# HRUDAYA KUSUMALU

# హృదయ కుసుమాలు

ఆంధ్రసచిత్ర వారపత్రికలో

ధారావాహినిగా ప్రచురింపబడిన నవల

# అంకితం

శ్రీ వేంకటేశ్వర స్వామివారి
పాదపద్మములకు
భక్తిప్రపత్తులతో

— రచయిత

# శ్రీ వేంకటేశ్వరాయ నమః

ఏడూకొండల స్వామీ, ఏడు ద్వారాల వెనుక
నల్లని రూపంలో, నామాల తెలుపుతో
మముగాంచి చూచేవా, మా బాధలు తీర్చేవా

ప్రభాత సమయాన, నీ దర్శనంకొరకు
నిద్రలే పోలేదు, ఆ సత్రంలోన
తోమాలియ సేవలతో, మనమునే దోచావా
నామాల దేవయ్యా, నల్లని నావాడా ॥ఏడూ॥

నీ సహస్ర నామంతో, నిఖిలమైన జనులు
ముదమునః కలిగి నీ ముంగిట్లో ఉన్నారు
ధర్మ దర్శనంకోసం దీనజను లందరు
దూరాన నుంచొచ్చి ధైర్యంతో ఉన్నారు
నామాల దేవర, నల్లని దేవర
కాపాడి వారిని, కరుణించు తండ్రీ ॥ఏడూ॥

పవళింపు సేవల్లో పాల్గొనుటకు మేము
పరుగెత్తి వచ్చాము పవళింప రావయ్యా
పద్మావతీదేవి అలకొచ్చి పోగానే
మము బ్రోచుటకు నీవు ఇక్కడే ఉన్నావా! ॥ఏడూ॥

# కృతజ్ఞత



నా నవలకు మూలము ఏదీ కాదు, నా భావనా శక్తి మాత్రమే. భావనాశక్తికి మూలము నా జీవితంలో తారసపడిన వ్యక్తులు కాదు, ఊహా జీవితంలో నాకు తారసపడిన వ్యక్తులు మాత్రమే. ఊహకు అందిన ఆలోచనలూ, ఆలోచనలకు అందిన సంఘటనలూ సర్వ సామాన్యంగా అందరు రచయితలూ తమకు తాముగా సృష్టించుకునేవే ఆ విధంగానే ఈ నవల ప్రారంభించి ముగించాను.

నా సమక్షంలోనూ, నా పరోక్షంలోనూ ఈ నవలను గురించి అనేకమంది చర్చించారు. వారందరికీ నా ప్రణామములు. జానకి పాత్రను తాముగా భావించి కొంతమంది కంటతడి పెట్టుకున్నారు, సీత పాత్ర తాముగా భావించి కొంతమంది మురిసిపోయారు. రమాదేవి పాత్రను తాముగా ఎవరూ భావించకపోయినా, ఆ పాత్రను సానుభూతితో అర్థం చేసుకున్నారు. రామారావును మొదట్లో తృణీకరించినా, తరువాత అర్థం చేసుకొని తమలో కలుపుకున్నారు.

"రామారావు అంత తొందరగా మారిపోతాడా" అని కొంతమంది ప్రశ్నించారు. "జానకి

లాంటి బాధలు పడేవారు ఇంకా ఈ కాలంలోనూ ఉన్నారా'' అని కొంతమంది తమ సంశయాన్ని వెలి బుచ్చారు. అంతా మన సంఘంలో ఉన్నవాళ్ళే. మనతో జీవిస్తున్నవాళ్ళే. మనం వారిని దూరం చేసుకోలేము. వారు మననుంచి దూరంగా పోలేరు.

పాఠకులు ఈ నవల యందు చూపిన ఆద రాభిమానాలకు నా మనఃపూర్వక వందనములు.

సహృదయతతో ఈ నవలను స్వీకరించి సీరి యల్‌గా ప్రచురించిన ఆంధ్ర సచిత్ర వార పత్రికాధి పతులకు నా నమోవాకములు.

విజయవాడ,<br>4-2-1965.

'హరికిషన్'

# హృదయ కుసుమాలు

అక్కయ్యను చూట్టానికి ఆ రోజున పెళ్ళివారొస్తారని ఇంట్లో అంతా ఎంతో హడావుడిగా ఉన్నారు. అక్కయ్యకు అంతవరకూ రెండు మూడు సంబంధాలు నాన్నగారు లోగడ చూశారు. కాని పిల్లను చూసే పరిస్థితి రాకముందే ఆ సంబంధాలు తప్పిపోయినయ్యి. కనుక అక్కయ్యను చూట్టానికొచ్చే సంబంధాలలో ఇదే మొదటిది.

ఆ రోజున నేను కూడా స్కూలుకి శలవు పెట్టాను. "పెళ్ళివారు మీ అక్కయ్యను చూట్టానికి వస్తున్నారుగాని నిన్ను చూట్టానికికాదుగదుటే సీతా, నువ్వు శలవు పెట్టటం ఎందుకు?" అని ఒకళ్ళిద్దరు స్నేహితులు అన్నా నేను పట్టించుకోలేదు. పెళ్ళికొడుకు ఎట్లా ఉంటాడో చూడాలి. అక్కయ్య పెళ్ళిచూపులకు ఎట్లా కూర్చుంటుందో, పెళ్ళికొడుకును ఎట్లా చూస్తుందో, పెళ్ళికొడుకు అక్కయ్యను ఏం ప్రశ్నలు వేస్తారో, అక్కయ్య అతనితో ఎట్లా మాట్లాడుతుందో, ఆ వేడుక అంతా చూడాలనిపించింది. శలవు పెట్టి ఇంట్లోనే ఉన్నాను.

ఆ రోజున అక్కయ్య ఆందోళన చూస్తుంటే నాకు నవ్వు ఆగింది కాదు. సామాన్య పరిస్థితుల్లో ఒక పురుషుణ్ణి ఒక స్త్రీ చూసినా, ఒక స్త్రీని ఒక పురుషుడు చూసినా, ఏ విధమైన భావాలూ, అనుభూతులూ కలగవు. మన దృష్టికి బాగుంటే ఒక్క క్షణం చూసి ఎంత బావున్నారో అనుకుం

టాము బావుండకపోతే చూడనే చూడము. అంతకుమినహా ఆలోచించే అవుసరమేఉండదు. పెళ్ళిచూపులనంగానే ఏమిటో ఆందోళన ఏమిటో ఆలోచనలు. ఏదో దిగులు. ఆలోచనకు అంతుపట్టని వాంఛలు. మనసులో ఏదో ఆందోళనతోకూడిన తృప్తి. తెలియని తహ తహ వ్యక్తపరచలేని అభిప్రాయాలు మనసులో మెదులుతూ ఉంటే సిగ్గు విడిచి చెప్పలేని ఆందోళనతో కూడిన అనుభూతులు.

అక్కయ్య మనస్సు అరిటాకు లాంటిది. అతి సున్నితమైన భావాలు. చెప్పలేని ఆలోచనలు.

సాయంత్రం నాలుగ్గంటలకు పెళ్ళి వారొస్తారంటే మధ్యాహ్నం నుంచే గంటన్నర సేపు తల దువ్వి జడ వేసుకుంది. మొదటిసారి జడ బిర్రుగా వేసుకుంది. తోచలేదు మళ్ళీ జడంతా విప్పి మళ్ళీ దువ్వుకుని వదులుగా వేసుకుంది ఈసారి పాపిడి సరిగ్గా రాలేదు. తిత్తులు, తిత్తులుగా ఉంది మళ్ళా విప్పి మళ్ళా వేసుకుంది. ఈసారి నచ్చింది. ఏ చీర కట్టుకోవాలి? ఏజాకెట్టు తొడుక్కోవాలి? అనే సమస్య తెగటానికి అరగంట పట్టింది. పెట్టెలోఉన్న చీరలన్నీ తీసింది. అమ్మనడిగింది. అమ్మ చెప్పిన చీర నచ్చలేదు. నన్నడిగింది. నేను ఎగతాళి చేస్తానని తెల్సు. అయినా అడిగింది. చెప్పాను. నచ్చలేదు. ఆఖరికి ఒక నిశ్చయానికొచ్చి ఒక చీర తీసుకొని మిగతావి పెట్లో పెట్టేసింది. ఎట్లాగయితేనేం మూడున్నరకు ముస్తాబు పూర్తయింది. దాన్ని ఏడిపించటానికి "జానకీ, ఆ బొట్టు మరీ అంత కనుబొమ్మల మధ్య పెట్టుకున్నావేం? కాస్త అద్దంలో చూసుకో" అన్నాను. నిజమేననుకొని అద్దంలో

చూసుకుంది. బాగానే ఉన్నట్టుగా తోచింది. అమ్మనడిగింది అమ్మ "నిక్షేపంలా ఉంది. ఏ వంకా రాలేదు. సీత నడిగితే ఇంక ఇవ్వాళ తెమిలినట్లే" అన్నది. దాన్ని చూస్తుంటే నాకు నవ్వు ఆగలేదు.

"ఏమే, జానకీ ముస్తాబు పూర్తయిందా? అయినా ఎందుకే నీకీ ఆందోళన. వస్తారు చూసి పోతారు. నచ్చితే చేసుకుంటారు. దీనికింత రాద్ధాంతమూ, రిహార్సల్సూ ఎందుకే ఒకవేళ వాళ్ళు చేసుకోనంటారనుకో అప్పుడు నీ మనస్సు ఎట్లా ఉంటుంది? సహజ సౌందర్యాన్ని చూసి పెళ్ళికూతుర్ని ఎంచుకోవాలిగాని, ఇంత మేకప్ చేసుకుని, ముస్తాబయి కూర్చుంటే, తీరా పెళ్ళయ్యాక బావగారు "ఏం జానకీ పెళ్ళి చూపులప్పుడు చూసినట్టుగా లేవేం" అంటే ఏం సమాధానం చెప్తావే?" అన్నాను.

అక్కయ్య నామాటలకి నవ్వింది. అది నాకన్న తెలివి కలది. దానికి ఆత్మ సౌందర్యం బాహ్య సౌందర్యం కన్న ఎన్నో రెట్లు ఎక్కువ. అభిమానానికీ గౌరవ మర్యాదలకీ పడి చస్తుంది. నా ఎగతాళి మాటలన్నీ విని చిరునవ్వుతో ఒక్కటే సమాధానం చెప్పింది.

"ఎవళ్ళదాకా వస్తే వాళ్ళకే తెలుస్తుందే సీతా పెళ్ళివార్ని మోసం చెయ్యటానిక్కాదు నేను ముస్తాబయింది నా సంతృప్తికోసం. అమ్మా నాన్న సంతృప్తికోసం. నేను మామూలుగానే ఉంటాననుకో, జానక్కి ఈ సంబంధం ఇష్టం లేదు కామాలు అదిసరిగ్గా జడన్నా వేసుకోకుండా కూర్చుంది

అనుకుంటారు. వాళ్ళ మనసును అనవసరంగా కష్టపెట్టిందా న్నవుతాను" అన్నది జానకి. నేనేం మాట్లాడలేకపోయాను.

సాయంత్రం నాలుగ్గంటలకు పెళ్ళివారొచ్చారు. పెళ్ళి కొడుకు, తల్లి, తండ్రి, పెళ్ళికొడుకు చెల్లెలు. బండి దిగి వాళ్లు గుమ్మంలోకి రాగానే నాన్నగారు ఎదురేగి వాళ్ళను సాద రంగా ఆహ్వానించి ఇంట్లోకి తీసుకొచ్చారు. మగవాళ్ళంతా కుర్చీల్లో కూర్చున్నారు పెళ్ళికొడుకు తల్లి, చెల్లెలూ, మా అమ్మతో మాట్లాడుతూ తివాసీ మీద కూర్చున్నారు. పెళ్ళి కొడుకు చెల్లెలు నా ఈడుదే నా వైపు ఎగా, దిగా చూస్తూ కూర్చుంది. సన్నగా, పూచికపుల్లలా, పొడుగ్గా ఉంది. ఎంత దర్పంగా, డాబుసరిగా కూర్చుందో తల్చుకుంటే, నాకు నవ్వూ, కోపమూ రెండూ వచ్చినయ్యి. తనూ ఒక ఇంటి కోడలు కాబోయేదే. తనను చూట్టానికీ పెళ్ళివారొస్తారు. ఈ జీవన్నాటకంలో ఎప్పుడో ఒకప్పుడు ఈ పాత్ర ధరించ వల సిందే. అంత టీవీ, దర్జా, గర్వమూ ఎందుకు ఉండాలో నాకూ అర్థం కాలేదు.

నావైపు చూసి కళ్ళజోడు సవరించుకుని "మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు గుర్తు. ఎందాకా చదువుకున్నారు?" అన్నది పెద్ద స్టయిలిష్‌గా మాట్లాడుతూ. "చదువు మానేశా నండీ. ఏదో వానాకాలపు చదువు మీరేంచదువుతున్నారు" అన్నాను. అమ్మ నావైపు చూసింది. నేను మెల్లిగా నవ్వి పూరుకున్నాను. ఆ అమ్మాయి సమాధానం చెప్పలేదు. తల్లి వైపు చూసింది.

"మొన్ననే యస్.యస్.యల్.సి పరీక్ష యిచ్చింది" అన్నది తల్లి. మనస్సులోనే నవ్వుకుని "ఎవరికిచ్చిందో పరీక్ష" అనుకున్నాను.

"అమ్మాయిని తీసుకురండి" అన్నది తల్లి మా అమ్మతో. అమ్మ జానకిని పిల్చింది.

గది గుమ్మానికి ఎదురుగా వేసిన తివాసీ మీద కూర్చుంది అక్కయ్య పెళ్ళికొడుకు అక్కయ్యనుచూశాడు జేబు రుమాలుతో మూతి తుడుచుకున్నాడు. ఎగమకో నాకు అర్థం కాలేదు. పెళ్ళికొడుకు తండ్రితో నాన్న ఏదో మాట్లాడుతున్నారు.

"మీ పేరేమిటి?" అన్నాడు పెళ్ళికొడుకు.

"జానకి" అక్కయ్య సమాధానం.

"ఏం చదివారు?"

"ఇంటర్ పాసయ్యాను"

"సంగీతం వచ్చా"

"రాదు"

"పోనీ పాడగలరా"

"కొద్దిగా"

"ఇంటరులో మీ గ్రూప్"

"బై. పి. సి"

"డాక్టరు కోర్సు చదువుదామనుకున్నారా?"నవ్వుతూ అడిగారు.

"చదివిస్తే చదవాలనే వుంది"

నవ్వి ఊరుకున్నారు. ఇంక వేసే ప్రశ్నలు ఏమీ లేనట్లుగా తండ్రివైపు చూసారు.

ఇంటర్వ్యూ పూర్తయ్యింది. అక్కయ్య లోపలికి వెళ్ళింది

"ఏమండీ! మీరేం ప్రశ్నలు వెయ్యలేదేం?" అన్నాను ఆ అమ్మాయితో.

"పెళ్ళి చేసుకొనేది మా అన్నయ్య నేకాదు" అన్నది.

"అట్లాగా. అవుననుకోండి. అయినా ఆడబిడ్డ అర్థ భర్తతో సమానం. ఆడబిడ్డ పోస్టు మంచి హోదాగల ఉద్యోగం, జిల్లా బోర్డు ప్రెసిడెంటు లాంటిది" అన్నాను.

ఆ అమ్మాయి పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వింది.

"చాలా బాగా సరదాగా మాట్లాడతారండీ మీరు. మీరు గనక మా వదినయితేనా, నా ప్రెసిడెంటు గిరీ చెలా యిద్దును. ఛాన్సు పోయింది. ఏం చేస్తాం మీ పేరు" అన్నది.

"నా పేరాండీ సీత. అక్కయ్య పేరు జానకి. తమ నామధేయం?"

"సుభద్ర"

"చాలా బావుంది"

కాసేపు కూర్చుని వెళ్ళారు. పిల్ల నచ్చిందీ లేందీ ఉత్తరం రాస్తానన్నారు. నాన్నగారు వాళ్ళని స్టేషను వరకూ పంపించి వచ్చారు. వాళ్ళని పంపించి వచ్చాక అమ్మ అడిగింది నాన్నని. "వాళ్ళ అభిప్రాయం ఎట్లావుందో?"

"వాళ్ళ మాటధోరణి చూస్తే పిల్ల నచ్చినట్లుగానే వుంది. కట్నం కానుకలు మాట్లాడుకోవాలిగా" అన్నారు.

నేను మెల్లిగా అక్కయ్య గదిలోకి వెళ్ళాను. కిటికీ లోంచి బయటికిచూస్తూ, ఏదో ఆలోచిస్తూ పడుకుంది. అక్కయ్య మనస్సు ఎవ్వరికీ అర్థంకాదు, ఒక్క నాకు తప్ప.

"అక్కయ్యా" అని పిలిచాను.

ఉలిక్కిపడి లేచి కూచుంది.

ఏందుకే జానకీ అంత దిగులూ, ఖంగారూనూ. ఏమిటమ్మా అంత ఆలోచన. ఆ అబ్బాయిని చేసుకుందామా వద్దా అనేగా. చేసుకోవే జానకీ, బాగానే వున్నాడు. కాలేజీలో లెక్చరరు. ఎమ్. కాం. ప్యాసయ్యాడు. సింపుల్‌గా, చక్కగా వున్నాడు. ఏమోనమ్మా నాకుమాత్రం నచ్చాడు. తరువాత నీ యిష్టం" అన్నాను.

"పోనీ, నువ్వు చేసుకోరాదుటే సీతా" అన్నది అక్కయ్య

"పెళ్ళంటే అంత యిష్టం లేనిదానివి ఇంతవరకు ఎందుకు రానిచ్చావ్? ముందే చెపితే పోయేదిగా. నేనయితే వాళ్ళతో చెప్పేసేదాన్ని, "ఏమండీ! నాకు పెళ్ళంటే ఇష్టం లేదు, నా మతులు విరిచి యీ పెళ్ళిచూపులకు కూర్చోబెట్టారు. దయచేసి మావాళ్ళతో మీ అమ్మాయి బాగుండలేదని చెప్పండరూ" అనేదాన్ని. అప్పుడేమో అట్లా ముస్తాబయ్యావు. ఇప్పుడేమో ఇట్లా అంటున్నావు" అన్నాను అక్కయ్యను కేకలేస్తున్నట్లుగా మాట్లాడుతూ.

"కాదే సీతా"

'ఏమిటి మరి?"

"మనకి యీ పేర్లు ఎందుగ్గాను పెట్టినట్లు చెప్పు. నా పేరు జానకి. నీ పేరు సీత. అనకూడదు గాని సీతాదేవి పేరు పెట్టుకుంటే కష్టాలు పడతారంటారు. ఏమిటోనే సీతా, నాకు పెళ్ళంటే ఏమిటో దిగులుగానే ఉంది"

అక్కయ్య అట్లా అంటుందని నేనెప్పుడూ అనుకో లేదు.

"పెళ్ళంటే దిగులెందుకే జానకీ. కష్టాలు పేర్లనిబట్టి రావు. మన మనస్సునుబట్టే, మన హృదయాన్ని బట్టే, మన చేష్టలు, చేతల్నిబట్టి వస్తాయి. అయినా నీకు కష్టాలు వస్త య్యంటే నేను నమ్మను. ఈ సంబంధమే గనక అయితే కష్టాలు రావు అతను ఎంతో మంచివాడిలా వున్నాడు. చదువుకున్నవాడు. యోగ్యుడు నిన్ను పువ్వుల్లోపెట్టి పూజి స్తాడు. ఎంతో జాగ్రత్తగా ఎదుటివారి మనస్సుని అర్థం చేసు కొని మాట్లాడేదానివి నువ్వు నాకింకా నోటిదురుసు జాస్తే. నిమిషంలోకి అనుకోకుండా నోరుజార్తాను. కాలుజారినా తీసు కోవచ్చునుగానీ, నోరు జారితే తీసుకోలేమన్న సంగతి తెల్సు. అయినా నేను తొందరపడతాను, నువ్వు అట్లాకాదు. కట్న కానుకలనేవి ఈ పవిత్ర భారతదేశంలో తప్పవు కట్నం పుచ్చుకుంటే గాని ఆ వివాహం సవ్యంగా జరిగినట్లుకాదు. ఈ సంబంధమైనా కట్నం యివ్వాల్సిందే మరో సంబంధ మైనా ఇవ్వాల్సిందే. ఆ బరువు, బాధ్యతలన్నీ మనల్ని కన్నందుకు నాన్నే చూసుకుంటారు. ఈ సంబంధం కాదనకు. జీవితం వడ్డించిన విస్తరిగాదు. విస్తరి వేసుకుని అన్నీ మనమే

వడ్డించుకోవాలి. విస్తట్లో తింటున్నప్పుడు పుల్లలు రావచ్చు. వాటిని తీసివేసి గొంతుకు అడ్డు పడకుండా తినాలి" అన్నాను.

అక్కయ్య ఆశ్చర్యంగా నావైపు చూసింది. దాని కళ్ళల్లో వెయ్యి దీపాల కాంతి నాకు కనిపించింది. నాబుగ్గలు నిమిరి ముద్దు పెట్టుకుంది. నా చెంపలమీద వేడి కన్నీళ్ళు పడ్డయ్యి.

"నువ్వు చెప్పినట్లుగానే వింటానే సీతా ఈ సంబంధం చేసుకోటానికి నాకు అభ్యంతరం లేదు" అన్నది అక్కయ్య.

నాలుగు రోజుల్లో ఉత్తరం వచ్చింది పిల్ల నచ్చిందనీ, అక్కడికి వచ్చి కట్న కానుకల విషయం మాట్లాడి తాంబూలాలు పుచ్చుకోవచ్చుననీ.

ఆ రోజున అమ్మ సంతోషానికి హద్దులేదు. నాన్నగారుకూడా "జానకి అదృష్టవంతురాలే" అన్నారు.

నాలుగు రోజుల్లో వెళ్ళి కట్నకానుకలు మాట్లాడి తాంబూలాలు పుచ్చుకున్నారు. కట్నం అయిదు వేలు. ఉన్న ఎకరన్నరా అమ్మేసి డబ్బంతా బ్యాంకులో వేశారు నాన్న ఇదివరకే.

మరో పదిహేను రోజుల వ్యవధిలో ముహూర్తాలు పెట్టుకున్నారు. పెళ్ళిపీటల మీద ఎంతో సంతోషంగా కూర్చుంది అక్కయ్య. మంగళ వాద్యాలు మారుమ్రోగగా, వేదోక్తంగా మంత్రాలు చదువుతూంటే బావగారు మంగళ సూత్రం మెళ్ళో కడుతుంటే సంతోషంగా ఒక్కసారి నావైపు చూసి తల వంచుకుంది అక్కయ్య. ఆ మంగళసూత్రంఖరీదు అయిదు వేలన్నమాట. అది మెళ్లో పట్టానికి ఇంకో రెండు

వేలన్నా అయింది. అక్కయ్య చూపులో వెయ్యి భావాలు నాకు కలిగినయ్యి.

అక్కయ్య పరాధీన. ఇప్పుడు కుమారి జానకి కాదు శ్రీమతి జానకి. ఇంకా చక్కగా పిలవాలంటే శ్రీమతి జానకీ రామారావు దాని మెళ్లో ధగధగ లాడే రాళ్ళ నెక్లెసు, మంగళసూత్రాలూ, నల్లపూసలూ, పలకసర్లూ, చేతులకు బంగారు నగిషీ గాజులూ చూసేసరికి నాకూ కళ్ళు చెమర్చి నయ్యి, అక్కయ్య అపర లక్ష్మీదేవిలా ఉంది. ఒక్కసారిగా పది పౌన్లు పెరిగినట్లుగా కనిపించింది. నాలుగేళ్ళు పైబడి నట్లుగా కనిపించింది. నాకు దూరమై పోతున్నట్లుగా అనిపిం చింది. యధావిధిగా పెళ్లయిపోయింది.

మూణ్ణిద్రలకు గుంటూరు వెళ్లారు. అక్కయ్యతో పాటుగా నేనూ వెళ్లాను. సుభద్రతో కబుర్లు చెప్పవచ్చనీ, అసలు బావగారిల్లు ఎట్లా ఉంటుందో చూద్దామనీ వెళ్లాను. గుంటూరులోనే మా చిన్న మామయ్య, అంటే మా అమ్మ పెద్ద తండ్రి కొడుకు ఉన్నాడు అతను డాక్టరు. అతనికీ మా బావగారికీ కూడా బాగా పరిచయమే. అక్కడున్న మూడు రోజులూ అతను బావగారింటికొచ్చి బావతోనూ,నాతోనూ, అక్కయ్యతోనూ ఒకటే కబుర్లు చెప్పేవాడు. చాలా కలుపు గోలుతనంగా ఉండేవాడు. అక్కయ్యంటే ఆయనకు ఎంతో అభిమానం, ఎంతో గౌరవం. పెళ్లి కూడా అవటం నుంచీ, ఇంకా అభిమానమూ, గౌరవమూ ఎక్కువయినయ్యి. పెళ్లిలో అతను, అంటే చిన్న మామయ్య అక్కయ్యకు రిస్టువాచి ప్రెజెంటుగా చదివించాడు. వాళ్లు బాగా ఆస్థిపరులు, ఆ

మూడు రోజుల్లో మా చిన్న మామయ్య బావగార్ని పోరి అందర్నీ తీసుకుని సినిమాకు తీసుకువెళ్లారు. సినిమాకు బావ, అక్కయ్య, నేనూ, చిన్నమామయ్య, అత్తయ్య, పిల్లలూ, సుభద్ర అంతా వెళ్లాము. చిన్నమామయ్యకు ఒక్కకొడుకూ ఒక్క కూతురూ. కొడుకుకి నాలుగేళ్లు కూతురికి రెండేళ్లు మామయ్య పెళ్లయికూడా ఆరేళ్లయింది. మామయ్య ఎంతో సహృదయుడు. సరళ స్వభావం కలవాడు. ఆస్పత్రి కొచ్చే వాళ్లనికూడా ఎక్కువగా డబ్బుకు వత్తిడి చెయ్యడు. ఇచ్చిందేదో పుచ్చుకుంటాడు. కాకపోయినా అస్తిపరుడు. ఆరోజున చిన్నమామయ్య నవ్వించే కబుర్లు ఎన్నో చెప్పాడు. బావ కూడా పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వేశారు. అక్కయ్యతో ఎగతాళిగా ఎన్నో మాట్లాడాడు. బావను సరిగ్గా చూసుకో మన్నాడు. "రామారావుగారూ, మీరు నిజంగా శ్రీరామ చంద్రులే. మా జానకి సుగుణాల రాసి. ఆ సీతాదేవిని మరి పిస్తుంది. అంత ఉత్తమురాలు. ఇదుగో ఈ సీతాదేవిఉన్నది. దీంతో వేగటం కష్టమే. జానకిమాత్రం నిజంగా అలనాటి జనకమహారాజు కూతురే" అన్నాడు బావతో. అంత మంచి వాడు చిన్న మామయ్య

అంత సంతోషంతో ఆ మూడు రోజులూ గడచి నయ్యి.

జీవితంలో కొన్ని కొన్ని సంఘటనలు తాత్కాలిక మైనవే అయినా మన మనస్సులో శాశ్వతంగా ముద్రవేసుకు పోతాయి. అవి ఏనాటికీ మన హృదయ ఫలకం మీదనుంచి చెరిగిపోవు.

మరో వారంరోజుల్లోనే దారుణమైన వార్తవిన్నాము. చిన్న మావయ్య కారులో వస్తూ ప్రమాదవశాత్తూ లారీకి గుద్దుకుని అక్కడికక్కడనే ఈ లోకాన్ని విడిచిపోయాడు. ఈ దారుణ వార్త వింటామని కల్లోనయినా అనుకోలేదు. రత్నం లాంటి భార్యనూ, మాణిక్యాల్లాంటి బిడ్డలిద్దర్నీ వదిలి శాశ్వతంగా కన్ను మూశారు చిన్నమామయ్య

నాన్న, అమ్మా, గుంటూరు వెళ్ళారు. ఈ దారుణ వార్త విని అక్కయ్య ఏడ్చింది. శవాన్ని చూట్టానికి తనూ గుంటూరు వస్తానన్నది. పెళ్ళయి పదహారు రోజుల పండుగయినా కాలేదు. వోగాయిత్యంగా నువ్వు వెళ్ళటమేమిటన్నారు అంతా. అంచేత అక్కయ్య వెళ్ళలేదు. నేను అక్కయ్యా ఇంట్లో ఉన్నాము. నాన్న, అమ్మ వెళ్ళి కర్మ కాండలు పూర్తయ్యాక వచ్చారు. అక్కయ్య విచారానికి అంతులేదు. తనంటే ఎంతో అభిమానం చూపేవాడు. ఆ రోజున సినిమాకు అందర్నీ తీసుకువెళ్ళాడు. "అంత ఆదరాభిమానాల్ని చూపించిన చిన్నమామయ్య పోయాడు. దారుణంగా కన్ను మూశాడు" అంటూ విచారించేది అక్కయ్య.

* * *

ఒక్కసారి నిట్టూర్చి కళ్ళు తుడ్చుకుని రాధ వైపు చూసింది సీత.

"బాగుంది సీతా, మీ అక్కయ్య అంత సున్నిత హృదయురాలన్నమాట. ఉత్తమ ఇల్లాలు. ఈ కథంతా వినా

లని ఉంది. ఏమీ మర్చిపోకుండా పూర్తిగా చెప్పాలి సీతా''
అన్నది రాధ.

"అట్లాగే రాధా. నీకు ఆస్పత్రికిపైమైందేమో వెళ్ళిరా, సాయంత్రం మాట్లాడుకుందాం'' అన్నది సీత.

రాధ వెళ్ళిపోయింది. సీతకూడా దుస్తులు వేసుకుని తన డిస్పెన్సరీకి వెళ్ళింది.

సీత, రాధ ఇద్దరూ గుంటూరులో డాక్టర్లు. సీత ప్రైవేటుగా నర్సింగ్ హోం పెట్టింది. రాధ గవర్నమెంటు ఆస్పత్రిలో డాక్టరు. ఇద్దరూ యం.బి.బి.యస్. ప్యాస య్యారు. ప్రాణ స్నేహితులు. వైద్య రంగంలో పేరు తెచ్చు కున్నవాళ్ళు. ఏదో మాటల సందర్భంలో తన జీవిత చరిత్ర చెప్పమంది రాధ సీతని. సీత ఎంతో బలవంతంమీద తన జీవిత గాథ చెప్పసాగింది.

సాయంత్రం భోజనాలయ్యాక సీత, రాధ ఇద్దరూ మేడ మీద చెరో కుర్చీలో కూర్చున్నారు. రాధ మళ్ళా అడి గింది సీతని. సీత మళ్ళా చెప్పసాగింది—

"అక్కయ్య పెళ్ళి వైశాఖమాసంలో అయింది. జ్యేష్ట మాసంలో కాపురానికి వెళ్ళింది. అది కాపురానికి గుంటూరు వెళ్ళే రోజు. ఆ రోజున దాని ముఖంలో ఏ సంతోషమూ లేదు. ఏ మార్పూ రాలేదు. కళ్ళలో కాంతి లేదు. భార

మైన ఆలోచనలతో దాని మనస్సు నిండిపోయింది. ఆవేదనా పూరితమైన అనుభవంతో దాని హృదయం ఛూడిపోయింది.

బావను చూస్తే ఎంతో సంతోషంగా ఉన్నట్లే కనుపించారు. ఎంతో చలాకీగా, సరదాగా ఉన్నారు. కారు ఎక్కపోతూ అక్కయ్య నా దగ్గిరకొచ్చింది. "సీతా" అన్నది.

దాని కళ్ళల్లో నీరు చిమ్మింది. కనుకొలుకుల్లోనుంచి జారే ముత్యాలలాంటి కన్నీళ్ళు కింద పడకుండా పమిటి చెంగుతో తుడ్చుకుంది.

"ఎప్పుడు వీలయితే అప్పుడల్లా గుంటూరు వస్తూండవే సీతా. నువ్వు రాకపోయినా, నాకు ఉత్తరాలు రాయకపోయినా ఇంక సీత మిగుల్తుంది కాని జానకి కాదు. నామీద ఆపేక్ష ఉంటే నామాట తప్పక వింటావనుకుంటాను" అన్నది. కొయ్య బొమ్మలా కొయ్యబారిపోయాను. గొంతు పెగుల్చుకుని "అట్లాగేనే. తప్పక గుంటూరువస్తాను. నిన్ను చూడందే నేనూ ఉండలేను" అన్నాను. అక్కయ్య కారెక్కింది. బావ పక్కనే కూర్చుంది. దుమ్ము రేపుకుంటూ కారు వెళ్ళిపోయింది.

నాన్న తృప్తిగా నవ్వుతూ అమ్మవైపు చూశారు. "చాలా బుద్ధిమంతుడు. యోగ్యుడు. తెలివికలవాడు" అన్నారు నాన్న. అమ్మకూడా "అవును. మన జానకి అదృష్టవంతురాలే" అన్నది.

నాకేం చెప్పటానికీ తోచలేదు. గదిలోకి వెళ్ళి కరువు తీరా తృప్తిగా ఏడ్చాను. అంతకన్న చెయ్యగలిగింది నాకేమీ కనబడలేదు.

# హృదయ కుసుమాలు

అక్కయ్య వెళ్ళాక నాలుగు ఉత్తరాలు రాసింది. ప్రతి ఉత్తరంలోనూ నిరాశ, నిస్పృహ కనిపించేవి కారణాలు తెలిసేవి కాదు.

అక్కయ్య కోడంటికం అనుభవిస్తోందా? సుభద్ర ఏమైనా తంపులు పెడుతున్నదా? బావ మంచివాడు కాదా? స్త్రీలోలుడా? జూదరా? ఏమిటి? అక్కయ్య ఎందుకట్లాఉంటున్నది? దాని మనస్సులో బాధ ఏమిటి? బావ పేకాటలో డబ్బు పోగొట్టుకుంటూరా? క్లబ్బులకు వెళ్ళి ఇంటికి రాక అక్కడే కాలం గడుపుతారా? ఎంత ఆలోచించినా నాకు ఏమీ అర్థం కాలేదు.

ఒక ఉత్తరంలో ఇట్లా రాసింది అక్కయ్య:

సీతా,

ఈ నిర్భాగ్యురాలిమీద జాలిదలచి నువ్వు రాసిన ఉత్తరం చేరింది జీవితంలో ఆసించినవి జరిగినా, జరక్కపోయినా అంత బాధ పడము. ఆసించనివి జరిగినా అంతగా మనస్సు కష్టపెట్టుకోము. కల్లోనైనా ఊహించని సంఘటనలతో, మనస్సును వ్యథ పెట్టే మాటలతో కట్టుకున్న భర్త కఠోరమైన మాటలంటుంటే ఇంక ఆ ఇల్లాలి బ్రతుకు బండలు కాక మరేముంది? అత్త పోరు కొంత మంది అనుభవిస్తారు. ఆడబిడ్డల తంపులు కొంత మంది చవి చూస్తారు. సంపాదన లేని భర్తతో కాపురం చేస్తూ ఆర్థిక బాధలకు గురవుతూ కాపురం చేస్తారు. కాని నా జీవితం లాంటి జీవితం ఎవ్వరూ అనుభవించరు. నా మనోవ్యథ ఎవ్వరితోనూ చెప్పుకోలేనిది. చెప్పినా నమ్మజాలనిది. అసలు ఎట్లా చెప్పాలో అర్థంకానిది.

నా మానసిక సంక్షోభని నాలోనే ఇముడ్చుకుని కాలం గడుపుతున్నాను. ఏనాటికయినా నన్ను ఆమానసిక సంక్షోభ దహించి భస్మం చేస్తుందేమో!

'జానకి'

ఆ ఉత్తరానికి ఏం సమాధానం రాయాలో నాకు తోచలేదు.

శ్రావణ మాసం వచ్చింది. నోములకు అక్కయ్య వచ్చింది. నాన్న వెళ్ళి అడిగితేగాని వాళ్లు పంపలేదు. ఆ రోజున అక్కయ్య వస్తుందంటే నా సంతోషానికి హద్దు లేదు. రెండు నెల్లకే ఎన్నో ఏళ్ళయినట్లుగా ఉంది.

బండి దిగిన అక్కయ్యను చూడగానే దాన్ని ఎట్లా పలకరించాలో నాకు తోచలేదు. కొంచం నల్లబడింది. చిక్కిపోయింది. నన్ను చూడగానే కౌగలించుకుని సంతోషంగా గబా గబా ఎన్నో మాటలు మాట్లాడుతుం దనుకున్నాను. ఏమీ లేదు. ఎంతో పెద్ద మనిషి తరహాగా, ముభావకంగా పలకరించింది. "ఏం సీతా కులాసాగా ఉన్నావా" అని.

"నీ కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నానే" అన్నాను నా సంతోషం పట్టలేక. అమ్మకూడా "అదేమిటే అట్లా అయిపోయావ్. ఏమన్నా సుస్తీగా ఉన్నావా" అన్నది.

"ఏమీ లేదే. బాగానే ఉన్నాను. నువ్వే చిక్కిపోయావు" అన్నది అక్కయ్య. అంతకన్నా ఏమనాలో దానికి తోచలేదు.

రెండు రోజులు మామూలు కబుర్లతో గడిచిపోయింది. అక్కయ్య ఆంతర్యం తెలుసుకోవాలని తహ తహ

లాడిపోతున్నాను. ఎక్కడ నేను ఏ విషయాలు అడుగుతానో అని అక్కయ్య కొంచం తప్పుకుని తిరిగేది. ఎప్పుడూ అమ్మకు సాయంచేస్తూ అమ్మతోనే ఉండేది. నాకూ అక్కయ్యను ఎక్కువగా కల్పించుకుని అడగటానికి వీల్లేకపోయింది.

అక్కయ్య ముఖ కవళికలు గమనించేదాన్ని. ఎంత బింకంగా ఉన్నా ఆ ముఖంలో విచార రేఖలు పైకి కనిపిస్తూనే ఉండేవి. నేను చిన్న దాన్ననుకుంటే అమ్మతో చెప్ప వచ్చుగా, కాని అమ్మతోనూ చెప్పలేదు.

అమ్మ రెండో రోజునకామాలు అడిగింది

"మీ ఆయన ఎట్లా ఉంటారే. మీ అత్తగారు నీతో కలుపుగోలుతనంగా ఉంటుందా" అని.

"మా అత్తగారు మంచిదేనే. అత్తా కోడళ్ళనే మాట లోనే ఉందికదా. అభిప్రాయ బేధాలు రాక తప్పవు వచ్చినా అవి అంతగా బాధించేవి కాదు. మీ అల్లుడుగారంటావా, ఎట్లా ఉండేదీ పైకి కనబడుతూనే ఉన్నారుగా. ఇంకనన్ను అడగటం ఎందుకూ" అన్నది అక్కయ్య ముభావకంగానే. కాని ఏదో రహస్యము దాని మనసులో దాగి ఉందనే నా దృఢ నమ్మకం. జరిగే విషయాలు అమ్మతో చెబితే అమ్మ మనస్సు కష్టపెట్టుకుంటుందనే ఉద్దేశ్యంతో చెప్పటంలేదేమో ననుకున్నాను. కాని ఆ విషయా లేమిటో ఎంతఆలోచించినా నాకూ అంతుపట్టలేదు.

మంగళవారం రేపనగా సోమవారంనాడు బావదగ్గ ర్నుంచి వంద రూపాయలు మనియార్డరు వచ్చింది, శ్రావణ పట్టీసుగాను చీరకొనమని. మనియార్డరు నాన్నగారి పేరఉంది.

అల్లుని మంచితనానికి నాన్నగారూ అమ్మా ఎంతో సంతో షించారు. అక్కయ్య మాత్రం ఏం మాట్లాడలేదు. దాని మనసులోని భావాలు ఎవ్వరికీ అర్థంకావు. ఎవ్వరికీ చెప్పదు. తొణకదు. కాని దాని సంసార జీవితంలో సుఖ సంతోషాలు తక్కువేనని నేను అర్థం చేసుకున్నాను.

"అల్లుడు పంపిన వందరూపాయలతో ఏం కొనమన్నా వమ్మా" అన్నారు నాన్న.

"ఇప్పుడేం వద్దు నాన్నా. నేను గుంటూరు వెళ్ళిం తరువాత ఏమైనా కొనుక్కుంటాలే" అన్నది అక్కయ్య.

"అదేమిటే అతను పండక్కని పంపిస్తే నువ్వు తరు వాత కొనుక్కుంటానంటావు, శుక్రవారం వరలక్ష్మీ వ్రతానికి కంచి పట్టుచీరె కొనుక్కో- నీకు నచ్చింది" అన్నదిఅమ్మ.

"చూద్దాంలేవే ఇప్పుడు తొందరేం"అన్నదిఅక్కయ్య.

"సరే నీ ఇష్టప్రకారమే చేద్దాంలే తల్లీ" అన్నారు నాన్న. అప్పటికా విషయం అట్లా తేల్చేసింది అక్కయ్య.

మధ్యాహ్నం భోజనాలయ్యాక నేను నా గదిలో కూర్చుని చదువుకుంటున్నాను. అక్కయ్య వచ్చింది.

"ఏమే సీతా, అట్లా కూర్చున్నావ్. ఇవ్వాళకు నీ చదువు కట్టిపెట్టు. మరి అందర్నీ పేరంటం పిల్చి రావూ" అన్నది.

"అంటే నువ్వు రావా పేరంటం పిలవటానికి. నువ్వు రాకపోతే నేనూ వెళ్ళను. నోము నోచుకునేది నువ్వూ, పేరంటం పిలవటానికి నేనూనా, అట్లా వీల్లేదు. నువ్వు రాంది నేను వెళ్ళనే వెళ్ళను" అన్నాను.

"నా మాట నువ్వయినా వినవే సీతా. నే నెక్కడికీ రాను. నన్ను నువ్వుకూడా అపార్థం చేసుకుంటే ఎట్లా చెప్పు. నా బదులు నువ్వు వెళ్ళి పిల్చిరా. మా అమ్మవి కదూ! నా బంగారు తల్లివి! వరహాలరాశివి! రత్నాలు మూటవి! వెండి కొండవి" అంటూ నవ్వి నా బుగ్గలు గిల్లింది.

అక్కయ్య అట్లా అంటుంటే నాకూ ప్రాణం లేచి వచ్చినట్లయింది. పెళ్ళయ్యాక అక్కయ్య నవ్వు ముఖం చూట్టం అదే మొదలు. కాని ఆ నవ్వుకూడా కొంచెం తెచ్చి పెట్టుకున్నట్టుగానే ఉంది ।అవకాశం విడువకూడదనే ఉద్దేశ్యంతో నేనూ బట్టుసర చద్దామని "ఎవరయినా మీ అక్కయ్య ఎందుకు పిలవటానికి రాలేదంటే ఏం చెప్పను? మా బావ అక్కయ్యను ఎవరిళ్ళకూ వెళ్ళద్దన్నారుట, అని చెప్పనా? అంతేనా అక్కయ్యా?" అన్నాను నేనూ నవ్వి.

"ఏదో చెప్పవే సీతా! నాకు నిజంగా ఎవరింటికీ ఖా లని లేదు. ఏమిటో, ఎందుకో చెప్పలేనే సీతా! ఆలోచిస్తే నాకే అర్థంకాదు. సరే ఇంక వెళ్ళిరా. చాలా ఇళ్లు పిలవాలి" అంటూ వెళ్ళబోయింది. చెయ్యి పట్టుకుని లాగి అక్కయ్యను కుర్చీలో కూర్చోబెట్టాను. అక్కయ్య ఆశ్చర్యపడ్డది. అక్కయ్య ముఖంలోకి చూశాను దాని కళ్ళల్లో ఏదో తీరని ఆవేదన నాకు బాగా కనిపించింది

"అక్కయ్యా! నిజం చెప్పు. ఎప్పుడూ ఏదో దిగులుగా ఉంటావ్. పరధ్యాన్నంగా ఉంటావ్. ఎందుకనే జానకీ. నీ కష్టసుఖాలు నాకు తెలీకూడదా" అన్నాను.

అక్కయ్య ఏమంటుందోనని ఆత్రంగా చూశాను. అక్కయ్య పేలవంగా నవ్వింది. నిరాశగా చూసింది. నిర్లిప్తతగా నిట్టూర్చింది. తేలిపోయిన భావాలతో చెప్పవలసిన విషయాలు దాస్తున్నట్లుగా నాకు తోచింది.

"ఏమీ లేదే సీతా, బాగానే ఉన్నాను. చక్కగా తిని తిరుగుతున్నాను వంట్లో ఆరోగ్యంగా ఉంది" అన్నది తేలిపోయే మాటలతో.

నేనింక ఉండబట్టలేకపోయాను. అక్కయ్య ఎందుకిట్లా మారిపోయింది. రెండు నెల్లకే ఇట్లా మారిపోతే ఇంక కొన్ని సంవత్సరాలుపోతే అక్కయ్య నాతో అసలుమాట్లాడుతుందా అనే అనుమానం కలిగింది.

"జానకీ! ఎంత ప్రయత్నించినా నన్ను మభ్యపెట్టలేవే. నీ కన్నా చిన్నదాన్ని. అవివాహితను. భార్యా భర్తల మధ్య ఉండవలసిన మంచి చెడ్డలు నాకు తెలియవు. ఆ విషయాలు చర్చించ తగిందాన్ని కాదు. ఏమన్నా అడిగినా ఈ ముదినాపసాని కబుర్లు నీ కెందుకే అంటావు. నే నేం సమాధానం చెప్పలేను. మనిద్దరి పైన ఇంకో అక్కయ్య ఉంటే, నే నడక్కపోయినా ఆ అక్కయ్యయినా అడిగి తెల్సుకునేది. అల్లాంటి అవకాశం లేదు కనుక చిన్నదాన్నయినా నీ కష్ట సుఖాలు నాతో చెప్పుకోవచ్చు చెప్పవుటే అక్కా" అని ప్రాధేయపూర్వకంగా అడిగాను.

అక్కయ్య నిరాశగా నవ్వింది. చెంగుతో కళ్లు తుడ్చుకుంది.

"ఆ విషయాలన్నీ ఎల్లుండి మాట్లాడుకుందాం సీతా. ఇవాళా, రేపూ, చెప్పినట్లు విను" అని వెళ్ళిపోయింది. పుస్తకాలు మూసేసి నేనూ అక్కయ్య వెనకనే వెళ్లాను.

పేరంటానికి వెళ్లిన చోటల్లా అంతా అడిగారు. "ఏం సీతా, ఏమ్మా, మీ అక్కయ్యకూడా పిలవటానికొస్తే అరిగి పోతుందా? అంతా చూసేవాళ్ళంగా" అని.

"అక్కయ్యని ఇక్కడే చూస్తే మీరు పేరంటానికి రారేమోనని అదిరాలేదు" అంటూ ప్రతీఇంట్లో తప్పించుకుని వెళ్ళిపోయాను.

శ్రావణ మంగళవారం నోము నోచుకుంది. అంతా సవ్యంగానే గడిచింది. పిల్చినవాళ్ళంతా పేరంటానికివచ్చారు. మా ఇంటి ఎదురుగానే రంగమ్మగారని ఉన్నారు. ఆవిడ ఏ పేరంటానికీ రాదు. అంతా వచ్చి వెళ్లాక చివరికి ఏడు గంటలకి వస్తుంది. ఆవిడతో అంతా వచ్చినట్లే. ఆ రోజున ఆవిడా అట్లాగే ఏడుగంటలకొచ్చింది. వస్తూనే "ఏం జానకీ, కులాసాగా ఉన్నావా? ఏం నగలు చేయించుకున్నావు? ఏమిటో నువ్వు కాపురానికివెళ్ళి రెండునెలలే అయినా ఎన్నో నెలలయి నట్లుంది. పెళ్ళికాకమునుపు ఆడపిల్లలు చువ్వలల్లే ఎదుగుతూ ఎంతకాలం ఇంట్లోవున్నా, పెళ్ళిఅయ్యాక ఒక్కసారే మారి పోతారు. ఎంతో పెద్దమనిషితరహా, నిబ్బరమూ, ఓర్పూ వస్తాయి. ఆడదాని జీవితమేఅంత. మీ అత్తగారు కులాసాగా ఉన్నారా? అన్నట్లు మర్చిపోయాను. మీ మామగారు మా వారికి తెలుసుట. మా వారు మీ ఆయన్నికూడా ఎరుగుదు

రట. నీ పెళ్ళికి మా వారు క్యాంపులో ఉంటంనుంచి వారికి రావటానికి సందర్భపడలేదు'' అన్నది రంగమ్మగారు

ఈ మాటలు ఆశ్చర్యంగా విన్నది అక్కయ్య. సాధారణంగా ఇట్లా అన్నప్పుడు నవ్వుతూ "అట్లాగా అంతా తెల్సిన వాళ్ళమే నన్నమాట. మంచిదే. ఎప్పుడన్నా గుంటూరు వచ్చినప్పుడు మా ఇంటికి రండి'' అంటుందేమో అక్కయ్య అనుకున్నాను. కాని అక్కయ్య అట్లా అనకపోగా దిగాలుపడినట్లుగా కనిపించింది. ముక్తసరిగా "అట్లాగా'' అనివూరుకుంది.

రంగమ్మగారు వెళ్ళిపోయాక అక్కయ్య బట్టలుమార్చుకునేందుకు గదిలోకి వెళ్ళింది. నేను అక్కయ్య వెనకనే వెళ్లాను. అమ్మ వంటింట్లోకి వెళ్ళింది. "అదేమిటే జానకీ, ఆవిడ అలా అంటూంటే అట్లా దిగాలు పడిపోయావేం. వాళ్లు ఎరుగున్నవాళ్లయితే సంతోషించాలిగాని, అంత దిగులు పడిపోయావేం'' అన్నాను.

"ఏమీ లేదే సీతా, ఏమన్నాను? ఎట్లా ఉన్నాను? కాస్త తలనొప్పిగా ఉంది అంతే'' అన్నది.

"కాదు. నీ కాపురంలో ఏదో కొరత ఉన్నది. నిన్ను చూస్తేనే మానసికంగా నువ్వు ఎంత బాధ పడుతున్నావో నేను తెల్సుకున్నాను. ఇంక నాకు చెప్పకపోతే నన్ను చంప్రుకు తిన్నంత ఒట్టే. రేపు సాయంత్రంలోగా అన్ని విషయాలు చెప్పేసెయ్యాలి. లేకపోతే అమ్మతో చెప్పేస్తాను. మీరంతా కలిసి అక్కయ్య గొంతు కోశారని...''

"సీతా'' అంటూ అక్కయ్య నా నోరు మూసింది. కన్నీళ్లు పమిట చెంగుతో తుడ్చుకుంది.

"నీకు పుణ్యముంటుంది. నన్నిట్లా బ్రతకనివ్వవే సీతా, అన్ని విషయాలు చెబుతాను. కాని ఎవ్వరికీ తెలియనీకు. అమ్మకూ కూడా చెప్పొద్దు ఆ పరమాత్ముడే, ఆ వెంకటేశ్వర స్వామే నన్నూ, నా కాపురాన్ని దారికితీసుకొస్తాడు" అన్నది. నేనింక మాట్లాడలేకపోయాను.

రాత్రి భోజనాలయ్యాక అక్కయ్యా, నేను నా గదిలో చెరో పక్కమీదా పడుకున్నాము. అమ్మ, నాన్నా నిద్ర పోయారు అక్కయ్య ఏం చెప్తుందోనని ఆత్రంగా చెవులు రిక్కబొడుచుకుని పక్కమీద లేచి కూర్చున్నాను. రాత్రి పది దాటింది.

అక్కయ్య తన మంచం మీద నా వైపుకు తిరిగి పడుకుంది.

"చెప్పాల్సిందేనా సీతా! అయినా పెళ్ళి కానిదానివి. ఈ పెద్దవాళ్ల కబుర్లు నీకెందుకే! వినతగినవి, వినతగనివి ఉంటయ్యి. అంత ఆరిందా గోవిందమ్మవయ్యావా వినటానికి" అన్నది.

"అక్కా, నువ్వు నన్ను మభ్యపెట్టి చెప్పకుండా తప్పించుకోలేవే. మొన్నటి వరకూ, నువ్వూ చిన్నదానివే. ఇప్పుడు మరి అన్ని విషయాల్లోనూ పెద్దదానివయ్యావు. అను భవం సంపాదించావు. అమ్మకు ఆడపిల్లలమైనా, మొగపిల్లల మైనా మనిద్దరమే. అమ్మ అమాయకురాలు. జీవితంలో సుఖాలేగాని కష్టాలు తెలియవు అమ్మకి. ఆవిడ ఏ అత్తా ఆడ బిడ్డల మధ్య కాపురం చేసిందనీ? అత్తలేని సంసారమే! ఆడ బిడ్డలులేనే లేరుకదా. ఆవిడకు అత్తింటి కాపురం ఏంఅనుభవం

ఉంది? ఆవిడ జీవితం అట్లాగే గడిచిపోతుంది. నీ కాపురం విషయం అమ్మకు తెలిస్తే ఆవిడ గుండెలు బాదుకోవచ్చు. ఆవిడకు లౌక్యం అసలు తెలీనే తెలీదు. నా కూతుర్ని ఇంత కష్టపెడుతున్నారా, అంటూ బావురు మంటుంది ఇంక నీ కష్టసుఖాలు నాకాక ఎవరికి చెపుతావు? నాకు నువ్వు, నీకు నేనూ ధైర్యం చెప్పుకోవాలి. సిగ్గుపడక అన్ని విషయాలూ చెప్పు. నా జీవితం ఎట్లా గడుస్తుందో నాకు తెలీదుకదా? నీ జీవితం ఇట్లా మారిపోతుందనీ, నువ్విట్లా అవుతావనీ, ఇలాంటి మానసిక వ్యధలకు గురవుతావనీ నేను కల్లోనయినా అనుకోలేదు, మనస్సులో ఉన్న విషయాలూ, అనుభవించిన కష్టాలూ నాకు చెప్పు. నేనేమీ అనుకోను. నీ కష్టాలకు నేను ఏ విధంగానూ ఆదుకోలేకపోవచ్చు. కాని విని సానుభూతి కనబర్చగలను. అంతకన్న ఈ చెల్లెలు సీత నీ కాపురం ఎట్లా తీర్చిదిద్దుతుంది? వేలంలో నీ జీవితం అమ్ముడుపోయింది. నా జీవితం ఇంకా పాటకు రాలేదు. నిన్ను చూస్తుంటే నాకడుపు తరుక్కుపోతున్నది. కాపరానికి వెళ్ళాక ఎంత కులాసాగా, చలాకీగా ఉంటావో అనుకున్నాను. అందుకు అంతా వ్యతిరేకంగానే ఉన్నది. ఈ రాత్రి ఎంత పొద్దుపోయినా నువ్వు పూర్తిగా అన్నివిషయాలూ చెప్పందె నేను నిద్రపోను, నిన్ను నిద్రపోనీయను" అన్నాను.

నా పట్టుదలకు అక్కయ్య పేలవంగా నవ్వింది. "సీతా, నేను ఇంటరు పరీక్ష ఫస్టు క్లాసులో పాసయినప్పుడు ఎంత సంతోషంతో పొంగిపోయానో నీకు గుర్తుందికదూ, నా వివాహానికి ముహూర్తాలు పెట్టుకున్నప్పుడు అంతకు పదిరెట్లు పొంగి

పోయాను. వారు నా మెళ్ళో ఈ మంగళసూత్రం కడుతుంటే నా మనస్సు పులకరించి హృదయం ఎంతో ఆనందంతో, సంతోషంతో నిండిపోయింది నా కళ్ళల్లో వెయ్యి విద్యుద్దీప కాంతులు మెరిసిన సంగతి నీకూ తెల్సు మర్నాడు మా దంపతుల్ని ఒకటి చేశారు" అన్నది అక్కయ్య

"అవును" అన్నాను నవ్వుతూ. ఇంకేం మాట్లాడాలో అంతకు మినహా నాకేమీ తోచలేదు.

"ఆ రోజు ముహూర్తమయింది. అంతటితో నా జీవితంలో దుర్ముహూర్తం ఎదురైంది" అని బరువుగా నిట్టూర్చింది అక్కయ్య.

"తరువాత?" అన్నాను.

అక్కయ్య నా వైపు నిరాశగా చూసింది.

"నీ వయస్సు ఇరవై రెండు కదూ" అన్నారు మీ బావ. ఎందుకడుగుతున్నారో నాకు తెలీలేదు. నవ్వుతూనే "అవునండీ! నా వయస్సు ఇరవై రెండేళ్ళు. సరేకాని ఇప్పుడు వయస్సుతో పనేమొచ్చింది" అన్నాను.

అంతలోనే వారి ముఖంలో చీకట్లు కమ్మినయ్యి. ఆ కళ్ళల్లో క్రోధం కొట్టొచ్చినట్లు కనబడింది. "అనుమాన పడుతున్నానని నీ మనస్సులో బాధ పడకు, వయస్సు అటువంటిది" అంటూ నా వైపు ముభావకంగా చూశారు.

వారన్నది నాకు అర్థంకాలేదు. వారట్లా నావైపు చూస్తుంటే ఖిన్నురాలినయాను. వారి ముఖంలోకి చూడలేక కళ్ళు మూసుకున్నాను. ఆ అనుమానమేమిటో నాకు తెలియ లేదు.

"అవునా జానకీ" అన్నారు కోపంగా నా భుజాలు పట్టుకుని ఊపుతూ. విభ్రాంతితో వారి కళ్ళల్లోకి చూశాను. వారి ముఖం కోపంతో ఎర్రబడింది. నేను వణికిపోయాను. ఏం మాట్లాడ్డానికీ నాకు తోచలేదు. కళ్ళంట నీరు తిరిగింది. అవమానంతో శరీరం వణికిపోయింది. మెల్లిగా తేరుకుని "అంటే మీ ఉద్దేశ్యం?" అన్నాను

వారు నా వైపు సూటిగా చూస్తూ,

"జానకీ మీ డాక్టరు మావయ్యంటే నీకు చాలాఇష్టం కదూ?" అన్నారు కోపంతో నావైపు చూస్తూ.

నాలో క్రోధం, అవమానం, దుఃఖం, ఆవేశం రెచ్చిపోయినయ్యి. నాకు అయోమయమైపోయింది. "నా మీద అంత అనుమానం ఎందుక్కలిగిందండీ? నావల్ల తప్పేమిటి?" అన్నాను. అంతే నా చెంపలు వాచినయ్యి. అట్లాగే పడిపోయాను. ఒక్కసారిగా ఇంత జరిగేసరికి నాకేం చెప్పాలో తోచలేదు. కొంతసేపటికి కళ్ళు తెరిచాను.

"నీకూ నీ చిన్నమావయ్యకూ సంబంధం లేదంటావా? పెళ్ళయ్యాక ఇక్కడ మా ఇంట్లో ఉన్న మూడు రోజుల్లోనూ అతని ప్రవర్తన నేనూ కనిపెట్టే ఉన్నాను. అనుభవం లేంది అంత చనువుగా అతను నీతో ఎందుకు మాట్లాడుతాడు? అంతగా పరిచయం లేందే అట్లా పరిహాసంగా మాట్లాడుతాడా? ఇదంతా నాకు తెలీదనుకున్నావా?" అన్నారు. వారి నోటితో ఈ మాటలు వినగానే నాకు మతిపోయింది. ఏం మాట్లాడాలో ఏం చెప్పాలో నాకు అర్థంకాలేదు. చిన్నమావయ్యకూ నాకూ సంబంధం ఉన్నదా? చచ్చిన చిన్న

మావయ్య ఆ శుభసమయంలో ఆ రీతిగా వారికి గుర్తొచ్చా రన్నమాట. నా మనస్సులో చీకట్లు కమ్ముకున్నయ్.
నాలో పరాభవం రెచ్చిపోయింది. జీవితంమీదవిరక్తి కలిగింది. ఆడబ్రతుకంటే ఇన్ని అవమానాల పాలుగావాలా అనిపించింది. వారు నాతో మరి మాట్లాడలేదు. నా నిర్దోషిత్వం ఋజువుచేసుకోవాలి ఏం సమాధానం చెప్పదామను కున్నా ఆ సమయంలో వారు వినిపించుకునేటట్లు లేదు.
కొంత సేపయాక నాకు నేనే సమాధానం చెప్పుకుని తెప్పరిల్లుకుని "నా మీద మీకింత అనుమానం ఎందుకు కలిగిందో నా కర్థం కావటంలేదు చిన్నమావయ్యతో చను వుగా మాట్లాడటంనుంచి మీరు ఇంత అపోహ పడ్డారన్న మాట. దేవుడులాంటి చిన్నమావయ్య మీదనా మీ అను మానం! చచ్చినచిన్నమావయ్యమీద ఈఅభాండాలా! ఆలో చించండి. చాలా తొందరపడ్డారు. దైవసాక్షిగా నేనే పాపం ఎరుగను. నా జీవితంలో తుచ్ఛమైన ఆలోచనలు ఎప్పుడూ కలగలేదు. ఇంకముందు కలుగవు. ఇంతకన్న ఏం చెప్పాలో నాకు తెలీటం లేదు. అనుమానం అనర్థాలకు హేతువే. నా జీవితంలో ఇటువంటి అభాండాలుకూడా నెత్తిన వేసుకోవా ల్సొస్తుందని నేను కల్లోనయినా అనుకోలేదు" అని ప్రాధేయ పూర్వకంగా నా నిర్దోషిత్వాన్ని చెప్పుకున్నాను. నన్ను మంచంమీదినుంచి క్రిందికి నెట్టివేశారు. ఆ రాత్రి తెల్ల వార్లూ నాకా కటిక నేల ఆశ్రయమైంది. నా కన్నీరంతా భూదేవి పీల్చివేసింది. కళ్ళు వాచినయ్యి. ముఖమంతా ఎర్ర బడ్డది. నా బుగ్గలు దెబ్బలకు కందినయ్యి.

తెల్లవారింది. అంతా నన్ను చూసి నవ్వుకున్నారు. ఎవరి ఆలోచనలు వాళ్ళవి ఎవరి అనుభవాలు వాళ్ళవి. ఎవరి ఊహలు వాళ్ళవి. ఆ రోజు అటువంటిది. ఆ ముహూర్తం అటువంటిది. ఆ సమయంలో ఆడవాళ్ళ ఆలోచనలు అట్లా ఉండటంలో తప్పేమీ లేదు. అందుకు నేను బాధపడలేదు" అన్నది అక్కయ్య.

ఈ మాటలు అక్కయ్య చెపుతుంటే బావ మనస్తత్వం ఇటువంటిదా అని ఆశ్చర్యపోయాను. చిన్నమావయ్యమీద అనుమానమా! ఛీ మృత్యుదేవత ఈ రాబోయే పరిణామాలను ఊహించే చిన్నమావయ్యను ఆరీతిగా తీసుకుపోయింది. చిన్నమావయ్యగనక బ్రతికివుంటే ఈఅభాండాలు విని కుమిలిపోయి బావకు ఎట్లా నచ్చచెప్పాలో తెలీని మనోవ్యధతో మంచమెక్కి ఆ రీతిగానైనా ప్రాణాలు పోగొట్టుకునేవాడే బాంధవ్యాల్లో అతి మంచిగా ఉన్నా, చనువుగా ఉన్నా, కలుపుగోలుతనంగా ఉన్నా అనర్థాలకు దారితీస్తుందేమో!

"అక్కయ్యా! బావ ఇంత సంకుచిత హృదయుడని అనుకోలేదే. నీ నెత్తిన ఇటువంటి అభాండాల కొరివిని ఉంచుతారనుకోలేదు. కాలేజీలో లెక్చరరు. జ్ఞానహీనులూ, సహృదయులను అర్థంచేసుకోలేని వారూ డిగ్రీలు తెచ్చుకున్నా మూర్ఖులతో సమానమే" అన్నాను.

"మరే మనుకున్నావే సీతా! మా అత్తగారు నన్ను కాల్చుకుతింటున్న దనుకున్నావా? దీనికి తోడు అదికూడా ఉంటే ఇంక నా జన్మ తరించినట్లే. మీ అందరి దయవల్ల ఆ గొడవలు లేవు" అన్నది.

ఈ మాటకి కొంచం సంతోషించాను.

"తరువాత"

"మర్నాడుకూడా నాతో మాట్లాడలేదు. దాదాపు గంటసేపు అట్లాగే నిల్చున్నాను. "అట్లా నిల్చున్నావేం! ఇట్లారా" అన్నారు. వచ్చి మంచం మీద కూర్చున్నాను. నా దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించింది. "ఎందుకండీ! నాకీ అపనింద. నావల్ల తప్పుంటే మీరన్న మాటలకు ఈ రాత్రి మళ్ళా మీ వద్దకు వచ్చేదాన్నే కాదు. అందరితో బాటుగా మీరూ నా శవాన్నే చూచేవారు. కాని నేను చావ దల్చుకోలేదు. ప్రాణాలు తీసుకుంటే అపవాదు యదార్థమే అవుతుంది. మీ మనస్సులో ఈ విషబీజం ఎట్లా మొలకెత్తి నదో నాకు తెలీటంలేదు" అన్నాను.

"జానకీ" గద్దిస్తూ నావైపు చూశారు. వణికిపోయాను.

"కల్లిబొల్లి ఏడుపులు కట్టిపెట్టు. రంకు నేర్చినమ్మ బొంకు నేర్వకపోదు. ఎన్ని చెప్పినా నా అనుమానానికి కావాల్సినన్ని ఆధారాలున్నాయి" అన్నారు.

"మీరుచూసిన ఆధారాలేమిటో చెప్పండి, వింటాను. నా నిర్దోషిత్వాన్ని ఋజువు పర్చుకుంటాను. దైవసాక్షిగా మీ మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. మీరు అనవస రంగా నా మీద నిందమోపారు" అన్నాను.

"నా ప్రశ్నలకు సరిగా సమాధానం చెబుతావా?"

"అడగండి"

"మూణ్ణెల్లకు మా ఇంటికి వచ్చినప్పుడు మొదటి రోజున ఏమన్నాడో మీ చిన్నమావయ్య తెలుసా? ఆమాటలు నాకింకా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి."

"ఏమన్నాడు చిన్నమావయ్య?"

"జానకీ పెళ్ళయ్యాక ఎంతో మారిపోయినట్లున్నావ్. చాలా సంతోషం. మీ లెక్చరరుగార్ని చూస్తూ మా అందర్నీ మర్చిపోయేవ్ సుమా" అన్నాడు. ఆ మాటలోనే తేలింది మీ ఇద్దరి లోగుట్టూ. దీనికి నీ సమాధానం?" అన్నారు.

"సాధారణంగా పెళ్ళయి కాపురానికి వెళ్ళినవాళ్ళను బంధువులంతా ఎగతాళిగా అలా అంటారు. ఆ మాటల్లో విపరీతార్థం తీయవలసినంత విషయ మేమీ లేదు. మా కుటుంబమంటే చిన్నమావయ్యకున్న అభిమానంకొద్దీ అట్లా ఎగతాళిగా అడిగాడు. ఆ మాటల్ని మీరీ విధంగా అర్థం చేసుకున్నారన్నమాట" అన్నాను.

"అంతేకాదు. అనేక సందర్భాల్లోకూడా నీతో మీ చిన్నమావయ్య ఛలోక్తిగా, చనువుగా మాట్లాడాడు. ఎంత చనువు, ఇష్టతా, ప్రేమ లేంది వయసొచ్చిన వాళ్ళతో పెళ్ళయాకకూడా మేనమామ అంతనిబ్బరంగా పరాచికాలాడుతూ మాట్లాడుతాడు. ఏమీ లేకపోతే అలా ఎవ్వరూ, ఎప్పుడూ మాట్లాడరు. పెళ్ళి కానప్పుడు చనువుగా మాట్లాడినా పెళ్ళయ్యాకనైనా గౌరవంగా మాట్లాడుతారు. పెళ్ళయ్యాక మీ సరదాలు ఇంకా ఎక్కువయినట్లు" అన్నారు.

"మానవ మనస్తత్వాలు మీరావిధంగా అర్థం చేసుకుంటారన్నమాట పెళ్ళయ్యాక ఆ మరుక్షణమే ఆ పిల్ల ఆ భర్తకు అంకితమై పోతుంది. ఆ భర్తకు భార్యమీద సర్వ అధికారాలూ ఏర్పడుతాయ్యి. ఇంక తన భార్యతో ఎవ్వరూ మాట్లాడకూడదనీ, ఆమెవైపు ఎవ్వరూ తలెత్తి చూడకూడదనీ అనుకోవటం సహజమే. కాని ఆప్తులయినవారూ, మన మంచి చెడ్డలు, బాగోగులు ఆలోచించే వారూ సైతం ఆ పెళ్ళయిన పిల్లతో ఇంక ఏ విధంగానూ మాట్లాడకూడదనటంలో అంత అర్థం లేదేమో! నిన్న మొన్నటి వరకు తమ బంధుకోటిలో ఉన్నవ్యక్తి ఈ రోజున పరాయింటి కోడలైందనగానే అంతవరకూ ఉన్న బంధుత్వాన్నీ, సహృదయంతో చూసే ఆదరాభిమానాలనూ ఒక్క సారిగా తెగ తెంపులు చేసుకోవటం కష్టసాధ్యం. అనుమానం పెనుభూతంలాంటిది. చిన్నమావయ్యమీద మీకటువంటి అనుమానం కలిగిందంటే అది కేవలం నా ఖర్మనుకోవటం తప్ప వేరేచెప్పలేను. మంచి వాళ్ళను భగవంతుడు కూడా బ్రతకనివ్వడు. అందుకనే మావయ్య ఈ లోకాన్ని శాశ్వితంగా విడచిపెట్టి పోయాడు" అన్నాను.

"బాగానే సమాధానం చెప్పావే జానకీ. అందుకు ఏమన్నారు బావ?" అన్నాను.

"నిజమే. నా కళ్ళయెదుట లేకుండా భగవంతుడే నాకు సాయం చేశాడనుకున్నాను. లేకపోతే నా చేతుల్లో......" అంటూ పళ్ళుకొరికారు.

"ఆ రాత్రి మరి నాతో మాట్లాడలేదు".

ఆ రాత్రి కూడా నాకా కటిక నేల శరణ్యమైంది. చేతుల్లో తల దాచుకుని కుమిలిపోయాను. నేను జానకీదేవిని కాదు అగ్ని ప్రవేశం చెయ్యడానికి

అశరీర వాణి నా కన్యాత్వాన్ని గురించి పై నుంచి పలికేందుకు మనమేం పురాణకాలపు పుణ్య స్త్రీలం కాము అనుమానం కలగటానికి ఏ ఆస్కారమూ అక్కరలేదు. అది తొలగాలంటే కొన్ని సంవత్సరాలు పడుతుంది. వారికి నచ్చ చెప్పటానికీ, మామీద వారికిగల అనుమానాన్ని తీర్చటానికీ చిన్నమావయ్య బ్రతికి ఉండలేదు. ఇంక వారికి ఎవరు చెపు తారు? వారి మనసులో పాతుకుపోయిన శంకను ఎవరు తీరు స్తారు? ఎన్ని చెప్పినా వారు నా మాటలు వినలేదు. నా మాటలు నమ్మలేదు. మధురాతి మధురంగా గడపాల్సిన ఆ రెండు రోజులూ దిగులూ విచారంతోనే గడిచిపోయినయ్యి" అన్నది అక్కయ్య.

ఇంతవరకు సీత చెప్పిన విషయాలన్నీ విని రాధ చాలా విచారపడ్డది.

"మీ బావకు చదువున్నదిగాని సంస్కారం లేదు. ఆలోచనలు ఉన్నవిగాని అవి అర్ధరహితమైనవి హృదయ మున్నదిగాని అది అనుమానాల పుట్ట" అన్నది రాధ.

మళ్ళీ సీత చెప్పబోతూ ఉండగా ఏదో ఒక కాన్పు కేసు ప్రమాదంగా ఉందని నర్సు వచ్చి చెప్పటంతో సీత నర్సింగ్ హోమ్‌కి వెళ్ళింది. అప్పటికి రాత్రి తొమ్మిది గంట లయింది.

రాత్రి పన్నెండు గంటలు దాటాక సీత నర్సింగ్ హోమ్ నుంచి వచ్చింది. అంతవరకూ రాధ ఏదో పుస్తకం చదువు కుంటూ కూర్చుంది.

"నువ్వింకా నిద్రపోలేదా రాధా" అన్నది సీత.

"లేదు. ఎట్లా ఉందా కేసు?"

"సక్సెస్‌ఫుల్‌గానే కానుపయింది. ఏమిటో ఈ కాన్పు కేసులు చూస్తుంటే ఒక్కో-సారి మానవ జీవితం వ్యర్థమనే అనిపిస్తుంది. కొంతమందికి నిజంగా పురుడు పునర్జన్మగానే ఉంటుంది" అన్నది సీత.

రాధ నవ్వింది.

"నీలాంటి వాళ్లు ఉండగా పురుడు పోసుకునేవాళ్ళకు ఏ కొరతా ఉండదు" అన్నది రాధ.

సీత ఏం మాట్లాడలేదు.

"నాకు నిద్ర రావటం లేదు సీతా. మిగతా కథ పూర్తి చేస్తావా?"

"నాకు బడలికగా ఉంది. కాస్త విశ్రాంతి తీసుకో నియ్యి. మిగతా విషయాలు రేపు చెబుతాను" అన్నది సీత.

మర్నాడు ఆదివారం. రాధకు హాస్పిటల్ డ్యూటీ లేదు. సీత నర్సింగ్ హోమ్‌కి వెళ్ళింది. అందర్నీ చూసి ఎవ రికి ఏ మందులు ఇవ్వాలో నర్సులకు చెప్పి తను ఇంటికి వచ్చేసింది. సీత రాకకు రాధ ఎదురు చూస్తున్నది.

సీత నవ్వింది.

"మా జీవిత కథ అంత వినసొంపుగా ఉన్నదా రాధా?"

"కథ అనేది వినసొంపుగా ఉంటుంది. జీవిత కథ లయితే అందులో ఒక పాత్రగా మనమూ లీనమైపోతాం. అది కథ కాదు, ఒక జీవిత గాథ" అన్నది రాధ.

అక్కయ్య మళ్ళీ ఇట్లా చెప్పింది"—

"సీతా! జీవిత సమస్యల్ని పరిష్కరించుకోటానికి పెద్ద మనుష్యుల సాయం కొన్ని విషయాల్లో అవసరమే. కోర్టు సాక్ష్యాలూ, వ్రాతపూర్వకమైన ఆధారాలు కొంతమందికి అవసరం. వచ్చిన అపవాదులను పోగొట్టుకోటానికూడా ఇతరుల సాయం కొన్ని విషయాల్లో అవసరమే. కాని సీతా! నా విషయంలో మాత్రం ఎవరి సాయంపొందటానికి వీల్లేదు అపవాదు భరించిన చిన్నమావయ్య ఈ లోకంలో లేదు. మరి నాకు ఎవ్వరు సాయపడతారు?" అన్నది అక్కయ్య.

"అవును నీ అపవాదును చర్చించి నిన్ను నిర్దోషిగా ఋజువు చెయ్యటానికి ఎవ్వరూ లేరు. బావ మనస్సులో ఏ దేవుడన్నా ప్రవేశించి వారి మనస్సు మార్చవలసిందే" అన్నాను.

అక్కయ్య కళ్ళలో నీరు తిరిగింది.

"అంత పుణ్యాత్మురాలినా సీతా నేను. కరుడుకట్టిన వారి మనస్సు మారతుందా. నాకు నమ్మకంలేదు" అన్నది అక్కయ్య.

"నా మనస్సు ఎంతో వికలమైపోయింది" సీత ఒక్కసారి నిట్టూర్చింది.

"సరే తరువాత" అన్నది [illegible].

సీత మళ్ళీ చెప్పసాగింది—

"కొన్ని క్షణాలు కళ్లుమూసుకుని మళ్లా అక్కయ్య ఇట్లా చెప్పసాగింది"—

"సీతా! మీ బావ చిన్నమావయ్యమీద అట్లా అనుమానపడ్డారు కదా! నువ్వు మూణ్ణెల్లకు నాతో గుంటూరు వచ్చావుగా. వారట్లా అర్థంచేసుకునే రీతిగా చిన్నమావయ్య ఏం మాట్లాడాడో నువ్వు చెప్పవే" అన్నది అక్కయ్య.

కాస్సేపు జరిగిన విషయాలు గుర్తుకుతెచ్చుకున్నాను.

"మొదటి రోజున చిన్నమావయ్య అక్కడికివచ్చాడు. అప్పుడు నువ్వు గదిలో ఉంటే నేపిల్చుకొచ్చా నిన్ను కుశలప్రశ్నలయ్యాక చిన్నమావయ్య సర్దాగా ఏవో కబుర్లు చెప్పాడు. అప్పుడు బావకూడా అక్కడే ఉన్నారు. చిన్నమావయ్య మాటల్లో అపార్థాలకుగాని, అనుమానాలకుగాని, ఏమీ ఆస్కారం కనిపించదు. కాకపోయినా చిన్నమావయ్య స్వభావం అందరికీ తెలుసుకదా! అంత ఉత్తముడూ, దయార్ద్రహృదయుడూ, బంధువులంటే ఆదరాభిమానాలు కలవాడూ మన చుట్టాల్లో ఎవ్వరూ లేరు అందర్నీ కవ్వించి, నవ్విస్తూ, నవ్వుతూ సంతోషంగా మాట్లాడుతాడు. అత్తయ్యకూడా మావయ్యకు తగిన భార్య. వారి దాంపత్యం చూడముచ్చటగా ఉంటుందని మన చుట్టాలంతా అనుకుంటారు. అటువంటి సంసారంలో చిచ్చుపెట్టాడు భగవంతుడు. అంత మంచి పేరు తెచ్చుకున్నవాళ్ళు అర్థాయుష్షుగానే పోతారేమో" అన్నాను నేను.

"అవును కదా! అటువంటి సహృదయుడైన చిన్న మావయ్య నన్ను చుట్టానికి వస్తే నేను ఎట్లా మాట్లాడకుండా ఉండేది చెప్పు సీతా! కాకపోయినా నిన్నటి వరకూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడిన చిన్నమావయ్యతో, ఒక్కసారిగా పెళ్ళయిందని ఎట్లా మాట్లాట్టం మానెయ్యాలో ఆలోచించు. అటువంటి మావయ్యతో నాకు సంబంధం ఉందని వారు అనుమాన పడ్డారంటే నా మనస్సు ఎంత కుమిలిపోతున్నదో ఆలోచించు. పైగా చిన్నమావయ్య మీ బావగారి స్నేహితుడే. మావయ్య మనస్తత్వం వారికి మాత్రం తెలీదూ! తెల్సినా, వారికే అనుమానం కలిగిందంటే ఏం చెప్పాలో నాకు తల పగలుగొట్టుకున్నా తెలియటంలేదు. మావయ్య బ్రతికుంటే తన జీవితాన్ని త్యాగం చేసయినా వారి మనస్సులోగల ఆ అనుమానాన్ని తీర్చేవాడే మనందరి దురదృష్టవశాత్తు చిన్నమావయ్య ఈ లోకంలో లేడు" అన్నది అక్కయ్య.

"బావ అంత సంకుచిత హృదయుడన్నమాట. తరువాత అన్నాను. "సీతా! ఈ సంగతులన్నీ ఇప్పుడు నేచెప్పేటంతవరకూ ఎవ్వరికీ తెలియవుకదా! నేను కాపురానికి వెళ్లాక నన్ను గురించి ఏమనుకున్నావే" అన్నది అక్కయ్య.

"ఏమనుకుంటానే, నువ్వు అదృష్టవంతురాలి వనుకున్నాను. బావ సహృదయుడనీ అనుకున్నాను. నిన్ను ఎంతో ఆపేక్షగా చూసుకుంటూ పువ్వుల్లో పెట్టిపూజిస్తారనుకున్నాను. నీ మంచితనం, తెలివితేటలూ బావను ఆకర్షిస్తయ్యనుకున్నాను. నాన్న పొలమంతా అమ్మి పెళ్ళిచేసినా మంచిసంబం

ధమే చేశారనుకున్నాను అంతకుమించి నేనేమీ అనుకోలేదు''
అన్నాను.

"అవునే సీతా, నువ్వేకాదు అంతా అట్లాగే అనుకు
న్నారు. కొందరి జీవితాలు పైకి సంతోషంగానే ఉన్నట్లుగా
కనబడుతయ్యి. కాని లోపల అగ్నిపర్వతం ప్రజ్వరిల్లి బద్దలవు
తుంది కొంతమంది పైకి కష్టపడుతున్నట్లుగా కనిపించినా
ఎంతో ఆదర్శ దంపతుల్లా సంసార జీవితాన్ని గడుపుతారు.
అది వాళ్ళ మనస్తత్వాన్ని బట్టే. ఒకరియందు మరొకరికుండే
అనురాగాన్నిబట్టే ఉంటుంది. సరే మీరంతా వెళ్ళాక, చుట్టా
లంతా వెళ్లాక, ఇంక ఆ ఇంట్లో మిగిలింది మా అత్తగారూ,
మావగారూ, సుభద్రా, మే మిద్దరమూ. అంతా వెళ్లాక
నెమ్మదిమీద వారిని అన్ని విషయాలు అడుగుదా మను
కున్నాను'' అన్నది అక్కయ్య.

ఎందుకనో నావైపు నిరాశగా చూసింది అక్కయ్య.
మాట్లాడుతూ ఎందుకట్లా ఆగిపోయిందో నాకు అర్థంకాలేదు.
చూస్తూండగానే కన్నీరు పెట్టుకుంది. కొత్త విషయం ఏమ
యినా చెప్తుందేమో అనుకున్నాను.

"పెళ్లిలో చిన్నమావయ్య నాకు రిస్టువాచీ చదివిం
చాడు. గుర్తుందా సీతా?"

"అవును గుర్తుంది. ఆ వాచీ బాగా పనిచేస్తున్నదా?"

"హుం. వారికి నామీద ఈ అనుమానం కలిగినప్ప
ట్నించి ఆ వాచీ నా పెట్లో అడుగున పడేశాను. ఒకసారి
'కీ' అన్నా ఇవ్వలేదు. ఒకసారి టైము కావాల్సి మీ
బావను టైమెంతయిందండీ అని అడిగాను. అందుకు మీ

బావ ఏమన్నారో తెలుసా? 'మీ ప్రియమైన చిన్నమావయ్య ప్రెజెంటు చేసిన రిస్టువాచీ ఉన్నదిగా. అది చేతికి పెట్టుకు తిరుగు. టైము చూసుకోవచ్చు' అన్నారు. ఆ మాటలు నాకు సూలాల్లాతగిలాయి. ఛీ! ఇంతమాట అనిపించుకున్నాక, చదివించిన మావయ్య పోయాక ఈ గడియారం నా కాపురాన్ని ఏ విధంగానూ నిలబెట్టలేదనుకుని వారు చూస్తూండగానే ఆ గడియారాన్ని వీధిలో సైడు కాలవలో పారేశాను" అన్నది.

"నిజంగానా జానకీ. నూటయాభై రూపాయిలయిందిట ఆ గడియారం" అన్నాను ఆదుర్దాగా.

"అవునే సీతా, అంత అపవాదు నెత్తిన వేసుకుని జీవచ్ఛవంలా జీవిస్తున్నది చాలక, ఇంక ఆ గడియారం చేతికి పెట్టుకు తిరగమంటావా చెప్పు. మానవత్వం లోపించిన వారి మనస్సులో ఆ గడియారం ఇంకా దావానలాన్ని పెంచవచ్చు. అందుకే ఆ గడియారాన్ని పారేశాను. ఆ రోజున చిన్నమావయ్యను నేనే గొంతు పిసికి చంపినట్లుగా బాధపడ్డాను. ఆప్యాయంగా మంచి హృదయంతో చదివించిన ఆ గడియారాన్ని బురదగుంటపాలు జేశాను. నే చేసిన పనికి చిన్నమావయ్య ఆత్మ ఎంత క్షోభిల్లిందో" అన్నది.

ఈ మాటలు విని నేను మాట్లాడలేకపోయాను.

అక్కయ్య కాపురం ఈ తీరుగా ఉన్నందుకు ఎంతో బాధ పడ్డాను. అక్కయ్య మళ్ళీ చెప్పసాగింది.

"ఏదో ముభావకంగా భార్యాభర్తలం కనుక నాతో ఉంటమే తప్ప, కొత్త దంపతుల్లో ఉండవలసిన కోరికలుగాని

అనుభూతులుగాని, అభిరుచులుగాని వారిలో ఎక్కడా కనబడ లేదు. ఏం అడిగినా మాట్లాడరు. ఉదయం లేవగానే కాల కృత్యాలు తీర్చుకుని, కాలేజీపుస్తకాలు చదువుకోటం, నోట్సు రాసుకోటం, భోజనం చేసి కాలేజీకి వెళ్ళటం. సాయంత్రం అయిదు గంటలకు రాగానే, స్నానం చేసి, కాఫీ ఫలహారం చేసి ఎక్కడికో వెళ్ళిపోవటం, రాత్రి తొమ్మిది దాటగానే ఇంటికి రావటం. నావల్ల ఏ లోపముందని? ఎవరితో చెప్పు కోను? ఏమని చెప్పను? ఎట్లా చెప్పను? మా అత్తగారు అదో రకం మనిషి. ఎవరితోనూ కలుపుగోలుతనంగా మాట్లాడదు. పోనీ కోపల్ని కనక కోపమూ అంటే, అదీ కాదు. అవిడకు తోచిన పన్లు చెయ్యటం. లేకపోతే చెంగు పరుచుకుని పడుకో వటం. మాటా, పలుకూ, ఏమీ లేదు. ఆవిడ స్వభావమే అంత. మా మావగారు దేవుడు. ఆయనకు వేళకు ఇంత భోజనం పెడితేచాలు. ఆయనా రిజిష్ట్రారు ఆఫీసులోగుమాస్తా. ఇంకా రెండేళ్లు మాత్రం సర్వీసుంది. ఆయన ఆఫీసు గొడ వలూ, భోజనమూ మినహా ఏవీ పట్టించుకోరు. ఇంక మా ఆడబిడ్డ సుభద్ర తెలుసుగా? పదహారేళ్లు దాటినా, పెద్ద పిల్ల యినా పదేళ్ళ పిల్లలా ఉంటుంది వయస్సుకు తగిన భావాలు గాని, సిగ్గూ బిడియాలు గాని తెలియవు. కొంచెం వెకిలి తనమూ ఉంది. ఎంతో తెల్సిందానిలా, ఎంతో హుందా తనంగా, ఎంతో ధీమాగా, గొప్పగా ఉండాలనుకుంటుంది. కాని ఏం లాభం? నిమిషంలోకి తన తెలివితక్కువతనాన్ని బయటపెట్టుకుంటుంది. ఆ పిల్ల నీకూ పరిచయమేగా. కనీసం

నీతో వందసార్లయినా మాట్లాడి ఉంటుంది అవునా'' అన్నది అక్కయ్య.

* * *

"వింటున్నావా రాధా, అక్కయ్య జీవితం ఒక సినిమా కథ లాంటిది. అందులో హాస్యపాత్ర సుభద్ర. సుభద్ర స్కూలు ఫైనలు పాసయింది. అక్కయ్యతో వాళ్ళింటికి వెళ్ళిన మూడు రోజుల్లోనూ ఆ అమ్మాయి వాలకం చూస్తూంటే నాకు నవ్వొచ్చేది రాధా''అన్నది సీత రాధతో నవ్వుతూ.

"ఏం, వెర్రిబాగులదా? అట్లాఅయితే స్కూలుఫైనలు ఎట్లా పాసయింది?'' అన్నది రాధ.

"చదువుకీ లోక జ్ఞానానికీ కొంతమంది విషయంలో సంబంధంలేదు రాధా. అక్కయ్య పెళ్ళిలో ఒక సంఘటన తల్చుకుంటే నాకు ఇప్పటికీ నవ్వు వస్తుందే రాధా'' అన్నది సీత.

"ఏమిటమ్మా అంత నవ్వు వచ్చే సంగతి'' అన్నది రాధ.

"అక్కయ్య పెళ్ళిలో పళ్లు దోము పుల్లలకి వెళ్ళాము. అమ్మ, పిన్ని, నేనూ విడిదికి మేళంతో వెళ్ళాము. అప్పటికి ఉదయం తొమ్మిది గంటలయింది. అంతా స్నానాలు చేసి ముస్తాబు అయి మేం వస్తామని కూర్చున్నారు. తీరా పీటల మీద పళ్లు దోము పుల్లలకి కూర్చోపెట్టేసరికి సుభద్ర పేచీ పెట్టింది. పళ్ళు దోము పుల్లలంటే ఏదో నాలుక గీసేసినట్లు

గీసి ఒక చీరపెట్టి వెళ్ళిపోవటం కాదు. నాకు ఒక్కగానొక్క అన్నయ్య. నేనూ ఒక్కగానొక్క ఆడబడుచును. మామూలు ప్యాకెట్లూ లాంఛనాలతో బాటుగా నాకు ఓ డజను టూత్ పేస్టు ప్యాకెట్లు, ఒక వెండి బ్రష్, వెండి తాటాకు కావాలి అవి తెస్తే నేను పీటమీదనుంచి లేస్తాను. లేకపోతే అలుగుతాను. అన్నది. ఆ సమయంలో అట్లాంటి అర్థంలేని పేచీలు పెట్టి నందుకు అందరికీ కోపమూ, నవ్వూ కలిగినయ్య. చివరికి నేనే సుభద్రను సమాధానపర్చి, "అవన్నీ ఆలాంఛనాలన్నీ మాకు తెలీదండి, మా ఇంట ఆనవాయితీ లేదు మీకు టూత్ పేస్టులు పుచ్చుకోవటం ఆనవాయితీ అయితే డబ్బిస్తాం కొనుక్కోండి" అని నేను వెళ్ళి నాన్నగార్నడిగి ఓ పాతిక రూపాయలు తెచ్చి సుభద్ర చేతిలోపెట్టాను. అప్పటికిగాని సుభద్ర ముఖం తేటపడలేదు" అన్నది సీత.

ఇదంతా విని రాధ నవ్వింది. "సీతా, సీరియస్‌గా ఉండే సినిమాలో రిలీఫ్ కోసమని హాస్యపాత్రల్ని ప్రవేశ పెట్టినట్లుగా ఉంది సుభద్ర కథ. అయితే సుభద్ర అంత తెలివికలదన్నమాట" అన్నది రాధ.

"అప్పటి పరిస్థితులు అవ్వి. ఇప్పుడంటావా మనబోటి వాళ్ళకి పని మందికి చెబుతుంది సుభద్ర" అన్నది సీత.

"పోనీలే బ్రతికిపోయాం. ఇంక అసలు విషయం చెప్పు" అన్నది రాధ.

సీత మళ్ళా చెప్పసాగింది—

"సుభద్ర మనస్తత్వం తెల్సిందిగా సీతా! అట్లాంటి సుభద్ర అస్తమానం నాతో అర్థం పర్థంలేని ఎగతాళి మాటలు మొదలుపెట్టింది" అన్నది అక్కయ్య.

"ఏమనేదేం"అన్నాను సుభద్రను తల్చుకునినవ్వుతూ.

"వదినా, నువ్వు చదువుకున్న దానివే కదా! నాకు తెలీక అడుగుతాను. నువ్వు అన్నయ్య పాదాలకు నమస్కరిస్తావా? మంగళసూత్రాలు కళ్ళకద్దుకుని పడుకుంటావా? అని అడిగింది సుభద్ర."

"ఏమన్నావేం ఆ మాటకి" అనడిగాను

"అసలే మతిపోయి నే చస్తుంటే సుభద్ర తెల్సీ తెలియని మాటలకి నవ్వాలో ఏడవాలో నాకు తెలియలేదు. "సుభద్రా, అవన్నీ నాకు తెలియవు. మీ అన్నయ్య నడుగు. వారేం అన్నదీ నాకు చెప్పు" అన్నాను. ఆ రోజు సాయంత్రమే సుభద్ర వాళ్ళన్నయ్యని ఈ విషయాలు అడిగింది. ఆ పిల్లకు జంకూ, భయమూ లేదు రెండు నిమిషాల్లో మళ్ళీ నా దగ్గరికి వచ్చింది సుభద్ర. ఏమన్నారు మీ అన్నయ్య అన్నాను సుభద్ర బిక్కమొహంపెట్టి "అదేమిటి వదినా, అన్నయ్య అట్లా విసుక్కున్నాడు 'ఇదో నాటకం ప్రారంభించిందా మీ వదిన' అన్నాడు. అదేమిటి వదినా, అన్నయ్యకు నీ మీద కోపమా అన్నది. నాకు ఏం చెప్పాలో తోచలేదు. "కోపం కాదు సుభద్రా! ఊరికినే అన్నారు. నేనంటే ఇష్టమే. నేనేం బావుండలేదా చెప్పు. నాలో నువ్వేదయినా లోపం కనిపెట్టావా?" అన్నాను.

"నీకు వంకేమిటి వదినా. చక్కగా, ముచ్చటగా ఉన్నావు. ఏ వంకా, లోపమూ లేదు. చదువుకున్న దానివి నీకు లోపమేమిటి?" అన్నది నేను నవ్వి వూరుకున్నాను.

"సరేగాని వదినా! అన్నయ్యా, నువ్వూ ఎప్పుడూ సినిమాకి వెళ్ళరేం? రేపు మీరిద్దరూ జతగా సినిమాకి వెళ్లాలి. అంతే. తెల్సిందా" అన్నది. అది నిజంగా అన్నదో, ఎగతాళిగా అన్నదో నాకు అర్థం కాలేదు. వాళ్ళన్నయ్యతో కూడా చెప్పినట్లుంది. ఆ రాత్రి మీ బావ నన్నడిగారు

"సినిమాకు వెళదామన్నావుటగా" అన్నారు.

"నేను అనలేదు. సుభద్రే అన్నది నువ్వూ, అన్నయ్యా ఎప్పుడూ సినిమాకు వెళ్ళరేం అని నేను సినిమా విషయమే ఎత్తలేదు" అన్నాను.

"పోనీలే. అదీ నిజమే. మనం సినిమాకు వెళ్ళనల సిందే. రేపు రెడీగా ఉండు. సాయంత్రం ఆరు గంటలకి వెళదాం. చూడు జానకీ! నీకేం కావలసినా నన్నడుగు. సుభద్రతో చెప్పకు. అది వర్తి కోతి."

అంత ఆప్యాయంగా మాట్లాడుతారని నేను అనుకోలేదు. ఈ రోజున నా మీద, నా స్వామికి ఇంత దయ కలిగిందా అనుకున్నాను. నాయందు ప్రసన్ను లయినందుకు ఎంతో మురిసిపోయాను. అనవసరంగా నామీద ఏర్పచుకున్న అనుమానాలు పోయినయ్యనుకున్నాను. నా జన్మ తరించిందనుకున్నాను. మనస్సులోనే ఆ వెంకటేశ్వరస్వామికి ధన్యవాదాలర్పించి నిద్రపోయాను. చాలా పొద్దుపోయింది. అర్థరాత్రి అయి ఉండొచ్చు. అటునుంచి ఇటు వత్తిగిల్లి కళ్ళు

తెరచి చూసేసరికి, పక్కమీదనే కూర్చుని నా ముఖంలోకి చూస్తున్నారు ఖంగారుపడి లేచి కూర్చున్నాను.

"ఏమండీ, నిద్రపోలేదా? నాకు నిద్ర వచ్చేసింది. ఏమిటో పాడు నిద్ర. ఎంతసేపయింది మెళుకువ వచ్చి" అన్నాను.

"నువ్వు కాపురానికి వచ్చినప్పట్నుంచి మెళుకువగానే ఉన్నాను. జానకీ నిజం చెప్పు. నువ్వు, మీ చిన్నమావయ్యతో..." అర్థోక్తిలోనే ఆయన నా ముఖంలోకి చూశారు.

నా జీవితంలో మళ్ళీ చీకట్లు కమ్మినయ్యి. ఏరోజూ జీవితం ఒడుదుడుకులుగానే ఉంది. దీనంగా వారివైపు చూశాను. వారి పాదాలమీద తల వాల్చాను. కన్నీటితో అభిషేకం చేశాను.

"ఎందుకండీ నన్నిట్లా అనుమానంతో, మాటల్తో పొడిచి, పొడిచి చంపుతున్నారు? దైవసాక్షిగా, మీమీద ప్రమాణం చేసి చెపుతున్నాను మా చిన్నమావయ్యతో నాకే సంబంధమూ లేదు. చిన్నమావయ్య సహృదయుడు. సరదాగా కబుర్లు చెప్పేవాడు. గుణగణాల్లో దైవసమానుడు. చిన్నమావయ్యే కాదు, నేను చదువుకునే రోజుల్లోకూడా ఎవర్నీ కన్నెత్తి చూడలేదు. నేనెవరినీ ప్రేమించలేదు. నాకలాంటి స్నేహితులు లేరు. స్నేహాలు, ప్రేమలూ నాకు తెలియవు. నేను ప్రేమించినా, కామించినా మీరే నా సర్వం ఈ అనుమానం మీ మనసులోనుంచి, హృదయంలో నుంచి ఎప్పుడు తొలగిపోతుందో నాకు తెలీటంలేదు. నేను పతితను కాను. దైవసాక్షిగా నేను ఏ పాపం ఎరుగను" అంటూ

ప్రాధేయపూర్వకంగా వారిని బ్రతిమాలాను. వారు మాట్లాడ లేదు. ఆ రాత్రి అట్లాగే గడిచిపోయింది. మర్నాడు నాకు సినిమాకు వెళ్ళబుద్ధిపుట్టలేదు. పగలల్లా నాలో నేను మధన పడుతూనే ఉన్నాను. సాయంత్రం అయిదింటికల్లా మీ బావ కాలేజీనుంచి వచ్చారు రాగానే "జానకీ సినిమాకు పోదాం తయారవు" అన్నారు. ఎందుకో నేను ఏ మాట అంటే ఏం తప్పోనని "సరే" నన్నాను. సుభద్రనికూడా రమ్మన్నాను. వస్తానని తయారయింది సుభద్ర. అంతలోనే మా అత్తగారు కల్పించుకుంది.

"వాళ్ళిద్దరి మధ్యా నువ్వెందుకే సుభద్రా! నువ్వూ మొగుడితో సినిమాకు వెళ్ళే రోజులు ముందున్నాయి" అన్నారు.

సుభద్రకు కోపమొచ్చింది. ఎంత బ్రతిమాలినా సిని మాకు రానన్నది. మేం సినిమాకు వెళ్ళటం మా అత్తగారికి ఇష్టంలేదు. ఆవిడ ఉద్దేశం వేరు. కొడుకు "అమ్మా! నువ్వూ రావే, సరదాగా అంతాకలసి సినిమాకు వెళదాం" అంటే ఆవిడా వచ్చేది, సుభద్రా వచ్చేది. ఆవిడను రమ్మనలేదని కోపం. కొడుకు రమ్మనందే, "నేనూ వస్తానురా సినిమాకు" అని ఎట్లా అంటుందావిడ? అత్తయ్యకూ, ఆడబిడ్డకూ కోపాలు తెప్పించిన ఆ సినిమాకు పోకపోతే ఏ దేవుడు ఏడిచా డని నేనూ రానన్నాను. మీ బావ వినలేదు. అయిష్టతగానే బయల్దేరాను. ఇద్దరం రిక్షా ఎక్కాం. వారితో సినిమాకు వెళ్ళటం, రిక్షా ఎక్కటమూ అదే ప్రథమం" అన్నది అక్కయ్య.

రెండు నిమిషాలు కళ్లు మూసుకుంది. జరిగిన సంఘటనలు గుర్తుకు తెచ్చుకుంటున్నదేమోనని నేనూ పలకరించలేదు. అక్కయ్య మళ్లా ఒక్కసారి నిట్టూర్చి:

"ఏమిటో సోదంతా చెప్తున్నానే సీతా. విసుగ్గా ఉందేమో. ఇదంతా పుణ్యచరిత్ర కాదు వినటానికి పొద్దు పోయింది. పడుకో" అన్నది.

టైము చూశాను. రాత్రి పన్నెండు అయింది.

"నిద్ర రావటంలేదే అక్కా! నాకేం విసుగ్గాలేదు. విసుక్కోటానికి నువ్వేం పరాయిదానివి కాదు. కాకపోయినా నీ జీవిత చరిత్ర వింటూంటే నాకూ నా జీవితంలో ఉపయోగపడొచ్చు. నేనూ సామాన్య మానవురాలినే. దేవకన్యను కాదుగా" అన్నాను.

ఈ మాటకి రాధ నవ్వింది.

"నువ్వు దేవకన్యవు కాదని అంటే సరిపోతుందా. నిజంగా దేవకన్యవే సీతా! నాకు నిజంగా నువ్వు దేవకన్యవే అనిపిస్తోంది" అన్నది రాధ

"ఎందుకని?" అన్నది సీత.

"ఎందుకనో తరువాత చెప్తాను."

"భోజనం చేద్దామా?"

"నాకు ఆకల్లేదు. నీ అక్కయ్య జీవితచరిత్ర వింటూంటే నాకు ఆకలనిపించడం లేదు. మిగతా విషయాలన్నీ చెప్పు. పూర్తిగా వింటేనేగాని నేను భోజనం చెయ్యను. నాకు అప్పుడే డ్యూటీకూడా లేదు. నీకు అవసరమైతే నువ్వు

వచ్చి చెప్తుందిగా, ఒకసారి వెళ్ళిచూసొద్దువుగాని ఒక్క గుక్క కాఫీ తాగుదాం" అన్నది రాధ

ఫ్లాస్కు-లో కాఫీ రెండు కప్పుల్లో పోసింది సీత. ఇద్దరూ కాఫీ తాగారు. అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంట లయింది.

సీత మళ్ళీ చెప్పసాగింది—

"సీతా! మానవ మనస్తత్వాలు అనేక తీరులుగా ఉంటయ్యి కొంతమందికి సరిగ్గా అయిదు వేళ్ళు నోట్లోకిపోవు. వాళ్ళ ఇళ్ళు చూస్తూంటే వాళ్ల తాహతు ఎటువంటిదయిందీ తెలుస్తుంది. ఒక్కగది, వంటిల్లూ ఉన్న భాగాల్లో అద్దెలు పెట్టుకోలేక, నలుగురు పిల్లలున్నా సరిపెట్టుకుంటారు. వండు కోటానికి సరయిన పాత్ర సామానులుండవు. పట్టుమని నలు గురు చుట్టాలొస్తే తాగటానికి గ్లాసులుండవు. ఎటుచూసినా దణ్ణాలమీద చిరిగిపోయిన బట్టలూ, మాసిన బట్టలూ వేలాడు తుంటయ్యి. సరయిన పక్కబట్టలుండవు. కంపుకొట్టుకుంటూ రెండు జంపకాణాలూ, రెండు దుప్పట్లకన్నా ఎక్కువవుండవు. ఆదిళ్ళకుగలీబులు లేక తలనూనెమురికిపట్టి వాసనేస్తూఉంటయ్యి. నవారుమంచాలైనాలేకుండా నులకమంచాల్లో,కుక్కిమంచాల్లో కాపురాలు చేస్తుంటారు. అట్లా బీదరికంలో ఉన్నా, చాలీ చాలని జీతాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నా, ఆ దంపతులు ఎంతో అన్యోన్యంగా, ఆపేక్షగా ఉంటారు ఉన్నంతలో నేతిని అప్పో, సప్పో చేసినా, కనీసం వారానికోసారయినా, ఎంతో ముచ్చటగా ముస్తాబయి, చీకూ చింతా లేకుండా సినిమాకి పోతారు. రోజూ మడ్డిగారుకుంటూ ఉండే అయిల్లాలు ఆవేళ

చూడ ముచ్చటగా వుంటుంది. వంటిమీద చిరిగిన చొక్కా లతో మట్టిలో ఆడుకునే ఆ పిల్లలు, ఆవాళ దొర బాబుల్లా ఉంటారు. వాళ్లదే నిజమైన ఆదర్శ దాంపత్యం. వారి గృహ జీవితంలో ఆ రోజున వసంతాలు గుభాళిస్తవి. తృప్తిగా, ఆనందంగా ఒకరి హృదయాల్లో మరొకరు ఇమిడిపోతారు. కాని సీతా! అలాంటి జీవితానికికూడా నోచుకోలేక పోయాను నేను. ఆ రోజు అటువంటిది వారితో రిక్షాలో కూర్చుని పోతూంటే నా మనస్సు ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది. నేనూ అదృష్టవంతురాలినే అనుకున్నాను. నేనూ ఆదర్శ దాంపత్య జీవితం గడుపుతున్నాననుకున్నాను. నేనూ లెక్చ రరుగారి భార్యను, చదువుకున్నదాన్ని కాని అనుభవానికి నోచుకోలేదు" అన్నది అక్కయ్య.

"ఏం జరిగింది? సినిమాకు వెళ్లలేదా?" అన్నాను ఆదు ర్దాగా.

"సినిమాకు వెళ్లాం. బాల్కనీలో కూర్చున్నాం. వారి పక్కనే కుర్చీలో కూర్చున్నాను. నాది ఆఖరు కుర్చీ. నా ముందు కుర్చీల్లో అంతా మగవాళ్ళే కూర్చున్నారు. సినిమా ప్రారంభించారు. వారి పక్కన కూర్చుని సంతోషంగా సినిమా చూస్తున్నాను ఇంటర్వెల్ అయింది. లైట్లు వెలిగాయి. నా ముందు కూర్చున్నతను లేచి నిలుచున్నాడు. వెనక్కి తిరిగి చూశాడు. సాధారణంగా సినిమాకి వెళ్ళినప్పుడు కొంతమందికి వెనక్కి తిరిగి చూట్టం అలవాటు. ఎరుగున్న వాళ్ళెవరయినా వచ్చారేమో చూద్దామని చూసేవాళ్ళు కొంతమంది. ఎంత మంది ఆడవాళ్ళు వచ్చారో చూద్దామని చూసేవాళ్ళు కొంత

మంది. ఎవరి ఆలోచనలు వాళ్ళవి. అందర్నీ అందరూ సమ ర్థించలేరు. ఎవరి ఇష్టాలు వాళ్ళవి. ముందుకూర్చున్న వాళ్ళు వెనక కూర్చున్న వాళ్ళని చూడకూడదనే చట్టంలేదు కదా. అట్లాగే అతనూ చూశాడు. చూస్తూనే "ఏమండీ కులాసా? సినిమాకొచ్చారా?" అని మందహాసంచేసి, మళ్ళా మామూ లుగా తన కుర్చీలో కూర్చున్నాడు నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తినయ్యి. ఖంగారు పడ్డాను. అతన్ని వారు చూశారు. నాతో మాట్లాట్టం చూశారు ముభావకంగా ఊరుకున్నారు. సినిమా ఎప్పుడయిందో నాకు గుర్తులేదు. ఇంటికి వెళ్లాము. రిక్షాలో కూర్చున్నంతసేపూ వారు నాతో మాట్లాడలేదు. నేను ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని కూర్చున్నాను. ఆరాత్రి ఎవరం భోంచెయ్యలేదు. పడక గదిలోకి వెళ్లాకకూడా వారు నాతో మాట్లాడలేదు. మంచంమీద గోడవైపుకు తిరిగి పడు కున్నారు. మంచంమీద కూర్చుని మీద చెయ్యివేసి "ఇటు తిరగరూ" అన్నాను. నావైపుకు తిరక్కుండానే "అతనెవరు?" అన్నారు. "ఇటు తిరగండి చెపుతాను" అన్నాను ధైర్యంచేసి. నా జీవితంలో అడుగడుగునా అగ్నిపరీక్షలే. నా వైపుకు తిరిగి చెప్పమన్నట్లుగా నావైపు చూశారు. "సినిమాలో కనిపించి నతనేగా. ఇంటరులో ఏలూరులో నా క్లాసుమేట్. ఎరుగున్న వాళ్ళంగనుక పలకరించాడు. అతను పలకరించినా నేనేం సమాధానం చెప్పలేదే? అన్నాను" అన్నది అక్కయ్య.

"అప్పుడేమన్నారు బావ?" అన్నాను నేనూ ఆదుర్దాగా.

"అట్లాగా! పాపం. సంగనాచివి. మీరిద్దరూ కూడ బలుక్కునే వచ్చారని నా ఉద్దేశ్యం. నువ్వు మాట్లాడ

లేదన్నావు. అవునుమరి. పాత కాపేగా. ఆ సమయంలో ఆంతకన్నా కబుర్లు ఏముంటయ్యి. అందుకనే అతని వెనక కుర్చీలో కూర్చున్నావు సిగ్గు లేకపోతేసరి ముఖానికి. ఇంత బరి తెగించి ప్రవర్తిస్తావనుకోలేదు ఛీ! నీ ముఖం చూడ కూడదు. ఇంతకన్నా చస్తే నీకూ నాకూ మనశ్శాంతి అయినా ఉంటుంది'' అని అంటూనే నన్ను కిందికి నెట్టేశారు. మంచంమీాదనుంచి కిందపడ్డాను. ప్రాణం పోయినా బాగుం డేది. నుదురుకు దెబ్బతగిలి బొప్పి కట్టింది. మోచెయ్యి కొట్టుకు పోయింది. ఎత్తు పందిరి మంచం కావటంనుంచి ఆ దెబ్బలు తగిలినయ్యి'' అని కళ్లు తుడుచుకుంది అక్కయ్య.

సీత ఈ విషయాలు చెప్తుంటే రాధ నిర్విణ్ణురాలై వింటున్నది చెప్పటం ఆపి సీత రాధవైపు చూసింది.

"ఏం రాధా! ఎట్లావుంది అక్కయ్య జీవిత చరిత్ర?" అన్నది సీత.

"ఎట్లా ఉన్నదని చెప్పను. ఈవిషయాలన్నీ వింటుంటే అసలు ఆడదానికి పెళ్ళిమీాద ఇష్టంతగ్గిపోతుందేమో?అత్తింటి కాపురం చేసేవాళ్లు వున్నారుగాని మీా బావలాంటి వాళ్లు చాలా అరుదుగానే కనిపిస్తారు'' అన్నది రాధ.

"అవును రాధా. అక్కయ్యచెప్పిన మాటలువింటుంటే బావ అంత నీచుడాఅనిపించింది. కావటానికి ఎమ్.కాం. ప్యాస యాడు. కాలేజీలో లెక్చ్చరరు. రెండు వందల యాభై జీతం. సూటూ, బూటూ వేసుకుని, టై కట్టుకుని, తల పదిసార్లు నొక్కులు నొక్కులుగా దువ్వి, చక్కగా సైకిలుమీాద కాలే జీకి వెళతారు. మనస్సులో, హృదయంలో ఏకోశానా ఇంగిత

జ్ఞానంలేదు. అర్థంలేని అనుమానంతో సంసార జీవితం ప్రారంభించారు. జరిగే సంఘటనలన్నీ ఆ అనుమానాల్ని బలపరుస్తూనే ఉన్నయ్యి. నాకు బావమీద గౌరవంపోయింది అక్క కాబట్టి వూరుకున్నది. నేనైతేనా, తగిన బుద్ధి చెబుదును అనుకున్నాను. కాని నేను చెయ్యగలిగిం దేమిటి! నా ప్రశ్నకు అప్పుడు నాకే సమాధానం దొరకలేదు. మాన మర్యాదలకు తల ఒగ్గి సాచరించే అక్కయ్య మరి ఏం చేస్తుంది!" అన్నది సీత.

"ఎవరయినా ఏం చేసేది లేదు. తెగించిన వాళ్ళయితే తెగతెంపులు చేసుకుంటారు కాని, అది ఏమంత ఘనకార్యమైన పని" అన్నది రాధ.

"అక్కయ్య ఇంక చెప్పలేకపోయింది నాకూ మనస్సు వికలమైపోయి యింక వినలేకపోయాను.

అక్కయ్య కళ్ళు మూసుకుని పడుకుంది. నేను మాట్లాడలేదు. తెల్లవారుఝాముకి నాకు నిద్ర పట్టింది" అని చెప్పటం ఆపింది సీత.

"మీ చిన్నమావయ్య భార్యా పిల్లలు ఎక్కడున్నారు?" అన్నది రాధ.

"చిన్నమావయ్య భార్యా పిల్లలూ ఇప్పుడు రాజమండ్రిలో ఉన్నారు పొలాలమీద డబ్బుతో కాలం గడుపుతున్నారు" అన్నది సీత.

"చేతికొచ్చిన పిల్లలు లేరా?"

"పెద్దవాడు సెకండ్ ఫారం చదువుతున్నాడు."

"పాపం! ఊం- తరువాత?"

సీత మళ్లా చెప్పసాగింది—

"మర్నాడు నిద్ర లేచేసరికి మా ఇద్దరి కళ్ళూ ఎఱ్ఱబడి వాచినయ్యి మా ఇద్దర్నీ చూసి అమ్మ కంగారు పడింది. 'అదేమిటే సీతా, ఇద్దరి కళ్ళూ అట్లా వాచి ఎఱ్ఱబడినయ్యి. నిన్న పేరంటంలో ఇద్దరూ పట్టు చీరెలు కట్టుకుని అమ్మతల్లు లల్లె తిరుగుతుంటే ఏ దిష్టో దిబ్బలో తగిలిందేమో!' అన్నది అమ్మ. మాకు నవ్వూ, విచారమూ కలిగినయ్యి. అమ్మ మా ఇద్దరినీ చూసి ఖంగారుపడ సాగింది.

"ఏం లేదమ్మా, ఏవో కబుర్లు చెప్పుకుంటూ రాత్రి చాలా పొద్దుపోయాక నిద్రపోయాము. అందుకని నిద్రచాలక కళ్ళు వాచినయ్యి. అంత సుకుమారి మొద్దు శరీరాలే మావి" అన్నాను నవ్వుతూ అమ్మతో. అక్కయ్యకూడా నాతో ఏకీభ వించింది. అక్కయ్య సంసార గొడవలు వినేసరికి నాకు కళ్ళు వాచినయ్యి. అమ్మయితే మంచమెక్కేదేనేమో?

మర్నాడు రాత్రి మళ్లా అక్కయ్య తన గాథ చెప్ప సాగింది. "సీతా! పుణ్యచరిత్రలు వింటే భక్తీ ముక్తీ ఉంటుం దంటారు. భక్తీ, ముక్తీ కోసమని పుణ్యచరిత్రలు కొంత మంది వింటారు. వాటిల్లోని సారంగాని, తెల్సుకోవలసిన విష యాలు తెల్సుకోటానికిగాని, కొంత మంది పురాణాలకు పోతారు. కొంతమంది కాలక్షేపానికి పోతారు. ఇంక పాపుల చరిత్ర వినేవారు కొంతమంది. ఆ పాపపు చరిత్ర వినటం వల్లనే తామేదో రహస్యాలు తెలుసుకున్నట్లూ, ఘనకార్యం చేసినట్లూ భావిస్తారు కొంతమంది. మరి కొంతమంది ఇత రుల జీవిత విషయాల్లో జోక్యం కలిగించుకుని, వారి కష్టాలనే

తమ కష్టాలుగా భావించి సానుభూతిని చూపటమో, తమకు చేతనైన సాయం చెయ్యటమో చేస్తుంటారు. ఈ నిర్భాగ్యు రాలైన అక్కయ్య జీవిత కథ విని, నా కష్టాలు ఏ విధంగా ఈడేర్చగల ఓ తగిన సలహా చెప్పవే సీతా!" అన్నది అక్కయ్య

అక్కయ్యకు నే నేం సహాయం చెయ్యగలను? ఏం సలహా చెప్పగలను??"

సీత రాధ వైపు చూస్తూ కూర్చుంది.

"సీతా! మనకు సన్నిహితురాలైన వారిలో ఒక చెడ్డ గుణం కనిపించినప్పుడు, అయ్యో! పాపం పాడయిపోతున్నారే అని సానుభూతి కనబరుస్తారు. ఆ వ్యక్తి చెడ్డపని చేస్తున్నారని తెల్సినా కొంత సానుభూతి చూపగలుగుతాం. ఆ వ్యక్తిలో ఆ చెడ్డతనమే జీర్ణించిపోతే ఇంక ఆ వ్యక్తి బాగుపడటం కల్ల అనుకుని, ఒక్క నిట్టూర్పువిడిచి, ఒక రకమైన ఏహ్యభావాన్ని ఆ వ్యక్తినిగురించి మన మనస్సులో చిత్రించుకుంటాం. సాను భూతికూడా అంతే మనకు సన్నిహితులైనవారి కష్టాలు మనం మొదట్లో విన్నప్పుడు, ఆ కష్టాలే మన కష్టాలుగా తల్చుకుని, వాళ్ళతో బాటుగా మనమూ బాధ పడుతాం. ఆ కష్టాలే వదలక పీడిస్తూంటే అప్పుడు కర్మ సిద్ధాంతాన్ని స్మరించక తప్పదు. మీ అక్కయ్య జీవిత చరిత్ర ఇంతవరకు వింటున్న దాన్నిబట్టి చూస్తే జాలిపడి, కర్మ సిద్ధాంతాన్ని పాటించడం తప్ప ఇతరులు చెయ్యగలిగిన సహాయం ఏం లేనట్లుగా నే తోస్తు న్నది" అన్నది రాధ.

సీత కొద్దిగా నవ్వి, "నీకూ అట్లాగే అనిపించిందా రాధా" అన్నది. రాధ ఏమీ అనలేదు.

సీత మళ్ళీ చెప్పసాగింది—

అక్కయ్య మళ్ళా ఇట్లు చెప్పింది. "ఆ విధంగా వారు నన్ను కిందకు నెట్టివేసేసరికి, కిందపడ్డాను. నా ముఖాన బొప్పి కట్టింది. కుడిచెయ్యి ఎత్తనివ్వలేదు నా పరిస్థితి చూసి సుభద్ర నవ్వసాగింది. సుభద్రకు ఏసమయంలో, ఏం అనొచ్చో, ఏ మాట అనకూడదో తెలీదు. ఆ మాటలకూ, హాస్యానికీ అర్థం లేదు" అన్నది అక్కయ్య

"ఏమన్నదేమిటి సుభద్ర?" అని అడిగాను.

"ఏం చెప్పనే సీతా, వదినా, వదినా వల్లంకి పిట్ట. గదిలోపెట్టి గంజినీళ్ళు పొయ్యా, మా అన్న కొట్ట. నువ్వేడవా, నే నవ్వా—అంటూ చప్పట్లుకొట్టి, నవ్వసాగింది. తగిలిన దెబ్బల బాధకన్నా, సుభద్ర ఎగతాళి మాటలు నా మనస్సును మరింత బాధపెట్టినయ్యి. జరిగిన విషయం సుభద్రకేమని చెప్పేది. అత్తయ్యకు ఎట్లా చెప్పేది చెప్పినా వాళ్ళు సానుభూతి చూపకపోగా నిజంగా నాలో అలాంటి చెడ్డబుద్ధి ఉన్నదనే అనుకుంటారు. అప్పుడు పరిస్థితి ఎట్లా ఉంటుందో ఆలోచించు. నేనేం మాట్లాడలేదు. ఏమీ చెప్పలేదు. అ పగలంతా మీ బావ నాతో మాట్లాడలేదు"అని నవ్వుముఖంతో నా వైపు చూసింది అక్కయ్య.

అంత కష్టపడినవిషయాలు చెపుతూ, అంతలోనే నవ్వుముఖంతో నా వైపు ఎందుకు చూసిందో నాకు అర్థంకాక నేనూ ఆశ్చర్యంతో అక్కయ్యవైపు చూశాను.

"సీతా, మన హైందవ సాంప్రదాయమే అటువంటిది. పట్టుదలలూ, పర్యవసానాలూ ఎట్లావున్నా హిందూ స్త్రీ

భర్తతో వుంటే అన్నీ సమసి పోతయ్యి. ప్రేమ, ఆదరాభి
మానాలు ఎంతవున్నా భార్యాభర్తలు విడిగావుంటే సంఘం
హర్షించదు. వారిద్దరి మధ్యా ఏవో కలతలున్నయ్యనే నూటికి
నూరుమందీ అనుకుంటారు మన భారతీయ సాంప్రదాయాలు
అటువంటివి. గతరాత్రి అంతగ్రంథం జరిగినా మర్నాడు రాత్రి
మళ్ళా నేను వారిచెంత చేరవలసిందే లేకపోతే ఎన్నో రాద్ధాం
తాలూ, అపోహలూ, సంసారంలో కలతలూ కలుగుతయ్యి.
ఆ రాత్రే మళ్ళా వారిదగ్గరకు వెళ్ళాను. ఇతరులు అపోహ
పడకుండా ఉండటానికి మాత్రమే, ఆ పూలు తెల్లచీరె
ముస్తాబూ. గదిలోకి వెళ్ళాక నా కన్నీరు నాకేఉంది. అంత
కన్నా నాకు మిగిలిం దేమిటి? మంచం మీదకూర్చున్నాను.
నన్నుచూసి క్షణం ఊరుకుని "ముఖంమీద బొప్పి తగ్గిందా?
చెయ్యి వాపు ఎట్లా వున్నది?" అంటూ నా ముఖంమీద
బొప్పిని చూశారు. నేనేం మాట్లాడలేదు.

"చూడు జానకీ! ఎంత మనస్సు సరిపెట్టుకుందామను
కున్నా సరిపెట్టుకోలేక పోతున్నాను. నిన్ను చూస్తుంటే మీ
చిన్నమామయ్యా, ఆ నీచుడు గుర్తుకొస్తాడు. నేను అవునంటు
న్నాను. నువ్వు కాదంటున్నావు. ఏది నిజం? ఏది అబద్ధం?
నువ్వు శీలవతివని అనటానికి ఆధారం ఏది? కాదనటానికి నా
అంతరాత్మ చెప్పిందే నాకు ఆధారం. నిజం చెప్పు జానకీ!
తప్పు ఒప్పుకుంటే ఎంతబావుంటుందో ఆలోచించు" అన్నారు.
నేనేం మాట్లాడాలో నాకు అర్థం కాలేదు, వారి కళ్ళల్లోకి
చూస్తూ కన్నీరు పెట్టుకున్నాను. నావైపు వారు తిరిగి చూడ

లేదు. నాతో మళ్ళా మాట్లాడలేదు ఆ రాత్రి ఎట్లా తెల్ల వారిందో నాకు తెలీలేదు.

రెండు రోజులు అట్లాగే గడిచినయ్యి మూడోరోజున నా దుఃఖాన్ని నాలో ఇముడ్చుకోలేకపోయాను. నేను నిర్దోషి ననీ, అనవసరంగా చిన్నమావయ్యతో నాకు సంబంధం అంట గట్టారని, పోనీ మా ఇద్దరినీ ఎరుగున్నవాళ్ళ నందర్నీ అడిగి తెలుసుకోమనీ ఎన్నో విధాల నచ్చచెప్పాను. ప్రాధేయ పడ్డాను. ఈ రీతిగా జీవించేకంటే, చావే నాకు శరణ్య మన్నాను. అన్నీ విని ఒక్క మాట చెప్పారు.

"జానకీ! జరిగిందేదో జరిగిపోయింది. నిన్ను నేను పది సార్లు అన్నా, నన్ను నేను తిట్టుకున్నా ఏమీ ప్రయోజనం లేదు. మనఅంతర్యాలూ, అంతఃకరణలూ ఎట్లావున్నా ఇద్దరం మూఢులంకాదు. చదువుకున్న వాళ్ళం. తాళిగట్టిన సంబం ధమే తప్ప, తాకవలసిన సంబంధం తెంచుకున్నాను. మమ తలు రేపుకోకు. వాంఛలు మనస్సులోకి రానీయకు. లోకం దృష్టిలో మనం ఆదర్శ దంపతులమే. చిలకా, గోరువంకలమై అనుకూల దాంపత్య జీవితం గడపుతున్నట్లే లెక్క. కాని బయటబడి అందరి దృష్టిలో అల్లరిపాలు కావద్దు. నేచెప్పినట్లు నడచుకుని, ఇంకా నా మనస్సులో సంక్షోభం లేకుంటే నాకు అంతే చాలు" అన్నారు. సీతా! నిజం చెప్పుతున్నానే! నా తల నేలకేసి బాదుకున్నాను. శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచి వెళదామనుకున్నాను రాత్రిళ్లు నిద్రలేదు. ఇద్దరి మన స్సుల్లో, హృదయాల్లో అగ్నిగుండం భగభగ మండుతున్నది. కాని చచ్చి సాధించేది ఏముంది? అనుమానం నిజమేనని

అనుకునేటట్లుగా చేయ్యడంతప్ప వారు చెప్పినట్లుగా ఉంటా నికే నిశ్చయించుకున్నాను. అనుమానమనే హాలాహలాన్ని మింగి గొంతులో ఉంచుకున్నాను. అది మింగటమో, తిరిగి వమనం చేసుకోవటమో, కాలానుగుణంగా జరగవలసిందే" అన్నది అక్కయ్య.

అక్కయ్య మాటలు వింటుంటే నాకు మనస్సు వికలమైపోయింది కళ్ళార్పకుండా అక్కయ్య వైపు చూస్తూ కూర్చున్నాను.

అక్కయ్య మళ్లా చెప్పసాగింది—

ఒక రోజున కాలేజీకి వెళుతూ "జానకీ! సాయంత్రం సినిమాకిపోదాం, తయారుగాఉండు" అన్నారు. నా బ్రతుక్కి సినిమా ఒక్కటే తక్కువైంది. వారి భావం వేరు. అది లోకాన్ని వంచించటానికి. మరి లోకం దృష్టిలో మేం ఆదర్శ దంపతులం. నేను లెక్చరరుగారి భార్యను. ఎంతో ఆలోచించి "సరేనన్నాను" అని ఆగింది అక్కయ్య.

"తరువాత?" అన్నాను ఆదుర్దాగా.

ఆ రోజున జరిగిన సంఘటనే నా జీవితానికి గొడ్డలి పెట్టుగా తయారయింది. సినిమాకు బయల్దేరాము. దార్లోనే వారి స్నేహితు లిద్దరు కనిపించారు. కాలేజీలో వాళ్ళిద్దరూ మా బావతో చదువుకున్నారట. రాజమండ్రి కాలేజీలో వాళ్ళిద్దరూ లెక్చరర్లు. అనుకోకుండా తారసపడ్డ ఆ ఇద్దరు

మిత్రుల్ని వదల్లేక, తను వాళ్ళతో వెళతాననీ, నన్ను సిని మాకు వెళ్ళమనీ అన్నారు. నేను ఇంటికి వెళ్ళిపోతానన్నాను. సరేనన్నారు ఇంటికి వచ్చేసి జరిగిన విషయం అత్తయ్యకూ, సుభద్రకూ చెప్పాను. ఆరోజునుంచే శివాలయంలో పురాణం మొదలు. నేను రాగానే అత్తయ్యా, మావగారూ పురాణానికి వెళ్ళారు. సుభద్ర స్నేహితురాలింటికి వెళ్ళొస్తానన్నది. ఆ సమయంలో ఇంట్లో నేనొక్కర్తెనే. అప్పటికి ఏడు గంట లయింది. ఏం తోచక వీధి గుమ్మంలో రెండు నిమిషాలు నిల్చున్నాను. అంతకన్నా వ్యవధిలేదు. "ఏమ్మా జానకీ! ఇక్కడుంటున్నారా? చాలా కాలానికి చూశాను" అని నేను చదువుకున్న ఏలూరు కాలేజీలో లెక్చరరు మోహనరావుగారు పలకరించారు. మోహనరావుగారంటే కాలేజీలో అందరికీ ఎంతో గౌరవం. ఆయన తండ్రివంటివారు. రిటయిరు కాబోయే వయస్సుకూడా వచ్చింది. ఆయన ఫిజిక్సు లెక్చరరు. నాన్న గారికి కూడా తెలుసు. నా బ్రతుక్కేడు వారితో ఏం మాట్లాడనని, ముక్తసరిగానే సమాధానం చెప్పాను. ఆయనా కుశల ప్రశ్నలు వేస్తూనే నిల్చునే మాట్లాడారు. నాకూ గుండెలు కొట్టుకో సాగినయ్యి, ఇదేం తప్పవుతుందోనని. మోహనరావుగారితో మాట్లాడుతున్న సమయంలోనే మీ బావ వస్తున్నారు. "వస్తానమ్మా జానకీ" అంటూ ఆయన ఇటు వెళ్ళారు. అటునుంచి మీ బావ వచ్చారు వారు రాగానే అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని ఇంట్లోకి వచ్చాను. అనుకు న్నట్లుగానే పెద్ద తుఫాను చెలరేగింది.

"ఏం జానకీ! పరమ పతివ్రతవు నాతో సినిమాకు బయలుదేరి, మధ్యలో నేను స్నేహితులతో వెడితే, నువ్వు సినిమాకి వెళ్ళనని ఇంటికొచ్చి చేసేఘనకార్యంఇదేనన్నమాట. ఇంకా ఎన్నాళ్ళు నా కళ్ళుమూస్తావ్ జానకీ? నీ ప్రియుల్ని, ఒక్కొక్కరినే చూస్తున్నాను. ఎంతకి తెగించి పోయావే. ఛీ! నీ ముఖం నాకు చూపించకు" అంటూనే వెంటనే వీధిలోకి వెళ్ళిపోయారు. నా ప్రాణం నిలువునా నీరయి పోయింది. అనవసరంగా అనుమానాలు పెంచుకుని నన్ను వారెంత నీచముగా చూస్తున్నారో, అట్లాగే జరిగే సంఘటనలుకూడా దానికి తగినట్లుగానే సమకూడుతున్నాయి అత్తయ్యతో ఈ విషయాలు చెపితే, నాయందు నిజంగా లోపం ఉంటంనుంచే తన కొడుకు అనుమానానికి హేతువని ఆవిడా అనుకోవచ్చు. అప్పుడు నా వేలితో నా కన్ను నేనే పొడుచుకోవటమవుతుంది. ఆ పరిస్థితుల్లో నా కన్నీరే నన్ను సేద తీర్చకలిగేది. నా మనోభావాలే, నా నిదానమే నాకు శ్రీరామరక్ష అనుకున్నాను" అన్నది అక్కయ్య.

"బావ ఇంత చదువుకున్నవాడు, అన్నీ తెల్సినవాడూ అంత మూర్ఖుడుగా, అంత గుడ్డి నమ్మకాలతో, అర్థంలేని అనుమానాలతో ప్రవర్తించటానికి కారణం" అని అడిగాను.

"నేను చెప్పబోయేదీ అదే సీతా. అనుమానాలకి చెవులేగాని, కళ్లు లేవు. నమ్మకమేగాని బుజువులేదు. ఆ రాత్రి ఇంటికొచ్చాక వారు స్నానం చెయ్యలేదు. భోజనం

చెయ్యలేదు. మాట్లాడకుండా పడుకున్నారు. మెల్లిగా వెళ్ళి వార్ని పలకరించాను.

"ఎందుకండీ నామీద ఈ అపవాదులు వెయ్యటం. నాలో ఏ లోపంగాని, నా ప్రవర్తనలో ఏ దోషంగాని చూసి నన్నిట్లా అనుమానిస్తున్నారో నాకు అర్థం కావటంలేదు. చదువుకున్నవారు, సర్వమూ తెల్సినవారూ, నలుగురిలోనూ గౌరవ మర్యాదలతో తిరగనేర్చినవారూ, విద్యార్థులకు హితోక్తులు చెప్పేవారూ, మీరే ఇట్లా అపోహలు పెంచుకుని మానసికంగా నన్ను బాధపెడుతూ, మీరూ బాధపడుతూ కృంగిపోతుంటే నేను ఎట్లా నా నిర్దోషిత్వాన్ని ఋజువుచేసుకోవాలో నాకు తెలీటంలేదు. నా మనస్సు మీకు తెల్సు. నేను వాళ్లతో మాట్లాడాననేగా మీ అపోహలు? ఆ రోజు కారోజుకు ఇంకా ఎక్కువ కావటానికి కారణం?" అన్నది అక్కయ్య.

"బావ ఏమన్నారు జానకీ?" అన్నాను.

బావ ఏమన్నా రంటావా? ఏమన్నారని చెప్పను. "పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతుంటే ఎవ్వరూ చూట్టంలేదనే అనుకుంటుంది. ఆ రోజున సినిమాహాల్లో నీ స్నేహితుడూ, ఈ రోజున ఎవ్వరూ లేని సమయంలో రాత్రి పూట మీ లెక్చరరు, బ్రతికున్న రోజుల్లో మీ చిన్న మామయ్య, నన్నింక మోసపుచ్చలేవు జానకీ ఇంక ఎంత మంది ఉన్నారో నీ పాత స్నేహితులు" అన్నారు మీ బావ. నా మనస్సు ఉడికిపోయింది. అవమానంతో కుమిలిపోయాను.

"ఈ ఆధారాలు చూసే నన్ను అనుమానిస్తున్నారు కదూ! మీ మనసులో పూడిపోయిన భావాలనూ, అనుమానాలనూ నేను మాటలతో, నా చేతలతో తీర్చగలిగే శక్తిని నాకు కలిగించమని ఆ పరమాత్ముని వేడుకొంటున్నాను. మీతో ఇప్పుడు చర్చించగలిగే శక్తిసామర్థ్యాలు నాకు నిజంగానే లేవు. ఎంత చదువుకున్నా, ఎన్ని తెలివితేటలున్నా ఆడదాని జీవితమే అంత. పోనీండి. ఒక్కమాట అడుగుతున్నాను. మీరు కాలేజీలో లెక్చరరుగా ఉంటున్నారు. అనేక మంది విద్యార్థినులు ఉన్నారు. అందరితోనూ మీరు మాట్లాడుతారు. వారికి పాఠాలు చెప్తుంటారు. మీమీదకూడా నేను అపోహలు పడొచ్చుగా" అన్నాను.

ఈ మాటకి వారు రెచ్చిపోయారు.

"నోర్ముయ్. నీ బ్రతుక్కి నన్ను అనుమానించి ఎదిరిస్తున్నావా. మా కాలేజీలో విద్యార్థినుల కాలి గోటిక్కూడా నువ్వు సమానం కావు. ఛీ! నీ ముఖం చూపించకు"అంటూనే నా చెంపమీద అయిదు వేళ్ళూ తేలేటట్లు కొట్టారు. నా తల తిరిగిపోయింది. అయిదు నిముషాలవరకూ నా వళ్ళు నాకు తెలీలేదు. నాలో సహనం నశించింది. నా కన్నీరే నాకు కొంత మనశ్శాంతి నిచ్చింది. నా మనో నిబ్బరమే ఏనాటి కయినా వారిలో పరివర్తన తేగలదు. నా సౌశీల్యమే నాకు శ్రీరామ రక్ష. ఏనాటికయినా వారి తప్పు వారు తెల్సుకోక పోరు. అప్పటివరకూ మా ఇద్దరికీ ఈమానసిక బాధ తప్పదు" అన్నది అక్కయ్య.

ఒకసారి కళ్ళు తుడ్చుకుంది అక్కయ్య.

"ఆ రోజు నుంచీ వారు నాతో సరిగ్గా మాట్లాట్టమే మానేశారు. వారితో వాదాన్ని నే పెంచలేదు గృహిణిగా నా కర్తవ్యాన్ని నేను నెరవేరుస్తూనేవుంటున్నాను. ఇదంతా జరిగిన వారం రోజుల్లో శ్రావణమాసపు నోములకు పంపమని నాన్నగారి దగ్గర్నుంచీ ఉత్తరం వచ్చింది. మీ బావను అడిగాను, నోములకు వెళ్ళమంటారా అని. అందుకు వారేమన్నారో తెలుసా సీతా!" అని అగింది అక్కయ్య.

నేను ఆదుర్దాగా చూశాను.

"వరలక్ష్మీ అమ్మవార్ని ఏమని ప్రార్థిస్తావు జానకీ!" అన్నారు. ఇంత చక్కగా మాట్లాడుతున్నారేమా అనుకున్నాను.

"ఎన్ని జన్మలకన్నా మీరే నాభర్త కావాలని కోరుకుంటాను. మీరు నామీద ఎప్పుడూ ప్రేమ, ఆదరాభిమానాలతో ఉండాలని ప్రార్థిస్తాను" అన్నాను నవ్వుతూ. నేను ఎంత సంతోషంగా, మనస్ఫూర్తిగా ఈ మాటలు అన్నానో వారు నా మాటల్ని అంత చులకనగా తీసేశారు.

"అంతా అబద్ధం, అంతా అబద్ధం జానకీ! అట్లా కోరుకోవు, తల్లీ వద్దన్నకొద్దీ ఈ జన్మలో నాకీ భర్తని ప్రసాదించావు. కనీసం వచ్చే జన్మలోనయినా, ఈ జన్మలో నేను ప్రేమించిన ప్రేమికుల్లో ఒకర్ని, మా చిన్నమావయ్యని నా భర్తగా ప్రసాదించు తల్లీ అని ప్రార్థిస్తావు" అన్నారు. అంత ఈర్ష్యగా, పాతుకుపోయిన అనుమానపు భావాలతో ప్రతి విషయంలోనూ సూలాల్లాంటి మాటల్తో పొడుస్తుంటే నా మనస్సు ఎంత ఉడికిపోతున్నదో వారు ఏమాత్రం అర్థంచేసు

కోవటంలేదు. తప్పు ఉన్నప్పుడు ఆ మాటల్ని పదిసార్లు ఏకరువుపెట్టి నిందించినా ఆ మాటలు పడవలసిందే. లేని తప్పును అనుమానాలతో నామీద ఆరోపణచేసి కట్టుకున్న భర్తే నన్ను అవినీతిపరురాలుగా చిత్రిస్తుంటే ఆ పరిస్థితుల్లో నేనేం చెయ్యాలో ఎంత ఆలోచించినా అర్థంకావడంలేదే సీతా! సంసార జీవితంలో అడుగుపెట్టిన మొదటి రోజునే నన్ను శంకించే భర్తని ఏవిధంగా అర్థంచేసుకోవాలో నే నెంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఇంత వరకూ జరిగిన విషయాలు నీతో చెప్పాను" అన్నది అక్కయ్య.

ఇంత వరకూ చెప్పి రాధవైపు చూస్తూ కూర్చుంది సీత.

సీత చెప్పిన ఈ సంగతులన్నీ రాధ విన్నాక జానకి విషయంలో ఒక అభిప్రాయానికి వచ్చింది.

రాధ సీతతో అన్నది—

"సీతా! మీ అక్కయ్య సంసార జీవిత కథనంతా విన్నాక నేను ఏనిశ్చయానికొస్తానో చెప్పలేనుగాని, ఇంతవరకూ జరిగినట్లు చెప్పిన పరిస్థితుల్నిబట్టి ఒక యదార్థసత్యంమాత్రం నాకు అర్థమైంది. మీ అక్కయ్య చదువులో ఫస్టు క్లాసులో ప్యాసయింది. కాని జీవిత పరీక్షల్లో అసలు ప్రశ్నల్ని అర్థం చేసుకునే పరిస్థితిలోనే లేదు. మీ బావకు ఎట్లానచ్చచెప్పాలో, అవసరం వచ్చినప్పుడు ఎదిరించి ఎంత కటువుగా మాట్లాడాలో మీ అక్కయ్యకు తెలీలేదు. కటువుగా మాట్లాడితే అసలు కాపురానికే ఏం ముప్పు కలుగుతుందోనని మీ అక్కయ్య భయం. ఆవిడ మెతకతనాన్ని ఆసరాగా తీసుకొని ఇంకా అను

మానిస్తున్నారు మీ బావ. ఆ భార్యాభర్తల మనస్తత్వాలు ఒకటి దక్షిణ ధృవం, ఒకటి ఉత్తర ధృవం. ఇంక ఆ సంసార జీవితంలో సుఖమెక్కడ ఉంటుంది చెప్పు? ఒకరు పులి, ఒకరు మేక. అంతేనా సీతా!" అన్నది రాధ.

సీత కళ్ళు తుడ్చుకున్నది. తానేమయినా తప్పుమాట అన్నానా అనుకుని మనస్సులో బాధ పడింది రాధ.

సీత భోజనానికి వెళ్దామన్నది. రాధకూడా సరేనన్నది. ఇద్దరూ భోజనాలకు లేచారు. సీతకు అన్నం సయించలేదు. రాధ అంతా చూస్తూనే వూరుకుంది. రాధ భోంచేసేదాకా సీత వూరికినే కూర్చుంది.

"మీ అక్కయ్య ఇప్పుడెక్కడున్నది సీతా?" అన్నది రాధ.

ఒక్కసారి రాధ ముఖంలోకి చూసి సీత నవ్వింది.

"మా అప్పచెల్లెళ్ళ జీవిత చరిత్రలు పూర్తిగా వింటే నీకే తెలుస్తుంది రాధా" అన్నది సీత.

రాధ ఇంకేం మాట్లాడలేదు.

భోజనాలయ్యాక కాసేపు ఇద్దరూ విశ్రాంతి తీసుకొన్నారు. మిగిలిన విషయాలన్నీ చెప్పమన్నది రాధ. అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలయింది.

సీత మళ్ళీ చెప్పసాగింది—

"శ్రావణ మాసంలో నోములు కాగానే అక్కయ్య గుంటూరు వెళ్ళిపోయింది. నేను స్కూలు ఫైనలు పాసయిం తరువాత ఆ సంవత్సరం కాలేజీలో చేరలేదు. కారణం అక్కయ్య పెళ్ళితో డబ్బులేకపోవటమే మా నాన్నగారు తాలూకా ఆఫీసులో గుమాస్తా. మాకున్న పొలము కాస్తా అక్కయ్య పెళ్ళికిగాను అమ్మేశారు. ఆర్థిక ఇబ్బందులవల్ల ఆ ఏడు నేను కాలేజీలో చేరలేదు. అమ్మకు సాయంగా ఇంట్లోనే ఉన్నాను.

"రాధా! అక్కయ్య ఎప్పుడూ అంటూ ఉండేది. లోకంలో అనేక తరహాలు వ్యక్తులుంటారు. అందర్నీ మనం మెప్పించలేం. అందరికీ సహాయం చెయ్యలేం. అందరి ఆద రాభిమానాలు సంపాదించలేం. అందరి మాటలూ వింటూ ఉండాలి. మనస్సుకి ఏది న్యాయసమ్మతంగా ఉంటే అది చెయ్యాలి. అక్కయ్య ఆసిద్ధాంతాలకు ప్రాధాన్యత ఇస్తుంది. చదువులో అక్కయ్య మేధావి చిన్నప్పట్నుంచీ ప్రతి క్లాసులోనూ ఫస్టుగానే ఉండేది. ఇంటరు ఫస్టు క్లాసులో పాస యింది ఏలూరు కాలేజీలో ద్వితీయ శ్రేణిలో వచ్చింది అక్కయ్యంటే అటు విద్యార్థులకూ ఇటు లెక్చరర్లకూ అందరికీ గౌరవమే. అందరికీ అభిమానమే. ప్రతి ఒక్కరి జీవితం లోనూ ఏదో ఒక లోపం కనబడుతూనే ఉంటుంది. అక్కయ్య చదువులో ఎంత మేధావంతురాలో జీవితంలో అంత మేధకురాలు. ఏం మాట్లాడాలో ఏంమాట్లాడితే ఎవరు నొచ్చుకుంటారోనని ఎంతో నిబ్బరంగా, జాగ్రత్తగా మసులు కుంటుంది. ఎవ్వరి మనస్సూ నొప్పించదు. అందరి దృష్టిలో

మన్ననలందుకున్న అక్కయ్య కట్టుకున్న భర్త దృష్టిలో అవినీతి పరురాలు. దాని జీవితంలో ఇదొక రంపపు కోత. అగ్నిపరీక్ష.

అక్కయ్య వెళ్ళిపోయాక చాలా రోజులు దాని జీవితాన్ని గురించే ఆలోచిస్తూ ఉండేదాన్ని. ఈ అగ్నిగుండంలో నుంచి ఎట్లా బయటపడి తన నిర్దోషిత్వాన్ని ఋజువుపరుచుకుంటుందో ఎంత ఆలోచించినా నాకు అర్థంకాలేదు. నాలో నేనే విచారపడుతూ ఉండేదాన్ని. అమ్మకు ఏ విషయాలూ తెలియనివ్వలేదు. తెలిస్తే మంచమెక్కుతుంది.

అక్కయ్య మావగారు రిజిస్ట్రారాఫీసులో గుమాస్తా. రెండేళ్ళలో ఆయన రిటయిరవుతారు. ఆయన్ని గుంటూరు నుంచి వినుకొండకు బదిలీచేశారు. భార్యా భర్తలిరువురూ, సుభద్రా వినుకొండ వెళ్ళిపోయారు. ఇక గుంటూరులో బావ, అక్కయ్య ఇద్దరే ఉన్నారు. ఇద్దరే ఉండటంనుంచి బావలో కొంతమార్పయినా వస్తుందేమోనని ఆశించాను.

ఆర్థిక ఇబ్బందివల్ల నేను ఆ సంవత్సరం చదువు మానేసినా, అక్కయ్య జీవితంకూడా కొంతవరకు కారణముఉంది. అసలింక చదువే వద్దన్నది అమ్మ. "జానకి ఇంటరు చదివి ఏం చేస్తున్నది? కాపురం చేస్తున్నది. దానికి చదువేమయినా అక్కరకొచ్చిందా? దీనికీ ఎట్లాగోట్లా పెళ్ళిచేసి ఓ అయ్య చేతిలో పెడితే మీరు నిశ్చింతగా రిటయిరవచ్చు" అనేది అమ్మ. నాన్న ఏమీ చెప్పేవారుకాదు. నేను ఒక్కటే నిశ్చయించుకున్నాను. అక్కయ్య కాపురం బాగుపడి, అది సుఖసంతోషాలతో ఉంటేనే నేను పెళ్ళిచేసుకునే సంగతి ఆలో

చించటం. అక్కయ్య జీవితం ఇట్లా కన్నీరుమున్నీరుగా గడుస్తుంటే ఇంక జీవితంలో వివాహమే చేసుకునేది లేదు. ఉద్యోగమే శరణ్యం. అందుకోసం పై చదువు పూర్తిచెయ్యాలి. ఏమైనా ఆ పటికే చదువు ఆపేశాను గనక అమ్మతో ఏమీ తర్కించలేను.

దసరా, దీపావళి, పండుగలకు బావనీ, అక్కయ్యనీ రమ్మని నాన్న ఉత్తరం రాశారు. అందుకు అక్కయ్య పెద్ద ఉత్తరం రాసింది. పర్యవసానం పండక్కి తాము అక్కడికి రామనీ, నన్ను పండక్కి గుంటూరు పంపించమనీ మరీ మరీ ప్రాధేయపడుతూ అక్కయ్య ఉత్తరం వ్రాసింది. అమ్మ అంతగా ఇష్టపడలేదు అల్లుడూ, కూతురూ తమ ఇంటికే రావాలని అమ్మ పట్టుదల. రెండు రోజులు పట్టుబట్టి అమ్మను వప్పించిం తరువాత నాన్నగారితో నేను గుంటూరు వెళ్లాను. పది రోజులు ముందుగానే వెళ్ళాను.

అక్కయ్యను చూడగానే నాకు దానిలో ఏ మార్పు కనిపించలేదు శ్రావణమాసంలో వచ్చినప్పుడు ఎట్లావున్నదో అప్పుడూ అట్లాగే వున్నది.

మేం వెళ్లేసరికి బావ ఇంట్లోనే వున్నారు. కాలేజీకి వెళ్ళబోతున్నారు. పెళ్లికి ఎట్లా వున్నారో అప్పుడూ అట్లాగే వున్నారు. మమ్మల్ని చూడగానే ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. నాన్నతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు. కాలేజీ టైమవటంనుంచి వెళ్ళిపోయారు.

నాన్ననూ, నన్నూ చూసేసరికి అక్కయ్యకు ప్రాణం లేచివచ్చినట్లయింది. నాన్నకు ఇష్టమైన తీపి పిండివంట

మైసూరుపాకు చేసింది. నాకు ఇష్టమైన కారంబూంది చేసింది. జీడిపప్పులు వేయించి కారం మసాలా చల్లింది. ఎంతో సంతోషంగా, ఆప్యాయంగా ఇవన్నీ చెయ్యటం చూస్తే, అక్కయ్య జీవితంలో నవోదయం ఇప్పటికి ప్రారంభమైందా అని అనుకున్నాను.

రాత్రికి మామా,అల్లుడూ భోజనానికి కూర్చున్నారు. అక్కయ్య సంతోషానికి అవధులులేవు కూతురు చేతి వంట ఆప్యాయంగా తిన్నారు. నాన్నతో కబుర్లు చెపుతూ బావ కూడా సుష్టుగా భోజనం చేశారు. నేను తలుపు పక్కన నిల్చుని బావ ముఖంలోకి పరీక్షగా చూడసాగాను

"మామగారికి తీపి ఇష్టమైనట్లుంది. ఇంకో నాలుగు మైసూరుపాకు ముక్కలు వడ్డించు" అన్నారు బావ.

నాన్న విస్తట్లో రెండు ముక్కలు వేసింది అక్కయ్య. తనకూ వెయ్యబోగా వద్దని చెయ్యిఅడ్డంపెట్టి ముఖం చిట్లించుకున్నారు బావ. అక్కయ్య చిన్నబుచ్చుకుని వెళ్ళింది.

"తీపి సయించకపోతే బూందీఅయినా తినండి బావా!" అన్నాను.

"అన్నంలో తినలేను సీతా! అన్నంలో నా కేమీ సయించవు" అన్నారు బావ. కాని కోపంతో మాట్లాడలేదు.

బావ మాట్లాడే తీరుచూస్తే నాకు ఒక్క విషయం అర్థమైంది. ఒక్క అక్కయ్యతో మినహా మిగతా వాళ్ళతో ఆప్యాయంగా మాట్లాడుతారు తన చదువుకూ, హోదాకూ తగినట్లుగా మాట్లాడుతారు. ఎంతో వినయంగా కబుర్లు చెపుతారు. కాని అక్కయ్యను చూసేసరికి ఊసరివెల్లి రంగులు

మార్చినట్లే. నాటకంలో ఒక మహానటుడు ద్విపాత్రాభినయం చేసినట్లు, అంతలోకి ముఖకవళికలు మారిపోతయ్యి మాటలో కాఠిన్యం కనుపిస్తుంది

బావ ఆదరాభిమానాలకు నాన్న ఎంతో సంతోషించారు. బావ కాలేజీకి వెళ్ళినప్పుడు అక్కయ్యతో అన్నారు.

"చాలా అదృష్టవంతురాలివమ్మా జానకి. అల్లుడు చాలా మంచివాడు. సౌమ్యుడు. బుద్ధిమంతుడు. ఎరగని పరాయి సంబంధం చేసాను ఎట్లా ఉంటుందో నీ కాపురం అనుకున్నాను. చాలా తృప్తిగా ఉందమ్మా జానకీ. నీకడుపు చలవన మనవలనీ, మనమరాళ్ళనీ ప్రసాదించావంటే నాకు ఏనుగెక్కించినంత సంతోషంగా ఉంటుంది" అన్నారు నాన్న.

ఈ మాటలు విని అక్కయ్య నవ్వింది. నేనూ నవ్వుకున్నాను. అక్కయ్య కాపురం సంగతి నాన్న కేం తెలుసు! బావ మాటలు నాన్నను తృప్తిపరచిన మాట నిజమే. కాదని ఎవ్వరూ అనలేరు.

పండుగలు వెళ్ళగానే నన్ను పంపమని బావతోనూ అక్కయ్యతోనూ చెప్పి నాన్న వెళ్ళిపోయారు. బావతోనూ, అక్కయ్యతోనూ ఎక్కువగా మాట్లాడకుండా వాళ్ళ మనస్తత్వాలు అర్థం చేసుకుందామని అనుకున్నాను.

రోజూ వాళ్ళ దినచర్యలు గమనించేదాన్ని. ఉదయం ఆరు గంటలకు పనిమనిషి రాగానే నిద్ర లేస్తుంది అక్కయ్య. కాఫీ పని పూర్తయాక వంట మొదలుపెడుతుంది. అంత వరకూ తన కాలకృత్యాలు తీర్చుకుని కాలేజీ పాఠాలు

చూసుకోవటమో, పేపరు చదువుకోవటమో చేస్తుంటారు బావ. కాఫీ గ్లాసుకూడా డ్రాయరుమీద పెట్టి వెళుతుంది అక్కయ్య. ఏ విషయం మాట్లాడుకోరు. తను స్నానంచేసి వచ్చి బట్టలు మార్చుకున్నాక వంట ప్రయత్నం చేసేముందు మెల్లిగా వచ్చి "ఇవాళ కూర ఏం చెయ్యమంటారు?" అంటుంది అక్కయ్య. పేపరు చదువుకుంటూనే "నీ ఇష్టం" అంటారు బావ. "చెప్పండి ఏం వండాలో?" అంటుంది. మళ్లా అక్కయ్యతో "చూడు జానకీ! నీకు ఏది ఇష్టమైతే అది వండు. ఏం కూరలున్నయ్యో నీకు తెలుసుగా?" అంటారు బావ. ఒక్క నిమిషం నిల్చుని అక్కయ్య వచ్చేస్తుంది. బావ ఏం చెప్పకపోయేసరికి అక్కయ్య తనకు తోచింది చేస్తుంది. తొమ్మిదిన్నరకల్లా బావ వంటింట్లోకొచ్చి, వంట అయిందీ, లేందీ కనుక్కోకుండానే "ఇంక టైమైంది, వడ్డించు" అంటూనే పీట వేసుకుంటారు. "అయిపోయింది. ఒక్క నిమిషం. ఈ పులుసులో తిరగమూతపెట్టి వడ్డిస్తాననో, ఈ చారు దింపి వస్తాననో" అంటుంది అక్కయ్య తొందరపడుతూనే. బావ వంటింట్లోకి వచ్చి పీటమీద కూర్చోగానే అక్కయ్య ఎంతో ఖంగారుపడిపోతుంది. తొందర తొందరగా ఆ కుంపట్లమీదివి దించేసి, చేతులు కడుక్కుని, ఆ చీర కుచ్చెళ్లు పైకి దోపు కుంటూ, ముఖంమీది ముంగురుల్ని వెనక్కయినా తీసుకో కుండా, గబ గబా ఆ వంట ఇల్లు చిమ్మేసి, వడ్డన మొదలు పెట్టేసరికి, ముఖమంతా చెమటపట్టి, ఎంతో అలిసిపోయిం దానిలా కనిపిస్తుంది. వడ్డనపూర్తయాక విసురుతూ ఎదురుగా నిల్చుంటుంది. బావ వంచిన తల ఎత్తకుండానే భోజనం

ప్రారంభిస్తారు. ఇంకమామూలే అక్కయ్య అమర్దా. "కూరలో ఉప్పూ కారం సరిపోయిందా" అంటుంది అక్కయ్య.

"ఆ. నా మొహంలా ఉంది. కారం మండిపోతుంది. ఈ అన్నం ఇట్లా మెత్తనయిందేం" అంటారు బావ, కను బొమలు చిట్లించి, ముద్ద నోట్లో పెట్టుకుంటూ.

"కూర మాడుతుందేమోనని కలబెడుతూ ఉండేసరికి అన్నం కొంచెం మెత్తనయింది. అక్కడకీను" అంటుంది, అక్కయ్య, ఇంక పూరుకుంటే మంచిదని అక్కయ్య వూరు కోదు. పులుసో, చారో వడ్డించి "ఉల్లిపాయలు ఉడికినయ్యా, ములక్కాడలు చేదుగా లేవుకదా" అంటుంది. "ఆఁ పుల్లగా నీమొహంలా ఉంది" అంటారు బావ. బావ అట్లా అంటారని తెలిసికూడా అక్కయ్య అడక్కమానదు. అడిగిందికదా సరైన సమాధానం చెప్పుదామనే ఉద్దేశ్యం బావకూ ఉండదు. బావ కాలేజీకి వెళ్ళాక తను భోజనం ముగించి, వంటిల్లు సర్దు కుని వచ్చేటప్పటికి పన్నెండవుతుంది. ఇంక ఆ గదిలో పడు కుని ఒకటే ఆలోచన. ఆ ఆలోచనలకు అంతులేదు. జీవిత ఘట్టాలన్నీ సినిమా రీలులా తిరిగిపోతయ్యట. కాసేపు రేడియో, కాసేపు పుస్తకాలు. అదీ లేకపోతే నిద్ర. మధ్యాహ్నంపూట బావ ఇంటికిరారు కాఫీకి. ఏ మూడు గంటలకో కాచుకుని అక్కయ్య కాఫీ తాగుతుంది. మళ్ళా సాయంత్రం పనిమనిషి రాగానే ఇంటిపని మొదలు. తరువాత సాయంత్రం వంట.

ఈ రకంగా చూస్తుంటే మొదటి నాలు గయిదు రోజుల్లోనే వాళ్ళజీవితాలు కొంతవరకూ అర్థంచేసుకున్నాను. ఒక రోజున అక్కయ్యను అడిగాను.

"అక్కా! మీ కాపురాన్ని ఇప్పుడు నేను సరిగా అర్థం చేసుకున్నానే" అన్నాను.

"ఎట్లా ఉందేం?" నవ్వుతూ అడిగింది అక్కయ్య.

"దివ్యంగా ఉంది. ఎంతో ఆదర్శవంతమైన కాపురం. చూడ ముచ్చటగా ఉంది. ఇంక నీకు లోటేమిటే జానకీ!" అన్నాను.

"ఏదో లేవే నా జీవితం ఇట్లాగే వెళ్ళిపోతుంది. ఎట్లా గయినా నీ అంత తెలివితేటలు నాకు లేవే. ఇంతవున్నా, అన్న వస్త్రాలకు ఏలోపం లేకపోయినా ఏ రోజూ దిగులు కూడే" అన్నది అక్కయ్య నిరాశగా.

"అక్కా! కష్టపడుతున్న వారెప్పుడూ తమ కష్టాలను ఏకరువు పెట్టటంలోనే కాలం గడిపేస్తే ఆ కష్టాలనుంచి గట్టెక్కే మార్గం ఆలోచించుకోవద్దూ? నా జీవితం ఇట్లా అయింది కదాని, దిగాలుపడి, దిగులుపడి కూర్చుంటే, ఆ వచ్చిన ఇబ్బందులూ, కష్టాలూ వాటంతటవే పోతయ్యా?" అన్నాను.

"నువ్వు చెప్పింది నిజమే. మీ బావ మనస్తత్వం కొంతవరకయినా నువ్వు అర్థం చేసుకున్నావుగా. వారికి ఎట్లా నచ్చచెప్పాలో పోనీ నువ్వే ఆలోచించి చెప్పు. రెండు చేతులూ కలిస్తేనే చప్పట్లు. వారన్నారని నేనూ నోరు పారేసుకుంటే, పర్యవసానం ఆలోచించి చూడు. నా పొడం

టేనే వారికి గిట్టదు. నేను విచారపడక చేసేదేముంది'' అన్నది అక్కయ్య.

"కాదే ఎదురు తిరగమని కాదు నేననేది. నువ్వు సరస్వతీదేవి పుత్రికవు. లక్ష్మీదేవి కోడలివి. కాని పార్వతీదేవి ప్రభావం నీలో ఏమాత్రమూ లేదు.''

"జానకీ! అందరి జీవితాలూ వడ్డించిన విస్తరిలాంటివి కాదే. ఉన్న విస్తరికే చిల్లులు లేకుండా చూసుకుని మనం వండుకున్న పదార్థాలను చక్కగా వడ్డించుకుని ఆప్యాయంగా తినాలి. అంతేగాని ఆ విస్తరికి చిల్లులున్నవి కనక, నే నసలు భోజనమే చెయ్యలేనంటే అందులో అర్థమేముంది చెప్పవే!'' అన్నాను.

నా మాటలు విని అక్కయ్య ఆవేశపడ్డది. బొంగురు పోయిన గొంతుతో "అయితే మీ బావగారిమాదిరే నువ్వూ నన్ను అపార్థం చేసుకుంటున్నావా సీతా! తప్పంతా నాదేనంటావా!'' అన్నది ఆదుర్దాగా.

"అది కాదే. నిన్ను నేను అనుమానించటంలేదు. బావకు నువ్వు నచ్చచెప్పే ప్రయత్నం గట్టిగా చెయ్యలేదు. నీ మౌనమూ, మెతకదనమూ బావ అనుమానాలను దృఢతరం చేసినయ్యి. ఆ అనుమానం చిన్నమావయ్య మీదుగా పోయింది. పోనీ చిన్నమావయ్య బ్రతికుంటే ఎంత త్యాగానికయినా సిద్ధపడి, ఎన్నిసార్లయినా బావ చుట్టూతిరిగి ఎంతో నచ్చచెప్పి బావ మనస్సులోని అనుమానం నివృత్తి చేసేవాడు. కాని నీ దురదృష్టంకొద్దీ చిన్నమావయ్య మన

లోకంలో లేడు. అదీ నీ దురదృష్టమే. ఇవన్నీ బావ అనుమానాలను ఇంకా దృఢతరం చేసినయ్యి'' అన్నాను.

''పోనీ, నీ సలహాప్రకారమే నడుచుకుంటాను. ఏం చెయ్యమంటావో చెప్పు?'' అన్నది అక్కయ్య.

ఇంతవరకూ చెప్పి సీత కళ్ళు తుడుచుకున్నది.

''అదేమిటి సీతా, ఇంతలోనే అంత దిగాలు పడిపోయావేం?'' అన్నది రాధ

''ఏముందే రాధా! అక్కయ్య జీవితం తలుచుకుంటే ఏడుపు కాక మరేముంది? నాకీ మగవాళ్ళమీద నమ్మకము లేది పోవటానికి కారణం అక్కయ్య కాపురమే. అందరికాపురాలూ అట్లా ఉండవనుకో. కాని అక్కయ్య జీవితం తలుచుకుంటే నాకు మగవాళ్ళమీద నమ్మకం పూర్తిగా పోయింది''అన్నది సీత.

ఈ మాటలకు రాధ నవ్వింది.

''అయితే నేను పెళ్ళిచేసుకోవటం తప్పనే అంటావా సీతా?'' అన్నది రాధ.

''తప్పనను. అయినా నీ భర్తకూడా డాక్టరు కనుక మీ ఇద్దరి జీవితాలూ సాఫీగానే వెళతయ్యి. ఎవరి బ్రతుకు వారు బ్రతగ్గలరు. ఇద్దరి జీవితాలూ మానవసేవకే అంకితమయినయ్యి. కనుక నువ్వు డాక్టరుగానేగాక, ఆదర్శగృహిణిగాకూడా రాణించగలవు. నువ్వు చాలా అదృష్టవంతురాలివే'' అన్నది సీత

''మరి నువ్వు గృహిణిగా. నీ జీవితాన్ని సరిదిద్దుకోలేవా సీతా? నిన్ను చేసుకోటానికి ఎంతో మంది సిద్ధంగా ఉన్నారు. కాని నువ్వే వెనకాడుతున్నావు'' అన్నది రాధ.

"చెప్తున్నానుగా. అక్కయ్య జీవితచరిత్ర పూర్తిగా వింటుంటే నేనీ అభిప్రాయానికి ఎందుకు వచ్చానో నువ్వే గ్రహిస్తావు" అన్నది సీత

"సరేకానీ, పూర్తిగా చెప్పమరి. ఏ విషయామూ, ఏ సంఘటనా మర్చిపోకుండా అంతా చెప్పు వింటాను"అన్నది రాధ

సీత మళ్ళీ చెప్పసాగింది—

అక్కయ్యతో ఇట్లా అన్నాను: "జానకీ! నీకు చెప్పే టంత అనుభవంగానీ, అవకాశంగాని నాకు లేదే. అక్కా! నువ్వు వివాహితవు. నేను అవివాహితను. భార్యా భర్తల మధ్య ఉండవలసిన ప్రేమానురాగాలుగాని, సంసార జీవితం లోని సుఖ సౌఖ్యాలుగాని నాకు తెలియవు గనుకనే, ఈ విష యాల్లో నీతో ఎట్లా మాట్లాడాలో నాకు అర్థంకావటంలేదు. భర్తను ఎదిరించి, వారి కివ్వవలసిన గౌరవ మర్యాదలను వారి యందు చూపక, స్త్రీకి కూడా సమాన హక్కులు కావాలనే వాంఛతో భర్తను చిన్నతనంగా చూట్టం ఎంత తప్పో, భర్తయందు అమిత వినయ విధేయతలు ప్రదర్శిస్తూ, వారి అడుగులకు మడుగు లొత్తుతూ, వారనే మాటలనూ, తిరస్కృ తులనూశిరసావహిస్తూ,వ్యక్తిత్వాన్ని చంపుకుని,యాంత్రికంగా బ్రతకటమూ అంత తప్పే. దోషమున్నా లేకపోయినాకొంత మంది స్వభావం ఎదుటివారిని అనవసరంగా దూషించటం తమ ధ్యేయంగా ట్టుకుంటారు. వారి మనస్తత్వం అటువం టిది. అభాండాలు వెయ్యటం కొంతమందికి సరదా. ఎదుటి వారి మనస్తత్వాన్ని కించపరచటం కొంత మందికి హాబీ. ఇత

రుల వ్యక్తిత్వాన్ని విమర్శిస్తూ వారిని దుయ్యబడుతూ తమ అసందర్భపు తెలివితేటలు ప్రదర్శించి ఆనందించటమనేది కొంతమంది తరహా. వీటినన్నింటినీ పురస్కరించుకుని నిజంగా మనం తప్పు చేస్తున్నామా అనుకుని ఏమీ లేకపోయినా భయపడి ఆత్మవంచన చేసుకోటం వివేకవంతుల లక్షణం కాదు” అన్నాను.

అక్కయ్య నవ్వింది. నా మనస్సులోని ఆవేదననీ, భావాలనీ అది అర్థం చేసుకుంటే నేను కృతకృత్యురాల్ని అయినట్లే. కాని జడత్వంతో దాని మనస్సు నిండిపోయి నప్పుడు నే చెప్పే మాటలు అక్కయ్య అంతగా అర్థం చేసుకోలేదు.

“అంటే నేను మీ బావకు దాసురాల్నయిపోయి, నా వ్యక్తిత్వాన్ని చంపుకుని బ్రతుకుతున్నానంటావా?” అన్నది అక్కయ్య.

“వ్యక్తిత్వమనేది కొంత పుట్టుకతోనే రావాలి. కాలానుగుణ్యంగా వయస్సు పెరుగుతున్నకొద్దీ ఆ వ్యక్తిత్వాన్ని మన జీవితానికి అనుగుణ్యంగా మెరుగులు దిద్దుకుని మనం మన జీవిత పథాన్ని మలచుకోగలిగితే మనస్సుకు ఏ బాధా ఉండదు. ఒకళ్ళు అంటున్నారని మనం బాధ పడే కన్నా, అలాంటివాళ్ళ మనస్తత్వాల్ని మనం అర్థం చేసుకుని, మనయందు ఏ తప్పూ లేదని నిరూపించుకుంటే మనస్సుకు ఎంత హాయిగా బరువుతీరినట్లుగా ఉంటుందో ఆలోచించు” అన్నాను.

"నిజమే సీతా! మీ బావ మనస్సుని అర్థం చేసుకునే దానికన్నా, నా మనస్సులోని దుఃఖానుభూతుల్ని ఇంకా పెంపొందించుకుని, నాలో నేను కుమిలిపోయి విచారపట్టం లోనే ఎక్కువగా కాలం గడుపుతున్నానే సీతా!" అన్నది అక్కయ్య.

"అంతవరకూ వస్తుంటే నీ బుర్రలో కాస్త తెలివి తేటలు మిగిలి ఉన్నయ్యని అనుకుంటాను. లభించినదాంతోనే జీవితాన్ని సరిదిద్దుకోవటానికి మన తెలివితేటలు ఉపయోగిం చాలని నేను మరీ మరీ చెపుతున్నాను. బావ నీ మీద అను మానపడ్డారు. ఆ అనుమానమే ఆయనలో గట్టిగా పాతుకు పోయి ఉంటే నిన్నసలు వదిలిపెట్టేవారేకదా! కులట అని నిర్ధారణగా తెలుసుకున్న తరువాత ఏ మాత్రం వ్యక్తిత్వం కల భర్తయినా తన భార్యను ఏలుకుంటాడా? ఆలోచించు. నిన్ను గురించి బావ ఎంతో మథనపడుతున్నారని అంటున్నావు కదా! వ్యక్తిత్వం లేనివారయితే ఈ విషయాల్ని గురించి అంత ఆలోచిస్తారా? నువ్వే ఆలోచించు" అన్నాను.

నా మాటలకు అక్కయ్య ఆశ్చర్యపడ్డది. దాని మన స్సులో కొంత సంచలనం కలిగినట్లు దాని ముఖ కవళికల్ని బట్టి గ్రహించాను. ఆ రోజున అక్కయ్యతో ఈ విషయాలు మాట్లాట్టం అంతటితో ఆపేశాను.

అక్కడికి వెళ్ళిం తరువాత నేను బావతో ఎక్కువగా కల్పించుకుని మాట్లాడలేదు. అక్కయ్యతోనే మాట్లాడుతూ, దానికి సాయం చేస్తూ వారం రోజులు గడిపాను. నాకు మొదట్లో బావ ప్రవర్తన విషయంలో కొంచెం అనుమానం

కలిగింది. కాని ఈవారంరోజుల్లోనూ బావప్రవర్తనచూస్తుంటే నాకు ఏ అనుమానమూ కలగలేదు. అక్కయ్య నడిగితేతనకూ అలాంటి అనుమాన మేమీ కలగలేదనే చెప్పింది.

విజయదశమి పండుగ ఇంకా రెండు రోజులుండనగా పండక్కి ఏం చెయ్యమంటారని బావ నడగింది అక్కయ్య. ఆ సమయంలో నేనూ అక్కడే ఉన్నాను. బావ నా వైపు చూస్తూ "మన విషయం అట్లా ఉంచు. సీత కేం ఇష్టమో కనుకున్నావా జానకీ! ఈ పండుగ సీత ఇష్టానుసారమే చేసుకోవాలి. ఏం సీతా, నీ కేం ఇష్టం చెప్పమరి" అన్నారు బావ.

నేనూ ఆలోచించాను. బావ మన స్తత్వం తెల్సుకోటానికి ఇదీ ఒక సమయమే అనుకున్నాను. బావ ఆంతర్యం ఏమిటి? అక్కయ్య నమ్రతలో ఉందా? బావ పెడసరితనంలో ఉందా? అంతా మెల్లిగా తెల్సుకోవాలనుకున్నాను.

"నా ఇష్టా ఇష్టాలతో పనేముంది బావా! మీరు ఏ పిండివంటలు ఇష్టమో చెపితే అవ్వే చేస్తుంది అక్కయ్య. తీరా నా ఇష్టప్రకారం చేస్తే అదేం తప్పో" అన్నాను.

బావ నా వైపూ, అక్కయ్య వైపూ చూశారు. ఆయన ముఖంలో నవ్వు చూట్టం అక్కయ్య కాపురానికి వెళ్ళాక అదే ప్రథమం.

"పోనీండి. మీ బావా మరదళ్ళకు ఇద్దరికీ ఇష్టమైన పిండివంటలే చేస్తాను. మీ ఇద్దరికీ ఇష్టమైతే నాకూ ఇష్టమే. సరేనా. మరి మీఇద్దరూ తేల్చి చెప్పండి" అన్నది అక్కయ్య. నాకు తెలిసినంతవరకూ అక్కయ్య అంత సంతోషంతో బావతో మాట్లాట్టం అదే మొదలు.

బావ మాట్లాడలేదు నవ్వుతూ ఊరుకున్నారు.

"ఏం చెప్పండి?" అన్నది అక్కయ్య.

"నాకు రవ్వ లడ్డూ, పులిహోర, అందులో జీడిపప్పులు, నువ్వుల పప్పుపొడి వెయ్యాలి తెల్సిందా. ఇంకా ఆవడలు. అంతే. అంత వరకూ చాలు" అన్నారు బావ.

"మరి నీకో సీతా!" అని నన్నడిగింది అక్కయ్య.

"ఆంధ్రుల పౌరుషానికీ, కోపానికీ పులిహోర చిహ్నం. బావ ఎంతో పౌరుషవంతులు కనుక పులిహోర అడిగారు. ఆడదానికి పౌరుషం అలంకారం కాదు. ఆంధ్రుల ఔదార్యానికీ, విశాల హృదయానికీ చిహ్నం చెక్కెర పొంగలి. నాకు మంచి నేతితో కమ్మగా చెక్కెర పొంగలి చెయ్యవేఅక్కా" అన్నాను నవ్వుతూ

బావ, అక్కయ్య పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వారు.

"నీకన్నా సీత ఎంతో తెలివైంది. నువ్వా ఉన్నావ్ ఎందుకూ ! కోస్తే రెండు తలుపు చెక్క లవుతావ్" అన్నారు బావ కిటికీలోంచి బయటకు చూస్తూ, గోళ్ళు కొరుక్కుంటూ. అంతలోనే బావ ఊసర వెల్లి లారంగులుమార్చటం చూస్తే నాకు ఆశ్చర్యం కలిగింది. అంత సంతోషంతో మాట్లాడిన బావ ఒక్క నిమిషంలో అట్లా మారిపోవటానికి కారణం నాకు తెలీలేదు. అక్కయ్య చిన్నబుచ్చుకుని వెళ్ళింది. నేను బావవైపు చూస్తూ నిల్చున్నాను. బావ కిటికీలోంచి బయటకు చూస్తూ ఒక్కసారి నావైపు చూసి తల వంచుకుని కుర్చీలో నుంచి లేచారు. నాకూ ఏం తోచక అక్కయ్య దగ్గరకు వంటింట్లోకి వెళ్ళాను.

"అంత తొందరగా అట్లా తేలిపోయారేమే బావ. అంత కోపం ఎందుకొచ్చింది?" అన్నాను అక్కయ్యతో.

"అదే నాకూ అంతు పట్టంది" అన్నది అక్కయ్య బెరుగ్గా నావైపు చూస్తూ.

# 6

ఆ పూట గడిచిపోయింది. బావ మనస్తత్వం ఏమిటో నాకు అర్థంకావటంలేదు. ఏమయినా వీళ్ళ కాపురం తమాషాగానే ఉంది. అంతుపట్టదు. ఒకరి హృదయాలను మరొకరు అర్థం చేసుకోలేరు వాళ్ళ హృదయాలు మరొకళ్ళకు అర్థమయ్యేటట్లుగా ప్రవర్తించరు. ఇట్లా అనుకుంటూ కూర్చున్నాను.

నాకేమిటో అక్కయ్య కాపురం విషయమే ఆలోచనయిపోయింది. అక్కయ్యతో సంప్రదించి బావను అడిగాను.

"దసరా పండగలకి విజయవాడలో కనకదుర్గాదేవికి అలంకారాలు చేస్తారు. ఎంతో బావుంటయ్యి అవతారాలు! రేపు వెళ్ళి అమ్మవారి దర్శనం చేసుకుని మళ్ళా సాయంత్రానికి తిరిగి వచ్చేద్దాం" అన్నాను.

నావైపు తేరిపార చూశారు బావ. కళ్ళల్లో ఏదో తీరని ఆవేదన కనిపిస్తున్నది. ఏమైందీ ఎవ్వరికీ అంతుపట్టదు.

"మీ అక్కయ్య వస్తానన్నదా? ఆవిడ సరే నంటే రేవు వెళదాం. విజయవాడలో నా స్నేహితుడు వెంకటేశ్వరరావు ఉన్నాడు. వాళ్ళింటికి వెళ్ళచ్చు" అన్నారు బావ.

అక్కయ్యకూడా సరే నన్నది మర్నాడు ఉదయమే ఆరు గంటల బండిలో గుంటూరు నుంచి విజయవాడ బయ ల్దేరాం

రైలు దిగగానే బావ మమ్మల్ని వెంకటేశ్వరరావు గారింటికి తీసుకువెళ్ళారు. మేం వెళ్ళేసరికి ఎనిమిది అయింది. ఆయన రేడియోలో ఇంగ్లీషులో వార్తలు వింటున్నారు. ఆయనకు ఎదురుగా గుమ్మంలో కూర తరుగుతూ ఆయన భార్య కూర్చునుంది. ఆవిడను చూడంగానే నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. అనాకారిలో మొదటి రకం. చూడగానే తల తిప్పేసుకో బుద్ధి పుడుతుంది. ఆయన పచ్చగా చక్కగా ఉన్నాడు. కాకి ముక్కున దొండపండు. కాదు గోరింక ముక్కున నేరేడుపండు. మమ్మల్ని చూడంగానే ఆ దంపతు లిద్దరూ లేచి ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించారు. అంత అనాకారిదీ ఆవిడ మమ్మల్ని చిరునవ్వుతో ఆహ్వానిస్తుంటే, తెల్లని, చక్కని, ఆవిడ పలువరుస కనబడి నన్ను ఆశ్చర్య పడేటట్లుగా చేసింది. చిరునవ్వుతో ఆవిడ మాట్లాడుతుంటే ఎంతో మృదువుగా, కమ్మగా అపర శారదాదేవి మాట్లాడిన ట్లుంది. ఆవిడ అదృష్టం ఆ పలువరుసలో, తేనె లొలికే ఆవిడ మాటల్లో, గౌరవ మర్యాదలూ,ఆదరాభిమానాలూ కనబరిచే ఆవిడ ముఖ కవళికల్లో ఉందనుకున్నాను. ఆవిడ ఆదరణకు నేను విస్తుపోయాను. అక్కయ్య ఎంతో సంతోషించింది. ఆవిడ పేరు సులోచన. ఆవిడ చెప్పిన మాటలు వింటూ నేను అట్లాగే నిల్చున్నాను.

సులోచనాదేవి ఇట్లా చెప్పింది. "మాది పల్లెటూరవ టంవుంచి నేను ఎక్కువగా చదువుకోలేదు. అయిదో క్లాసు తోనే మా వూరు యూనివర్శిటీ కోర్సు పూర్తి చేశాను. పెళ్ళయింది. కాపురానికి వచ్చాను. మా వారికి ట్యుటోరి యల్ కాలేజీ ఉంది. థర్డు ఫారం నుంచీ ఇంటరు, బియ్యేల వరకూ చెపుతారు మొదట్లో స్కూలు ఇంటివద్ద ఉండేది. వరండాలో థర్డు ఫారం వాళ్ళకు పాఠాలు చెపుతుంటే ముందు గదిలో కూర్చుని నేనూ చదువుకునేదాన్ని. మెల్లిగా స్కూలు ఫైనల్ ప్యాసుఅయినాను ఇప్పుడు ఇంటరు పూర్తయింది. బి య్యేకి చదువుతున్నాను. అంతా వారి చలవ వారి ప్రేమ, ఆదరాభిమానాలే నన్నింత విద్యావంతురాలినిగా చేసినయ్యి. బి.య్యే ప్యాసయితే నేనూ వారి ట్యుటోరియల్ కాలేజీలో స్త్రీల విభాగంలో టీచరుగా ఉండాలని వారి కోరిక. అదీ కొనసాగుతుందనే మా ఉద్దేశ్యం. ఏదెట్లా ఉన్నా చదువు కున్న వాళ్ళయినా, చదువుకోని వాళ్ళయినా భార్యాభర్తలు ఒకరి నొకరు అర్థం చేసుకుని, ఒకరిమీద మరొకరు నమ్మక ముంచుకుని సంసారం చేస్తుంటే వారు సాధించలేని విషయం ఉండదు. ఆయన పిల్లలకు పాఠాలు చెప్తుతుంటే నేనూ వింటూంటే, నామీద వారూ అపోహ పడొచ్చు. నీకు చదు వెందుకు? ఆ బి. యే. క్లాసు పెద్దపిల్లల్ని నీకు నచ్చినవాడిని చూసేందుకేగా నువ్వు చదువు వంకపెట్టి అక్కడ కూర్చుం టున్నది, అని వారేకనుక అనుమానపడితే నాకీ చదువు అబ్బే దేనా చెప్పండి" అన్నదావిడ.

"మీరు అదృష్టవంతులు కనుక అన్నగారు అట్లా ఊరుకున్నారు. అందరి మగవాళ్ళూ అంత విశాల హృదయం కలవారుగా ఉండొద్దూ" అని అన్నాను నేను.

ఆవిడ నవ్వింది.

"నమ్మకమనేది, పట్టుదల అనేది జీవితంలో అందరికీ ఉండవలసిన గుణాలు. ఒకరియందు మరొకరికి నమ్మకం లేన ప్పుడు ఇంక చదువు, సంధ్యలే అనుమానానికి ప్రాతిపదికగా ఎందుకు తీసుకోవాలి? భార్య పవిత్రురాలయినా ఏదో నెపంతో నువ్వు ఫలానివాడితో మాట్లాడావనో, ఫలానివాడిని చూశా వనో, ఫలానివాడు నేను లేనప్పుడు ఇంటికి ఎందుకొచ్చాడనో అవమానంతో, అనుమానంతో పొద్దస్తమానం సతా యిస్తుంటే ఇంక ఆ సంసారంలో సుఖమెక్కడిది? ఆ భార్యా భర్తలు ఒకరినొకరు ఎట్లా అర్థంచేసుకో గలుగుతారు?" అని అన్నదావిడ

"అలాంటి కాపురాలు ఇంక పైకిరావనే అంటారా?" అన్నది అక్కయ్య తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"ఎప్పటికీ పాడయిపోవు. లేనిపోని అనుమానాలతో భార్యయందు కార్పణ్యం ఎట్లా పుట్టిందో కొంతకాలానికి ఆ అనుమానం దానంతటు అదే పటాపంచలయి పోతుంది. కాక పోతే ఆరోజు వచ్చేంతవరకు ఆయిల్లాలికి మనశ్శాంతిఉండదు. తన మనస్సులో, హృదయంలో మలినభావం లేనప్పుడు అను మానాలతో ఆ భర్త ఎన్ని మాటలన్నా, అవి భార్య కాలి గోటికి కూడా తగలవు. కాని ఆ స్థితికి వచ్చేదాకా ఆఇల్లాలికి

వోర్పుండదు. ఆ వోర్పునే తనకు రక్షగా తీసుకుంటే అంత కన్నా శ్రీరామరక్ష మరొకటి లేదు" అన్నదావిడ.

అక్కయ్య మనస్సుకు ఆమాటలు ఎంతవరకు సంతోషం కలిగించినయ్యో నాకప్పుడు తెలీలేదు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక కాసేపు విశ్రాంతి తీసుకుని గుడికి వెళ్ళాము మాతోపాటుగా ఆభార్యాభర్తలిద్దరూ వచ్చారు. దసరాకు ఆయన ట్యుటోరియలు కాలేజీకి శలవులు. అమ్మవార్ని దర్శించి, తీర్థ ప్రసాదాలు స్వీకరించి ఆ జనంలో నుంచి బయటపడి కొండ దిగి వచ్చేసరికి సాయంత్రం నాలు గ్గంటలయింది వారి వద్ద శలవు తీసుకుని అటు నుంచి అటే స్టేషనుకు వెళ్ళి రైలెక్కి గుంటూరు వచ్చేశాము.

సులోచనాదేవి మాటలూ, ఆవిడ సంసారమూ, ఆవిడ తెలివితేటలు తల్చుకుంటే నాకెంతో సంతోషము కలిగింది. జీవితంలో చూసి నేర్చుకొనేవి కొన్ని, అనుభవం ద్వారా తెల్సుకునేవి అనేక విషయాలు. విని తెల్సుకునేవి చాలా ఉన్నా, చూసి నేర్చుకునేవాటి మాదిరిగా మనస్సునీ, హృదయాన్ని తాకవు. చూసి నేర్చుకునేదే మనస్సుకు బాగా పట్టిస్తుంది. హృదయం పులకరించేటట్లుగా కొన్ని కొన్ని సన్ని వేశాలు అనుకోకుండా మన జీవితంలో సంఘటితపడతయ్యి. వాటిని చూసి జీవితంలో నేర్చుకోవలసిన మంచి విషయాలు ఎన్నో ఉన్నయ్యని తెల్సుకుంటాము.

బావ కోరిక ప్రకారమే పండక్కి ఆయన చెప్పిన పిండి వంటలు చేసింది అక్కయ్య. బావ తనకు కావలసినవి అడిగి మరీ వేయించుకుని ఆప్యాయంగా తిన్నారు. ఏమీ వంకలు

పెట్టకుండా బావ ఆ రోజున భోజనం ముగించటం చూస్తే నాకూ చాలా సంతోషం కలిగింది. అక్కయ్యతో ఈ విషయం అంటే "ఆ బుద్ధి నిలకడ ఎప్పుడూ ఉండాలి కదా!" అన్నది నిజమే దినం గడిస్తే తరం గడిచినట్లు కాదుగా! ఒక రోజున సంతోషంగా ఉంటే మర్నాటి విషయం ఎట్లా ఉంటుందో?

ఆ రోజున బావ సంతోషంగా ఉంటమూ, అక్కయ్యతో నవ్వుతూ మాట్లాటమూ చూస్తే, ఈ అవకాశాన్ని పురస్కరించుకుని బావ మనస్తత్వం బాగా అర్థంచేసుకోటానికి ప్రయత్నిద్దామని ఆలోచించాను. ఏదయినా, ఎన్నిమాట్లాడినా అక్కయ్య, బావ కులాసాగా ఉంటమే నాకు కావలసింది'

పండుగ భోజనాలయి మేము వంటింట్లోనుంచి బయట పడేసరికి పన్నెండు దాటింది

బావ కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తూన్నారు. మమ్మల్ని చూడంగానే:

"పాపం! అక్క చెల్లెళ్ళు చాలా కష్టపడ్డారు. కాసేపు విశ్రాంతి తీసుకోండి" అన్నారు నవ్వుతూ.

"ఆడవాళ్ళ జీవితానికి విశ్రాంతేమిటి బావా! వాళ్ళకి తోడు విశ్రాంతి కూడా అవుసరమా ఏమిటి? వాళ్ళకి స్వతంత్రంగా ఆలోచించే శక్తి, అవకాశమూ, అధికారమూ ఎక్కడన్నా ఉన్నయ్యా? మంచిగాని, చెడుగాని కట్టుకున్న భర్తని అనుసరిస్తూ వారి అభిప్రాయాలకు అనుకూలంగా నడుచుకోవటమే ఆడదాని ఆదర్శం, అంతేనా బావా?" అన్నాను.

బావ విస్తుపోయారు. అక్కయ్య వైపు చూడంగానే "వినండి దాని మాటలు. నేను కాదు మాట్లాడకుండా వూరు కోటానికి. మీరన్నట్లుగా అది నాకన్నా ఎన్నో రెట్లు తెలివి కలది" అన్నది అక్కయ్య.

"ఏం సీతా! నామీద ఆడవాళ్ళ తరఫున యుద్ధం ప్రకటించావల్లే ఉందే అయినా నీ మాటలు నేను ఎక్కువగా ఎప్పుడూ వినలేదు. ఆడదానికి విశ్రాంతి అక్కర్లేదని నేను అనుకున్నట్లుగా నువ్వు అర్థంచేసుకున్నావా?" అన్నారు బావ.

"మీ మనస్తత్వం నాకే కాదు అక్కయ్యకూడా అర్థం కావటంలేదు బావా. నాకో సందేహం, మిమ్మల్ని మీరు అర్థంచేసుకో గలుగుతున్నారా అని, ఏదో మాట వచ్చింది కనుక అంటున్నాగాని, అన్యథా భావించి కోపగించుకోకండి బావా!" అన్నాను.

"కోపమెందుకు సీతా! మామరదలు సీత, మాటకారని నా కెప్పుడో తెలుసు. నీ మాటలు వింటూంటే నా కెంతో సంతోషంగా ఉంటుంది. ప్రతివారి జీవితాల్లోనూ తీర్చుకోగల కోరికలు కొన్ని, తీరని కోరికలు కొన్ని ఉంటయ్యి అన్నింటినీ సమన్వయించుకుని, చూసీ చూడనట్లుగా నటిస్తూ తృప్తిగా జీవించడమనేది నా బోటి వాడి విషయంలో అనుమానాస్పదమే" అన్నారు బావ.

అక్కయ్య ఏం మాట్లాడలేదు.

"ఒక విషయానికి ప్రాధాన్యత ఏ విధంగా ఇవ్వాలి బావా? విన్న సంగతులకా, చూసిన సంగతులకా లేక మన మనస్సులో అనుకొని వూహించుకున్న సంగతులకా." అన్నాను?

బావ నావైపు చిరునవ్వుతో చూశారు. అక్కయ్య మా ఇద్దరివైపూ చూడసాగింది.

"విన్న సంగతులకయితే అంత ప్రాధాన్యత యివ్వ నక్కరలేదు. చూసిన సంగతులన్నీ పట్టించుకోకపోతే అవి చెడు ఫలితాల్ని ఇచ్చేవయితే అసమర్థతగా భావించవలసిందే. ఊహించుకున్న సంగతులు విషయం చెప్పనక్కర్లేదు. అది కేవలం మనస్తత్వంమీదా, మన నమ్మకంమీదా, మనకి ఒక వ్యక్తి యందుండే ఇష్టా యిష్టతల మీదా ఆధారపడి ఉంటుంది" అన్నారు బావ.

"నేనున్నాను. నా మంచి చెడ్డలు మీకు తెలీవు. నన్నుగురించి ఎవ్వరూ మీతో చెప్పలేదు. నన్ను చూడం గానే ఒక విధమైన దురభిప్రాయం మీ మనస్సులో ఏర్పడు తుందనుకోండి. అంటే మీ అభిప్రాయాలతో అంతా ఏకీభ వించవలసిందేనా?" అన్నాను

"బావతో మాట్లాడుతుంటే నా గుండెలు కొట్టుకో సాగినయ్యి. నా వయస్సుకి మించి, నాకు తెలీని విషయాలను చర్చించి వాగ్వాదానికి దిగుతున్నానా అనిపించింది. ఏమ యినా బావ మనస్తత్వం పూర్తిగా అర్థం చేసుకోవాలనే పట్టుదల నాలో అప్పుడు ఏర్పడింది" అన్నది సీత.

"నువ్వింత ధైర్యంగా, సూటిగా మాట్లాడుతుంటే మీ బావ చిన్నబుచ్చుకోవటంగాని, మీ అక్కయ్య జానకే ఇట్లా అన్నీ చెప్పి చేయిస్తున్నదా అని కాని అనుకోలేదా మీ బావ?" అన్నది రాధ.

సీత నవ్వింది—

"బాగా అడిగావే రాధా! నేను బావను మయ్యాబడు తుంటే ఆయనకు నిజంగా కోపం వచ్చినట్లే నేను భావించాను. నిజంగా కోపమే వచ్చింది. ఆ రోజున ఆయన నా వైపు చూసిన చూపు నా కిప్పటికీ గుర్తున్నది" అన్నది సీత.

"ఏమన్నారేం మీా బావ?" అన్నది రాధ.

సీత మళ్ళా చెప్పసాగింది—

"బావ నావైపు తీక్షణంగా చూశారు వచ్చిన కోపాన్నంతా మనస్సులోనే అణచుకున్నారు కామాలు. ఆ చూపులో కరుకుదనముగాని, కోపంగాని, సంతోషంగాని ఏమీా నాకు కనబడలేదు. కాని తన మనస్సులో నన్ను గురించి అంచనాలు వేస్తున్నారనే అప్పుడు నేననుకున్నాను. బావ మళ్ళా ఇట్లా అన్నారు: "ఒకరి అభిప్రాయాలతో ఒకరు బలవంతంగా ఏకీభవించాలనే నియమంలేదు. క్లాసులోకి మాష్టరు వచ్చారు. మాష్టరు రాగానే ఒక పిల్లవాడు బిత్తరిచూపుల్తో చూస్తూ ఉంటాడు. వాడు అల్లరి చెయ్యకపోయినా, వాడే ఆ క్లాసులో అల్లరి చేసినవాడని ఆ మాష్టరు అభిప్రాయానికి రావటానికి ఎంతయినా సావకాశం ఉంది ఆ సమయంలో ఆ కుర్రవాడు శిక్షార్హుడే. అవునా సీతా!" అన్నారు బావ.

మా సంభాషణ చూసి అక్కయ్య ఆదుర్దాపడసాగింది. ఏమీా మాట్లాడలేదు. మాట్లాడుతున్నంతసేపూ మా ఇద్దరి వైపూ చూస్తూ కూర్చుంది. మా బావ మరదళ్ళ సంభాషణ చిలికి చిలికి గాలివానవుతుందేమోనని అక్కయ్య భయం.

"మెత్తని వాళ్ళని చూస్తే మొట్టబుద్ధయిందన్నట్లుగా ఉన్నది మీారు చెప్పేది. అయితే అనుమానంమీాద ఆ

క్రూరాడిన్ని నాలుగు బాది కూర్చోబెట్టా లంటారు. అల్లరి చెయ్యనివాడికే దెబ్బలు తగిల్తే వాడి మనస్సు ఎంత క్షోభిల్లు తుందో ఆ మాస్టరు కేం తెలుస్తుంది మర్నాటినుంచీ అసలు బళ్ళోకి పోవటానికే వాడు భయపడతాడు. అమాయకత్వాన్నే ఆధారంగా తీసుకుని నిర్దోషిని శిక్షిస్తుంటే, శిక్షింపబడేవ్యక్తిని చూసి జాలి పట్టం విషయం అట్లా వుంచి, శిక్షించే వ్యక్తి యొక్క మనస్తత్వాన్ని ఎంత కటువుగా అర్థం చేసుకోవాలో ఒక్కసారి ఆలోచిస్తే, ఆత్మవిమర్శ చేసుకున్నట్లే అవుతుంది'' అన్నాను

బావ ముఖకవళికల్ని బట్టి అప్పుడు చూస్తే ఆయనలో సంచలనం కలిగినట్లు అర్థమైంది. బావ ఏం మాట్లాడతారో, నన్ను ఏమంటారో అనుకున్నాను. అంతలో బావ స్నేహితులు రావటంచుంచు, అక్కయ్యా, నేనూ లోపలికి వెళ్ళిపోయాం.

ఆ రోజంతా బావ ముభావంగానే ఉన్నారు. అక్కయ్యతో కూడా ఎక్కువగా మాట్లాడలేదు.

రాత్రి భోజనాలయాక ఎవరి పక్కల మీదకి వాళ్ళం చేరాం. కళ్ళు మూసుకున్నానేగాని, నాకు నిద్రపట్టలేదు. అక్కయ్య సంసార జీవితంలో, భార్యాభర్తల మధ్య ఉండే మనస్పర్థల విషయంలో నేను జోక్యం కలుగజేసుకోవడం నా వయస్సుకు మించిన పనేమో ననిపించింది. అసలు బావ నా మాటలన్నీ ఎట్లా అర్థం చేసుకున్నారో! అక్కయ్య విషయంలో మాట్లాడుతున్నాననే అనుకున్నారా! సీత ఇంత ముదినాపసానిలా, సిగ్గు లేకుండా మాట్లాడుతున్నదేమా అనుకుని, నామీద అక్కయ్యమీదిరే ఏదయినా దురభిప్రాయాన్ని

ఏమైనా అనుకున్నారా? ఈ అప్ప చెల్లెళ్ళిద్దరూ ఇంతేకామోలను కుని, అసలా వంశమే అంతేనేమోనని అనుకుని దురభిప్రాయ పడ్డారా? ఇలాంటి అనుమానాలతో ఒక దురభిప్రాయాన్ని మనస్సులో పెంపొందించుకున్న బావతో తర్కానికి దిగితే ఆ అనుమానం తీరిపోవటానికి బదులు అనుమానం ఇంకా ఎక్కువవుతుందేమో? అదీగాక నేను నిన్ను అనుమానించి బాధ పెడుతున్నట్లుగా మీ చెల్లెలుతో చెప్పి, దానిచేత నన్ను నానా మాటలు అడిగిస్తున్నావా అని అక్కయ్యమీద బావ ఇంకా విరుచుకు పడతే? మంచికిపోతే చెడు ఎదురవు తుందన్నట్లుగా అవుతుందేమో?

ఇట్లా ఎంత ఆలోచించినా నేను ఒక నిర్ణయానికి రాలేక పోయాను. ఆందోళనతో నిద్ర పట్టలేదు.

భళ్ళున తెల్లవారింది. అక్కయ్య మామూలుగా కాఫీ కుంపటి అంటిస్తున్నది. రోజూ నాకన్నా అక్కయ్య ముందు నిద్రలేస్తుంది. కాఫీ కాస్తూండగా నేను నిద్ర లేచేదాన్ని. "కాఫీ తయారయింది ముఖం కడుక్కురావే, సీతా" అనేది. పళ్ళపొడి చేతిలో వేసుకుంటుంటే చెంబుతో నీళ్ళు నా చేతి కిచ్చేది. అటువంటిది ఆ రోజున అక్కయ్య నన్ను పలకరించ లేదు నావైపు తలెత్తి చూడలేదు నాకు ఆశ్చర్యం కలిగింది. ఆదుర్దాగా అక్కయ్య ముఖంలోకి చూశాను. కళ్ళు ఎర్రబడి వాచినయ్యి. ముఖం ఉబ్బింది. పలకరిస్తే కట్టలు తెంచుకుని ప్రవహించేటంత దుఃఖ సముద్రం అక్కయ్యలో పరవళ్ళు తొక్కుతున్నది. "అట్లా ఉన్నావేమే అక్కయ్యా? బావ ఏమయినా అన్నారా?" అన్నాను.

అక్కయ్య కళ్లు తుడుచుకుని "ఏమీ లేదే నువ్వు వెళ్ళి ముఖం కడుక్కురా కాఫీ తాగుదువుగాని" అంటూనే అవతలకు వెళ్లింది.

నేను అనుకున్నంత అయింది. బావ ఇంకా రెచ్చిపోయారన్నమాట. కట్టుకున్న భార్యని అర్థం చేసుకోలేనివాడు కాలేజీలో విద్యార్థులకు ఎట్లా పాఠాలు చెప్తాడు అనుకున్నాను. ఎన్ని తప్పులున్నా ఆయన మగవాడు. సంపాదిస్తున్నాడు. చాకిరిచేసే భార్యకు తిండిపెట్టేవాడు. మనస్సుతో, హృదయంతో, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానంతో భార్యని అర్థం చేసుకోలేనివాడు. ఎన్నను కున్నా కరుడుగట్టిన హృదయాన్ని ఎంత ప్రయత్నించినా మార్చలేనేమో!

అక్కయ్యను చూస్తుంటే ఆ రోజున నాకేం తోచలేదు ఏ పనీ చేతనపడలేదు. ఏం మాట్లాట్టానికీ మనస్కరించలేదు. బావకు కనబడ్డా తప్పుకు తిరిగాను. ఆరోజంతా ఎవరం మాట్లాడలేదు.

మర్నాడు బావ కాలేజీకి వెళ్ళినప్పుడు అక్కయ్యను అడిగాను.

"సీతా! నీకు పుణ్యం ఉంటుంది. నన్ను ఈమాత్రంగా నయినా బ్రతకనివ్వు. మీ బావతో వాదానికి దిగకు. నా జీవితం ఇట్లా వెళ్ళిపోవలసిందే. నా మీద ఎంత నీచంగా చిత్రించి చెప్పకపోతే సీత అంత డొంకతిరుగుడుగా నన్ను అన్ని మాటలడుగుతుంది మీ అప్పచెల్లెళ్ళిద్దరూ కొంపలు తీసే రకాలు, అని అన్నారు మీ బావ. సీతా! వారితో నన్ను గురించి ఏం మాట్లాడక. నామీద నీకున్న అభిమానా

నికి కృతజ్ఞురాల్ని. మీ బావ మనస్సు మారదే! మీ బావ ఇంకా ఏమన్నారో తెలుసా సీతా? నీ మీద నాకు అనుమానం తీరకపోయినా నిన్ను నేను వదిలిపెట్టలేను. ఇంతకన్నా నీకు కావలసిందేమిటి? అని ఎదురు ప్రశ్న వేశారు. అలాంటి మనిషితో నే నేం చెప్పేది. ఏం మాట్లాడేది?" అన్నది అక్కయ్య.

నా ప్రాణం నిర్జీవమై పోయింది. బావ చదువుకున్న వాడు. ఉద్యోగం చేస్తున్న వాడు. నలుగురిలోనూ తిరగనేర్చిన వాడు. కాలేజీలో సహాధ్యాయుడితో మాట్లాడినందుకూ, అదరాభిమానాలు చూపే సహృదయుడయిన చిన్న మావయ్యతో చనువుగా మాట్లాడినందుకూ, కాలేజీలో తనకు చదువు చెప్పిన లెక్చరరుతో మాట్లాడినందుకూ అనుమానపడే మన స్త్రీత్వంగల బావ తన మటుకు తాను కాలేజీలో ఏ ఆడపిల్లతోనూ మాట్లాడకుండానే ఉన్నారా? తనతో ఆ విద్యార్థిన్లు మాట్లాడుతున్నారు గనుక వాళ్ళ విషయంలోనూ అనుమానపడాల్సిందేనా? ఏమిటీ మన స్త్రీత్వం? ఎందుకీ అనుమానాలు? ఈ అనుమానాలతో తనకు సుఖం లేకుండా చేసుకుంటున్నాడు. అక్కయ్యకు మనశ్శాంతి లేకుండా పోతున్నది. ఆ రోజంతా నా కివ్వే ఆలోచనలు. ఆ రోజున నేను ఎంత విచారపడ్డానో తల్చుకుంటే నాకు యిప్పటికీ బాధగానే ఉంది", అన్నది సీత రాధతో.

రాధ నిట్టూర్పుతో తరువాతసంగతులు చెప్పమన్నట్లు సీత ముఖంలోకి చూసింది.

సీత కళ్ళు తుడుచుకుని మళ్లా ఇట్లా చెప్పసాగింది—

పది రోజులు గడిచినయ్యి. దీపావళికి ముందే నేను ఏలూరు వెళ్ళిపోదా మనుకున్నాను. అక్కయ్య దీపావళి వెళ్లాక నే వెళ్ళమన్నది. బావకూడా అట్లాగే అన్నారు. నాకు ఉండక తప్పలేదు.

బావ మనస్తత్వం తల్చుకుంటే నాకు ఇప్పటికీ ఆశ్చర్యంగానే ఉంటుంది. ఆ రోజున మంచి హిందీ పిక్చర్ వచ్చిందనీ, ముగ్గురం వెళదామనీ బావ అన్నారు. బావ మాట కాదనలేక అక్కయ్యా, నేనూ సరే నన్నాము. కాదంటే అదేం తప్పోనని అక్కయ్య భయం. ఏ రోజు కారోజు పెద్ద పులిదగ్గర మేకపిల్ల ఉన్నట్లే అనుకుంటూ కాలం గడుపుతున్నది అక్కయ్య. ఈ రోజున బావ సంతోషంగా ఉన్నారని అనుకోటానికి వీల్లేదు. మరు క్షణంలో ఏం ఉపద్రవం జరుగుతుందో! దిన దిన గండం నూరేళ్లు ఆయుష్షుగా ఉంది దాని జీవితం. ఎప్పటికయినా కుదుట పడుతుందా అనే నా ఆవేదన.

ఆ రోజున సినిమాకు మొదటి ఆటకు వెళ్లాం. బావ పక్కన అక్కయ్య అక్కయ్య పక్కన నేనూ కూర్చున్నాం. బావకు అటు పక్కన ఒక సీటు కాళీగా ఉంది. సినిమా ప్రారంభించే వేళకు ఎవరో అమ్మాయి వచ్చి బావ పక్కన కుర్చీలో కూర్చుంది. అక్కయ్యా, నేనూ చాలా ఆశ్చర్యపడ్డాం. బావ ఆ అమ్మాయిని ఆప్యాయంగా పలకరించారు.

"ఏం రమా! నువ్వొక్కతివే వచ్చావా, ఇంకా ఎవరయినా వచ్చారా?" అని.

"అనుకోకుండా నే నొక్కదాన్నే వచ్చేశానండీ! ఒక్కతినే వస్తున్నాననే అనుకున్నాను. మీరు కనిపించారు. అదృ

ష్టవశాత్తు మీ పక్క సీటు కాళీగా వుంది" అన్నదా అమ్మాయి నవ్వుతూ. సినిమా పూర్తయేలోపల కనీసం పాతికసార్లయినా వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. పక్కన అక్కయ్యా, నేనూ ఉన్న సంగతే మర్చిపోయారు. కనీసం మర్యాదకైనా మమ్మల్ని ఆ అమ్మాయికి పరిచయం చెయ్యలేదు. మాకు చాలా కష్టమనిపించింది. సినిమా చూడ బుద్ధిపుట్టలేదు బావ బుద్ధి ఇటువంటిది కదా అని ఆలోచిస్తూ కూర్చున్నాను.

సినిమా అయిపోయింది. లైట్లు వెలిగాయి. "గుడ్ నైట్ మాష్టారూ. శలవు. వస్తాను"అని నవ్వుకుంటూ వెళ్ళి పోయింది. మా వైపున చూడనైనా చూడలేదు.

ఎవరం మాట్లాడుకోకుండానే ఇంటికి వెళ్ళిపోయాం. మర్నాడు ఆదివారం. కాలేజీకి శలవు. బావ కాఫీతాగి ఎక్కడికో వెళ్ళిపోయారు. అక్కయ్యముఖం కందగడ్డయిపోయింది. బావ ప్రవర్తన నాకు నచ్చలేదు.

"అట్లా వూరుకున్నావేమే జానకీ? బావను సమయం వచ్చినప్పుడే అడగాలి. ఆ అమ్మాయి ఎవరో,ఏమిటో అడక్కపోయావా? బావని" అన్నాను.

"అడిగానే సీతా! నా మనస్సు ఎంత ఉడికిపోతున్నదో చెప్పలేనే. పైకి ఎంత సౌమ్యంగా కనిపించినా, ఆయనకు మనస్సులో అనేక ఆలోచనలు, అభిప్రాయాలు కడుపులో

ఒకమాట. చెప్పదల్చుకుంది ఒకమాట, చెప్పేది ఒకమాట” అన్నది అక్కయ్య.

“ఏమన్నారు బావ?” అన్నాను.

“ఆ అమ్మాయి వారి స్టూడెంటుట. చాలా గొప్పింటి పిల్లట. ఎంతో తెలివికలది, చలాకీగా మాట్లాడేదీ, సరదాగా ఉండేదట. ఆఅమ్మాయి పేరు రమాదేవి”అన్నది అక్కయ్య.

“నేను ఆ రోజున వాళ్ళతో ఒక్కసారి మాట్లాడితేనే అంత అనుమానంపడ్డారు. మరి మీరు ఆ అమ్మాయితో అంత నవ్వుతూ మాట్లాడారేం? అని అడక్కపోయావా?” అన్నాను.

“అడిగాను సీతా! మీ బావ మనసు అందరు. రమాదేవి నీ అంత అధమస్తురాలు కాదు. ఏంచేసినా ఏం మాట్లాడినా ఆ అమ్మాయి మాటల్లో నిజాయితీ ఉట్టిపడుతుంది. ఎంతో మంచి పిల్ల” అని అన్నారు అక్కడికే మనస్సు సరి పెట్టుకోలేక ఆ పిల్లతో అంత చనువుగా ఉంటే అది బాగుం టుందా? అన్నాను. నా చెంప ఛెళ్ళుమంది. తల దిమ్మెర పోయింది. ప్రాణం కడబట్టింది. అయిదు వేళ్ళూ తేలినయ్యి” అని చెంప చూపించింది. ఆ ఎరుపు తగ్గలేదు.

నాకు బావను తల్చుకుంటే అసహ్యం వేసింది. అక్కయ్య జీవితం ఇట్లాగే వెళ్ళిపోవాలా అనిపించింది. ఆఖరి సారిగా బావను మళ్లా హెచ్చరిద్దా మనుకున్నాను. అక్కయ్యను చూస్తుంటే నాకు కాళ్ళు ఆడలేదు. దాని కాపురం బాగుపట్టానికి నా ప్రాణాలు అర్పించటానికయినా వెనకాడ కూడదనుకున్నాను. అక్కయ్య మీద నాకు గల ప్రేమ, ఆదరాభిమానాలూ, జాలి, నిరాశా, నిస్పృహా అన్నీకలిసి నాలో

ఏదో చైతన్యాన్ని కలుగజేసినట్టు. దాని కాపురం బాగుపడి అది కలకల్లాడుతూ కాపురం చేస్తుంటే నా మనస్సుకు అంత కన్న కావలసిన ఆనందం లేదు. ఆ రోజుల్లో రాత్రింబగళ్లు అక్కయ్యను గురించిన ఆలోచనతప్ప ఇతరత్రా ఏమీ ఆలోచించేదాన్ని కాదు. సర్వసామాన్యంగా వయసొచ్చిన ఆడపిల్లకు అనేకరకాల ఆలోచనలు. తనకు ఎలాంటి భర్త వస్తే బావుంటుంది? ఏం చదువుకున్న వాడయితే బావుంటుంది? తమకు ఏం నగలూ, చీరెలూ పెడతారో, తమను ఎంత ప్రేమగా, ఆదరణగా చూస్తారో? ఇట్లా ఆలోచిస్తారు చాలా మంది. ప్రేమించి, పెళ్ళిచేసుకునే వారయితే వాళ్ళ ఆలోచనలు వేరు. వాళ్ళ కోరికలు వేరు. నా మనస్సులో అలాంటి ఆలోచనలేం కలిగేవికాదు నా ఆలోచన ఒక్కటే. ఏనాటికయినా అక్కయ్య కాపురం బాగుపడాలి బావ అక్కయ్యను ఆపేక్షగా చూడాలి. దాని మనస్సులో ఏ రకమయిన దిగులూ ఉండకూడదు. ఇదే నా ఆలోచన.

ఆ రోజు రాత్రి భోజనాలయాక బావతో కల్పించుకుని నేనే మాట్లాడాను.

"సినిమా బాగుందా బావా?" అన్నాను.

"ఏం సినిమా సీతా?" అన్నారు ఏమీ తెలీనట్లుగా నా వైపు చూసి.

"నిన్న చూసిన హిందీ సినిమా" అన్నాను.

"ఏం, బాగానేవుంది. కథలో కొత్తదనం ఉందికదూ" అన్నారు. నాకు ఒళ్లు మండిపోయింది.

"అవును బావా! కొత్తగానే ఉంది. సరేగాని బావా, మీ పక్కన కూర్చున్నమ్మాయి చాలా బావుంది. చక్కగా నవ్వుతూ, కళ్ళు తిప్పుతూ మాట్లాడుతుంది. ఏం చదువు తోంది బావా?" అన్నాను.

బావ ముఖంలో చిరునవ్వు కనిపించింది.

"ఆ అమ్మాయి పేరు రమాదేవి. బి కాం. చదువు తున్నది. చాలా సరదాగా మాట్లాడుతుంది. క్లాసులో ఆడ పిల్ల లందరిలోకీ తెలివైనది" అన్నారు బావ

"ఇంటరు ఫస్టు క్లాసులో పాసయిందా?" అన్నాను.

"లేదనుకో, అయినా తెలివికలది స్నేహపాత్రురాలు" అన్నారు.

"అవును తెలుస్తునే ఉంది. మీకు బాగా పరిచయ మల్లే ఉంది. చక్కగా పక్కనే కూర్చుంది" అన్నాను.

బావ గతుక్కు మన్నారు.

"ఏం కూర్చుంటే తప్పా సీతా? నా క్లాసు స్టూడెంటు నాతో మాట్లాట్టంకూడా తప్పయితే ఎట్లా సీతా?" అన్నారు.

"తప్పని కాదు బావా! రమాదేవి ఎంతో ఆకర్షణీ యంగా ఉంది. అలాంటి పిల్ల క్లాసుకు ఒక్క తెఉన్నా చాలు. క్లాసంతా ఎంతో నిండుగా ఉంటుంది" అన్నాను.

బావ నవ్వి వూరుకున్నారు.

"బావా! అంత చనువుగా మాట్లాట్టం ఎవరయినా చూస్తే ఏమనుకుంటారు? వాళ్ళ తల్లి దండ్రులకు తెలిస్తే ప్రమాదంకదూ!" అన్నాను.

"సీతా! రమాదేవితో మాట్లాడినంత మాత్రం చేతనే అనుమాన పడాలా? మేం, కాని పన్లేవీ చెయ్యటంలేదే. అంత తప్పుగా అనుమానపడితే వాళ్ళఉడుకుమోతుతనం వాళ్లే బైట వేసుకున్నట్లవుతుంది" అన్నారు

బావ నామార్గాన పడుతున్నందుకు సంతోషించాను. నా మనస్సులోని భావాలకు దగ్గరగానే వస్తున్నారనుకున్నాను. ఈ సమయంలోనే అన్నీ అడగాలనుకున్నాను. పొంగి పొర్లుకొస్తున్న మనస్తాపాన్ని అపుకుని మంచితనంగానే మాట్లాడాను.

"ఒక్కమాట అడుగుతాను బావా! ఏమీ అనుకోకండి పరాయి స్త్రీ, పురుషులు మాట్లాడుకున్నందువల్ల ఏ తప్పూ లేదన్నారు. చుట్టాలు మాట్లాటంలో అసలు అనుమానానికి తావుండకూడదుగా? ఎవరయినప్పటికీ మనస్సులో, కోరికలలో ఏ మాలిన్య భావాలూ లేనంతవరకూ మాట్లాటం తప్పుకాదు. అట్లాగే ఏ దురుద్దేశాలూ లేకుండా అక్కయ్య చిన్నమావయ్యతో, వాళ్ళ కాలేజీ విద్యార్థితో, లెక్చరరుతో మాట్లాడింది. అసభ్యంగా, ఏ ఉద్దేశాలతోగాని అక్కయ్య ఎవ్వరితోనూ మాట్లాడలేదు, కాని అక్కయ్యను గురించి మీరు ఏ విధంగా అభిప్రాయ పడ్డారో ఆలోచించండి మనస్సుకు మనసే సాక్షి" అన్నాను

బావ నా వైపు చూసి వూరుకున్నారు. బావతో మాట్లాడుతున్నానన్న మాటేగాని, నన్నుకూడా నీచంగానే చిత్రించి, బావ నన్ను హేళనగా మాట్లాడితే నేనేం కావాలి? "ఇంత చొరవగా సంసార జీవితంలో గల సంగతుల్ని చర్చి

స్తున్నావంటే, నిన్నూ నేను అనుమానిస్తున్నాను సీతా" అని బావ అంటే నిజంగా నా జీవితంలో నేనే కోరి నిప్పులు పోసుకున్నట్లవుతుంది. ఏమయినా ఆత్మసాక్షిగా, పరమాత్మ తోడుగా, అంతఃకరణ శుద్ధిగా నా మనస్సులో ఏ దురుద్దేశమూ లేకుండా మాట్లాడుతున్నప్పుడు బావ ఏమనుకున్నా నాకు తగలవనుకున్నాను. నాజీవితానికే బావ కళంకం తేబూనితే ఆ పరమాత్ముడే గతినా డనుకున్నాను. ఎట్లాగయినా బావ మనస్సు సరయినమార్గంలోకి తీసుకురావాలి. అక్కయ్య సుఖపడాలి. అదే నా కోరిక.

ఇట్లా ఆలోచిస్తూ కూర్చున్నాను బావ నా వైపు చిరునవ్వుతో చూస్తూ,

"సీతా! ఇంత నిర్భయంగా, పెళ్ళికాని పిల్లవైనా నీ వయస్సుకు మించిన మాటలు మాట్లాడుతున్నావంటే నేను చాలా సంతోషిస్తున్నాను. జానకి మనస్తత్వానికీ, నీ మనస్తత్వానికీ పోలిక లేదు. మంచి చెడ్డలు మనస్తత్వాన్ని బట్టి ఉంటయ్యి. వ్యక్తులయందు మనకుగల అభిప్రాయాలూ, మనస్తత్వాలూ మనకు వారి యందుగల గౌరవాన్నిబట్టే, బాంధవ్యాన్ని బట్టే ఉంటయ్యి" అన్నారు బావ.

"అంటే జానకి మీద మీకు సదభిప్రాయం లేదా?" ఆదుర్దాగా అడిగాను.

"సదభిప్రాయం ఒక్కసారిగా తెచ్చుకోగల నా తావరణం జానకి నా కెప్పుడూ కలిగించలేదు" అన్నారు బావ.

"అంటే?" అన్నాను.

"అవివాహితవు కనక నీకు తెలీదు" అన్నారు బావ.

"పోనీండి. మీ మనస్సుకు మీకు తోచినట్లుగా అక్కయ్యమీద అభిప్రాయం ఏర్పర్చుకున్నారు. సరే, అక్కయ్య వాళ్ళతో మాట్లాట్టం మీ అనుమానాలకి ఇంకా హేతువయింది కదూ!" అన్నాను.

"కొంత వరకూ నిజం" అన్నారు బావ.

"ఆ విధంగానే మీ విషయంలోనూ, రమాదేవి విష యంలోనూ అపోహ పడతారనుకోండి అప్పుడు మీమనస్సు ఎంత బాధ పడుతుంది?" అన్నాను.

"మా ఇద్దరినీ జతచేసిన వాళ్ళ మనస్తత్వాలు బైట పడతయ్యి. అంతకన్నా పోయిందేమీలేదు. కాకపోయినా నైతికంగా పురుషుడు పతనమైనా అంత బాధలేదు. స్త్రీ నైతి కంగా పతనమైతే అది కుటుంబానికి తలవంపు" అన్నారు బావ.

ఈ మాటలకు నేను ఆశ్చర్యపడ్డాను.

"నైతిక పతనమంటే?" అన్నాను

"స్త్రీ లోలుడవటం" అన్నారు బావ.

"అంటే మగవాళ్ళు స్త్రీ లోలురైనా ఆ కుటుంబానికి మచ్చరాదన్నమాట" అన్నాను బావవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"కొంత వరకూ నిజమే. అది సంఘం నిర్దేశించిన విధా నమే. నేను రమాదేవితో సాంగత్యం ఏర్పరచుకున్నా నన్ను ఎవ్వరూ హేళనగా మాట్లాడరు. నావ్యక్తిత్వానికి ఏ లోపమూ రాదు. ఎవ్వరూ నన్ను తప్పు పట్టరు. రమాదేవి విషయంలో అట్లా కాదు. నలుగురిలోనూ చులకనగా చూడ బడుతుంది. ఇద్దరి విషయంలోనూ అంతే తేడా" అన్నారు బావ.

నాలో నేను నవ్వుకున్నాను.

"పాప పుణ్యాల్లోకూడా, స్త్రీ, పురుషుల విషయంలో తేడాలున్నాయా బావా? స్త్రీ విషయంలో చేసిన పాపకార్యం ఒకతీరుగా చూస్తే, పురుషుల విషయంలో ఒకతీరుగా చూస్తా రన్నమాట. అంటే నైతికవిలువలను తక్కువగాఅంచనా కట్టు కున్న పురుషులే, స్త్రీలను చేరదీసి వారి నైతిక విలువను పోగొడుతున్నా రన్నమాట శాస్త్రకారులూ నైతిక విలువ లను నిర్దేశించిన వారూ మగవారే కనుక ఆ శాస్త్రాలు అట్లా సృష్టించి రాశారేమో? పోనీండి మీరు చెప్పిందే సరయిన సిద్ధాంత మనుకుందాం. నైతిక విలువలకి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వని పురుషులు పతనమవ్వాలంటే అందుకు స్త్రీ చేయూత కూడా కావలసిందేగా" అన్నాను.

"అవును" అన్నారు బావ.

"అంటే స్త్రీ తన పాతివ్రత్యాన్ని కాపాడుకుని నైతి కంగా పతన మవకూడదు. కాని ఇదే సిద్ధాంతం మగవారి విషయంలో అంత పట్టింపు కాదంటారు" అన్నాను.

బావ మాట్లాడలేదు. నే చెప్పేది వింటున్నారు.

"అంటే ప్రతి మగవాడూ తన భార్య మాత్రం పవి త్రురాలిగా ఉండాలనే కోరుకుంటాడు. తనుమాత్రం విచ్చల విడిగా తిరిగినా ఎవ్వరూ తప్పు పట్టుకోకూడ దనుకుంటారు. అవునా బావా!" అన్నాను.

"నీ అభిప్రాయం పూర్తిగా చెప్పు" అన్నారు బావ.

"అంటే ప్రతి మగవాడూ పరాయి స్త్రీల పొందు కోరవచ్చు. కాని తన భార్యవైపు ఎవ్వరూ కన్నెత్తి చూడ

కూడదు. ఆవిడ ఎవ్వరితోనూ మాట్లాడకూడదు. అంతేనా బావా?'' అన్నాను.

బావ నిర్ఘాంతపోయి అయిష్టతగా నావైపు చూస్తూ తన గదిలోకి వెళ్ళిపోయారు. నాకు పట్టరాని దుఃఖం పొంగి పొర్లుకొచ్చింది. ఏమిటో ఎందుకట్లా మాట్లాడానో నాకు తెలీదు. వంటింట్లోనుంచే అన్ని మాటలూ విన్న అక్కయ్య నా దగ్గరకొచ్చి నన్ను కౌగలించుకుని ''నీ కెంతో ఋణపడి ఉన్నానే సీతా'' అంటూ మనస్ఫూర్తిగా నా చెంపలు నిమిరింది. నా హృదయం పులకరించింది. నవ్వుతూ అక్కయ్య వైపు చూశాను. అక్కయ్య కళ్ళలో ఆనందం వెల్లివిరిసింది. నా మనస్సులోని ఆరాటం కొంత వరకూ తగ్గింది.

మరో రెండు రోజుల వరకూ నేను బావను చూడలేక పోయాను. అక్కయ్యను చూస్తూంటే బావ కొంచం మనసిచ్చి మాట్లాడుతున్నట్లే ఉంది. అక్కయ్య ముఖంలో సంతోషాతిశయాలు కొద్దిగా తొంగి చూసినయ్యి. అక్కయ్య నడిగాను, బావ ఏమన్నారని

''కాపరానికొచ్చింది మొదలు వార్ని చూస్తూంటే ఒక విధమైన భయంతోనే ఉంటున్నాను. నా మనస్సులోని ఉద్దేశ్యాలూ, మంచి చెడ్డలూ వారితో చెప్పుదామని నోటిదాకా వచ్చినా వార్ని చూసేసరికి ఎంతో భయం కలిగి నేను చెప్పదల్చుకున్న విషయాలు మర్చిపోయేదాన్ని వారుగట్టిగా రెండు మాటలంటే దిగాలుపడి కూర్చోటం తప్ప నోరెత్తి చెప్పే ధైర్యం కలిగేదికాదు. ఇప్పుడు ఈ రెండు మూడు రోజుల నుంచీ నవ్వు ముఖంతో ఉంటంనుంచే మాట్లాటానికి

భయపట్టంలేదు. ఇది ఎల్లకాలం ఉంటుందా అనే నా సందేహం" అన్నది అక్కయ్య.

"నన్ను గురించి ఏమైనా అన్నారా?" అన్నాను ఆదుర్దాగా. బావ దృష్టిలో నే నెట్లా ఉన్నానో తెల్సుకోవాలనే ఆదుర్దా ఎక్కువయింది.

"నువ్వు చాలా తెలివిగల దానివనీ, ఎంతో నేర్పుగా ఎదుటివారి మనస్సు కష్టపెట్టకుండా మాట్లాడగలవనీ, నిన్ను చేసుకున్నవాడు ఎంతో అదృష్టవంతుడనీ అన్నారు. మాట్లాడుతూనే సీత చాలా అదృష్టవంతురాలు జానకీ అని చాలా సార్లు అన్నారు. ఎప్పుడూ నీతో మాట్లాడాలనే అనిపిస్తుంది. కాని నీతో మాట్లాడాలంటే ఎంతో జాగ్రత్తగా ఒళ్లు దగ్గర పెట్టుకుని తూచి, తూచి మాట్లాడాలిట. లేకపోతే ఒక్క మాటలో నోరు మూయించేస్తావుట" అన్నది అక్కయ్య నవ్వుతూ.

నా మనస్సు కుదుటపడ్డది. తన దృష్టిలో బావ నన్ను ఇంకో రకంగా చిత్రించుకుంటే ఇంక చేసేదేముంది? ఎన్ని మాటలు చెప్పినా, ఎన్ని విషయాలు చర్చించినా మనిషికి విలువఉంటేనే ఆ మాటలు రాణిస్తయ్యి. విలువలేని వ్యక్తులు ఎన్ని హితోక్తులు చెప్పినా ఎవ్వరూ లక్ష్యపెట్టరు.

"సీత ఏదో వాగుతుందేమిటి? అయినా మన సంసార విషయంలో దాని జోక్య మెందుకని కసురుకోలేదా?" అన్నాను.

"లేదే. నువ్వంటే ఆయన మనస్సులో ఒక ఉన్నత స్థానాన్ని ఏర్పర్చుకున్నట్లే నే ననుకున్నాను. నీయందు వారికి

ఏ రకమయిన ఈర్ష్యాభావమూ, తేలిక భావమూ లేదు. నువ్వంటే ఎంతో గౌరవంగానే మాట్లాడుతారు. సీత మనస్సులో ఎన్ని విషయాలో దాగి ఉన్నవి. దాని భావాలకూ, దాని బుద్ధి కుశలతకూ, దాని ఔదార్యానికి నేను ఎంతో మెచ్చుకుంటున్నాను. దానికి అనుకూలుడైన భర్త దొరికితే నేను ఎంతో సంతోషిస్తాను. సీతనూ, దానిమాటల్నీ తల్చుకుంటే నాకు చాలా సంతోషంగా ఉంది. నువ్వూ ఉన్నావ్, ఎందుకూ విగ్రహ పుష్టి తప్ప మరేంలేదు అన్నారు" అన్నది అక్కయ్య.

ఈ మాటలు వినేసరికి నాకు ఏనుగెక్కినంత సంతోషం కలిగింది. బావలాంటివ్యక్తి మనస్సులో నేను మంచిఅభిప్రాయంతోనే ఉండగలిగినందుకు నా మనస్సు శాంతపడ్డది. నా జీవితంలో అదే ఒక మెలురాయి లాంటిది.

మరో నాలుగు రోజులు గడిచినయ్యి.

*  *  *

నేను ఉదయం నిద్రలేచేసరికి అక్కయ్య వాంతి చేసుకుంటున్నది. నేను అక్కయ్యకేమయినా జ్వరంగా ఉందేమోననుకున్నాను. అక్కయ్య నవ్వుతూ నావైపు చూసి ముఖం తుడ్చుకుంటూ "ఏం లేదే సీతా, కాస్త పసరు వెళ్ళింది" అన్నది. అప్పటికి నాకు అర్థమయింది. 'ఎంత పని చేశావే అక్కా! ఉండు, వెళ్ళంగానే నువ్వింత పనిచేశావని అమ్మతో చెప్తాను" అన్నాను నవ్వుతూ.

బావతో అన్నాను. "అక్కయ్య ఎంత పని చేసిందో విన్నారా? ఇంక నేను ఏలూరు వెళ్ళిపోతాను అమ్మకు ఈ కబురు చెప్పాలిగా" అన్నాను.

"మీ అక్కయ్యకు ఏం చేతకాకపోయినా ఇది మాత్రం ఎవరూ చెప్పక్కర్లేకుండానే చేతయింది" అన్నారు బావ అక్కయ్య వైపుచూసి నవ్వుతూ.

"అయితే ఇంక మీకు చాలా కాలక్షేపం అవుతుంది బావా ఆవాళ రైలులో చూశాంకదూ విజయవాడ వెళ్ళేటప్పుడు. అక్కయ్య పని కనటంవరకే. ఆ పుట్టినవాడ్ని ఎత్తుకు తిప్పి ఆడించటం మీ వంతు. మీరు పసివాడ్ని ఎత్తుకు తిప్పుతుంటే చూడాలని ఉంది బావా! అప్పుడింక మేమెవ్వరం కనబడమేమో!" అన్నాను.

"పిల్లల్ని ఆడించటం నా తరం కాదు. అది మీ అక్కయ్య వంతే" అన్నారు బావ.

బావ ఇంత సంతోషంగా మాట్లాడుతుంటే నాకెంతో సంతోషం కలిగింది. అక్కయ్య అదృష్టవంతురాలే ననుకున్నాను. ఇంక నేను మెల్లిగా నిష్క్రమిస్తే మంచిదని భావించాను.

ఎంతో బలవంతంమీద అక్కయ్యను సమాధానపర్చి ప్రయాణానికి అనుమతి తీసుకున్నాను. దీపావళి వెళ్ళే వరకూ ఉండమని బావకూడా బలవంతం చేశారు. ఎందుకో నాకు ఇంక ఉండాలనిపించతేదు. ఈ శుభవార్త ఎప్పుడెప్పుడు అమ్మ చెవిని వేద్దామా అనిపించింది.

అక్కయ్య నాకు చీరె, జాకెట్టుగుడ్డ తెప్పించింది. వద్దన్నకొద్దీ బలవంతంగా నాకు బొట్టుపెట్టి ఇచ్చింది. చీరె కట్టుకోమంది. నాకు ఇష్టం లేకపోయింది అనవసరంగా అంత ఖరీదుగల చీరె ఎందుకు నాకనిపించింది. చీరె ఖరీదు అరవై నాలుగు రూపాయలు.

"కట్టుకోవే సీతా! నా మనస్సు తృప్తికోసమైనా కట్టుకోవూ" అంటూ నా వైపు చూసింది. ఆ చూపు ఎంతో దీనంగా ఉంది. అక్కయ్య ముఖంలో ఏదో తెలీని ఆవేదన కనిపించింది. చాలా నిరాశగా ఉంది నిరాశగా మాట్లాడింది. చీరె కట్టుకున్నాను అక్కయ్యకూ, బావకూ నమస్కరించాను. బావకూడా ఎంతో ఆదరణగా మాట్లాడారు. ఆ సమయంలో ఎందుకో నాకూ దిగులు కలిగి కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఇంకా ఉంటే బావుంటుందని నా మనస్సులో అనిపించింది. కళ్ళు తుడుచుకుని రిక్షా ఎక్కాను అక్కయ్యా, బావకూడా స్టేషనుకు వచ్చి నన్ను రైలెక్కించారు. రైలు సాగిపోతూంటే అక్కయ్యకు దూరమైపోతున్న ట్లనిపించింది. ఏమిటో దిగులు. ఏమిటో నిరాశ. నిస్పృహ. రైలు ప్లాట్ ఫారం దాటగానే కిటికీ ముందు నుంచి ఇవతలకొచ్చి బర్త్ మీద కూర్చున్నాను. నా మనస్సంతా దిగులుతో నిండిపోయింది.

ఇంటికి వెళ్ళింతరువాత రెండు మూడు రోజుల వరకూ కళ్ళు తెర్చినా, కళ్ళు మూసినా అక్కయ్య, బావ కనుపించసాగారు. పుట్టి బుద్ధెరిగింతరువాత ఇన్ని సంవత్సరాల నుంచీ అక్కయ్యతో ఉంటూ, అక్కయ్యతో మాట్లాడుతూ పెరిగి

పెద్దదాన్నయినా ఇరవై రోజుల్లోనూ అక్కయ్య గారింట్లో ఉంటం తల్చుకుంటే నావళ్లు పులకరించేది. ఏమిటో అక్కయ్య నాజీవిత సర్వస్వంగా ఉండాలని అనిపించింది. అక్కయ్యకోసం ఏ త్యాగమైనా చెయ్యాలి దాని సంతోషమే నాసంతోషం. దాని సుఖమే నా సుఖం అది కష్టపడుతుందంటే నామనస్సు బాధ పడుతుంది. అక్కయ్య నాకు దేవత.

వచ్చే ఏడు మళ్ళా కాలేజీలో చేరి చదువుకోవాలను కోవటం నుంచి ఏవో కాలేజీ పుస్తకాలు స్నేహితుల దగ్గర తెచ్చుకుని కాలక్షేపానికి చదువుకోసాగాను. అంతకన్నా నాకు పని చర్య కనిపించలేదు.

అక్కయ్య వారానికో ఉత్తరం రాసేది. దాని ఉత్త రాలు చదువుతుంటే నాకు ప్రాణం లేచివచ్చినంత పనయ్యేది. దాంతో మాట్లాడుతున్నట్లే అనిపించేది. ఒక్కో ఉత్తరం నాలుగేసిసార్లు చదువుకునేదాన్ని.

సంక్రాంతి పండుక్కి అక్కయ్యను పంపమనీ, తను వచ్చి తీసుకువెళతాననీ నాన్న బావకు ఉత్తరం రాశారు. అందుకు బావ తన ఇష్టత తెలిపారు. ఎంతో సంతోషపడ్డాను. అక్కయ్య వస్తుందనీ, ఈ మూడు నెల్లనుంచీ జరిగిన విష యాలు విందామనీఆసించాను. ఇప్పుడు అక్కయ్యకు అయిదో నెల. అక్కయ్యను తల్చుకుని, ఏమిటేమిటో అనుకుని నాలో నేనే నవ్వుకునేదాన్ని. ఈదులాడుతూ అక్కయ్య నడుస్తుంటే ఎగతాళి చెయ్యాలని అనుకునేదాన్ని. అక్కయ్య కొడుక్కి ఏ పేరు పెడితే బావుంటుందో ఇప్పుడే, అక్కయ్య రాగానే అడగాలని అనుకునేదాన్ని. వాడికి మేజోళ్ళు, స్వెటర్లు అల్లు

దామని అనిపించేది. ఏమిటో నా మనస్సంతా అక్కయ్య ఆక్రమించింది.

నాన్న అక్కయ్యను తీసుకొస్తారని ఎదురు చూస్తూ కూర్చున్నాను. అమ్మ వద్దన్నా వినకుండా రైలొచ్చే వేళకు పవరుపేట స్టేషనుకు వెళ్ళాను. ఇంటి కొచ్చే వరకూ నా మనస్సు ఆగింది కాదు. రైలు ప్లాట్‌ఫారం మీదికి వస్తుంటే వెయ్యి కళ్ళతో పెట్టెలన్నీ చూశాను. హృదయం పరవళ్ళు తొక్కసాగింది. మనస్సు ఉరకలు వేసింది. కళ్ళుఅక్కయ్యను వెతకసాగాయి. రైలు ఆగింది. నాన్న దిగారు. గబ గబా ఆ పెట్టె దగ్గిరికి వెళ్ళాను. అక్కయ్య కనబడలేదు. ఉసూరుమంటూ నాన్న వైపు చూశాను.

"అక్కయ్య రాలేదు" అన్నారు నాన్న. ఆదుర్దాగా, బిక్క మొహంతో నాన్నతో ఇంటికి వెళ్ళాను. దార్లో నాన్న ఏం చెప్పలేదు. అమ్మకూడా ఆదుర్దాగా అడిగింది. నాన్న చెప్పలేక చెప్పలేక అన్నారు.

"అల్లుడు పరిస్థితి నాకు నచ్చలేదు. ఆయన ఎవరో కాలేజీ అమ్మాయితో ఉంటున్నాడు. ఆ పిల్లను ఇంటికే తీసుకొస్తాట్ట. అమ్మాయిజానకి చిక్కి శల్యమైపోయింది. కళ్ళల్లో ఉన్నయ్యి దాని ప్రాణాలు..." ఇంక వినలేకపోయాను. గది లోకి వెళ్ళి భోరున ఏడ్చాను. చేతుల్తో తల బాదుకున్నాను. మనస్సు వికలమైపోయింది. కళ్లు తిరిగినయ్యి. దిగాలుపడి కూర్చున్నాను. నాన్న ఇంకా అమ్మతో ఇట్లా చెప్తున్నారు. "సీతను కొన్నాళ్ళపాటు పంపమంది. సీత ఉంటే కాస్త మన శాంతి ఉంటుందిట. జానకిని చూస్తే నా కడుపు తరుక్కు

పోతున్నదే. నువ్వూ, సీతా వెళ్ళండి. అన్యాయంగా దాని గొంతు కోశాను. అసలు దాన్ని చూస్తుంటే మన జానకేనా అనిపించింది. రేపే బయల్దేరి వెళ్ళండి."

# 8

అమ్మ గోల చెప్పటానికి వీల్లేదు. ఆవిడ గుండెల్లో రాయి పడ్డది. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు గుంటూరు పోదామా అనిపించింది.

అమ్మను తీసుకుని గుంటూరు వెళ్ళాను. ఇంటికి వెళ్ళగానే జానకిని చూచి అమ్మ కావిలించుకుని ఏడ్చింది. దాని తల, చెంపలు, చేతులూ, ఆప్యాయంగా, ప్రేమతో నిమిరింది. అక్కయ్య అమ్మను ఓదార్చి "కంట తడిపెట్టవద్దు, ఇంకా నేను బ్రతికే ఉన్నానమ్మా!" అన్నది. ఆ మాట అంటూ నావైపు చూసింది. దాని జీవితమంతా సినిమా రీలులా నా కళ్ళముందు కనిపించింది. అక్కయ్య తెలుగువారి ఆడబడుచు. మానాభిమానాలుగల స్త్రీ మూర్తి. పవిత్ర భారతదేశంలో పుట్టి, పవిత్రమైన ఆదర్శాలకు, సాంఘిక కట్టుబాట్లకూ తల వంచి, పవిత్ర భావాలతో, ఆదరాభిమానాలు ఎంతమాత్రం చూపని భర్తతో కాపురం చేస్తున్నది. ఇంటరులో అదిసంపాదించుకున్న ఫస్టు క్లాసు సర్టిఫికేటుగాని, ప్రిన్సిపాల్‌గారిచ్చిన కాండక్టు సర్టిఫికెట్లుగాని, లెక్చరర్లూ, విద్యార్థులూ చూపిన ఆదరాభిమానాలుగాని, దాని సంసార జీవితాన్ని తీర్చి దిద్దలేక పోగా, అది ప్రాణాలతో జీవించటానిక్కూడా ఏ విధం

గానూ ఉపయోగ పడలేవేమో అనిపించింది. అక్కయ్య ముఖంలో ఆనాటి కాంతి రేఖలు శాశ్వతంగా తొలిగిపోయి నయ్యి. నిరాశ, నిస్పృహ గూడుకట్టుకుని కాపురం చేస్తు న్నాయి.

మేం వెళ్ళేసరికి బావ ఇంట్లోనే ఉన్నారు. నన్ను చూడగానే నవ్వుతూ ముఖావకంగానే పలకరించారు.

“కులాసాగా ఉన్నారా బావా! అక్కయ్యను చూస్తా నంటే అమ్మను తీసుకువచ్చాను” అన్నాను.

“అట్లాగా! మావగారు కులాసాగా ఉన్నారా? వెళ్ళే రోజున వారు కొంచెం సుస్తీగా ఉన్నట్లు కనిపించారు సరే వస్తా” అంటూనే వెళ్ళిపోయారు.

అమ్మ నాలుగు రోజులుంది. అన్ని విషయాలూ అమ్మతో చెప్పింది జానకి. అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. అమ్మ మనస్సులో దిగులు పేరుకుపోయింది. కన్నతల్లి మనస్సు అక్కయ్య జీవితాన్ని తల్చుకుని బావమీద కాఠిన్యంతో నిండిపోయింది. ఆవిడ విచారానికి అంతులేదు. కొన్నాళ్ళపాటు నన్ను ఉండమని అమ్మ వెళ్ళింది. మీ అమ్మ ఎందుకు వచ్చిందనిగాని, అప్పుడే వెళ్ళిందేమనిగాని, బావ అనలేదు. అమ్మ ఉన్న నాలుగు రోజులూ ఆయన రావటం రాత్రి పది గంటల తరువాతనే.

ఆ రోజు ఆదివారం. బావ ఇంట్లోనే ఉన్నారు. శల వయినా సాయంత్రం నాలుగ్గంటల దాకా ఉంటం నాకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. సరిగ్గా నాలుగున్నరకు ఒక మ్మాయి వచ్చింది. వస్తూనే బావను పలకరిస్తూ “ఏం

మాష్టారూ! ఇవాళ పాట కచ్చేరి ఉంది మర్చిపోయూరా?"
అని నవ్వుతూ అంటూ అక్కడే కుర్చీలో కూర్చుంది. ఆ
అమ్మాయిని పరిశీలనగా చూశాను. ఆ రోజున సినిమాలో
చూసినమ్మాయే. రమాదేవి. నన్ను ఆఅమ్మాయి చూళ్లేదు.

"వస్తున్నా రమా! పాట కచ్చేరి సంగతి నాకూ
గుర్తుంది నువ్వే వచ్చి పిలిస్తేనేగాని వెళ్ళదల్చుకోలేదు."

"ఆ మర్చిపోయూ. కాస్త జాగ్రత్త. మా మరదలు
సీత వచ్చింది" అన్నారు మళ్ళా.

నాకు తల నరికినంత పనయింది. అక్కయ్యకు ఇదంతా
అలవాటయినట్లుంది ఆ అమ్మాయి రాగానే ఒక్కసారిచూచి
కళ్లు తుడ్చుకుంది. అభిమానంకల ఆడదానికి తన భర్తతో ఒక
పరాయిస్త్రీ తన కళ్ళ ఎదటనే తనకన్న ఆధిక్యత చూపుతూ
మలుకుతుంటే అంతకన్నా తలవంపు విషయమేముంటుంది?

నేను బావగారి గదిలోకి వెళ్ళాను. నన్ను చూడగానే
రమాదేవి నిర్ఘాంతపోయి లేచినిల్చుంది. గులాబిరంగు షిఫాన్
చీరె కట్టుకుంది. నారింజ రంగు వెల్వేట్ జాకెట్టు తొడు
క్కుంది. లంగాకు కుట్టిన నక్షత్రాల్లాంటి చెమ్కీ పూలు
చీరెలోంచి నన్ను చూసి నవ్వుతూ మెరుస్తున్నయ్యి.

"కాలేజీలో మాశిష్యురాలు రమాదేవి ఆ అమ్మాయి
సీత, మా మరదలు" అంటూ ఒకరి కొకరు పరిచయం
చేశారు బావ. నాకు వళ్లు మండిపోయింది.

"నమస్కారమండీ" అన్నది రమాదేవి. ప్రతి నమ
స్కారం చేస్తూనే తీక్షణంగా రమాదేవిని చూశాను. రమా
దేవి ఖంగారుపడి తలొంచుకుంది.

బావతో కలిసి రమాదేవి వెళ్ళిపోయింది వాళ్లిద్దరూ వెళుతుంటే నా మనస్సులోని ఆవేదన పెల్లుబికి, శరీరం వణికి పోయింది. అక్కయ్య ఆక్రమించవలసిన స్థానం రమాదేవి ఆక్రమించింది. వాళ్ళు వెళ్ళాక నాకు వళ్ళు తెలీలేదు.

"జానకీ! బావ అట్లా చెడిపోవటానికి నువ్వే కారణమే. అట్లా మొద్దులా చూస్తూ ఊరుకోవడంనుంచే బావ అట్లా తయారయారు. నీ కాపురం బాగు చేసుకోవటం నీకు చేతకాదు· నువ్వు సుఖ పడలేవు. ఒకళ్ళను సుఖపెట్టలేవు. పిల్లి చాలా సాత్వికమైన జంతువు. ఎంతచేసినా 'మ్యావ్' మంటూ తోక ముడుచుకుని వెళ్ళిపోతుంది. తలుపులన్నీ వేసి కర్ర తీసుకుంటే ఇంక ఏం చేస్తుంది? గుడ్లు పీకుతుంది. నువ్వు పిల్లిలావుంటే, బావ ఇంకా చెడిపోతారు నేను అవివాహితను. నేను చెప్ప రానివి, చెప్పకూడనివి ఎన్నో విషయాలుంటయ్యి. భర్త చెడు మార్గాన పడుతున్నా తీర్చి దిద్దుకోని భార్య ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే" అన్నాను, ఏం మాట్లాడు తున్నానో నాకు తెలీలేదు.

"అక్కయ్యా" అంటూ బావురుమని అక్కయ్యని కావిలించుకున్నాను. నా మనస్సులోని ఉద్వేగం కట్టలు తెంచుకుంది. నేను ఏడ్చినంతగా అక్కయ్య తన విచారాన్ని వ్యక్తం చేయలేదు. నాకు ఆశ్చర్యం కలిగింది— అగ్ని పర్వతము బ్రద్దలయినా ఇంకా ఇంత నిదానమేమిటా అని. కళ్ళు తుడుచుకుని అక్కయ్య ముఖంలోకి చూశాను నన్ను చూస్తూ "సీతా ఎందుకే నువ్వేడుస్తావు?" అంటూ నీరసంగా నవ్వింది.

అక్కయ్య అంత క్షమాగుణం, ఓర్పు, ధైర్యంతో కష్టాల్ని ఎదుర్కోవటం ఎట్లా నేర్చుకున్నదా అనుకున్నాను.

"నా జీవితంలో అన్ని ఆశలూ అణగారి పోయినయ్యే సీతా. ఏడ్చినా కన్నీళ్లు రావు. నాలోని కన్నీళ్లుఎప్పుడో అయి పోయినయ్యి. అన్ని కోరికలూ, అన్ని కాంక్షలూ, అంత అను రాగమూ, అన్ని ఉద్రేకాలూ, అన్ని ఉద్వేగాలూ చంపు కున్నాను. ఈ పొట్టలో పిండం కదులుతుంటే అన్ని కష్టాల్ని మర్చిపోతున్నాను. అన్ని అవమానాల్నీ చిరునవ్వుతో ఎదు ర్కొంటున్నాను. అన్ని అనుభూతుల్నీ, అన్ని కోరికల్నీ సరి పెట్టుకొని తృప్తిపడుతున్నాను. వాటిమీద ఎన్నో కోరికలూ, కాంక్షలూ, అనురాగమూ ఉన్నయ్యి. ఏం లాభం? ఏమను కుని తృప్తిపడను? ఎన్నాళ్ళని అన్నం నీళ్లు మానను? తిండి మానేస్తే ఈ పొట్టలోని వాడి గతి? వాడికీ వాళ్ళ నాన్న పోలిక వస్తే అప్పుడు నా క్షోభ ఉండనేఉన్నది ఇప్పట్నుంచే వాడి విషయమైకూడా ఎట్లా అనుకుని బాధపడను. అయినా ఈ కాన్పు సవ్యంగా అయి మళ్ళా బ్రతికి బయటపడినప్పటి సంగతికదా? అందాకా నువ్వయినా తోడుగా ఉంటావని నాన్నను బ్రతిమాలాను. అమ్మతో ప్రాధేయపడి అడిగాను. అమ్మా, నాన్నా వింటారనే నమ్మకంతో ప్రాధేయపడ్డాను. మీ బావతో ప్రాధేయపట్టమే కాదు, ప్రాణాలు వదుల్తాననే అన్నాను. కన్నీటితో వారి పాదాలు కడిగాను మనస్సు కరిగేటట్లు చెప్పుకున్నాను. నా అనుభవాలు తల్చుకుంటే నాకు ఏడుపు రావడంలేదు. గుండె రాయిగా మారిపోయింది. మనస్సులో ఏ అనుభూతులూ, ఏ కాంక్షలూ, ఏ కోరికలూ

కలగడంలేదు ఒక్కటే ఆశ ఒక్కటే కోరిక, ఒక్కటే బాధ. నువ్వు బావను తీర్చిదిద్దగలవే సీతా! బాగుపడితే నీ ద్వారానే వారు బాగుపడాలి. లేకపోతే నువ్వూ ఒక అభాండాన్ని నెత్తినవేసుకుని పోతావు. నా అదృష్టం ఈ రీతిగా ఉన్నదా, నీ అదృష్టం ఎట్లు ఉందో చూడు. ఆ. ఏమీ అనుకోకు సీతా! ఏదో ఆవేదనపట్టలేక అనేస్తున్నాను" అంటూ ఆయాసపడుతూ అన్నది అక్కయ్య అక్కయ్య మాటలు వినేసరికి నాకు ప్రాణం నిర్జీవయిపోయింది ఏం మాట్లాడాలో తోచలేదు.

బావ రాత్రి పదకొండు గంటలకి వచ్చారు. అప్పటి వరకూ అక్కయ్య అన్నం తినకుండా కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఎదురు చూస్తూ కూర్చుంది. వడ్డించలేక వడ్డించలేక బావ కంచంలో వడ్డించింది కూర్చుని వడ్డిస్తున్నా చేతుల్లో బలంలేక పులుసు గరిటె వణికి పులుసంతా ఆయన చేతి మీదా, కాలిమీదా పోసింది చెయ్యి వణికి అంత పని జరిగింది. అక్కయ్య హడలిపోయింది నా మనస్సు గతుక్కుమంది. బావ కోపం పరవళ్లు త్రొక్కింది.

"జానకీ! చూడు, నాకు వడ్డించటానికి కష్టంగా ఉంటే పోయిపడుకో అంత ఇష్టంలేని తిండికావాలని నేనేం ఏడవటం లేదు. నీకు కష్టంగా ఉంటే రేపట్నుంచీ హోటల్లోనే భోంచేస్తాను నువ్వు ఆరు గంటలకల్లా తిని పడుకో. నువ్వు నాకు వంటచేసి పెట్టటంలేదని నేననుకోను. నా అదృష్టం బావుండి ఆ పులుసు వేడిగాలేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే చెయ్యి, కాలూ తాట ఊడేది" అంటూ కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్లారు.

వెనకాలే అక్కయ్య వచ్చింది. నేను గుమ్మంలోనే కూర్చున్నాను.

"చూడండి! నేనేం పొయ్యాలని పొయ్యలేదు. వంట్లో నీరసంగా ఉండి చెయ్యి వణికిపోయింది. మీకు అన్నం వండి పెట్టటానికి కాకపోతే నా జీవితానికి కాలవసిందేముంది? ఇంతసేపూ కనిపెట్టుకు కూర్చుని, నేను ఎంగిలి పడకుండా ఉన్నది దేనికి? మీ కోసం కాదా? మీరసలు పూర్తిగా మారి పోతున్నారు. మీకు కాకపోతే నా గోడు ఎవరికి చెప్పుకోను? నా వంట్లో ఏమీ స్రాణ లేదు. అందుకు నేను బాధపట్టం లేదు. మీ గౌరవం పోతున్నదనే నా మనస్సులో బాధ. లోకం కోడయికూస్తున్నది ఆ రమాదేవి స్నేహంమానండి. అంతకన్నా నేను కోరేది, కోరదగింది ఏదీ లేదు" అన్నది అక్కయ్య

"అయిందా లెక్చరు జానకీ ఒక్కటే చెప్తున్నా. నా స్వంత విషయాలలో నువ్వు జోక్యం కలగచేసుకోవద్దు. నీకు కష్టంగా ఉంటే రేపే వెళ్ళు ఏలూరు. సీత వచ్చిందిగా. సీతతో వెళ్ళిపో నువ్వు వెళ్ళినందుకు నేను బాధపడను. పురి టికి ఎట్లాగూ వెళ్లాలిగా రేపే వెళ్లు. రమాదేవి విషయం ఎత్తకు. ఆ పిల్ల కాలి గోరుకుకూడా నువ్వు సరిపోవు. ఆ అమ్మాయి అరికాలునున్న అదృష్టం నీ ముఖానకూడా లేదు. ఎక్కడో రాసిపెట్టి ఉండడం నుంచి ఆ చదువు అబ్బిందిగాని, నీలో ఏం చూసి చేసుకున్నానో నేను ఆలోచించుకుంటే ఇప్పటికీ అర్థం కావటంలేదు. ఇకనుంచీ నువ్వు నాకు ఏ సలహా చెప్పనక్కర్లేదు. నా మంచి చెడ్డలు నాకు తెలుసు. నా

సుఖం నేను చూసుకుంటాను. నా క్లిష్టమైన, నన్ను ఆశించిన వారిని సంతోషపెడతాను. నాకు ఎవరియందు ఇష్టత ఉంటే వారితోనే ఉంటాను. కడుపుతో ఉన్నదానివని కనికరించి మంచిగా చెప్తున్నాను. ఇప్పట్నుంచీ నీ పురిటి ఏర్పాట్లు నువ్వే చూసుకో. నన్ను గురించి నువ్వేమీ బాధపడకు'' అన్నారు బావ. అన్నీ నాకు వినబడుతూనే ఉన్నయ్యి. ఆడదాని జీవితానికి అక్కయ్య గీటురాయి.

''మీ స్వంత విషయాలంటే నేను జోక్యం ఏనాడూ కలిగించుకోను. పండంటి కాపురంలో కారుచిచ్చు పెట్టి, ఒక అప్రాచ్యురాలు నా స్థానాన్ని ఆక్రమించి, నా భర్తని తన చేతిలో కీలు బొమ్మగా చేసుకుంటే చూస్తూ ఊరుకోమంటారా? నేనే కాదు, ఎవ్వరూ దీన్ని హర్షించరు. ఏ భార్యా తన భర్త స్త్రీ లోలుడయితే సహించదు. ఇది మీ స్వంత విషయం కాదు. మన స్వంత విషయం. మన కాపురం విషయం. మన సంసార విషయం. ఈ విధంగా మీరు మారిపోతుంటే నా మనస్సు ఎంత క్షోభిల్లుతున్నదో ఆ పరమాత్ముడికే ఎరుక. దాని అరికాలునున్న అదృష్టం నా ముఖాన లేదన్నారు నిజమే. చెడిపోయిన ఆడదాని అదృష్టం అరికాల్లోనే ఉంటుంది. అరికాల్లో అదృష్టం ఉంటంనుంచే అదట్లా చెడి తిరుగుతూ మిమ్మల్ని తన చుట్టూ తిప్పుకుంటూ మిమ్మల్ని సర్వనాశనం చేస్తున్నది. చదువుకున్నవారు, పదిమందికి చెప్పగలవారు...'' అక్కయ్య చెంప ఛెళ్ళుమంది. నా గుండె ఝల్లుమంది. గదిలోకి వెళ్ళాను. అక్కయ్య చెంప అట్లాగే పట్టుకుంది. గుడ్లనీళ్ళు గుడ్లగుక్కుకుని ఆయాసపడుతూ

ఇవతలకి వచ్చింది బావ తలుపులు గడియవేసుకున్నారు. అక్కయ్యకు నోట మాట రాలేదు. "బావ మనస్సూ, అక్కయ్య సంసార జీవితమూ తల్చుకుంటే పెళ్ళనే తతంగానికి అసలు అర్ధంలేదనే అనిపిస్తున్నది. ఆదరణలేని భర్తతో అగచాట్లు పడుతూ, వ్యక్తిత్వాన్నిచంపుకుని, లోకానికి తలొగ్గి, మానానికి మగ్గి, అవ్యక్త వ్యథల్ని అనుభవిస్తూ, నరనరాల్లోని నరక బాధల్నీ పళ్ళబిగువుకు అణిచి పెట్టుకుని, మంగళసూత్రాల్నీ, మట్టెల్నీ, నల్లపూసల్నీ చూసుకుని నేనూ నా భర్తతో కాపురం చేస్తున్నానని ఆత్మవంచన చేసుకుని, నికృష్టజీవితాన్ని గడిపేకన్నా, క్షణిక సుఖాన్ని మనస్సులోకి రానీయక, నిజాయితీగా ఏ ఉద్యోగమైనా చేసుకుంటూ, గౌరవంగా బ్రతకటమే ఆడది తన జీవిత పరమార్ధంగా తలచి, ఆ రకంగా జీవించగలిగితే, అంతకన్నా సుఖమయ జీవితం లేదు. పెళ్లి కొచ్చిన ఏ పెద్దలూ ఇలాంటి సంసారాన్ని తీర్చి దిద్దలేరు. వంకలుపెట్టి వ్యాఖ్యానించి పోవడం తప్ప

అక్కయ్య జీవితం నన్నెంతో కుంగదీసింది. ఆడదాని జీవితంలో సుఖ సంతోషాలకన్నా ఆత్మ వంచన జాస్తి. ఆత్మ వంచన చేసుకుంటే ఆడది తన కాపురం బయట పడకుండా జీవించ గలిగేది. అంతరాంతర కల్లోలాన్ని దిగమింగి, ఆత్మ పరిశీలన చేసుకోక 'అహాహాహో' అని నవ్వుతూ ఎవరి భర్తని వాళ్లు వెనకేసుకుని జీవించగలిగితేనే ఆ భార్యాభర్తలు సంఘం దృష్టిలో చిలకా, గోరింకల్లా ఉన్నట్లుగా అనుకుంటారు. అదే సంసారం. అదే ఆదర్శ గృహిణి జీవితం. అదే దాంపత్యానికి గీటురాయి. అదే చక్కగా, ముచ్చటగా

కాపురం చెయ్యటం. ఛీ! ఆడదాని జీవితం ఎంత నికృష్టమై నదో, ఎంత ఆత్మవంచనతో కూడుకుని ఉందో ఈనాటికి నాకు అర్థమైంది" అనుకుని వాపోయాను ఆ రోజున.

అక్కయ్య సొమ్మసిల్లి పడుకుంది. దాని చెంపమీద కన్నీటి చారలు శాశ్వతంగా దాని ఏర్పర్చుకున్నయ్యి. ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. కళ్ళు మూసుకుంటే రమాదేవి కనుపించసాగింది. దానివెనకనే విచారంగా అక్కయ్య నిల్చుని ఉండేది. రెప్పవాల్చకుండా కూర్చున్నాను. నా పద్దెనిమిదేళ్ల జీవితంలో ఎనభై ఏళ్ళ సంసార జీవితాన్ని నా కళ్ళతో చూశాను.

ఆరోజునుంచే అక్కయ్య మంచమెక్కింది. దాని పన్లు ఆది చేసుకోవటంలోకూడా జాడ్యం, నిర్లక్ష్యత, నిరాశ, కన బరుస్తూ ఏదో చావలేక, బ్రతుకుతున్నట్లుగానే ఉంటున్నది. వంటకూడా నేనే చేస్తున్నాను. బావకు మాత్రం లేని వోపిక తెచ్చుకుని నిదానంగా వడ్డిస్తున్నది. డాక్టరుకు చూపించారు బావ. డాక్టరుమాత్రం ఏం చెపుతాడు? పడికట్టు పదాలు చెప్పి, మందులూ. ఇంజక్షన్లూ మామూలుగా ఇస్తున్నాడు. అంతకు మినహా అక్కయ్య ఆరోగ్యం విషయంలో బావ తీసు కున్న శ్రద్ధాసక్తులేమీ లేవు లేడీ డాక్టర్నికూడా పిలిపించి పరీక్ష చేయిస్తే ఆవిడ అంతా బాగానే ఉన్నదనీ బలానికి టానిక్కులు, ఇంజక్షన్లూ తీసుకోవాలనీ, విశ్రాంతి అవసరమనీ ఒక మందుల జాబితా రాసిచ్చింది. అంతకన్నా తను చేయ గలిగిందేమీ లేనట్లుగా ఊరుకున్నారు బావ. వారానికి రెండుసార్లు అక్కయ్యతో లేడీ డాక్టరు ఆస్పత్రికి వెళ్ళటం,

ఇంజక్షను కాగానే మళ్లా రిక్షా ఎక్కి మందు సీసా చేత్తో పుచ్చుకుని రావటం. కడుపుతో ఉన్న వాళ్ళ దిన చర్యల్లో ఇదొకటి. అక్కయ్యకు మాత్రం కడుపుతో ఉన్నాననే సంతోషంగాని, తల్లిని కాబోతున్నాననే ఉత్సాహంకాని, మందు తీసుకుంటున్నాననే తృప్తికాని లేదు. ఆసుపత్రికి వెళ్ళినా, రిక్షాలో కూర్చున్నా, ఇంట్లో ఉన్నా ఏదో పరధ్యాన్యం, దిగులు. బావ దృష్టిలో మాత్రం తన భార్య కడుపుతో ఉండంగానే చక్కగా మందులూ, ఇంజక్షన్లూ ఇప్పించి ఏ లోటూ లేకుండా దాని ఆరోగ్యం కాపాడుతున్నాననే సంతృప్తి చుట్టుప్రక్కల అమ్మలక్కలు మొదటి కానుపుకే, అయిదోమాసం నుంచే ఎంతశ్రద్ధగా ఆవిడ మొగుడు మందూ మాకూ ఇప్పించి ఆపేక్షగా చూసుకుంటున్నాడమ్మా, అని అనుకోవటమూ. ఏమిటో ఈ ఆత్మవంచన ఇంట్లో భర్తచేత చీవాట్లూ, దెబ్బలూ తింటూ, తిరస్కారంతో, మానసిక వ్యధలతో కుళ్లి కృశించిపోతోందని ఎవరికి తెల్సు? చక్కగా తల దువ్వుకుని, మంచి బట్టలు కట్టుకుని, ఉన్న నాలుగు నగలూ పెట్టుకుని నేనూ, అక్కయ్య రిక్షాలో ఆస్పత్రికి పోతుంటే చూసేవాళ్ళకు అదీ ఒక అందంగానే కనబడుతుంది. మా మనసుల్లో, హృదయాంతరాళాల్లో ప్రజ్వరిల్లి భగ భగ మండే అగ్ని పర్వతాల విషయం ఎవరికి తెల్సు? అక్కయ్య లాంటివారు ఎంతమందో ఈ దేశంలో, ఈ పవిత్ర భారత దేశంలో?

అక్కయ్య రాలేకపోతే ఒక రోజున మందు తీసుకు రావటానికి నేను ఆస్పత్రికి వెళ్ళాను. మందు తీసుకుని వస్తుం

డగా రమాదేవి కనిపించింది. నాకూ పలకరించటానికి ఇష్టం లేకపోయింది. ఎదుట పడగానే రమాదేవి పలకరించింది.

"అక్కగారికి కులాసాగా లేదా?"

"లేదు. వంట్లో బాగా లేదు."

"ఎన్నో మాసం?"

"అయిదో మాసం పూర్తి కావస్తోంది."

"పురిటికి ఏలూరు తీసుకు వెళతారా?"

"ఇంకా ఏం ఆలోచించుకోలేదు."

"ఒకసారి మా ఇంటికి రండి. బ్రాడీపేట, పద్నాలుగో అడ్డరోడ్డు, రెండో లైను."

"అట్లాగే. రేపు సాయంత్రం అయిదు గంటలికి వస్తాలెండి."

"తప్పక రావాలి" నవ్వుకుంటూ వెళ్ళింది

నాలో ఏవో ఆలోచనలు దొర్లిపోతున్నాయి. రమాదేవిని మార్చగలనా? చివాట్లు తిని రాగలనా? నిండా మునిగిన వాడికి చలేమిటి?

మర్నాడు సాయంత్రం అయిదున్నరకు రమాదేవి ఇచ్చిన అడ్రసు ప్రకారం వెళ్ళాను. పెద్ద మేడ. ఎన్నో పూల మొక్కలూ, రకరకాల చెట్లూ, పాదులతో చూడ ముచ్చటగా ఉంది. నే వెళ్ళేసరికి వరండాలో ఈజీ చైర్‌లో పడుకుని, కాళ్ళూగిస్తూ, జారిపోయిన పమిటైనా చూసుకోకుండా "అల్సేషియన్" కుక్కతో ఆడుకుంటూన్నది రమాదేవి. నన్ను చూడంగానే లేచి నవ్వుతూ ఆహ్వానించింది ఆకుక్కను గొలుసుతో స్థంభానికి కట్టేసి సాదరంగా ఆహ్వానించింది.

"రండి మేడమీద కూర్చుందాం" అంటూ దారి తీసింది. వెనకాలే నేనూ మేడమీదకి వెళ్ళాను. రమాదేవి గది లోనే ఇద్దరం చెరో కుర్చీలో కూర్చున్నాం. గది నాలుగ్గోడలకూ రకరకాల చిత్రపటాలూ, రమాదేవి ఫొటోలూ ఉన్నయ్యి. అంతా రోజ్ ఉడ్ ఫర్నిచర్. రెండు అద్దాల బీరువాలు, రెండు డ్రాయర్లు, ఒక డ్రెస్సింగ్ టేబిల్, నాలుగు కుర్చీలు రెండు ఈజీచెయిర్లు, రెండు బట్టలస్టాండులు, వాటిమీద బట్టల దుకాణాల్లో అలంకరించినట్లు సిల్కు చీరెలు, జాకెట్లు, డ్రెసరీసు పడేసి ఉన్నయ్యి. ఒక పందిరి మంచం, బూరగ దూది పరుపు, దోమతెర అంతా సినిమా సెట్టింగులా ఉంది. ఆ సెట్టింగులో నాయిక రమాదేవి, ఆమె స్నేహితురాలు నేను.

"కాలేజీనుంచి వచ్చి ఎంతసేపయింది?" అన్నాను.

"చాలాసేపయింది. ఇవ్వాళ లాస్టవరు లేదు" అన్నది.

"మీరు చాలా అదృష్టవంతులు."

"ఏం?"

"మీగది చూస్తేనే తెలుస్తున్నది. ఇంట్లో మీ మాటకు తిరుగు లేదనుకుంటాను. చక్కగా చదువుకుంటున్నారు. సుఖప్రదమైన జీవితం గడుపుతున్నారు. కోరితే కొండమీది కోతినికూడా తెచ్చుకోగలరు" అన్నాను.

నిరాశగా నవ్వింది రమాదేవి.

"నా చదువు చూసీ, నా గది చూసీ, నా బట్టలు చూసీ అంతా అట్లాగే అనుకుంటారు. ఏవ్యక్తీ, ఆడదయినా మగవాడయినా అరడుగులకు మించి ఉండరు. కాని వాళ్ళ

జీవిత సంఘటనలు మాత్రం కొన్ని కొన్ని మైలు రాళ్లు, మరి కొన్ని గోపురాలు, కొన్ని శిఖరాగ్ర సన్నివేశాలు, కొన్ని గోతులు. అంతా కలిపి చూస్తే కొన్ని వేల అడుగుల సినిమా రీళ్ళు. ఏమంటారు?" నిర్లిప్తతగా అడిగింది రమాదేవి.

"నిజమే మీరూ అట్లా అంటే ఎట్లా? ఇంక మాబోటి వాళ్ళ జీవితాలు? డబ్బుగలవాళ్ళే అట్లా అనుకుంటే మధ్య తరగతి కుటుంబీకులు ఎట్లా అనుకోవాలి? ఎంత నిరాశపడాలి?" అన్నాను.

"ఆశలు పెట్టుకుంటేనే నిరాశలు కలుగుతయ్యి. మంచి చెడ్డలు, తర్క వితర్కాలు, పాత పురాణాలూ వల్లిస్తుంటే అడుగడుగునా నిరాశ కలుగుతూనే ఉంటుంది. ఏ ఆలోచనా లేకుండా ఉంటే ఏ బాధా ఉండదు. వచ్చే బాధ రాకా తప్పదు. పరమశివు డంతటివాడు శని ప్రభావంవల్ల మర్రి చెట్టుతొర్రలో దాక్కున్నాడు. ఆ కైలాసాన్ని విడిచి రావల సిన గతి ఆయనకేం పట్టింది? ఆలోచిస్తే నిరాశలేని ఆశ ఎక్కడా లేదు. పూర్వ కాలంలో పెద్దమనిషి కాకుండానే ఆడ పిల్లలకు పెళ్ళి చేసేవారు. పెద్దమనిషి కాగానే తిథి, వార, నక్షత్రాలు చూసి, శుభలేఖలు పంపి, వేడుకలు జరిపి, శాంతి చేయించేవారు. ఎంతో తతంగం చేయించేవారు. అంత జాగ్రత్తగా, వేదోక్తంగా ప్రతి విషయంలోనూ శ్రద్ధ తీసు కుని ఆడపిల్లల్ని అత్తవారింటికి పంపినా ఎంతో మంది వైధ వ్యాన్ని అనుభవించారు. కోడంటికం చవి చూశారు.

భర్త వదిలిపెడితే పుట్టిళ్ళకు చేరారు. పెళ్ళికాకుండా పెద్దమనిషయితే ఏ లోటూ లేదు ఏ శుభలేఖలూ లేవు. ఏ శాంతులూ లేవు. ప్రేమ కలాపాల్లో దిగినవారికి ఏ ముహూర్తాలూ అక్కర్లేదు. ఏ ముత్తయిదువలూ అక్కరలేదు. ఏ మంత్ర తంత్రాలూ అక్కర్లేదు. అంతా సవ్యంగానే జరిగిపోతుంది" అన్నది రమాదేవి. కళ్ళార్పకుండా నా వైపు చూసింది.

"నాటి మంచి చెడ్డలు ఇప్పుడు తెలియవుగా. జరిగినంత కాలం బాగానే ఉంటుంది. నలుగురి నోళ్ళల్లోనూ పడి అందరి దృష్టిలోనూ నీచంగా చూడబడి నప్పుడు మనల్ని ఎవ్వరూ ఆదరించరు. భర్త కొట్టినా, గౌరవంగా సానుభూతి చూపుతారు. పరాయివాళ్లు చెయ్యి చేసుకుంటే దాని పొగరు అణిగిందంటారు. రెంటిలోనూ తేడా లేదా?" అన్నాను

"పొరబాటు. మా అక్కయ్య పేరు శకుంతల. 'కార్యేషుదాసి, కరణేషుమంత్రి, శయనేషురంభా, క్షమయా ధరిత్రి' అన్న సూత్రాల్ని అక్షరాలా పాటించింది. అయిదేళ్ళు కాపురంచేసి, అష్ట కష్టాలూ మా బావ చేతిలో పడి, చివరకు భర్త చేతిలోనే బ్రాందీ సీసాతో తలమీద కొడితే తల పగిలి ఈ లోకాన్ని శాశ్వతంగా విడిచింది. ఇరవై వేలు కట్నం. అయిదు రోజులు పెళ్ళి. ఏనుగు అంబారీ ఊరేగింపు. బాణ సంచాల సంరంభం. చుట్టాల ముచ్చట్లు. మంత్రులూ, అధికార్లూ, ఎమ్మెల్యేల ఆశీస్సులు, డిన్నరు పార్టీలు, పూల దండలతో మునిగి తేలటం. అయిదు వేల రూపాయల ఇంటిసామాన్లతో, పదివేల రూపాయల నగలూ,

వెండి సామాన్లతో, వంద పట్టు చీరలూ, సిల్కు చీర్లతో దేదీప్యమానంగా కాపురానికి వెళ్లింది. మా బావ గజిటెడ్ ఆఫీసరు. అంత అనుకూల దాంపత్యం లేదన్నారు. చిలకా గోరువంకలన్నారు. కన్నుల పండువుగా చూడ ముచ్చటయిన దాంపత్యమన్నారు. రతీ మన్మథు లన్నారు. అయిదేళ్ళలో ఏభై సంవత్సరాల అనుభవం గడించి ఆఖరికి బ్రాందీ సీసా దెబ్బతో తల పగిలి చచ్చింది. మా అక్కయ్య ఎంత అదృష్ట వంతురాలో చెప్పండి?" అన్నది రమాదేవి. కళ్ళంట బొట బొటా నీళ్ళు కారినయ్యి. నా మనస్సుకూడా బాధ పడింది. శకుంతుల మా అక్కయ్యకన్న రెండాకులు ఎక్కువే చదివింది.

"ఏమంటారు సీతా?" అన్నది కళ్ళు తుడ్చుకుంటూ.

"ఏమంటాను. మీ తల్లి దండ్రులు చాలా దురదృష్ట వంతులంటాను. మీ అక్కయ్య అదృష్టహీనురా లంటాను" అన్నాను.

"ఇంక మా వదిన. ఆవిడ ఎప్పుడూ, ఇప్పుడే అమె రికానుంచి విమానం దిగి విమానాశ్రయం నుంచి "రోల్సు రాయిస్" కారులో వచ్చినట్లు మాట్లాడుతుంది. ఏ పనీ ముట్టుకోదు. ఇద్దరు పిల్లలూ దాసీల చేతుల్లోనే పెరుగు తారు. ఎప్పుడూ క్లబ్బులూ, సినిమాలూ, స్నేహితులూ, ఆఫీసర్ల భార్యలతో కబుర్లూ, విందులూ విలాసాలూ, హాలీ వుడ్ తారల అలంకరణ. రాత్రి పదింటికి ఇంటికి రావటం. రాగానే పిల్లలు మేలుకునుంటే ఒక్క అయిదు నిమిషాలు ముద్దులాడి వాళ్లను నిద్రపుచ్చటం. ఆవిడగారొచ్చేసరికి వాళ్లు నిద్రపోతే అదీ లేదు. అన్నయ్య ఆవిడగారి బట్లరు

ఆవిడగారి ఆజ్ఞ పాలించి, ఆచరించటమే ఆ మగధీరుడి కర్తవ్యం. ఆవిడ మధ్యాహ్నంపూట నిద్రపోతుంటే, దాసులు ఇంటికి వెళితే, ఆ పిల్లలు గొడవచేస్తే, ఆవిడగారికి నిద్రా భంగం కలక్కుండా వాళ్ళ సౌకర్యాలు తనే చూస్తాడు. నిద్ర లేవంగానే కాఫీ కావాలా "వేణీ" అంటాడు. ఆవిడగారి పేరు కృష్ణవేణి. మరి ఆవిడా కట్టుకున్న భార్య. అగ్నిసాక్షిగా వేదోక్తంగా పెళ్ళయిన దంపతులు ఆవిడా మనబోటి ఆడదే. మరి అక్కయ్య జీవితానికి, వదిన జీవితాన్ని పోల్చి చూస్తే ఎవరి కయినా ఆశ్చర్యం కలక్క మానదు. ఏమంటారు సీతా!" అన్నది రమాదేవి.

"నిజమే. ఆడవాళ్ళలో మేథకురాలు మీ అక్కయ్య. మగసిరిగల ఆడది మీ వదిన ఇద్దరికీ తూర్పు పడమరల కున్నంత తేడా ఉన్నది. మీ బావ తన తప్పు తెల్సుకు న్నారా?" అన్నాను.

"తప్పు తెల్సుకోవడం అరెస్టు కావడం. ఆ విష యాలు అట్లా ఉంచండి. ఒక ఇంట్లోనే ఇంత తారతమ్యంగల వాళ్ళను చూస్తుంటే అసలు ఎవరు నమ్మదగినవాళ్ళో? ఎవరు నమ్మతగనివాళ్లో? మగవాళ్ళ మనస్తత్వాలు చదువును బట్టి ఉంటయ్యా? ఉద్యోగాన్ని బట్టి ఉంటయ్యా? డబ్బును బట్టి మారుతూ ఉంటయ్యా? ఆ వచ్చిన ఇల్లాల్నిబట్టి ఉంటుందా? ఆమె అందాన్ని బట్టి ఉంటుందా? ఎంత ఆలోచించినా నా కేమీ అర్థం కావటంలేదు. అక్కయ్య చావుతో అమ్మ మంచమెక్కింది. అసలు నా పెళ్ళి విషయం నాన్న తలపెట్ట టమే లేదు నేనూ పెళ్ళిచేసుకో దల్చుకోలేదు. మగ వాళ్ళ

మనస్తత్వాలు పూర్తిగా తెల్సుకోవాలి. ఎవరిని నమ్మవచ్చు? ఎవరిని నమ్మకూడదు? అసలు మగవాళ్ళని అర్థంచేసుకునే దెట్లా? నాకు తెల్సుకొన్నకొద్దీ ఒక నిర్ణయం దొరక లేదు. వాళ్లతో స్నేహంచేసి, వాళ్ళను తిప్పుకుని, వాళ్ళ అంతర్యాలు తెల్సుకుని నా వివాహ విషయంలో ఒక నిర్ణయానికి రావాలనుకున్నాను. మీ బావగారు రామారావు గారు మా కాలేజీలో లెక్చరరు. ఆయనంటే విద్యార్థులందరికీ ఎంతో గౌరవం చక్కగా చిరునవ్వుతో పాఠాలు చెప్పి, క్లాసులో అందర్నీ ఆకట్టుకుంటారు ఎంత పొగరుబోతు విద్యార్థికూడా రామారావుగారి క్లాసులో కుదురుగా కూర్చుని ఆయన చెప్పింది వింటాడు. ఆయనకు అంతా నమస్కారం చేస్తారు ఇతర లెక్చరర్లకూ, ప్రిన్సిపాలుకూ ఆయనంటే ఎంతో గౌరవం. అంత పేరు ప్రతిష్టలు గలవారు విద్యార్థినిగానే వారితో నాకు పరిచయమైంది. చక్కగా, సరళంగా నవ్వుతూ మాట్లాట్టం నుంచి స్నేహమయింది. అంత వరకే మా స్నేహం. కాని, లోకం మా స్నేహాన్ని పొడిగించింది. అంటే స్నేహం ప్రేమగా మారిందనుకున్నారు ప్రేమ సరస సల్లాపాలుగా మారిందని అంచనా వేసుకున్నారు. సరస సల్లాపాలతో నా సర్వస్వం వారి స్వాధీనం చేశాననుకున్నారు. నాలాంటి డబ్బుగల కన్నెపిల్ల దొరికినందుకు రామారావు గారి అదృష్టాన్ని కొనియాడారు. నన్ను మాత్రం చెడిపోయిందానికింద లెక్క వేసుకున్నారు. మేమిద్దరం కష్ట సుఖాల్ని చెప్పుకోటానికి, సరదాగా కబుర్లు చెప్పుకోటానికి స్నేహితులమే. ఇద్దరం జాగ్రత్తగా అలౌకిక ప్రలోభాలకు లొంగకుండా,

వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటూ స్నేహంగా ఉన్నాము. కాని నేను ఆడదాన్ని కనుక కట్టు తప్పిందానిగా అంతా తమ మనస్సులో చిత్రించుకున్నారు. రామారావుగారు మగవారు కాబట్టి మంచి ఛాన్సు కొట్టారని సంతోషాన్ని ప్రదర్శిస్తూ, తమకు లేకపోయెనే అని ఈర్ష్య పడ్డారు. మీరూ అట్లాగే అనుకున్నారుగా" అని నిస్సారంగా నావైపు చూసింది. నేను ఆశ్చర్య పోయాను రమాదేవి మాటలు విని. ఇదంతా నాకు కలగా కనబడింది. జీవితాన్ని చూసి ఊహించేకన్న, తెల్సుకుని ఆలోచించటం మంచిదని నా మనస్సుకు తట్టింది.

నేను మాట్లాడక పోయేసరికి మళ్ళీ రమాదేవి చెప్ప సాగింది.

"అవును, అందరితోపాటు మీరూ అనుకున్నారు. అనుకోవటంలో తప్పేమీ లేదు. కాని మీ అక్కయ్య జానకి, ఆవిడ ఎంత ఉత్తమురాలు. అమాయకురాలు. భార్యా భర్తలు ఒకరి నొకరు అర్థం చేసుకోలేకపోయారు. మీ బావను అర్థం చేసుకు నేందుకు తెలివితేటలూ, సమయ స్ఫూర్తీ, చొరవా, మాటకారితనమూ, చలాకీతనమూ ఉండాలి. ఆయన సహృదయుడు మంచివాడు. కాని ఒక్కటే లోపం. అనుమానస్తుడు. ఆయన మనస్సులో అనుమానం నిముషంలోకి కలుగుతుంది. ఆ అనుమానం ఆయన మనస్సులోనుంచి తీసివెయ్యాలంటే కొన్నిమాసాలు పడుతుంది. మీ జానకి లాంటి వారికి కొన్ని సంవత్సరాలుకూడా పట్టొచ్చు. ఆయన మనస్సు అటువంటిది. ఆయనతో ఎన్ని సార్లు, ఏ ఏ విషయాలు మాట్లాడానో తల్చుకుంటే నవ్వో

స్తుంది. రామారావుగారితో స్నేహం నా జీవితానికి గీటు రాయి. ఆయన్ని అర్థం చేసుకుంటే జీవితంలో అనేక విష యాలు తెల్సుకున్నట్లే వారు నాకు సర్వదా పూజనీయులు వార్ని తల్చుకుంటే మనస్ఫూర్తిగా, హృదయ పూర్వకంగా, ఎంతో సంతోషంగా, ఆనందంగా వారితో మాట్లాడాలని పిస్తుంది. అంత సరళంగా సహృదయతతో మాట్లాడుతారు" అన్నది

నాకు వళ్లు మండిపోయింది.

"భార్యని ప్రేమగా చూడలేని వాడు, భార్యని అర్థం చేసుకోలేని వాడు, భార్యతో ఆదరంగా మాట్లాడలేని వాడు, భార్యను హీనాతి హీనంగా చూసి, ఆమెను మనోవ్యధ కలి గించేవాడు, భార్యను కొట్టి, తిట్టి, హింసించే వాడు, వంద మంది ఇతరుల దృష్టిలో మంచి పేరు తెచ్చుకుంటేమట్టుకు, అది భగవంతుడు మెచ్చుడండీ. ఇంట్లో ఈగలమోత, బయట పల్లకీ మోత అన్నట్లుగా, ఇంటి ఇల్లాలు ఆ విధంగా నికృష్ట జీవితం గడుపుతుంటే, ఆయన కులాసాగా, సరళంగా, సహృదయముతో, సరదాగా, మీబోటి స్నేహితు లతో మాట్లాడుతూంటే, ఆ ఇల్లాలికి మనశ్శాంతి కలుగు తుందా? మీ మీద కోపంచేత నేననటం లేదు. భార్యను సహృదయంతో స్వీకరించి, ఆదరించి, సంతోష పెట్టలేనివాడు వందమంది గమా దేవుల్ని స్నేహశీత్వానే సంతోష పెట్టినా ఆ ఇల్లాలి కడుపు నిండదు. ఇంత వరకూ మీరిద్దరూ స్నేహ పూర్వకంగా చక్కగా మాట్లాడుకుంటూ సంతోషంగా ఉన్నారు. మీ సహృదయతకూ, నిజాయితీకీ, వ్యక్తిత్వాన్ని

కాపాడుకున్నందుకూ నేను గర్వపడుతున్నాను. ఈ స్నేహం లోనే ఒక్క ఇల్లాలి కాపురం, ఒక్క దీనురాలి కాపురం, ఒక్క అమాయకురాలి కాపురం నిలబెట్టి, ఆ భార్యా భర్తలు ఆనం దంగా కాపురం చేసేట్లుగా ప్రయత్నించి ఆ ఇల్లాలినిసంతోష పెట్టమని ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నాను. అర్థిస్తు న్నాను, వేడుకుంటూ మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను" అన్నాను. నా కళ్లు నీళ్ళు కమ్మాయి. ఆ కన్నీటి మసకలో రమాదేవి స్థానంలో అక్కయ్యను చూసినట్లయింది కళ్ళు తుడుచుకున్నాను. రమాదేవి వైపు చూశాను. చిరునవ్వుతో కళ్ళార్పకుండా నావైపు చూస్తున్నది. ఆ చూపులో ఉత్సాహం, సంతోషం, ఒక విధమైనఠీవి,దర్పం, కనబడ్డయ్యి. అప్రయత్నంగా రమాదేవికి నమస్కరించాను.

నా చేతులు పట్టుకుని కళ్ళు మూసుకుని వచ్చేకన్నీళ్ళని ఆపుకుంటూ, రుద్ధబోయిన కంఠంతో, "క్షమించండి. అట్లాగే ప్రయత్నిస్తాను" అన్నది.

ఇద్దరం కిందికి దిగాము. వెళ్లలేక వెళ్లలేక వెళ్లాను. జేబురుమాలు అరచేతిలో ఉంచి నోటికడ్డం పెట్టుకుని బిక్క ముఖంతో నావైపే చూస్తూ గేటు వాకిట్లో నిల్చున్నది రమాదేవి. సందు తిరుగుతుంటే బావ వస్తున్నారు. బహుశా వాళ్ళింటికేనేమో అనుకున్నాను.

వారంరోజులుగడిచాక ఒకరోజున బావనాతో అన్నారు,

"సీతా, మీ అక్కయ్య పాపం, ఆ రోజు కారోజుకు నీరసించి పోతున్నది. లేడీ డాక్టరు ఏమన్నది ? మందు మార్పు విషయమై ఏమన్నా చెప్పిందా ?"

బావ ఎందుకిట్లా అడిగారో నాకర్థం కాలేదు. ఒక వేళ రమాదేవి బావతో ఏమయినా చెప్పిందేమోనని అను మాన పడ్డాను.

"డాక్టరమ్మ ఏం చెప్పలేదు. అక్కయ్య మానసికంగా బాధ పడుతున్నదనీ, కడుపుతో ఉన్నవారు ఎంతో సంతో షంగా, ఉత్సాహంగా ఉండాలనీ, ఎప్పుడూ ఏదో విచారంగా ఉంటుంటే, మనిషి కోలుకోవటం చాలా కష్టమనీ చెప్పింది. డాక్టర్లు అట్లాగే చెప్తారు బావా. కుటుంబంలో ఉండే కల తలూ, మంచి చెడ్డలూ వాళ్లకేం తెలుస్తయ్యి చెప్పండి. అయినా అక్కయ్య విషయంలో అవిడ జీవితానికి తోడు ఉత్సాహ మేమిటి ? సంతోష మేమిటి? అసలు ఆడవాళ్లకి అంత సంతోషకరమైన వాతావరణం మగవాళ్లు కల్పించట మేమిటి ? ఆడది అణిగి మణిగి ఉండే బానిస గాని, ఆడ దానికి మానవత్వం, వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం ఇవ్వట మేమిటి? ఏం బావా! ఏమంటారు?" అన్నాను. ఎందుకో బావను చూస్తుంటే నాకు ఒక రకమైన నిరాదరణ కలుగు తున్నది. గౌరవం పోతున్నది. కాని బావ! అక్కయ్య భర్త! తన సర్వస్వం ఆయనేనని భావిస్తున్నది అక్కయ్య. అలాంటి బావ ఎలాంటి వాడయినా అంత నిరాదరణగా మాట్లాటం తప్పే కాని మనస్సు అట్లా అనిపిస్తున్నది. హృదయం ఆక్రోసిస్తున్నది. ఏం చెయ్యాలి? ఆడదాని మాటలకూ, ఆడ దాని జీవితానికీ, ఒక విధమైన ఓర్పూ, క్షమాగుణం, సాను భూతి, దయార్ద్ర హృదయమూ ఉండాలి.

అట్లా అన్నానే గాని బావతో మరేం మాట్లాడలేక పోయాను. వంచిన తలను మెల్లిగా ఎత్తి బావ వైపు చూశాను. ఆ చూపులో ఆర్ద్రత లేదు. అట్లా అన్నానని కోపం లేదు. ఎగతాళిగా తీసుకున్న భావం లేదు. బావ కళ్ళల్లో అలాంటి చూపు నే నెప్పుడూ చూడలేదు. వణికి పోయాను. గుండెలు దడదడ లాడినయ్యి. వళ్ళంతా ముచ్చె మటలు పోసినయ్యి. బెరుకుగా చూస్తూ అక్కయ్య దగ్గరకు వెళ్లాను. నాకేమిటో భయం కలిగించింది. ఎందుకని అట్లా అనిపించిందో నాకు అర్థం కాలేదు. అక్కయ్య మంచంమీద కూర్చుని ఏదో మాట్లాడుతున్నాను. అక్కడికే వచ్చారు బావ.

"సీతా అన్ని విషయాలు నాకు తెలుసు. రమాదేవితో నువ్వు మాట్లాడిన విషయాలూ నాకు తెల్సు. మానసిక దౌర్బల్యమనేది, హృదయ దౌర్బల్య మనేది ప్రతి మానవు నికీ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు కలుగుతునే ఉంటాయి. ఆ సమయంలో ఇది ఉత్తమము, ఇది అధమము అని తెల్సు కోలేం. ఆ దుర్బలత్వం నాలోను ఉన్నది. కాని ఒక్క విష యానికి నేను బాధ పడుతున్నాను. చిన్నదానివైనా నీకున్న నిశితమైన విమర్శనాజ్ఞానం గాని, విచక్షణా జ్ఞానం గాని నాకు లేదు. అందరి జీవితాలనూ ఏ ఒక్క వ్యక్తి సరిదిద్దలేడు. అది మనోభావన మాత్రమే నీ చేతిలో మరోసారి ఓడిపోయాను. అనకూడని మాట అంటున్నానని ఏమీ అనుకోకు. బాధ పడకు. కన్నీరు పెట్టకు. నిన్ను భార్యగా పొంది ఉంటే నా జీవితం ఏనాడో రాణించేది. కాని ఇప్పుడనుకొని ప్రయో

జనం లేదు జానకీ! ఒక్కమాట చెప్తున్నా. నేను ఏ పరిస్థితుల్లో ఉన్నా, ఎట్లా ఉన్నా, ఎవరితో కాలం గడిపినా, నీకు ఏ లోటూ రానివ్వను. సర్వదా నిన్ను సుఖపెట్టటానికే ప్రయత్నిస్తాను. భార్యగా సుఖపెట్టటానికే ప్రయత్నిస్తాను. భార్యగా, గృహిణిగా, ఆదర్శ మాతగా నీకు గౌరవం ఇస్తాను. నీ మనస్సునీ, నీహృదయాన్ని, నీమనోభావాల్ని, నీమదిలోని విచారాన్ని అన్నీ అర్థం చేసుకున్నాను. ఈ రోజు నుంచీ నేను నీ వాడిని. మనస్ఫూర్తిగా, నిన్ను ప్రేమిస్తున్నాను. గౌరవిస్తున్నాను. కానీ సీతా! నా ఆత్మక్షోభ ఎవ్వరికీ అర్థం కాదు. ఎవ్వరూ అర్థం చేసుకోలేరు. ఎవ్వరూ తీర్చలేరు. చిన్నదానివయినా నేను నిన్ను పెద్దవాళ్ళకన్న ఎక్కువగా గౌరవిస్తున్నాను. సీతా! కాని నా మనస్సులో హృదయంలో నువ్వు, నువ్వు...... ఏం లేదులే, ఏం లేదులే... జానకీ, నీ ఆరోగ్యం కాపాడుకో. ఈ రోజు నుంచీ ఏ దిగులూ పెట్టుకోకు" అని కళ్ళు తుడుచుకుంటూ గదిలోకి వెళ్ళిపోయారు. జానకి విభ్రాంతిగా నావైపు చూసింది. నాకేం తోచలేదు. అర్థం కాలేదు. బావగదిలోకి వెళ్ళిందిఅక్కయ్య. నా మనస్సు ఆలోచనలతో నిండిపోయింది. ఇంక నేను వెళ్ళిపోతే మంచిదేమో అనుకున్నాను. నాకేంతోచలేదు. అంతా అయోమయంగా ఉంది.

రెండు రోజులు గడిచినయ్యి. అక్కయ్యలో మార్పు వచ్చింది. కళ కళ లాడుతూ ఎంతో ఉత్సాహంగా ఉంది. దాని ముఖంలో ఆ కాంతిని, ఆ చిరునవ్వునూ, ఆ చలాకీ

తనాన్ని, ఆ ఉత్సాహాన్ని పెళ్ళికాక ముందు దాని ఇంటరు రిజల్ట్సు వచ్చినప్పుడు చూశాను.

"సీతా! బావ పూర్తిగా మారిపోయాడు. వారి మన స్తత్వంలో అనుకోని మార్పుకలిగింది. అన్ని విషయాల్లోనూ నా మనస్సులోని ఆందోళన, బాధ, నిరాశ అన్నీ తీరిపోయి నయ్యి. నన్ను రోజుకు పదిసార్లయినా తల్చుకోంది నిద్ర పోరు. నిద్రలో కూడా నీ పేరే తలుస్తారు నీ పేరే కలవరి స్తారు. నీకెంతో ఋణపడి ఉన్నానే సీతా. నా కాపురాన్ని అనుకోనంత సంతోషంగా నిలబెట్టావు. చాలా సంతోషం చెల్లీ!" అంటూ ఆప్యాయంగా నన్ను కౌగిలించుకుని నా చెంపలు నిమిరి సంతోషంతో నన్ను ముద్దు పెట్టుకుంది అక్కయ్య. నాకు సిగ్గేసింది. అక్కయ్య కాపురం బాగుపడిం దన్న సంతోషంతో నా హృదయం నిండిపోయింది. నా జీవి తంలో ఇదొక విజయఘట్టం అనుకున్నాను.

అప్పట్నుంచీ బావతో మాట్లాడాలని అనిపించటం లేదు. బావ వైపు చూడలేకపోతున్నాను.

మరో రెండు రోజులుండి ఏలూరు వెళ్ళిపోయాను. అమ్మతో అన్ని విషయాలు చెప్పాను. అమ్మ ఎంతో ఆనంద పడ్డది. నాన్న సంతోషంతో నవ్వి ఊరుకున్నారు.

అక్కయ్య వద్ద నుంచి నాలానికో ఉత్తరం వచ్చేది. దాంట్లో ఎన్నో కబుర్లు, ఎన్నో వింతలూ, విశేషాలూ. ఒక ఉత్తరం ఇట్లా రాసింది. ఆ ఉత్తరాలు నా వద్ద ఇంకా ఉన్నాయి.

గుంటూరు.

సీతా !

నీ ఉత్తరం చేరింది. నా ఆరోగ్యం బాగానే ఉంది. నా మనస్సులో ఇప్పుడు ఏ దిగులూ, విచారమూ లేదు. మీ బావ ఇప్పుడు నన్ను ఒక్క క్షణం కూడా విడిచి ఉంటంలేదు, కాలేజీ వేళల్లో తప్ప. ఈ మనిషిలో ఇంత మార్పు ఎట్లా వచ్చిందా అని నాకే ఆశ్చర్యంగా ఉంది. ఇద్దరం పునర్జన్మ ఎత్తినట్లు గానే ఉంది. అంతా నీ చలవ నిన్ను తలవని రోజు లేదు. రమాదేవి మీద ఇది వరకు ఎంత కోపమూ, కార్పణ్యమూ పెంచుకున్నానో ఇప్పుడంత సానుభూతి చూపిస్తున్నాను. ఆ విషయంలో నన్ను నేను నిందించుకుంటున్నాను. రమాదేవి ఇప్పుడు నాకు స్నేహితురాలు. రోజూ మనింటికి వస్తుంది. నా యోగక్షేమం కనుక్కుంటుంది. నాతో ఎంతో ఆదరణగా, అప్యాయంగా, మాట్లాడుతుంది. మీ బావతో సహా ముగ్గురం ఎంతో సరదగా కబుర్లు చెప్పుకొంటాం. ముగ్గురం సినిమాకు వెళుతున్నాం. ఎవరి మధ్యా ఏ విధమైన న్యూనత లేదు. అయినా లోకులు కాకులు కదా. లోకులే కాదు. మొదట్లో ఆ అమ్మాయి విషయంలో మనమూ కాకులుగానే వ్యవహరించాం. ఎన్నో అనుమానాలు, అపోహలూ పెట్టు కున్నాం ఆ అమ్మాయి తత్వంవేరు. ఆలోచనలు వేరు. మనస్సు, హృదయమూ మంచిది. మగవాళ్ళ మనస్తత్వాలు రమాదేవికి తెల్సినట్లుగా మనకి తెలియవేమో. మచ్చలేని మనిషి. వెలకట్టలేని మాణిక్యం. ఎప్పుడూ నిన్ను గురించే మాట్లాడుతుంది. నీ వ్యక్తిత్వానికి నమస్కరిస్తుంది. నీ

మాటల్ని ఎప్పుడూ సంస్మరిస్తూనే ఉంటుంది సగం మాటలు నిన్ను గురించే. సంఘంలో ఒకరిని గురించి మరొకరు ఆలోచించే తీరుల్లో అనేక రకాలు. ఒకరిది నిశితమైన విమర్శనా దృష్టి. మరొకరిది మాలిన్యమైన ఆలోచనలతో కూడినదృష్టి. వేరొకరిది ఈర్ష్యతో కూడిన దృష్టి. అందర్నీ ఏ ఒక్కరూ సమన్వయపర్చి సంతోష పెట్టలేరుగా !

రమాదేవిని గురించి, మీ బావను గురించి అనేకమైన పుకార్లు. భార్య కడుపుతో ఉంటంతో ఆయన ఈ పిల్లను మంచి చేసుకున్నారని అంతా అనుకుంటున్నట్లుగా కొంత మంది నన్నే అడిగారు. వారితో నేనేం చెప్పి సమాధానం పర్చాలి ? మన మనస్సుకు మనం సమాధానం చెప్పు కున్నా అందరి మనస్సునీ మనం వప్పించలేమే. పైగా నా ఇష్టంతోనే ఇదంతా జరుగుతున్నదని అంతా అనుకుం టున్నారు. కట్టుకున్న భార్యకేలేని విచారం మన కెందుకను కుంటున్నారు రమాదేవికి అన్నీ తెల్సు. కాని తను ఎవ్వరి మాటలు లెక్క చెయ్యనంటున్నది. అంతరాత్మ సాక్షిగా తనకు ఏ వాంఛా లేదని ఎంతో జాలిగా నాతో చెప్పింది. కాని లోకం ఊరుకోదుగా. అపవాదులూ, అసత్యప్రచారాలు అభాండాలూ, ఎక్కువైనయ్యి. ఈ పరిస్థితిలో నేను పురుడు ఇక్కడే పోసుకుంటే బావుంటుందేమో ? నా మనస్సుకు ఇక్కడుంటేనే నయమనిపిస్తున్నది. నువ్వూ ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి అమ్మకూ, నాన్నకూ చెప్పి సమాధాన పర్చాలి. వెంటనే జాబు రాస్తావుగా సీతా !

నీ ప్రియ సోదరి, జానకి.

## 10

అమ్మకూ, నాన్నకూ ఉత్తరం చదివి వినిపించాను. పరిస్థితుల ప్రభావానికి అమ్మ విచార పడ్డది. ఒక విచారం మనస్సులో నుంచి తొలగిపోతే ఇంకో రకమైన విచారంతో బాధపడవలసిందే. నాన్నగారేం మాట్లాడలేదు. ఈ సమస్య నాకే వదిలారు. అమ్మ మాత్రం ఏమయినాసరే మొదటి కాన్పు కనుక పురిటికి ఇక్కడికే తీసుకురావాలని పట్టుబట్టింది. అమ్మకు ఎంత నచ్చచెప్పినా వినలేదు. ఆఖరికి నేను అంతా విడమర్చి చెప్పాను. "కుదుటపడ్డ కాపురాన్ని ఈ కాన్పుతో కూలదొయ్యవద్దు ఏమీ లేకపోతేనే, అక్కయ్య అక్కడుం డంగానే అనేక అభాండాలు వేస్తున్నారు. ఇంక అక్కయ్య పురిటికి ఇక్కడికి వచ్చేస్తే పరిస్థితులు నిజంగానే విషమించ వచ్చు. మనస్సులో కోరికలు లేకపోయినా, ఏ మాలిన్య భావాలూ లేకపోయినా అమృత కలశం పాడవటానికి ఒక్క విష బిందువు చాలు. జీవితాంతమూ నిగ్రహంతో ఉన్నా మనోవికారం ఒక్క క్షణంలో జీవితాన్ని నాశనం చేస్తుంది. కన్ను పోయేటంత కాటుక పెట్టుకోవటం ఎందుకు?" అన్నాను అమ్మతో.

నా మాటలు అమ్మ మనస్సులో జొరబడి బాగానే పని చేసినయ్యి. ఏడవ నెలలో పసుపు కుంకుమ ఇచ్చి వేడుక చేసి తొమ్మిదో మాసం రాగానే అమ్మ గుంటూరు వెళ్ళ టానికి ఒప్పుకుంది.

ఈ విషయం అక్కయ్యకు ఉత్తరం రాశాను. అక్కయ్య, బావ కూడా ఈ పద్ధతికి ఒప్పుకున్నారు.

ఏడో మాసం రాగానే అమ్మా, నేను అక్కయ్యకు సూడిద లివ్వటానికి గుంటూరు వెళ్ళాము. అక్కయ్య విప్పారిన ముఖంతో మాతో మాట్లాడింది. తన సంసారంలో ఏ కొరతా లేదనే అక్కయ్య చెప్పింది.

అక్కయ్యకు వేడుకలు చెయ్యటానికి అన్ని ప్రయత్నాలు చేసింది అమ్మ వంద రూపాయలుపెట్టి చీరా, జాకెట్టు గుడ్డా కొన్నాము. వినుకొండ ఉత్తరం రాయగానే అక్కయ్య అత్తగారూ, సుభద్రా వచ్చారు. సుభద్రను చూడంగానే వెనకటి విషయాలన్నీ గుర్తొచ్చి నాకు చచ్చే నవ్వొచ్చింది. రెండు మూడు రోజుల్లోనే సుభద్ర చాలా మారిపోయినట్లు గ్రహించాను. ఇప్పుడు సుభద్రకు వయస్సుకు తగిన తెలివితేటలున్నయ్యి అక్కయ్య, బావ విషయం, రమాదేవి సంగతి వినుకొండలో వాళ్ళకీ తెల్సిందట. ఈ విషయాలన్నీ విని తల్లి ఎంతో బాధ పడిందిట. కాని కొడుక్కి చెప్పే స్తోమతు లేక, చెప్పినా బావ వింటారనే నమ్మకం లేకా బావ తల్లి దండ్రు లిద్దరూ తమ కొడుకు సంగతి తెల్సినా ఏమీ పట్టించుకోలేదు. సుభద్ర అన్ని విషయాలూ అడిగింది. నాకు తెల్సిన సంగతులన్నీ చెప్పాను. అన్ని సంగతులూ విని సుభద్ర చాలా చిన్నబుచ్చుకుంది.

అక్కయ్య పేరంటానికి రమాదేవిని పిలవాలా, వద్దా అన్న సమస్య వచ్చింది. అక్కయ్య నడిగితే పిలవమన్నది. అన్ని ఇళ్ళకూ వస్తానుగాని, రమాదేవిని పిలవటానికిమాత్రం

రానన్నది సుభద్ర. సుభద్ర పట్టుదలకు నాకుసంతోషమైంది. వయస్సు పరిమితమైన జ్ఞానాన్ని ఇవ్వటమే గాక, ఆడపిల్లలకు అభిమానాన్నికూడా ఎక్కువ మోతాదులోనే ఇస్తుంది. వయసొచ్చిన ఆడపిల్లల మనస్సు అతి సున్నితమైనది. ముందాలో చనలూ, ఆత్మాభిమానమూ, అణకువ, వయస్సు పెరిగిన కొద్దీ ఎక్కువవుతెయ్యి. సుభద్ర ఇంతగా పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించుకుంటుందని నేను ఊహించలేకపోయాను. తన అన్నగారి విషయాలన్నీ విని విచార పడ్డది.

అన్ని ఇళ్ళూ పిలిచాక నేనే వెళ్ళి రమాదేవిని పిలిచాను.

"నన్ను పేరంటానికి రమ్మన్నావా సీతా! మనస్సులో లేని భావాలు, పదిమంది దృష్టి మనమీద పడంగానేమనస్సు ఎంతో బాధపడుతుంది. వట్టిగా రావటం వేరు. పేరంటానికి రావటం వేరు. పది మందీ పది రకాలుగా ముఖానే అడుగుతారు. ఆ అడిగేవారు ఎన్ని కాని పనులు చేస్తున్నా భర్తచాలు భార్యలవటంచేత అవి బయటకు రావు. వాళ్ళు సంఘంలో గౌరవనీయులు నాబోటిది అందరి ఎదటా పడితే వాళ్ళల్లో వాళ్ళే బుగ్గలు నొక్కుకుంటారు కాల పరిస్థితులే అట్లా ఉన్నయ్యి. నేను రాను సీతా. ఏమీ అనుకోకండి. అక్కయ్యతో చెప్పు, ఏమీ అనుకోవద్దని. ఆ వేడుక చూట్టానికి నేను నోచుకోలేదు. నే వచ్చినా నన్ను వాళ్ళేమయినా అన్నా నాకు బాధ లేదు. నా నుంచి మీరు బయటపడతారు. నేను ఎప్పుడూ వచ్చేదాన్నే. మీ అక్కయ్య పది కాలాలపాటు సుఖ సంతోషాలతో కాపురం చెయ్యటమే నా కోరిక కాని

అంతా అట్లా అనుకోకుగా సీతా!" అన్నది రమాదేవి చెప్పిన అభిప్రాయాలు నాకూ నిజమనేఅనిపించింది కాసేపునూట్లాడి వచ్చేశాను.

వేడుకలు పూర్తయినయ్యి. అంతా వాళ్ళల్లో వాళ్ళు ఏవో గొణుక్కున్నారు. ఒకావిడమాత్రం ఉండబట్టలేక అమ్మని అడిగింది. నాకు అరికాలి మంట నెత్తికెక్కింది. చెప్పవలసిన సమాధానం చెప్పేసరికి ఆవిడ కిక్కురుమనకుండా వెళ్ళి పోయింది.

నాలుగు రోజులుండి అక్కయ్య అత్తగారూ, సుభద్రా వెళ్ళిపోయారు. సుభద్ర నన్ను వినుకొండ రమ్మన్నది. వీలుని బట్టి వస్తానన్నాను.

తొమ్మిదో మాసం రాగానే వస్తానని చెప్పి అమ్మ వెళ్ళింది. నన్ను వదిలి వెళ్ళటానికి ఇష్టం లేకపోయినా అక్కయ్య మరీ మరీ చెప్పి బ్రతిమాలటం నుంచి అమ్మ ఇష్టపడ్డది.

అమ్మ అక్కయ్యతో అన్నదిట. పురుడు వెళ్ళంగానే ఎక్కడోక్కడ సంబంధం చూసి నన్నుకూడా ఒక అయ్య చేతిలో పెట్టి తమ బాధ్యత వదిలించుకుంటుందిట. నాకూ నవ్వొచ్చింది అమ్మ ఆదుర్దాకి

"నువ్వేమన్నావే?" అన్నాను అక్కయ్యతో.

"తొందరగా దానికి పెళ్ళి చెయ్యండి దాని కాపురం నేనూ చూడాలని ఉంది అన్నాను" అన్నది అక్కయ్య.

"అవును. నీ కాపురం ఈ తీరుగా ఉండా. నీకు తోడు నేనూ ఏడుస్తూ ఉండొచ్చు. మనిద్దర్నీ చూసి అమ్మ ముక్తి మార్గం తొందరగా చూసుకుంటుంది" అన్నాను

"అందరికీ నామాదిరి అదృష్టమే పడుతుందంటావా? మా మరిదిగారు నిన్ను చక్కగా, ఆపేక్షగా చూసుకోవచ్చు. కాకపోయినా నామాదిరి తెలివితక్కువదానివి కాదుగా. నెల రోజుల్లో ఆయన్ని మార్చేస్తావ్. నువ్వు సామాన్యురాలివా" అన్నది అక్కయ్య నవ్వి.

"నాకసలు పెళ్ళే వద్దు వచ్చే ఏడు కాలేజీలో చేరి మళ్ళీ చదువు ప్రారంభిస్తాను. చదువుకుని ఉద్యోగం చేసు కుంటూ కాలం గడుపుతాను" అన్నాను.

"అవున్లే, అప్పుడే ఎవర్నయినా ప్రేమించి పెళ్ళి చేసు కోవచ్చు ఈ రోజుల్లో అదేం తప్పు కాదుగా" అన్నది.

"ఏ రోజుల్లో అయినా తప్పులేదు. మనసాంప్రదాయా లకూ, కులగోత్రాలకూ విరుద్ధంగా ఉండకుండా ఉంటేసరి. ప్రేమించి పెళ్ళి చేసుకున్నా తప్పులేదు. ఆ ప్రేమ వెర్రి తలలు వెయ్యకుండా ఉంటే సరి. ఒకరి నొకరు అర్థం చేసుకుని సత్సాంప్రదాయాలకు గౌరవాన్నిచ్చి ప్రేమించి పెళ్ళిచేసు కోటం చాలా మంచి పద్ధతే" అన్నాను.

"అంటే నా పెళ్ళి అట్లా జరగలేదు కాబట్టే ఇట్లా ఉంది నా కాపురం అంటావా?" అన్నది.

"నా అభిప్రాయం అది కాదు అసలు ప్రేమకు తొలి ఘట్టం వాంఛ కాకూడదు. వాంఛతో ప్రేమిస్తే అది ఆత్మా ర్పణ చేసుకున్నట్లు కాదు. తళుకు బెళుకులకు దాసులై,

సౌందర్యానికిముగ్ధులై, అంగవిన్యాసాలకులొంగిపోయి ప్రేమిం చామని చెప్పుకునేవాళ్ళు ఈ రోజుల్లో ఎంతోమందిఉన్నారు. ప్రేమకు మూలం మనస్సు, మనస్సుతో ప్రేమించిన ప్రేమే సార్థకత చెందుతుంది” ఇంకా ఏమిటో చెప్పాలనుకున్నాను. అక్కయ్య నవ్వుతూ నన్ను చూస్తుంటే నాకు సిగ్గేసింది.

“అంటే అందచందాలు చూసి ప్రేమించ కూడదం టావా? ఆడదానికి అందచందాలు లేకపోతే నిన్ను ప్రేమిస్తు న్నానని ఏ పెళ్ళి కావలసిన మగవాడూ అనడు అందమే ప్రేమ కలగటానికి దారి తీస్తుందేమో?” అన్నది అక్కయ్య. నా మనస్సులోని భావాలను అక్కయ్యకు కాక మరెవ్వరికి చెప్పుకుంటాను?

“అసలు ప్రేమని ఏ దృష్టితో చూడాలంటావు? శారీరక మైన సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని చూడాలా? అందాన్ని దృష్టిలో పెట్టుకు చూడాలా? మనస్సుని దృష్టిలో పెట్టుకు చూడాలా?” అన్నది అక్కయ్య చాలా పెద్ద ప్రశ్న వేసింది అక్కయ్య అనుకున్నాను.

“మంచితనాన్ని బట్టి ప్రేమించాలి. ఒక వ్యక్తిని మనంచూడంగానే వెంటనే వాళ్ళమీద మనకు ఏ విధమైన అభిప్రాయం కలగదు అభిప్రాయమనేది ఏదో ఒక దృష్టిలో, ఒక కోణంలో చూస్తేనేగాని కలగదు. ప్రేమించటానికి ముందు ఆ వ్యక్తియందు మనకు ఒక విధమైన సదభిప్రాయం కలగాలి. అలాంటి సదభిప్రాయంలోనుంచే ప్రేమ కలుగు తుంది. ఒక వ్యక్తిని చూడగానే వారి ఉనికినిబట్టే వారితో పరిచయం లేకపోయినా వారి గుణగణాల్ని మనం అంచనా

వేసుకుని, సంస్కారాన్ని, కుటుంబాన్ని దృష్టిలో ఉంచుకుని, ఆ అంచనాలను మిళితం చేసుకున్నాక మన జీవితమంతా వారి జీవితంలో కలిసిపోవాలని కలిగే ఒక రకమైన మానసిక భావమే ప్రేమ. అలాంటి మెత్తని భావమే, సరళమైన స్వభావమే ప్రేమ. ఈ సద్భావములో నుంచి కలిగిన ఒక రకమైన ఉద్వేగమే ప్రేమ'' అన్నాను.

"చాలా కావ్యాల్లోనూ, పుస్తకాల్లోనూ తొలిచూపులోనే ప్రేమించేసుకున్నారంటాముగా. అలాంటి తొలి చూపులో నువ్వుచెప్పిన అంచనాలన్నీ వేసుకోవటం కష్టమే'' అన్నది అక్కయ్య.

"అవును. అది వాంఛా దృష్టితో చూసిన ప్రేమ. వాంఛతో కూడిన ప్రేమ శరీర సుఖాన్నే కోరుతుంది మనస్సునీ, హృదయాన్నీ అర్థంచేసుకుని ప్రేమించాలంటే కొంత కాలం పట్టొచ్చు. దానికీ ప్రథమ చూపులోనే వాళ్ళు ప్రేమించుకున్నారని అనుకోటం కద్దు. ఉదాహరణకి ఫలాని అమ్మాయి ముఖం పున్నమ చంద్రుడిలా ఉన్నదంటారు. అంటే ఆ అమ్మాయి ముఖం గుండ్రంగా, వంకర లేకుండా ముక్కుని సెంటరుగా తీసుకుని ఒక సర్కిలు కొట్టినట్లుగా ఉంటుందా? ఎన్నటికీ ఉండదు. అదంతా గ్రాంధిక భాష, పుస్తకాల్లో ఉండేది. ఆ భావాలు అంతవరకే. చదివి ఆనందించటం వరకే మనస్సుని ఆకట్టుకుని ఏర్పరచుకున్నదే ప్రేమ. ఆ స్థితికి వచ్చి ప్రేమించాలంటే కొంత పరిచయమూ, అభిప్రాయాలూ ఉండాలి. ఏదీ లేకుండా నేను ఫలానా అమ్మాయిని ప్రేమించాననో, ఫలాని అబ్బాయిని ప్రేమిం

చానసో అంటే అది నమ్మదగిన ప్రేమ కాదు. వాంఛాపూరిత మైన ప్రేమ. అందుకనే పూర్వకాలంలో చిన్నప్పుడే పెళ్ళి చేసేవాళ్లు. పదేళ్ళ పిల్లకి పెళ్ళి చేస్తే ఆ పిల్లకి ప్రేమించడ మంటే ఏం తెలుస్తుంది? తెలీదు. పెళ్ళయ్యాక ఏడాదిలోపల తీసుకొస్తారు అల్లుడిన్ని. పండగలకు తీసుకొస్తారు. ఈ పిల్లనూ అత్తవారు పండగలకి వాళ్ళింటికి తీసుకెళ్ళవచ్చు. ఇలాంటి రాకపోకలవల్లా, అల్లుడిమీద తన తల్లి దండ్రులు చూపే సద్భావమూ, గౌరవ మర్యాదలమీద ఈ పెళ్ళయిన పిల్ల దృష్టి పడుతుంది. అలాంటి దృష్టి కలిగిన ఆ పిల్ల మనస్సులో ఆ వ్యక్తి నా భర్త, నా జీవితం వారితోనే గడపాలి, వార్ని నేను గౌరవించాలి, వారు నన్ను మంచిగా చూసుకోవాలి అనే భావాలతో కూడిన ఒక రకమైన సద్భావం ఈ పిల్ల దృష్టిలో, మనస్సులో, హృదయంలో కలుగుతుంది. అదే ఆ భర్తయందు ఆ పిల్లకు కలిగే ప్రేమ. గౌరవంతో కూడిన ఆలోచనల మొలకలే ఆ పిల్ల మనస్సులో మెదిలే సిగ్గు. అలాంటి సిగ్గు ఏర్పడిం తరువాత వయసొచ్చిన కొద్దీ ఆ పిల్లలో కలిగే మానసిక పరిణామమే, భావోద్రేకాలే ప్రేమ. అదే నిజమైన, హృదయానుగతమైన ప్రేమ" అన్నాను.

ఏమిటో నాకట్లా చెప్పబుద్ధిపుట్టింది. చెప్పేశాను. అక్కయ్య ఏమనుకుందో ఏమో! ఇంతలోకి బావ రావటం నుంచీ, ఎవరో పిలుస్తుంటం నుంచీ ఆ ప్రస్తావన ఆపేశాం.

* * *

"ఆ రోజున రమాదేవి పుట్టిన రోజు కాలేజీలో తన స్నేహితురాళ్ళందర్నీ విందుకు పిల్చింది. నన్నుకూడా రమ్మని రెండు మూడు రోజులుగా బలవంతం చేసింది. నాకు వెళ్లాలని పించలేదు. అక్కయ్య తప్పక వెళ్ళమన్నది. అక్కయ్యను చూస్తే ఇప్పుడు జాలేస్తున్నది మరీ బొత్తిగా ఓపలేక పోతు న్నది నెలలు వస్తున్న కొద్దీ దడ, ఆయాసం, నీరసం ఆ రోజు కారోజు ఎక్కువవుతున్నది బావ కులాసాగా కబుర్లు చెప్తూ, అక్కయ్య ఆరోగ్యం విషయమై బాధపడుతూ, ఈ పురుడు ఎట్లా వెడుతుందా అని అక్కయ్యకిన్న తనూ ఎక్కువ బాధ పడుతూ, ఆందోళన పడుతూ ఉండేవారు నిద్ర లేవంగానే బావ నిత్యావసరాలన్నీ తనే స్వయంగా తీర్చాలని ప్రయత్నిం చేది. ముఖం కడుక్కోటానికి నీళ్ళు తనే ఇవ్వాలనుకునేది. స్నానానికి నీళ్ళు తనే తోడాలనుకునేది బీరువాలోంచి బట్టలు తనే ఇవ్వాలనుకునేది. భోజనం తనే దగ్గర కూర్చుని వడ్డిం చేది కడుపుతో ఉండనప్పుడు మొదటిరోజుల్లో అంతకాల్చు కుతిన్న బావ ఇప్పుడు అక్కయ్యను ఎంతో ఆపేక్షగా చూసు కుంటుంటే ఆయన అవసరాలను ఇప్పుడు తను తీర్చలేక పోతు న్నాను కదాని మనస్సులో బాధపడేది. "బొత్తిగా స్త్రాణ లేకపోతే నువ్వు మటుకు ఏం చేస్తావు జానకీ!" అనే వారు బావ. తనూ తల్లి కాబోతున్నందుకు సంతోషపడ్డా ఎందు కనో అక్కయ్య మనస్సులో పిరికితనం ప్రవేశించింది. మాట్లా డితే 'నేను బ్రతికి బయట పడతానా సీతా' అనేది.

అక్కయ్య ఈపరిస్థితుల్లోఉన్నా, అక్కయ్య ప్రోద్బలం నుంచే నేను రమాదేవి పుట్టింరోజు విందుకు వెళ్ళాను.

వాళ్ళ మేడమీద రూఫ్ గార్డెన్‌లో సాయంత్రం ఆరు గంటలకి విందు ఏర్పాటు చేసింది రమాదేవి స్నేహితురాళ్ళంతా వచ్చారు. మొత్తం పాతిక మందికి పైగానే ఉన్నారు నన్ను చూసి ఎంతో సంతోషంతో ఆహ్వానించింది. రమాదేవి తల్లి కూడా ఒక పక్కన కుర్చీలో కూర్చున్నారు నన్ను వాళ్ళమ్మకు పరిచయం చేసింది. ఆవిడ ఎంత సంతోషంగా మాట్లాడినా ఆమె ముఖంలో విషాద రేఖలు బాగా కనిపించినయ్యి. బహుశా పెద్ద కూతురు శకుంతల ఆ విధంగా చనిపోయినందు కేనేమో? రమాదేవి వదినగారితో పరిచయం చేసింది. ఆవిడ కనుబొమలతో, కళ్ళతో ఏమిటో లెక్కలేనట్లుగా మందహాసం చేసింది. నొక్కులుగా తల దువ్వుకుని జడ బిగుతుగా మెలెపెట్టి రింగులోనుంచి పాము పడగలాగా వెడల్పుగా తీసి, కొసలు వదులుగా వ్రేలాడేటట్లుగా తీసి నాగకన్యలా కేశాలంకరణ చేసుకుంది. పెదవులకి లిప్‌స్టిక్, బుగ్గలకు లేతరంగు రోజ్ క్రీం రాచుకుంది. ఆ చీరె కట్టూ, దేవతా వస్త్రాల్లాంటి ఆ చీరె, చోళీలను చూస్తే ఈవిడ సంసార స్త్రీనా లేక సినిమాల్లో మాదిరి దేవకన్యా అని అనిపించింది. చేతులో "అమెరికన్ వేనిటీ బ్యాగ్" ఉన్నది. ఆవిడను చూస్తుంటే సానుభూతితో కూడిన నవ్వు వచ్చింది. ఈవిడ పిల్లలిద్దరూ ఎంత నిర్భాగ్యులో అనుకున్నాను. వాళ్ళకి కన్నతల్లి పోషణ లేదు. కన్నతల్లి ఆదరణ లేదు. కన్నతల్లి పెంపకం లేదు. వాళ్ళ ముద్దు ముచ్చటలు చూసి ఆనందించే అవకాశం ఆ తల్లికి లేదు. ఆవిడ ఫేషన్ పెరేడ్‌లో ఉండదగిన స్త్రీ. రమాదేవి చెప్పినట్లుగా ఆవిడ ఎప్పుడూ

బిజీగా, హాలీవుడ్ నుంచి అప్పుడే వచ్చినట్లే ఉంటుంది. ఆవిడ అలంకరణలో ముఖ్యంగా గమనించి ముక్కుమీద వేలు వేసుకోవలసింది ఆవిడకు బొట్టు లేకపోవటమే, బొట్టు ఫ్యాషన్ కాకుంట బొట్టు పెట్టుకుంటే ఆవిడకు ఏమిటోగా ఉంటుందిట. రమాదేవి చెప్పినవన్నీ యదార్థ విషయాలే అంతా ఆవిడను చూస్తూ కూర్చున్నారు.

విందు ప్రారంభమైంది రమాదేవికి అంతా శుభాకాంక్షలు అందజేశారు. రమాదేవిని ప్రశంసిస్తూ ఆవిడ చాలా సరళ స్వభావురాలనీ, స్నేహపాత్రురాలనీ, ఆమె హృదయం నవనీతమనీ, బీద విద్యార్థినులకు చాలామందికి సాయం చేస్తూ ఉంటుందనీ, అందరితో కలసి మెలిసి ఉంటుందనీ, కొంత మంది విద్యార్థినులు మాట్లాడారు. రమాదేవి అందరికీ ఉచిత రీతిన సమాధానం చెప్పింది. అందరూ వెళ్ళిపోయాక రమాదేవి, రమాదేవి వదిన కృష్ణవేణి, నేనూ మాట్లాడుతూ కూర్చున్నాం. కృష్ణవేణి మాటలతీరు చూస్తుంటే ఆంధ్ర దేశంలో యిలాంటి ఆడవాళ్లుకూడా ఉన్నారా అనిపించింది.

"మీ అక్కయ్యను గురించి నేనూ విన్నానండీ. తప్పు మీ బావగారిది కాదు. ఆవిడదే తప్పు. పురుషులతో బాటు స్త్రీలకు కూడా సమాన హక్కులు ఇస్తున్న ఈ రోజుల్లో, అందులోనూ చదువుకుని ఇంత లోకజ్ఞానాన్ని సంపాదించుకుని కూడా మీ అక్కయ్య ఎంతసేపూ మీ బావగారి అడుగులకు మడుగులొత్తుతూ ఆ వంటింటి పొగలో కూర్చుని, గరిటె తిప్పుతుంటే, మీ బావ అన్నారంటే ఎందుకు అనరు చెప్పండి? మానవత్వాన్ని చంపుకుని, మగవాళ్ళ ఆదేశాలే, వాళ్ళ

భావాలే, వాళ్ళ మాట ప్రకారం నడుచుకోవటమే ధ్యేయంగా పెట్టుకుంటే, భార్య వ్యక్తిత్వాన్ని భర్త తప్పక అణచి వెడతారు. వారికి కావలసింది ఏ వేళకు అది అందిస్తూ, వారి అవసరాలు తీరుస్తూ, వారి ఆదేశాలు శిరసావహిస్తూ ఉంటేనే పతివ్రతా లక్షణమూ చెప్పండి. మేమంతా భర్తకో కాపురమే చెయ్యటం లేదా? పిల్లల్ని కనటం లేదా? భర్తని వదిలేసి స్వేచ్ఛగా సిగ్గు విడిచి తిరుగుతున్నామా? ఎక్కడికీ వెళ్ళకుండా, ఎవరి ప్రమేయమూ పెట్టుకోకుండా పొద్దస్తమానం చాకిరీ చేసుకుంటూ సాయంత్రమయ్యే సరికి స్నానం చేసి, ఇంత పౌడరూ, స్నో ముఖానికి పట్టించి, తెల్లచీర కట్టుకుని, ఇన్ని పూలు తల్లో పెట్టుకుని, ఇంత కుంకం ముఖాన పెట్టుకుని, వీధి గుమ్మంలో నిల్చుని భర్త రాకకోసం ఎదురు చూట్టంలోనే ఆవిడ తన కాలం గడపాలనుకోకూడదు. అట్లా ఉంటమే సంసార స్త్రీలక్షణమూ కాదు. తమ అభిప్రాయాలకు తిలోదకాలిచ్చి, తమ కోరికలనూ, ఆదర్శాలనూ భర్తల హృదయాల్లో జారవిడిచి, ఏ విధంగానైనా వారిని సంతోష పెట్టడమే స్త్రీ లక్షణం కాదు బైటికి రావాలి. పదిమందితో సహృదయతతో స్నేహం చెయ్యాలి. పదిమంది అభిప్రాయాలు తెల్సుకోవాలి. పదిమంది జీవితాలుచూసి అర్థం చేసుకోవాలి. పదిమందిలో జంకూ గొంకూ లేక తమ అభిప్రాయాలను నిష్కర్షగా చెప్పగల ధైర్య సాహసాలు అలవర్చుకోవాలి. తోటి సంసార స్త్రీల అభిప్రాయాలూ, ఆదర్శాలూ తెల్సుకోవాలి. సాంఘికంగా తామూ విశాల హృదయులైన వ్యక్తిత్వం కలవారుగా ఉండాలి. అప్పుడే వారి జీవితాలు

రాణిస్తాయి. వారూ ఒక వ్యక్తిగా, వ్యక్తిత్వం గల స్త్రీగా, ఆదర్శ గృహిణిగా చలామణి అవుతారు. అవునంటారా?'' అన్నది ఆవిడ

ఆవిడట్లా గలగలమంటూ తడుముకోకుండా మాట్లాడు తుంటే నాకు గాహం వేసినట్లయింది ఆవిడ ఆరితేరిన ఘటం. మాటకు మాట చెప్పగల నేర్పరి వందమందిలో తిరిగి వెయ్యి మంది అభిప్రాయాలు తెలుసుకున్న వ్యక్తి. ఆవిడకు నేను సమాధానం చెప్పినా లాభం లేదనిపించింది. రమాదేవి ముభావకంగా కూర్చుంది నా వైపు చూస్తూ.

మీరు చెప్పినవిషయాలు వినటానికి ఎంతో సొంపుగా ఉన్నాయండీ. వ్యక్తిత్వ మనేది మానవ స్వభావం మీద, పుష్కలంగా డబ్బుంటం వల్లా అ కుటుంబంలో తమకుగల స్వేచ్ఛా వాతావరణంవల్లా ఏర్పడే ఒకరకమైన రూపకల్పన. అలాంటి రూపకల్పన, ఆ వ్యక్తులు తమ తమ జీవితాలకీ, తమ వారి జీవితాలకీ జత చేసి, అన్వయించుకోటంలో ఉంటుంది. మీరున్నారు. పదిమంది స్నేహితులతో ఏ మహిళా మండలిలోనో, క్లబ్బులోనో మాట్లాడుతూ ఎంతసేపయినా కాలం గడపగలరు. ఇంటి వద్ద వంట చేసుకోవాలనే ఇబ్బంది మీకు లేదు. పిల్లల పోషణభారం మీరు వహించాలనే ప్రమేయం లేదు. డబ్బిచ్చి ప్రేమను పిల్లల కోసం కొనుక్కున్నారు. ఆ డబ్బుకు ఆ దాదులు వారి ప్రేమను అమ్ముకున్నారు. ఒకరు ప్రేమను కొన్నారు. ఒకరు ప్రేమను అమ్ముకున్నారు. మీ పిల్లలు కొన్న ప్రేమతో పెరుగుతున్నారు. ఈ రెండు ముఖ్యమైన పన్లనూ మీ రెప్పుడయితే విడిచి పెట్టారో, అప్పుడే

మీ మనస్సుకి స్వేచ్ఛ, దానంటే అదే కలిగింది. మీ మనస్సు, స్వేచ్ఛను ఎప్పుడయితే కాంక్షించిందో అప్పుడే మీకు అనేక రకములైన ఆలోచనలు, వ్యాపకాలూ కలిగి నయ్యి. అలాంటి వ్యాపకాలను నాలుగు పక్కలా వదిలేసే సరికి కొన్ని క్లబ్బులవైపూ, మరికొన్ని మహిళా మండలి వైపూ, కొన్ని మాటలవైపూ, మరికొన్ని అలంకరణాల వైపూ దారితీసినయ్యి. అంతటితో మీకు తదనుగుణ్యాంగానే నడుచుకోవాల్సొచ్చింది. సామాన్య సంసార స్త్రీలకు ఇలాంటి వ్యాపకాలన్నీ ఎట్లా కలుగుతయ్యి చెప్పండి. వారి వ్యాప కాలు నిత్యమూ, కూడు గుడ్డలకోసమే పాకులాడుతయ్యి. దానికి ప్రధాన కారణం డబ్బు. ఆ డబ్బు తమ భర్తలు కష్ట పడితేనే వచ్చేది. చాకిరీచేసి నాలుగుడబ్బులు తెచ్చే భర్తను ఆదరణగా చూడకపోతే ఆ భర్త గతేం కావాలి? ఆయన్నే నమ్ముకుని, ఆయన బాగోగులే విచారించకపోతే ఇంక ఆ సంసారం సాగే విధానం? అందుకే ఆవిడ తల్లో పూలు పెట్టు కున్నా, తెల్లచీర కట్టుకున్నా, పౌడర్లు, స్నో రాచుకున్నా ఆ వ్యక్తికోసమే పాటుపడుతుంది. అదే ఆవిడ ధ్యేయం. తన భావాలనూ, తన కోరికలనూ, తన వ్యక్తిత్వాన్ని భర్తకు అనుగుణంగా మలచుకొని భర్త సంతోషమే తన సంతో షంగా భావించి ఆ సంసారాన్ని తీర్చి దిద్దుకుంటుంది. అందులో తప్పేముంది చెప్పండి?" అన్నాను.

ఆవిడ ముఖంలో కోపం బాగా కనిపించింది. తన అభి ప్రాయాలతో నేను ఏకీభవించక పోయినందుకు కొంచెం చిరాకు పడ్డది.

'వదినా! ఎవరి భావాలు, ఆదర్శాలు వాళ్ళవి. ఎవ్వరూ వద్దు, పాటక ప్రజలనే తీసుకో. వాళ్లుమటుకూ స్వేచ్ఛగా, ఆనందంగా, సుఖ సౌఖ్యాలతో తులతూగుతూ ఉండాలని కోరుకోరా? నిద్ర లేవంగానే గంప నెత్తినపెట్టుకుని కూలికి పోవటం ఎందుకు? వాళ్లుమాత్రం క్లబ్బులకు పోకూడదూ! 'పిక్నిక్'లకూ, పార్టీలకూ పోకూడదూ? అజంతా ఎల్లోరాలను చూస్తూ, కాశ్మీరు లోయల్లో విహరిస్తూ, వెన్నెలలో తాజ్‌మహల్ సౌందర్యాన్ని వెయ్యి కళ్ళతో చూస్తూ, బృందావనోద్యాన వనాల్లో విహరిస్తూ, కన్యాకుమారి అగ్రం తీరంలో సూర్య భగవానుని ఉదయాస్తమయాల అరుణరాగ రంజితాలను తిలకిస్తూ ఎందుకు కాలం గడపకూడదూ? ఎవరయినా వాళ్ళని వద్దన్నారా? ఎవ్వరూ వద్దనరు. ఏదయినా ఆదర్శాలుగాని, ఆంతర్యాలుగాని, స్వేచ్ఛా జీవితం గడపాలని అనుకోవటంగానీ అంతా జరుగుబాటును బట్టి ఉంటుంది. జరుగుబాటుకు మరొక పేరే డబ్బు. ఆ డబ్బు ఎంత ఎక్కువగా ఉంటే ఆదర్శాలను అంత రమణీయంగా సృష్టించుకోవచ్చు. ప్రేమను కొనుక్కోవచ్చు. ప్రేమించినవార్ని చులకనగా చూడొచ్చు. చులకనకూడా డబ్బునుబట్టి కలిగేదే వ్యక్తిత్వాన్నికూడా డబ్బునుబట్టే ఏర్పాటు చేసుకుంటూ మార్చుకోవచ్చు. ఇదంతా సామాన్య సంసారులకి ఎట్లా కుదుర్తుంది వదినా? అందులో జానకి విషయంలో అసలే కుదరదు. ఆవిడ అట్లా ఉండటంలో తప్పేమీ లేదు. అంతకన్నా ఆవిడ చెయ్యగలిగిందేమీ లేదు. అనవసరంగా జానకిని నిందించకు" అన్నది రమాదేవి. కృష్ణవేణికి

కోపము వచ్చినట్లుంది. మాట్లాడకుండానే వెళ్ళిపోయింది. రమాదేవి నావైపు చూసి నవ్వింది. వదినా మరదళ్ళ భావాలు, ఒక ఇంట్లో ఉంటున్నా, అంత డబ్బున్నా ఎంత తూర్పు పడమరలుగా ఉన్న య్యో ఆలోచించుకుంటే నా మనస్సుకు ఎంతో తృప్తి కలిగించి సంతోషం కలిగింది. ఆనందం కలిగింది రమాదేవి కళ్ళల్లోకి చూసి సంతోషం పట్టలేక నమస్కరించి. రెండు చేతులూ పట్టుకుని నా కళ్ళ కద్దుకున్నాను. రమాదేవి అరచేతులు నా ఆనంద భాష్పాలతో క్షాళితమయి నయ్యి. నా మనస్సులోని బరువు తీరింది. ఏదో పెద్ద సమస్య తీరినట్లనిపించింది కాసేపు కూర్చుని మాట్లాడి వెళ్ళిపోయాను. నే వెళుతుంటే కళ్లుతుడుచుకుంటె రమాదేవి ఇద్దరి అంతర్యాలూ పెనవేసుకున్నయ్యి. ఇద్దరి ఆవేశాలూ మిళితమైనయ్యి, ఇద్దరి భావాలూ సెలయేరులా గల గలమంటూ ప్రవహించి. చిన్న నదిలా ఏ చప్పుడూ లేకుండా ప్రశాంతంగా ప్రవహించినట్ల యింది నా జీవితానికి ఇదొక ఆశించని ఆశారేఖ. అనుకోని మధురాతి మధురమైన సన్నివేశం. ఏమిటో ఈ జీవితంలో ఇంకెన్ని మధుర క్షణాలను చవి చూడాలో! అనుకున్నాను ఆ రోజున.

## 11

ఇంటికి రాగానే జరిగిన విషయాలన్నీ బావ భోజనం చేస్తుంటే, అక్కయ్య బావకు వడ్డిస్తూంటే అక్కయ్యకు చెప్పాను. బావకూడా అన్ని విషయాలూ విన్నారు నాతో

ఏమీ అనలేదు. ఆయన ముఖంలో ఎంతో ప్రశాంతతా, ఆనందమూ కనిపించినయ్యి.

"ఇప్పటికయినా రమాదేవిని, సీత అర్థం చేసుకున్నందుకు చాలాసంతోషం. ఇంట్లో వాళ్ళకూ, చేసుకున్న భార్యకూ ఏ అనుమానమూ లేకపోతే నాకు అంతేచాలు లోకులు నమ్మినా, నమ్మకపోయినా ఆత్మసాక్షిగా మన మంచి చెడ్డలు మనం అర్థం చేసుకోగలిగితే మనశ్శాంతి ఎప్పుడూ ఉంటుంది. మనల్ని గురించి ఒకళ్ళు అనుకున్నారనే బాధా ఉండదు" అన్నారు బావ. బావ ఎంత మారిపోయారు! నాకు ఆశ్చర్యం కలిగింది.

బావ నవ్వుతూ మాట్లాడుతూంటే ఆయన తప్పులు ఆయన చేతనే వప్పిస్తే ఎంత బావుంటుందో అనిపించింది.

"బావా!"

"ఏం సీతా?"

"ఏం లేదులెండి"

"అదేమిటి సీతా! అడగదల్చుకుందేదో అడుగు. భయమెందుకూ? అందులో నీ దగ్గర నేను దాచవలసిన విషయ మేమీ లేదు. ఒకవేళ దాచినా కుండ బద్దలుకొట్టినట్లు నువ్వే చెప్పెయ్యగలవు" అన్నారు బావ.

"ఆత్మసాక్షిగా, పరమాత్మసాక్షిగా తనేమీ చెడ్డపని చెయ్యలేదని కట్టుకున్న భార్య చెప్పినా నమ్మనప్పుడు ఆ పరిస్థితుల్లో! అ ఇల్లాలి మనస్సు ఎట్లా ఉంటుందో ఊహించుకో బావా మనకు ఏ విధంగానూ బాంధవ్యం లేని రమాదేవి సంగతి చెప్పేసరికే మీరెంతో సంతోషంగా, మిమ్మల్ని

అపార్థం చేసుకున్నవాళ్లు తమ తప్పును తెల్సుకున్నారని విని ఆనంద పడుతున్నారే, ఏ పాపమూ ఎరగని అక్కయ్యని నేటి కాలానికి మీరు అర్థం చేసుకున్నందుకు, అక్కయ్య ఎంత ఆనంద పడుతున్నదో ఆలోచించండి. అపవాదు వెయ్యటానికి అర నిమిషం చాలు. ఆ అపవాదును పోగొట్టుకోటానికి ఒక జీవిత కాలంకూడా చాలకపోవచ్చు. ఇంత చనువుగా మాట్లాడుతున్నందుకు మీ చేతుల్లో నేనెన్ని అపవాదులు పడాలో?" అన్నాను బావ ముఖంవైపు చూస్తూ. చేతులో మజ్జిగ పోయించుకుని బావ జుర్రుమని తాగుతున్నారు. కొర బోయింది

"రమాదేవి మిమ్మల్ని తల్చుకుంటున్నది" అన్నాను. బావ మంచినీళ్ళు తాగి కంచంలోనే చెయ్యి కడుక్కున్నారు. గదిలోకి వెళతారని నేను వంటింటి గది గుమ్మంలోనుంచి లేచాను

"సీతా! ఇక్కడే నేను కూర్చుంటాను. మీరిద్దరూ అన్నానికి కూర్చోండి. నేను వడ్డిస్తాను. రా, సీతా! కంచాలు పెట్టు" అన్నారు

నేను లేచివెళ్ళి కంచాలు పెడుతూ అక్కయ్యను అక్కడే కూర్చోమని మా ఇద్దరికీ వడ్డించాను.

"కనీసం మీ ఇద్దరికీ నెయ్యైనా వెయ్యనివ్వండి. అదీ పనికిరాదా?" అన్నారు బావ. మా ఇద్దరికీ నెయ్యి కుమ్మరించారు.

"అంత హోదా, గౌరవమూ మాకేం అక్కరలేదు లెండి. అవన్నీ రమాదేవి వదినగారికి" అన్నాను.

"మీరట్లా కబుర్లు చెప్తూ కూర్చోండి. మాకెంతో తృప్తిగా ఉంటుంది. మీరేం వడ్డించొద్దు ఈ నేతిజిడ్డు వదలటానికి సీకాయో, సబ్బో కావాలి. అందుకనే మగవాళ్ళ వంటా, వడ్డనా, ఇట్లా ఉంటయ్యి" అన్నది అక్కయ్య.

"ఏం బావా చెప్పరేం! నామాటలు మర్చిపోయారా" అన్నాను మళ్ళీ.

"తప్పు చేసినవాళ్ళు తమ తప్పును వప్పుకుంటారా సీతా? నీమీద నాకు ద్వేషం లేదు. నేను కాలేజీలో లెక్చరరు నయినా, ఎంత పేరు తెచ్చుకున్నా మరదలితో పోటీకి దిగితే తప్పక వోడిపోతానని తెలుసు. రాబోయే మా తోడల్లుడు చాలా అదృష్టవంతుడు" అన్నారు.

సిగ్గుతో తల వంచేసుకుని కంచానికి తగుల్తుంటే నా జడ పట్టుకుని లాగి కూర్చోపెట్టింది అక్కయ్య. బావనవ్వుతూ వక్కపలుకు నవ్వుల్తున్నారు. అక్కయ్య నా వైపు చూస్తూ ఆయాసంతో కూర్చుంది. గడ్డం కింద చెయ్యి పెట్టుకుని ఏదో ఆలోచిస్తూ ఒక్క నిట్టూర్పు విడిచి గదిలోకి వెళ్ళిపోయారు బావ. ఆయన వెళ్ళాక సరిగ్గా కూర్చుని అన్నం తిన్నాను.

నా జీవితంలో అదొక అనుకోని ఘట్టం. వ్యక్తం చేయలేని అవ్యక్త వ్యథలతో నా మనస్సు కుమిలిపోయింది. ఆ పరిస్థితుల్లో అంతకన్నా నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఏమీ చెప్పలేకపోయాను.

అన్నం సయించక ఆయాసం ఎక్కువయి కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్ళి పడుకుంది అక్కయ్య. ఏమిటో గుబులు గుబులుగా దుఃఖం పొంగిపొర్లుకొచ్చి అప్రయత్నంగా

కళ్ళల్లో నీళ్ళు తిరిగి నేను అక్కయ్యా కంచం ఎత్తుతుంటే ఆ కంచంలో నాలుగు కన్నీటి బొట్లు పడ్డయ్యి. ఇల్లు బాగుచేసి ఇవతలకి వచ్చేసరికి అప్పుడు గ్లాసులో మందు పోసి బావ అక్కయ్యచేత తాగిస్తున్నారు. నా కళ్ళు చెమర్చి పమిటి చెంగుతో తుడ్చుకున్నాను.

*　　*　　*

మర్నాడు పొద్దున్నే రమాదేవి వచ్చింది. అక్కయ్యనూ, నన్నూ పలకరించి బావ గదిలోకి వెళ్ళింది. తను రాసిన నోట్సు ఏదో బావకు చూపెడుతున్నది. పుస్తకం చేతులో ఉంచుకునే "అట్లా ఉన్నావేం రమా?" అన్నారు బావ. వాళ్ళ మాటలు నాకు బాగా వినిపిస్తున్నయ్యి.

"ఎట్లా ఉన్నాను? బాగానేఉన్నానే" అంది రమాదేవి.

"కాదు రమా, నీ మనస్సు సరిగ్గా ఉన్నట్లు లేదు. ఏమిటీ విశేషం?"

"ఏమీ లేదండీ, ఈ ప్రాబ్లమ్ సాల్వ్ కాలేదు. మిమ్మల్ని అడిగి తెల్సుకుందామని వచ్చాను."

"జీవితంలో మన ప్రాబ్లమ్ మనం సాల్వ్ చేసుకోగలిగితే పుస్తకాల్లో వాటి ఆన్సర్లు వాటంతటవే వస్తయ్యి. ఎప్పటి మాదిరిలేవు మనస్సులో ఏదో బాధపడుతూ చెప్పలేక పోతున్నావు."

"నిన్న నా పుట్టింరోజు విందుకు నా స్నేహితుల నందర్నీ పిల్చి చిన్న పార్టీ ఇచ్చాను. సీతకూడా వచ్చింది.

పార్టీ అనంతరం మా వదినెతో చిన్న చర్చ జరిగింది. బహుశా సీత అన్నీ విషయాలూ చెప్పే ఉంటుంది" అన్నది రమాదేవి.

నేను ఆదుర్దాగా వినసాగాను. మా చర్చలవల్ల రమాదేవి కేమయినా కష్టం తోచిందా అనుకున్నాను. ఆదుర్దా ట్టలేక గదిలోకి వెళ్లాను. రమాదేవి ముఖం చిన్నబోయి నట్టుంది.

"కూర్చో సీతా" అన్నది రమాదేవి.

"మీ వదిన ఏమన్నా అన్నదా రమా?" అన్నాను.

"నన్ను ఏమన్నా నాకేం బాధలేదు. అందర్నీ అన్నది. నాకేం చెప్పాలో అర్థం కావటం లేదు. సరే, వాటికేంగాని ఇకనుంచి నేను మీఇంటికి రావటం తగ్గించుకుంటాను. మీరు ఏమీ అనుకోకండి ఈ మాట చెప్దామనే వచ్చాను". నిరాశగా కిందిపెదవి మునిపళ్ళతో కొరుక్కుంటూ కూర్చుంది రమాదేవి. అంత సంతోషంగా, చలాకీగా, నవ్వుతూ మాట్లాడే రమాదేవి అంతలోకి ఇట్లా మారిపోయిందేమా అనుకున్నాను. అగ్ని పర్వతం అన్నివేళలా బ్రద్దలవదు. లోపల్లోపల ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది.

"సీతా" అని నావైపు చూసింది. అప్రయత్నంగా నావళ్ళో తల దాచుకుని కంట తడిపెట్టింది. నేను దిగాలుపడి బావ ముఖంలోకి చూశాను. బావ ఏమీ మాట్లాడలేదు. రమాదేవి కళ్ళు తుడ్చుకుని కూర్చుంది. ముఖం జేవురించింది.

"ఎవరు అపవాదులువేసినా, ఎవరు ఎన్నను కున్నా ఇంతవరకూ నేను లక్ష్యపెట్టలేదు. కాని రాత్రి మాటల సంద

ర్భంలో అమ్మా, నాన్న నన్ను శంకించారు. వారు కూడా వదిన మాటలువిని నన్ను ఎన్నో మాటలన్నారు. అసలే అక్కయ్య చావుతో అమ్మ మనస్సు వికలమై పోయింది. నా ప్రవర్తన చూస్తుంటే అమ్మకు ఇంక జీవితంమీద విరక్తి కలిగి ఏ నుయ్యో, గొయ్యో చూసుకోవాలనిపిస్తున్నదట. రాత్రి తెల్లవార్లూ నేనేదో నిజంగానే చెడిపోయినట్లుగా అనుకుని అమ్మ హితబోధ చెయ్యసాగింది. నేను పతితురాల్ని కాలేదని ఎంత నచ్చచెప్పినా, ఎన్ని ప్రమాణాలు చేసినా అమ్మ నా మాటలు నమ్మలేదు. నా ప్రవర్తనమీద అమ్మకే అనుమానం కలిగినప్పుడు ఇంక ఇతర్లకు నమ్మకం ఎట్లా కుదుర్తుంది?" అన్నది రమాదేవి. ఎక్కి ఎక్కి వై మాట్లాడలేక పోయింది. గొంతు జీరబోయింది మాటకన్నా ముందు ఎక్కి పుట్టే దుఃఖం ఎక్కువైంది. రమాదేవిని ఆ పరిస్థితుల్లో చూస్తుంటే ఆడదాని జీవిత నిఘంటువులో ఎన్ని అర్థాలున్నయ్యో, ఎన్ని ప్రత్యామ్నాయ పదాలున్నాయో నాకు అర్థమైంది. బావ నిట్టూర్పు విడిచి నావైపు చూస్తూ కూర్చున్నారు. ఇంతలో మెల్లిగా నడుస్తూ అక్కయ్య వచ్చింది. మెల్లిగా నా పక్కనే కూర్చుంది.

"నువ్వు చెప్పిన మాటలన్నీ వింటూనే ఉన్నాను రమా. ఆడ, మగ అనే తేడాలు భగవత్ సృష్టిలోనే ఉన్నాయి రమా. పోషించేవాడు భర్త. పోషింపబడేది భార్య. ఈ రోజుల్లో స్త్రీలూ చదువుకుంటున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. జీతాలు తెచ్చుకుంటున్నారు. కుమారిగా ఉద్యోగంలో చేరిన వారు శ్రీమతి కాగానే ఉద్యోగం మానేసేవా

పార్టీ అనంతరం మా వదినెతో చిన్న చర్చ జరిగింది. బహుశా సీత అన్నీ విషయాలూ చెప్పే ఉంటుంది" అన్నది రమాదేవి.

నేను ఆదుర్దాగా వినసాగాను. మా చర్చలవల్ల రమాదేవి కేమయినా కష్టం తోచిందా అనుకున్నాను. ఆదుర్దా పట్టలేక గదిలోకి వెళ్లాను. రమాదేవి ముఖం చిన్నబోయి నట్లుంది.

"కూర్చో సీతా" అన్నది రమాదేవి.

"మీ వదిన ఏమన్నా అన్నదా రమా?" అన్నాను.

"నన్ను ఏమన్నా నాకేం బాధలేదు. అందర్నీ అన్నది. నాకేం చెప్పాలో అర్థం కావటం లేదు. సరే, వాటికేంగాని ఇకనుంచి నేను మీ ఇంటికి రావటం తగ్గించుకుంటాను. మీరు ఏమీ అనుకోకండి ఈ మాట చెప్దామనే వచ్చాను". నిరాశగా కిందిపెదవి మునిపళ్ళతో కొరుక్కుంటూ కూర్చుంది రమాదేవి. అంత సంతోషంగా, చలాకీగా, నవ్వుతూ మాట్లాడే రమాదేవి అంతలోకి ఇట్లా మారిపోయిందేమా అనుకున్నాను. అగ్ని పర్వతం అన్నివేళలా బ్రద్దలవదు. లోపల్లోపల ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది.

"సీతా" అని నావైపు చూసింది. అప్రయత్నంగా నావళ్ళో తల దాచుకుని కంట తడిపెట్టింది. నేను దిగాలుపడి బావ ముఖంలోకి చూశాను. బావ ఏమీ మాట్లాడలేదు. రమాదేవి కళ్ళు తుడ్చుకుని కూర్చుంది. ముఖం జేవురించింది.

"ఎవరు అపవాదులువేసినా, ఎవరు ఎన్ననుకున్నా ఇంతవరకూ నేను లక్ష్యపెట్టలేదు. కాని రాత్రి మాటల సంద

ర్థంలో అమ్మా, నాన్న నన్ను శంకించారు. వాళ్ళు కూడా వదిన మాటలువిని నన్ను ఎన్నో మాటలన్నారు. అసలే అక్కయ్య చావుతో అమ్మ మనస్సు వికలమై పోయింది. నా ప్రవర్తన చూస్తుంటే అమ్మకు ఇంక జీవితంమీద విరక్తి కలిగి ఏ నుయ్యో, గొయ్యో చూసుకోవాలనిపిస్తున్నదట. రాత్రి తెల్లవార్లూ నేనేదో నిజంగానే చెడిపోయినట్లుగా అను కుని అమ్మ హితబోధ చెయ్యసాగింది. నేను పతితురాల్ని కాలేదని ఎంత నచ్చచెప్పినా, ఎన్ని ప్రమాణాలు చేసినా అమ్మ నా మాటలు నమ్మలేదు. నా ప్రవర్తనమీద అమ్మకే అనుమానం కలిగినప్పుడు ఇంక ఇతర్లకు నమ్మకం ఎట్లా కుదు ర్తుంది?'' అన్నది రమాదేవి. ఎక్కి ఎక్కి వై మాట్లాడలేక పోయింది. గొంతు జీరబోయింది మాటకన్నా ముందు ఎక్కి పుట్టే దుఃఖం ఎక్కువైంది. రమాదేవిని ఆ పరిస్థితుల్లో చూస్తుంటే ఆడదాని జీవిత నిఘంటువులో ఎన్ని అర్థాలు న్నయ్యో, ఎన్ని ప్రత్యామ్నాయ పదాలున్నాయో నాకు అర్థమైంది. బావ నిట్టూర్పు విడిచి నావైపు చూస్తూ కూర్చు న్నారు. ఇంతలో మెల్లిగా నడుస్తూ అక్కయ్య వచ్చింది. మెల్లిగా నా పక్కనే కూర్చుంది.

"నువ్వు చెప్పిన మాటలన్నీ వింటూనే ఉన్నాను రమా. ఆడ, మగ అనే తేడాలు భగవత్ సృష్టిలోనే ఉన్నాయి రమా. పోషించేవాడుభర్త. పోషింపబడేది భార్య. ఈ రోజుల్లో స్త్రీలూ చదువుకుంటున్నారు. ఉద్యోగాలుచేస్తు న్నారు. జీతాలు తెచ్చుకుంటున్నారు. కుమారిగా ఉద్యో గంలో చేరిన వారు శ్రీమతి కాగానే ఉద్యోగం మానేసేవా

ళ్ళున్నారు. అప్పటికీ కాకపోతే ఇద్దరు, ముగ్గురు పిల్లలుపుట్టాక మానేసిన వాళ్ళున్నారు. మగవాళ్ళమాదిరి ముప్పై ఏళ్లా సర్వీసులో ఉండి, ఏభై అరు ఏళ్ళు నిండగానే రిటయిరయిన వాళ్ళు ఆడవాళ్ళలో ఎంత మంది ఉన్నారు చెప్పు? అలాంటి వాళ్ళు నూటికి ఒక్కళ్ళకన్నా ఎక్కువ ఉండరేమో? మగ వాళ్ళతో సమానంగా ఉండాలని ఎంత తాపత్రయపడినా ఇంకా మన భారతదేశంలో చాలా మంది స్త్రీలు ఆ దశకు రాలేదు. రైళ్ళను తీసుకో. స్త్రీలకోసం ప్రత్యేకంగా పెట్టెలు వేసి 'స్త్రీలు' అని బొమ్మ వేసి చీట్లు అతికిస్తున్నారుగాని, పురుషులకు మాత్రమే అంటూ వారికే ప్రత్యేకించి రైలు పెట్టెలు వెయ్యటం లేదు కదా! దాంపత్య జీవితానికి మకు టాయమానమైన వివాహాల్లో పెళ్ళికొడుకు పెళ్ళికూతురు మెళ్ళో పుస్తె కడతాడుగాని, పెళ్ళికొడుకు మెళ్ళో పెళ్ళి కూతురు పుస్తె కట్టటం లేదుగా. వాళ్ళతో సమానంగా మనమూ ఉండకూడదా అనుకున్నప్పుడు ఈ పని అందరూ ఎందుకు హర్షించరు? ఇట్లా చెప్పాలంటే ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి రమా. నీ మీద కోపంచేత చెప్పటంలేదు. పెళ్ళి కాని వయసొచ్చిన ఆడపిల్లలు పరాయి మగవాళ్ళతో చను వుగా ఉంటం తప్పే మీ అమ్మగారు కన్నతల్లి కనుక నీ మంచి కోసమే చెప్పారు అందులో బాధపడవలసిన విషయం ఏమీ లేదు. నీ మనస్సాక్షిగా నీకే దురాలోచనా లేదు. అది మనందరికీ తెల్సు. మీ అమ్మగారికి తెల్సు. నాకూ తెల్సు. కాని సంఘం అనేది ఒకటున్నది మన స్నేహితులు, మన చుట్టు పక్కల వాళ్ళు, మన చుట్టాలూ, మన తల్లి దండ్రులు

వీళ్ళే మన సంఘం. వీళ్లందర్నీ కాదని మనం ఎట్లా జీవించ
గలం చెప్పు? ఎన్నాళ్లు జీవించగలం చెప్పు? నేనూ నీ మీద
దురభిప్రాయంతో అంటున్నానని బాధపడకు. మీ అమ్మ
గారుకూడా అనుమానపడ్డారంటుంటే అందుకు చెబుతున్నా.
మీ మాష్టారుగారితో కాస్త స్వేచ్ఛగా తిరగటం తగ్గించు.
ఒక్కమాట. నాకు మనస్సులు కష్టంతోచి కాదు నేననేది. మీ
అమ్మగారి మనస్సుకష్టపెట్టకు. అందుకే యింతగా చెప్పాను.
రమా! ఏమీ అనుకోవుకదూ! నాకు సీతలాంటి చెల్లెలివి"
అంటూ రమాదేవి గడ్డం పుణికి పుచ్చుకుని తల నైకెత్తింది.
ముత్యాల్లాంటి కన్నీళ్ళు జారి అక్కయ్య చేతుల్లో పడ్డయ్యి.
రమాదేవి తల నిమిరి ముద్దుపెట్టుకుని "పిచ్చిదానా! లోకంలో
మన మంచి మనం చూసుకోవాలంటే అందరి మంచీ మనం
కాంక్షించాలి అప్పుడే అందరి ఆశీస్సులూ మనకుంటయ్యి.
కాలికి రాయి అడ్డం వస్తే వంగి చేత్తో తీసి అవతల పారె
య్యాలి. లేకపోతే తప్పుకుని పక్కగా పోవాలి. అంతేగాని
అడ్డం వచ్చింది వెధవరాయని కాలితో తన్నితే మన కాలికే
దెబ్బ తగులుతుంది" అన్నది అక్కయ్య. అక్కయ్య ఇట్లా
మాట్లాడుతుందని ఎవరూ అనుకోలేదు. బావకూడా ఆశ్చర్య
పోయారు. నా సంతోషానికి హద్దులు లేవు. రమాదేవి
దిగాలుపడికూర్చుంది. అక్కయ్య అక్కడే కొంగు వేసుకుని
పడుకుంది.

"మీ మాష్టారుగారంటే నీకు ఎంతో గౌరవమూ,
అభిమానమూ ఉంటం మంచిదే. విద్యార్థి దశలో విద్యార్థు
లకు తమ గురువులమీద సద్భావం ఉంటేనే ఆ చదువు

రాణిస్తుంది మనం అనేకమంది చదువుకునే విద్యార్థుల్ని చూస్తూంటాం. హైస్కూలు చదువువరకూ ఒక రకమైన భావాలూ, కాలేజీ జీవితంలో మరో రకమైన భావాలూ, ప్రతి విద్యార్థిలోనూ మసులుతునే ఉంటయ్యి. ఉపాధ్యాయులు చెప్పే పాఠాల తీరునిబట్టి విద్యార్థులకు వారిమీద సదభిప్రాయంగాని, దురభిప్రాయంగాని కలుగుతుంది. అధ్యాపకుల తీరునిబట్టీ, వారి మన స్తత్వాలనిబట్టీ, వారిగుణగణాలనిబట్టీ విద్యార్థులకు వారిమీద సదభిప్రాయంగాని, దురభిప్రాయంగాని కలుగుతుంది. అధ్యాపకులమీద గౌరవ మర్యాదలు చూపే విద్యార్థినులు కేవలంగా వారితో మాట్లాడుతుంటేనో, వారితో చనువుగా ఉంటంచేతనో వారిమీద గౌరవ భావం వెల్లడిస్తూ, ఆదరణగా ఉన్నామని అనుకోకూడదు. చనువు తీసుకోవటం వేరు. గౌరవ మర్యాదలు చూపడం వేరు. ఒక వ్యక్తి యందుగల మంచి గుణాల్ని, మంచి మనస్సునీ ఆసరాగా తీసుకుని వారివల్ల మనకు కావలసిన ప్రయోజనాలను పొందటమే చనువుగా ఉండటం. ఒక వ్యక్తి మంచి గుణాల్నీ, మంచి మనస్సునీ, హృదయౌన్నత్యాన్ని గుర్తించి వారి దృష్టిలో మనం ఉంటూ వారి ఆదరాభిమానాలు మనం పొందటం నుంచి, వారియందు మనం చూపించవలసిన కృతజ్ఞతా భావమే ఆ వ్యక్తిని గౌరవించటం అవుతుంది. విద్యార్థుల మాట అట్లా ఉంచు. విద్యార్థినుల విషయమే మనం తీసుకుందాం. ఆడపిల్లలు ఉపాధ్యాయులతో చనువుతో ఉండేదీ, వారితో చనువుగా మాట్లాడేదీ చిన్న క్లాసుల్లో ఉండే రోజుల్లోనే. పెద్దవాళ్ళయి, కాలేజీ జీవితం

గడిపే స్థితిలో కొచ్చాక కొంత బాధ్యత, కొన్ని కొన్ని పరిస్థితులూ వాళ్లు గమనించి సంచరించాలి. కారణం వయస్సుని బట్టి వచ్చే మానసిక పరిణామమే. ఈ పరిస్థితుల నన్నింటినీ సమన్వయించుకుని మనం చదువుకుంటేనే అందరి దృష్టిలో మనమూ గౌరవంగా చూడబడతాం. ఏ ఒక్క విషయంలో హద్దు మీరినా అందరి దృష్టిలో పడటం జరుగుతుంది" అన్నది అక్కయ్య ఆయాస పడుతూ. రమాదేవి అక్కయ్య వైపే చూస్తూ కూర్చుంది. బావ అక్కయ్య మాటలు వింటూ కూర్చున్నారు.

"రమా! ఏదో మాట వచ్చింది కనక నాకు తోచింది చెప్పాను. ఏమీ మనస్సు కష్టపెట్టుకోకు. ఏ వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఎవ్వరూ కాదనలేరు, ఒక్క వివాహమైన స్త్రీల విషయంలో తప్ప" అన్నది అక్కయ్య.

అంతా మంత్రముగ్ధులమై అక్కయ్య అభిప్రాయాలు విన్నాము. బావ ముఖంలో ఆ నాడు నే చూసిన ఆనందానుభూతులు నే నెప్పుడూ చూడలేదు. అక్కయ్య మనస్సులో ఎన్నో ఊహలూ, అభిప్రాయాలూ ఉన్నా ఆ రీతిగా ఎప్పుడూ అక్కయ్య మాట్లాడలేదు.

రమాదేవి కాసేపు నిశ్శబ్దంగా కూర్చుంది. బావ ఏం మాట్లాడలేదు.

"నా రాకపోకలవల్ల, చనువుగా మీ అందరితో మాట్లాట్టం నుంచీ అందరి దృష్టి నన్నే ఆకర్షిస్తుందని అనుకోలేదు. విద్యార్థి జీవితంలోనే లేని పోని ఆలోచనలు పెట్టుకోక సంస్కార భావాలూ, ఆదరాభిమానాలూ

గల మీ కుటుంబంతో స్నేహ బాంధవ్యం ఏర్పర్చుకుని సంతోషంగా కాలం గడుపుదామనుకున్నాను సీతా. కాని అందరూ పడుతున్న దురభిప్రాయమే మా అమ్మకూడా తన మనస్సులో ఏర్పర్చుకున్నది. ఈ రోజున మీ అక్కయ్యకూడా ఆ అభిప్రాయానికే వచ్చారు. మా అక్కయ్యను మీలో చూచుకుంటూ అక్కయ్యలేని కొరత తీర్చుకుందామనుకున్నాను. అంతేగాని నాకే దురభిప్రాయమూ లేదు. సీతా! డబ్బు, కొని తెచ్చుకునే సౌఖ్యాన్ని ఇస్తుందిగాని, మన సారా కోరి తెచ్చుకొనే సౌఖ్యాన్ని ఇవ్వలేదు. నా మనస్సుని నే నెప్పుడూ మభ్యపెట్టుకోలేదు నా ప్రవర్తనలో గల అతి చనువు, కలుపుగోలుతనమూ అందరి మనసుల్నీ కష్టపెట్టింది. పోనీండి, ఇంత మందికి అనుమానం కలిగే ఈ స్నేహంవల్ల కలిగే సత్ఫలితం ఇదే కాబోలు. శలవు. వెడతాను అక్కా. సీతా! వెళతానమ్మా, మాష్టారూ శలవు" అంటూ మెల్లిగా వెళ్ళిపోయింది. రమాదేవి ముఖంలో శ్రావణ మాసపు మేఘాలు బాగా కమ్ముకుని ఉన్నయ్యి. సమావేశం ఇట్లా ముగుస్తుందని నేననుకోలేదు. రమాదేవి వెళుతుంటే ఎవ్వరం ఏమీ మాట్లాడలేకపోయాం.

వారం పది రోజులు గడిచినయ్యి. రమాదేవి రావటం లేదు. అక్కయ్య, నేను ఆస్పత్రికి వెళ్లొస్తుంటే దార్లో కనిపిస్తుందేమోనని ఎంతో ఆత్రంగా చూసేదాన్ని. కాని ఎప్పుడూ కనిపించలేదు. ఇంట్లో బావకూడా ఎప్పుడూ రమాదేవి ప్రస్తావన తీసుకురాలేదు. ఒక్కసారిగా ఏర్పడిన ఈ పరి

స్థితులు నన్ను మరీ కలవర పెట్టినయ్యి. ఒక రోజున ఉండ బట్టలేక బావను అడిగాను.

"రమాదేవి కాలేజీకి వస్తున్నదా బావా?" అని

"వస్తూనే ఉన్నది. చదువు మానెయ్యలేదుగా" అన్నారు బావ.

"కులాసాగా ఉంటున్నదా?"

"ఆ"

ఇంకేం అడగాలో అర్థం కాలేదు. ఏం తోచలేదు. అక్కయ్యను అడిగాను వాళ్ళింటికి వెళ్ళి రమాదేవిని చూసొస్తానని. అక్కయ్య ఏం సమాధానం చెప్పలేదు. బావను అడగమన్నది. రమాదేవి విషయంలో ఇంతగా అక్కయ్య తన అభిప్రాయాన్ని మార్చుకున్నందుకు నాకు చాలా కష్టమనిపించింది. బావను అడిగాను రమాదేవి ఇంటికి వెళ్ళొస్తానని. సరేనన్నారు.

మర్నాడు ఆదివారం కావటంనుంచి మూడు గంటలకు వాళ్ళింటికి వెళ్ళాను. నే వెళ్ళేసరికి రమాదేవి వదినగారు కృష్ణవేణి వరండాలో ఈజీచైర్లో పడుకునుంది. పక్కన మరో కుర్చీలో రమాదేవి అన్నగారు కూర్చున్నారు. కృష్ణవేణిని చూడంగానే నామనస్సు గతుక్కుమన్నది. లోపలికిపోదామా వద్దాని ఆలోచిస్తూ ఒక్క నిమిషం ఆలోచించాను. కృష్ణవేణి మాట్లాడలేదు. చూసి ఊరుకుంది. ఆయన ఆదరంగా పలకరించి "రమాదేవి మేడమీద గదిలో ఉంది వెళ్ళమ్మా" అన్నారు. కృష్ణవేణి ముభావంగానే చూస్తూ ఊరుకుంది. నేను మేడమీదికి వెళ్ళాను. రమాదేవి చదువుకుంటూ

కూర్చుంది. నన్ను చూడంగానే విప్పారిన ముఖంతో ఆద రంగా పిల్చింది.

"ఏం సీతా! మరీ నల్లపూసవయి పోయావు. నామీద నీకూ కోపమా?" అన్నది.

"నాకే కాదు, ఎవరికీ కోపం లేదు రమా. అక్కయ్య ఆ రోజున మన మంచికే చెప్పిందిగానీ, నీ మీద కోపం చేత కాదు. నేను మాత్రం చేస్తున్న ఘనకార్యం ఏముంది? ఇన్నేసి రోజులు బావగారింట్లో ఉంటే లోకులు నన్ను గురించీ అను కోటానికి ఆస్కారం లేకపోలేదు. నువ్వెంతో నేనూ అంతే. కాకపోతే నువ్వు పరాయిదానివి, నేను మరదల్ని" అన్నాను. రమాదేవి ఆశ్చర్యంగా చూసింది.

"అదేమిటి సీతా, మీ అక్కయ్య నిన్ను గురించీ అనుమాన పడిందా?"

"అక్కయ్య ఎవర్నీ గురించీ అనుమానపడదు. ఆవిడకు అంతా సమానమే మన మంచి చెడ్డల్ని గురించీ, మన నైతిక విలువల్ని గురించీ మనకు అనుమానం లేకపోయినా లోకులు అనుమాన దృష్టితోనే చూస్తారు. మనస్సుని దాచుకోవచ్చు గానీ, వయస్సును దాచుకోలేం కదా" అన్నాను.

రమాదేవి నవ్వింది. ఆ నవ్వులో తేలిపోయిన భావాలూ, నిరాశాజనకమైన దృష్టి, ఆవేదనతో కూడిన ముఖ కవళికలు నేను చూశాను.

"కాలేజికి వెళుతున్నావుగా. మా బావగారు మును పటిలా మాట్లాటం లేదా?" అన్నాను మళ్ళా ఈ ప్రశ్న ఎందుకు అడిగానా అనిపించింది.

"మాష్టారులో మార్పేమీ లేదు. ఆయన వ్యక్తిత్వం విలువయినదే. ఆయన మామూలుగానే మాట్లాడుతున్నారు.

కాని, నాకే మాట్లాట్టానికి మనస్కరించటంలేదు. మాష్టార్ని చూడంగానే నామనస్సులో జానకి కనబడుతారు. ఆవిడ మాటలు నా చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నవి. ఆలోచిస్తుంటే పెళ్ళయిన వాళ్ళకన్నా కన్యాత్వపు జీవితము గడుపుటయే చాలా విలువైనదానిలా కనిపిస్తున్నది. అక్కయ్య పోయాక ఎప్పుడూ ఇలాంటి ఆలోచనలు మనస్సులోకి రాలేదు. మళ్ళా నేటి కాలానికి వ్యక్తిత్వపు విలువల్ని గురించీ, వ్యక్తిగత భావాల్ని గురించీ ఆలోచనలు వాటంతటవే దొర్లిపోతున్నయ్యి" అన్నది రమాదేవి.

"మీ అమ్మగారుగాని, వదినెగారుగాని ఏమైనా అన్నారా?" అన్నాను

"లేదు. ఈ ప్రస్తావన రానేలేదు. కాని, నన్నో కంట కనిపెడుతూనే ఉన్నారు. ముఖ్యంగా వదిన, ఆవిడ జీవితాన్ని గురించి ఆలోచిస్తే నాకు నిజంగా అసహ్యమనిపిస్తుంది. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. గాజు భవనాల్లో ఉండేవాళ్లు రాళ్లు రువ్వరాదని గౌరవ మర్యాదలూ, నైతిక విలువలూ ఆడదానికి జీవితాంతమూ ఉండాలిగాని భర్త సాన్నిధ్యంలో ఉండేవాళ్ళకు అక్కర్లేదనీ, పెళ్లికాని ఆడపిల్లలకి మాత్రమే ఆ సూత్రం వర్తిస్తుందనీ ఏధర్మ శాస్త్రంలోనూ చెప్పలేదు. కాని, మావదిన భావాలు మాత్రం ఆవిడ సృష్టించుకున్నవే. ఆవిడకు ఆవిడే సాటి. అన్నయ్యను చూస్తూంటే జాలీ, నాను

భూతి కలుగుతుంది అలాంటి వదినకు నేనిప్పుడు తలవంచి సమాధానం చెప్పాల్సొస్తోంది" అన్నది రమాదేవి.

"ఏమంటున్నారేం" అన్నాను.

"కాలేజీనుంచి ఒక్క పది నిమిషాలు ఆలస్యంగా వస్తే ఎక్కడ తిరగటానికి వెళ్ళారు అంటుంది. కాలేజీకి పది నిమిషాలు ముందుగా బయల్దేరితే ఈలోగా ఏమయినా పన్లున్నయ్యా అంటుంది. ఆవిడదయవల్ల సినిమాలు మానేశాను. అమ్మ నా మాటలు వినిపించుకోలేదు. నాన్న 'అవునమ్మా వదిన చెప్పింది నిజమే. ఆడపిల్లలు చాలాజాగ్రత్తగా మసులుకోవాలి' అన్నారు. చివరికి నా జీవితం అడకత్తెరలో పోకచెక్కలా అయింది సీతా!" అంటూ కళ్ళు తుడుచుకుంది రమాదేవి.

రమాదేవి మాటలు వింటుంటే నేనుకూడా అమ్మ చేతులో, నాన్న చేతులో, ఆఖరికి అక్కయ్య చేతులోకూడా ఇలాంటి నిర్బంధాలూ, మాటలూ పడాల్సొస్తుందేమో ననిపించింది. కాసేపు కూర్చుని ఇంటికి వచ్చేశాను.

నేను ఇంటికి వెళ్ళేసరికి అక్కయ్య మంచంమీద పడుకునుంది. పక్కన పడక్కుర్చీలో బావ కూర్చున్నారు. అంతకు క్రితం ఏం మాట్లాడుకున్నారో తెలీదు కాని, నే వెళ్ళేసరికి నవ్వుకుంటున్నారు. నన్ను చూసి మాటలు ఆపేశారు

"నే రాగానే మాటలు ఆపేశారేం బావా?"అన్నాను

"నిన్ను గురించే మాట్లాడుకుంటున్నాం. నీకోమంచి సంబంధం చూస్తున్నాను" అన్నారు.

"అక్కయ్య చెప్పిందా సంబంధం చూడమని?"

"మీ అమ్మగారు జానకితో చెప్పారుట".

"పాపం! అయితే చూశారా? ఎలాంటివాడు? ఏం చదువుకున్నవాడు? ఏ ఊరివాడు? ఎంత కట్నం? అన్నీ చెప్పండి" అన్నాను నవ్వుతూ.

"ఈ ఊరివాడే. మా కాలేజీలో లెక్చరరు."

"చచ్చాం. ఇంకేం. బహుశా ఆయనకూ మీమాదిరి మనస్తత్వమే అయుంటుంది కొంత కాలం అక్కయ్య చార్జి నేనూ పుచ్చుకోవాలన్నమాట"అన్నాను సీరియస్‌గా ముఖం పెట్టి.

"లేదు సీతా! నాకన్నా బుద్ధిమంతుడు. ఆస్థిపరుడు. చాలా మంచివాడు" అన్నారు.

"అంత మంచివా డయినప్పుడు మీచెల్లెలు సుభద్రకు ఈ సంబంధం కుదర్చకూడదూ?" అన్నాను కోపంతో.

"ఆ కోతికా! దానికసలు బుద్ధి కుదురుతుందా అని" అన్నారు. నాకు నవ్వొచ్చింది.

"కాస్త అన్నగారి మాదిరే అనుకోండి. అయినా సుభద్ర ఇప్పుడు మునుపటి సుభద్ర కాదు. వయస్సుకు తగిన తెలివి తేట లున్నయ్యి" అన్నాను.

"నీకు వయస్సుకు మించిన తెలివి తేట లున్నయ్యిగా" అన్నారు బావ.

నేను రమాదేవి సంగతి ఎత్తాను. బావ వెంటనే లేచి బట్టలు మార్చుకొని వెళ్ళిపోయారు.

# 12

"రమాదేవి సంగతి మాట్లాడగానే బావ వెళ్ళిపోయా రేమే అక్కా!" అని అక్కయ్యవైపు చూస్తూ అడిగాను. అక్కయ్య ఒక్క నిట్టూర్పువిడిచి మెల్లిగా లేచింది. దిగలేక దిగలేక మంచం దిగింది.

ఇద్దరిలోనూ ఈ మూగవేదన ఎందుకో నాకు అర్థం కాలేదు. ఆలోచిస్తూ అట్లాగే కూర్చుండిపోయాను. దొడ్లోకి వెళ్ళి అక్కయ్య మెల్లిగా వచ్చి మంచంమీద పడుకుంది.

"సీతా"

"ఏమిటే?"

"మగవారి మనస్సును పూర్తిగా అర్థం చేసుకోవా లంటే ఒక జీవితకాలం సరిపోదేమో. ఎంతో లాలనగా, ఆద రణగా, ఆప్యాయంగా మాట్లాడుతారు. కాని, వాళ్ళ హృద యంలో ఒకమూల బయటపడని సత్యం దాక్కునే ఉంటుంది. అదేమిటో భార్యకే అర్థంకాదు" అన్నది నిట్టూర్పు విడుస్తూ.

"అంటే!" అన్నాను.

"చాలామంది మగవారికి ముఖ్యంగా కవులకు, కాలేజీ అధ్యాపకులకు ఊహల్లోగాని, హృదయంలో ఏదో ఒకమూల గాని, భార్యకాక మరొక ప్రియురాలు ఉంటుందేమో? ఏదో ఒక సమయంలో ఎన్నాళ్ళుగా కప్పిపుచ్చినా ఆ విషయం బయటపడక మానదు" అన్నది అక్కయ్య.

నాకు నవ్వొచ్చింది.

"ఏదో కవిత్వధోరణిలో మాట్లాడుతున్నావా? నిజంగా అంటున్నావా?" అన్నాను.

"కవిత్వ ధోరణి కాదే నిజంగానే అంటున్నాను. రమాదేవి మీ బావ హృదయంలో కొద్దిగా స్థానం ఏర్పరుచుకొన్నది. నాకు తెలుసు. అయితే వారిద్దరూ కాని పనులు చేయకపోయినా ఒకరియందు వారొకరికి మమత, వాంఛా ఉన్నవి. కాని లోకానికి వెరుస్తున్నారు" అని అక్కయ్య కళ్లొత్తుకుంది. ఈ మాటలు అక్కయ్య అన్నందుకు నేను ఆశ్చర్యపడలేదు. అక్కయ్యకే అలాంటి అనుమానం కలిగినందుకు నే నేం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు.

"మనసా, వాచా భర్తనే తల్చుకుంటూ వారినే ఆరాధిస్తూ, వారి హితవునే కోరుతూ, వారి గౌరవ మర్యాదలను కాపాడుతూ కాపురం చేసే నాబోటి సంసార స్త్రీలకు ఇవి రోజులు కావే సీతా! నాలాంటి వెర్రిబాగుల్ది భర్తరూపంలో తన ఛాయనే చూసుకుంటుంది కాని, ఆ ఛాయ వెనక మరొక స్త్రీ నీడ తెల్సుకోలేదు. అది గ్రహించిన రోజున ఆ భార్య మానసిక సంక్షోభం ఎట్లా ఉంటుందో నీకు అర్థం కాదు" అన్నది అక్కయ్య.

"నీ మాటలు వింటుంటే నాకు ఆశ్చర్యంగా ఉందే. కాపురాని కొచ్చిన కొన్ని రోజుల వరకూ బావ నిన్ను అనుమానించారు. ఆ అనుమానాలు పోయి కాస్త కాపురం కుదుట పడిందనుకుంటే, ఇప్పుడు బావను నువ్వు అనుమానిస్తున్నావు. ఏ రాయి అయితేనేం పళ్లూడ కొట్టుకోటానికి" అన్నాను.

"నిజమే సీతా. నా జీవితమే అనుమానాల పుట్ట లేని దాన్ని ఉన్నదనుకుని బాధ పట్టంలో అర్థం లేదు. అది తాత్కాలికమైన మానసిక ఆందోళన. ఆ ఆందోళనకు అవధులు లేవు. ఏం చెయ్యాలో తోచదు, కుమిలికుమిలి ఏడవటం తప్ప. అది నిరాశను చిగురింపచేసే ఆందోళన. ఇప్పుడు మీ బావ విషయంలో నేను పడే ఆందోళన లోక సహజమైంది. అందరూ వేలెత్తి చూపేది. కంటికి కనబడేది. ప్రస్తుతం ఊహఅయినా అది ఎప్పటికయినా నిజమే అవుతుంది. రమాదేవి వాణ్ని ప్రేమిస్తున్నది నేను అంతా అర్థం చేసుకునే చెప్తున్నాను. ఏనాటికయినా నువ్వూ తెలుసుకుంటావు అప్పుడు మీ బావ మనస్సు నువ్వూ అర్థం చేసుకోగలుగుతావు జీవితాలు శాశ్వతం కావే సీతా! మాటలూ, చేతలూ మనంపోయినా కలకాలం చెప్పుకుంటారు. అదే లోకం తీరు" అన్నది అక్కయ్య.

నేను కొయ్యబారినట్లు కూర్చున్నాను. అక్కయ్య మనస్సు ఇంత అగాధంగా మారిపోయినందుకు విచారపడ్డాను.

* * *

అక్కయ్యకు తొమ్మిదో మాసం వచ్చింది. బొత్తిగా నీరసించిపోయింది. ఏ మాత్రం వంట్లో రక్తం లేనట్లుగా పాలిపోయింది. మందులూ, ఇంజక్షన్లూ ఇచ్చినా పరిస్థితి మామూలుగానే ఉన్నది.

ఉత్తరం రాయంగానే అమ్మవచ్చింది. పురిటిఏర్పాటు ఇక్కడే అని నిర్ధారణ చేసుకున్నారు బావ అక్కయ్యను చూసి అమ్మ దిగులుపడ్డది. ఈపురుడు ఎట్లా వెళుతుందోనని. లేడీ డాక్టరు మరేం ఫరవాలేదన్నది. రోజులుగడుస్తున్నయ్యి.

రమాదేవి కనబడ్డంలేదు. బావకూడా రమాదేవి సంగతి ఏం చెప్పటం లేదు. మామూలుగా కాలేజీకి వెళ్ళి వస్తున్నారు.

అక్కయ్యను చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది. కళ్ళల్లో ఉన్నయ్యి దాని ప్రాణాలు. ఇంట్లోకూడా నడవలేక నడవలేక మెల్లిగా నడుస్తుంది. అమ్మ వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంది. బావకూడా కొంచెం ఆందోళన పడసాగారు.

ఒక రోజు రాత్రి నాకు కల వచ్చింది. కల్లో ఒక దుండుముక్కలాంటి పాపాయి నెత్తుకుని బావ నిల్చున్నారు. బావ ఎంతో సంతోషంతో పిల్లాడి నెత్తుకున్నారు. అక్కయ్య కనబడలేదు. బావ చేతుల్లోంచి జారిపోతూ నా దగ్గరకు వస్తానని ఎగుర్తున్నాడు. నేను రమ్మని చేతులు జాపాను. ఆవెధవ చేతులు నాకు అందించి నాదగ్గరకు వచ్చాడు. "ఏరా భడవా, పిన్ని చంక నెక్కావ్. నీకు అమ్మకన్న పిన్నే ఎక్కువ మాలిమి అయిందిరా" అంటూ అక్కయ్య వచ్చింది.

అక్కయ్య పిల్చినా వాడు రానన్నాడు. "పాలిస్తా రారా" అన్నది అక్కయ్య. అప్పుడు వచ్చాడు అక్కయ్య దగ్గిరికి. అక్కయ్య ఎత్తుకున్నా నా దగ్గిరికే వస్తానంటూ చేతులు చాపుతాడు. అక్కయ్య పాలివ్వటానికి తీసుకెళ్ళింది. "నువ్వూ పెళ్ళిచేసుకో సీతా! పనసపండులాంటి పసివాడ్ని ఎత్తుకుందువుగాని" అన్నారు బావ. బావ మాటలకు ఎంతో సిగ్గేసింది. అంతే, మెళకువ వచ్చింది. కలగన్నానని తెలుసుకున్నాను.

తెల్ల వారింది. బావ కాఫీ తాగుతూ కూర్చున్నారు. అక్కయ్య అక్కడే మంచంమీద పడుకుంది. అమ్మ వంటింట్లో ఉంది.

“బావా” అన్నాను.

“ఏం సీతా!”

“అక్కయ్య కనటం వరకే ఇంక పిల్లాడి పోషణభారం మీదే. అక్కయ్యకు ఓపిక లేదుగా. అవ్వాళ విజయవాడ వెళ్లేటప్పుడు రైల్లో చూశామ్. అట్లాగే వాడ్ని మీరే ఎత్తుకు తిప్పుతూ సముదాయించాలి. పిల్లాడ్ని ఆడిస్తూ అక్కయ్యకు సాయం చెయ్యకపోతే మీకు కాలేజీ వేళకు వంట కాదు” అన్నాను.

“నేను పిల్లాడిని ఎత్తుకుంటానో లేదోనని నాకు పరీక్ష పెడతారా మీ అప్పచెల్లెళ్ళు? అంత ఎత్తుకోలేకపోతే ఓపని పిల్లని ఏర్పాటు చేస్తాను” అన్నారు బావ.

“అంతేగాని ఎత్తుకోరన్నమాట. మీ అబ్బాయిని మీకు ఎత్తుకోపటంకూడా కష్టమే. మీకేం, గొప్పవాళ్ళు. ఎంతమంది నౌకర్లనన్నా పెడతారు” అన్నాను

“మరి పిల్లల్ని ఎత్తుకోవటం చేతకాకపోతే ఏం చెయ్యాలి?” అన్నారు.

“మర్చిపోయా, పేరేం పెడుదామనుకున్నారు? ఏమే అక్కా. అసలింతకీ అబ్బాయికావాలా? అమ్మాయికావాలా? అన్నాను.

ఎవరో ఒకరు. ఎప్పుడెప్పుడు ఈ బరువుకాస్తా తీరిపోతుందా అని రోజులు లెక్కిస్తున్నాను. చాలా ఆయాసంగా

ఉంటున్నదే సీతా. ఏమిటో నాకు గుండెల్లో రాయి పడ్డది" అన్నది అక్కయ్య.

"ఎందుకని?"

"ఈ పురుడు ఎట్లా వెళుతుందా అని. నామటుకు నాకు ఏమిటో అధైర్యంగా ఉంది" అన్నది అక్కయ్య దిగులుగా.

"ఏం?"

"ఏమిటో చెప్పలేను. అబ్బ! ఏం గంతులేస్తున్నాడే ఈపొట్టలో. ఉండుండి ఒక్కసారి ఎగుర్తున్నట్లుంది" అన్నది అక్కయ్య. నాకూ నవ్వొచ్చింది.

మరో రెండురోజులు గడిచినయ్యి. అక్కయ్యకు కాస్త సన్న నొప్పులు ప్రారంభమైనయ్యి. బావ కాలేజీకి శెలవు పెట్టారు. అన్నీ సమకుర్చుకుని అక్కయ్యను నర్సింగ్ హోంలో చేర్పించాం. ఉదయం పది గంటలికి నొప్పులు ప్రారంభమైతే సాయంత్రమయినా కాన్పు కాలేదు. అమ్మ కళ్ళనీళ్లు పెట్టుకుని కూర్చుంది. బావ ఖంగారు పడసాగారు. నాకేం తోచటంలేదు. అక్కయ్యకూడా చాలా బాధ పడుతున్నది. కాన్పుల గదిలోనుంచి గంటయినా లేడీ డాక్టరు బైటికి రాలేదు. నర్సులు హడావుడిగా తిరుగుతున్నారు. ఎవర్నడిగినా ఏం చెప్పరు. లేడీ డాక్టరు బైటికొచ్చింది. ఆమర్దాతో బావ, నేను వెళ్ళాం.

"మామూలుగా కాన్పు కాదు. కొలతలు తక్కువగా ఉన్నయ్యి. ఆపరేషన్ చేసి తీయాలి. ఆపరేషన్‌కు రెడీ అవుతున్నాను. ఏం భయపడకండి. అంతా సవ్యంగానే అవుతుంది"

అని చెప్పి వెళ్ళిపోయింది. స్ట్రెచర్ మీద అక్కయ్యను ఆప రేషన్ గదికి తీసుకువెళ్ళారు. హాల్లోనుంచి వెళుతుంటే అక్కయ్య కన్నీళ్ళతో బావకు నమస్కారం చేసింది. నావైపు జాలిగా చూసింది. అమ్మ ఆ వరండాలోనే కుప్పన కూలి పోయింది. నాకూ దుఃఖం పొంగి పొర్లుకొచ్చింది. మనస్సు లోనే ఎక్కు ఆపుకుని గుడ్లనీళ్ళు కుక్కుకున్నాను. బావ ముఖంలో కత్తివేసినా నెత్తురుచుక్క లేదు.

ఆ వరండాలోనే తలో పక్కనా దిగాలుపడి కూర్చు న్నాము. గంటసేపూ ఒకయుగంగా గడిపాము. నాలుక తడారి పోయింది.

గంటయ్యాక నర్సు బయటికి వచ్చింది సంతోషంగా చెప్పింది. "ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గానే అయింది. మగ పిల్ల వాడు. చక్కగా పుష్టిగా ఉన్నాడు" అని అంది.

సంతోషం పట్టలేక ఎగిరి గంతులేద్దామనిపించింది. అమ్మకు ఆదుర్దా తగ్గి మెల్లిగా లేచి కూర్చుంది. బావ చిరు నవ్వుతో ముఖం తుడ్చుకుంటూ నావైపు చూశారు. అందరి ఆదుర్దా తీరింది మా మనస్సులు తేలికపడ్డయ్యి లోపలికి వెళ్లి చూసి వద్దామనుకున్నాం. అక్కయ్యకు ఇంకా తెలివి రాలే దుట. అందుకని వెళ్ళొద్దన్నారు. గండం గడిచిందనుకున్నాం. నా సంతోషానికి హద్దులు లేవు. ఈ శుభవార్త రమాదేవికి చెప్పాలనిపించింది.

అరగంట గడిచింది. నర్సు అక్కయ్య గది లోనుంచి ఆదుర్దాగా పరుగున వెళ్ళి లేడీ డాక్టరును పిల్చుకొచ్చింది. లేడీ డాక్టరు వచ్చింది! అయిదునిమిషాల్లో బయటికొచ్చింది.

బావనూ, నన్నూ, అమ్మనూ నమ్మన్నకు వెళ్లాం. పై ప్రాణాలు పైనే పోయినయ్యి. అక్కయ్య పిచ్చి చూపులు చూస్తున్నది. గుడ్లు తిరిగిపోతున్నయ్యి. కళ్ళు వాలిపోతున్నయ్యి. నోరు మాటపడి బిగుసుకుపోయింది. కాళ్ళూ చేతులూ చల్లబడ్డయ్యి. మందులూ, ఇంజక్షన్లూ, ఆక్సిజన్ అన్నీ ఇచ్చారు. బిత్తర చూపులతో మా అందరి వైపూ చూసింది. ఎంతో ప్రయాసతో నోరు పెగుల్చుకుని బావతో ఈ నాలుగు మాటలూ చెప్పింది

"ఇంక నేను అందర్నీ విడిచి పోతున్నాను. బాబుని చూసుకోండి. ఒక్క మాట చెప్తారా?" అన్నది, బావ చెయ్యి తన చేతుల్లోకి తీసుకుని.

"ఏమిటది జానకీ!" అన్నారు బావ.

"నామీద మీకున్న అనుమానాలన్నీ తీరినయ్యా? నేను, నేను ... నేనేమీ పతితురాల్ని కాదు" అన్నది బొంగురు పోయిన కంఠంతో. ఈ మాటలకు మా అందరి కళ్ళు చెమ్మగిల్లినయ్యి బావకు పట్టరాని దుఃఖం పెల్లుబికి వచ్చింది.

"క్షమించు జానకీ! నేను మూర్ఖుడ్ని. నువ్వు దేవతవు. నిన్ను అర్థం చేసుకోలేకపోయాను. అర్థం చేసుకున్న సమయంలో, నా తప్పు నేను తెల్సుకున్న తరువాత నువ్వు ఈ తీరుగా ..."

ఇంక మాట్లాడలేకపోయారు బావ. అక్కయ్య చేతులలో తన ముఖాన్ని కప్పుకుని చిన్న పిల్లాడిలా బావురుమని వెక్కి వెక్కి ఏడ్చారు. లేడీ డాక్టరూ, నర్సులూ బావను

కేకలేశారు. నేను లోపల్లోపలే కుమిలిపోతూ అక్కడే నిల్చున్నాను.

బావ కళ్ళు తుడిచింది అక్కయ్య.

"విచారించకండి నేను ఏ అపవాదులూ నెత్తిన వేసుకోకుండానే ముత్తైదువుగానే వెళ్ళిపోతున్నాను. అదృష్టవంతురాలినే. ఇంకో మాట. మీకూ, సీతకూ... ఇష్టమైతే..." ఇంక మాట్లాడలేకపోయింది.

కళ్ళు మూతలు పడినయ్యి. క్షణంలో అంతా చూస్తూండగానే శాశ్వతంగా కన్ను మూసింది అక్కయ్య. అమ్మ బావురుమని శవంమీదపడి ఏడ్చింది. నా పరిస్థితి చెప్పలేను. బావ ఆక్షణంలోనే పిచ్చివాడిలా అయిపోయారు. కళ్ళంట నీళ్ళు కారుతున్నాయి. ఏమీ మాట్లాడకుండా అక్కయ్య ముఖంలోకిచూస్తూ నిల్చున్నారు. ఎంతో బరువుగా నిట్టూర్చి అక్కయ్యకు నమస్కరించి తలొంచుకుని మెల్లిగా ఆ గదిలోంచి బయటికి వచ్చేశారు.

శవంపైన దుప్పటికప్పి నర్సులు మమ్మల్ని బయటికి పొమ్మన్నారు.

ఇంతవరకూ చెప్పి సీత కంట తడిపెట్టింది,

* * *

సీత మళ్ళీ చెప్పసాగింది. రాధకూడా కళ్ళు తుడ్చుకుని ఎంతో ఆసక్తితో వినసాగింది—

"కర్మ కాండలన్నీ యథావిధిగా జరిగినయ్యి. వచ్చిన బంధువులంతా వెళ్ళిపోయారు. అమ్మ కడుపు దుఃఖంతో సగమైంది. బావ స్తబ్ధుడై పోయారు. ఎప్పుడూ కళ్ళలో కన్నీళ్ళ

తిరుగుతూనే ఉండేవి. ఎవ్వరితోనూ మాట్లాడరు. నేనూ, సుభద్రా గుండె రాయి చేసుకోక తప్పలేదు.

నెల్లోపలనే ఇంక ఉండలేక అమ్మా, నాన్నా, నేనూ ఏలూరు వెళ్ళిపోదామనుకున్నాం.

తల్లి గండాన పుట్టాడో ఏమో పిల్లాడు కులాసాగానే ఉన్నాడు. తల్లి కనీసం కళ్ళారా ఆ పసికందుని చూసుకునే యోగ్యతకూడా లేకపోయింది. వాడెంత పాపకర్మం చేసుకున్నాడో. అక్కయ్య బ్రతికుంటే వాడి మంచిచెడ్డలు ఎంతో ఆనందంగా, సంతోషంగా చూసుకుంటూ వేళకు నీళ్ళుపోసి, పాలుబట్టి, ఉగ్గుపెట్టి, పౌడరు రాచి, బొట్టుపెట్టి, వాడి ముద్దు ముచ్చటలు చూసి ఆనందించేది. ఆ అదృష్టం వాడికి లేదు. ఎవరికి వీలయితే వాళ్లు ఆ పసివాడికి నీళ్ళు పోస్తున్నారు. ఎవరికి వీలైతే వాళ్ళు పాలు పడుతున్నారు. వీడ్ని చూసి అంతా విచారపడుతున్నారేకాని, సంతోషపడటం లేదు.

బావకళ్ళలో కన్నీరు ఇంకిపోయింది. పశ్చాత్తాపంతో ఆయన మనస్సు దహించుకు పోతున్నట్లుగా అర్థం చేసుకున్నాను. కాపురానికి వచ్చిన సంవత్సరంలోపల, జానకి విషయంలో తను చూపిన నిరాదరణా, మొదట్లోపడ్డ అనుమానాలూ, అన్నీ తల్చుకుని కుమిలి పోయేవారు. ఎప్పుడూ ఉయ్యాలవద్ద నిల్చుని, ఆ పసివాడ్ని చూస్తూ కళ్లు తుడుచుకునే వారు.

ఈ పెద్దతనంలో కోడలు కర్మ కాండలు జరుపుతూ, నేను బ్రతకవలసివచ్చిందని అక్కయ్య మామగారు అందరితో చెప్పి బాధపడేవారు.

వెళ్ళేరోజున అమ్మ కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఆ పరిస్థితి చూస్తే అమ్మకూడా ఈ దిగులుతోనే ఏమన్నా అవు తుందా అనిపించింది. పసివాడ్ని జాగ్రత్తగా చూసుకోమని ఆవిడతో చెప్పలేక చెప్పలేక అమ్మ చెప్పింది. సుభద్ర నన్ను కావిలించుకుని ఒకటే ఏడుపు.

"సీతా! వదిన పోయిందని, ఈ ఇంటితో మీకేం సంబంధం లేదని రాకపోకలు మానెయ్యకు. మీ అక్కయ్య ఉన్నప్పుడు ఎట్లా ఉండేదానివో ఇప్పుడూ అట్లాగే ఉండాలి. బాంధవ్యం తెంచుకోకు" అంటూ ఏడ్చింది.

నా పరిస్థితి ఇంక చెప్పనక్కరలేదు. ప్రయాణమవు తూంటే అక్కయ్య ఇంకా ఇంట్లోనే తిరుగుతున్నట్లూ, తన సంసార జీవితంలోని కబుర్లు నాకు చెపుతున్నట్లూ, అంత పెద్ద పొట్టతో నడవలేక మెల్లిగా నడుస్తున్నట్లూ, రమాదేవితో మాట్లాడుతున్నట్లూ స్పష్టంగా కనిపించింది. కళ్లు మూసినా, కళ్ళు తెరిచినా అక్కయ్య కనిపించేది మానవ జీవితాల్లో ఎంత మార్పు? ఎన్ని విచిత్ర సంఘటనలు? ఎన్ని చావులు?

వెళ్ళలేక వెళ్ళలేక అంతా కన్నీళ్ళతో బండిఎక్కాం. గంపెడుచీకటి నెత్తినేసుకుని, పుట్టెడుదిగులుతో, విచారంతో, ఆవేదనతో రైలెక్కాము.

* * *

"చచ్చిన్నాటి దుఃఖం మర్నాడు ఉండదు, మర్నాటి దుఃఖం మూడోనాడు ఉండదు" అని అంటారు పెద్దవాళ్లు. వారి భావంలో దుఃఖమంటే పైకి వ్యక్తపరిచే కన్నీళ్ళే

కావచ్చు. పలకరించటానికి వచ్చిన వాళ్ళనిచూసి పొంగిపొర్లు
కొచ్చే భారంతో భావురుమని ఏడవటమే కావచ్చు.
అలాంటి దుఃఖం పిల్లల విషయంలో తల్లిదండ్రులు వ్యక్త
పరిచేది. తల్లిదండ్రులు పోయినప్పుడు పిల్లలు వ్యక్తపరిచేది.
అల్లుడు పోయినప్పుడు కూతుర్ని చూసి వ్యక్తపరిచేది భార్య
పోయినప్పుడు భర్త, భర్త పోయినప్పుడు భార్య వ్యక్తపరి
చేది. ఈ ఐదు రకాల చావులూ మనిషిని కృంగదీసేవి. ఈ
ఏకమైన దుఃఖాన్ని వ్యక్తపరిచేది ముఖ్యంగా అమ్మవంతు,
తరువాత నాన్నవంతు, బావవంతు అక్కయ్య చావు నా
విషయంలో వీరందరినీ మించిపోయింది. కన్నీరు కాలువలు
కట్టేట్టుగా పెద్దవాళ్ళు ఏడ్చినట్టుగా బావురుమని ఏడవలేను.
పలకరించటానికివచ్చిన వాళ్ళనుచూసి అమ్మమాదిరి రాగాలు
పెట్టలేను. నా జీవితం అటువంటిది. వయస్సుకీ, జీవితానికీ,
సంబంధం ఉన్నది బాంధవ్యానికీ, వయస్సుకి సంబంధం
ఉంది. మానసిక సంక్షోభానికీ, బాంధవ్యానికి సంబంధం
ఉంది. నా మనస్సులో, హృదయంలో, ఆలోచనలలో, నిత్య
జీవితంలో అనుక్షణమూ అక్కయ్య సంగతులే ఆక్రమించి
నయ్యి ఇంట్లో తిరుగుతూ చూసినా, భోజనం ముందు
కూర్చున్నా, ఆకాశంవంక చూసినా సర్వత్రా అక్కయ్య
రూపమే కనబడుతుంది. ఆందోళన తప్ప కన్నీళ్ళు రావు.
అక్కయ్య ఆలోచనలు తప్ప మరే ఆలోచనా లేదు. బావను
తల్చుకుంటే సానుభూతి కలుగుతుంది. ఏం మాట్లాడాలో,
ఎట్లా పలకరించాలో తెలీదు. రమాదేవిని తల్చుకుంటే ఏదో
తెలీని ఈర్ష్య కలుగుతుంది. ఎందుకో తెలీదు. అందరి జీవి

తాలనీ ముడిపెట్టి, అందరి మనస్సులూ అర్థం చేసుకుని, ఎవరికి ఎట్లా నచ్చచెప్పాలో నచ్చచెప్పి, అందరి ఆదరాభిమానాలూ పొందుతూ, కాస్త కాపురంకుదుటపడే సమయంలో అందర్నీ వదలి అక్కయ్య శాశ్వతంగా తనే వెళ్ళిపోయింది. తల్చుకుంటే కడుపు చెరువైపోతుంది. నిత్యజీవితమే శూన్యంగా తోస్తుంది. నిరాశ, తీరని ఆవేదన. బావమీదా, రమాదేవిమీదా ఏమిటో, ఎందుకో తెలీని కోపం

అందరికీ పరీక్షలయి శలవులిచ్చారు. అక్కయ్య పోయి రెండు నెలలయింది. మళ్ళీ కాలేజీలూ స్కూళ్ళూ తెరిచే రోజులు దగ్గరకొచ్చినయ్యి. గుంటూరునుంచి వచ్చాక బావ రెండు ఉత్తరాలు నాన్నగారిపేర రాశారు. పిల్లవాడు కులాసాగానే ఉన్నట్లు. వాళ్ళ నాన్నగారు వినుకొండనుంచి మళ్ళీ గుంటూరు మార్పించుకున్నారట. మళ్ళీ యథాప్రకారం అంతా కలిసి ఉంటున్నారట.

ఒకరోజున నాపేర కవరొచ్చింది. ఆత్రంగా కవరువిప్పి ఉత్తరం చూశాను. రమాదేవి రాసిన ఉత్తరం. రమాదేవి మీద కోపం కలిగి క్షణంలోనే మాయమైంది.

గుంటూరు.

సీతా,

నా ఉత్తరంచూసి నువ్వు కోపగించుకుంటావని తెలుసు. కారణం విడమర్చి చెప్పనక్కరలేదు. కొంతమంది వ్యక్తులకు సంఘంలో ప్రత్యేకస్థానం ఉంటుంది. మనస్సు, హృదయము ఉండీ, ఎంత సహృదయతతో సద్భావాలనే పెంపొందించు కున్నా, సాంఘిక న్యాయ సూత్రాలకు కట్టుబడి, దూరంగా

ఉంటూనే చూస్తూండవలసిందే. లేకపోతే ఇంకా విపరీత పరిస్థితులను ఎదుర్కోనవలసి వస్తుంది. మీ అక్కయ్య పోయినప్పుడు ఆసుపత్రికి మాత్రమే వచ్చి మిమ్మల్ని చూడగలిగాను. మళ్ళా ఇంటికొచ్చి నీతో మాట్లాడి నా మానసిక వ్యథను నీతో చెప్పుకోటానికి సాహసించలేక పోయాను. కారణం అందరికీ భయపడే. మీ ఇంటికి రాగానే జరిగిన విషయాలెట్లావున్నా "ఆ అమ్మాయితోనే మా అల్లుడు ఉంటున్నది" అని మీఅమ్మగారనవచ్చు. "మా అబ్బాయి కాపురము చెడగొట్టింది ఈ అమ్మాయే" అని మీ అక్కయ్య అత్తగారు అనుకోవచ్చు. అప్పుడు నామనస్సు, పరిస్థితి ఎట్లా ఉంటుందో నువ్వే ఆలోచించు. మీ బావగారితో నేను చనువుగా ఉంటమూ, వాళ్లింటికి వెళ్ళటమూ నానోసటన ఈరాత రాసినయ్యి. అనుమానాలు అనుకోకుండానే కలుగుతయ్యి. మానవ సహజమే అది బజారులో రోడ్డుమీద చెల్లెలితో మాట్లాడినా అసందర్భంగా చిత్రించుకుని నవ్వుకునే రోజులివి. అందుకే నేను మళ్ళారాలేదు క్షమించమని వేడుకుంటున్నా. శలవులలో ఏమీ తోచటంలేదు. మనస్సూ సరిగా లేదు.

ఇటీవల ఒకసారి సుభద్ర కనిపించింది. స్కూలుఫైనల్ ప్యాసయింది. కాలేజీలు తెరిచాక పి. యు. సి లో చేరుతుందిట. నేనూ బి. కాం. ఫైనల్ ఇయర్‌లో చేర్తాను. నీ చదువు సంగతి ఏమిటి? మానేసినట్లేనా? నువ్వూ ఏలూరులో కాలేజీలో చేరితే మంచిదేమో?

జీవితంలో కాలప్రవాహానికి ఎదురీదటమనేది వాంఛనీయం కాదేమో? జీవిత సమస్యల్ని పరిష్కరించుకోలేక,

నిత్యమూ అనేకసంఘర్షణలకు గురవుతూ కాలం వెళ్లబుచ్చుట మనేది ఆడదాని జన్మహక్కుగా నాకు అనిపిస్తున్నది.

మీ అక్కయ్య (బతికున్నన్నాళ్ళు ఆవిడజీవితంకూడా ఈ రకంగానే గడిచిపోయింది. మళ్లీ మన కలయిక ఎప్పుడో? వెంటనే జాబు రాస్తావుగా!

నీ స్నేహితురాలు,
రమాదేవి.

ఉత్తరం చదివాక రమాదేవిమీద నాకు ఎందుకో తేలికభావం కలిగింది. కారణం నాకే తెలియదు. తప్పులు చేయటం, ఆ తప్పులు దిద్దుకోవటం, ఆ తప్పులవలన బాధ పడటం మానవ సహజమే. కాని, రమాదేవి విషయములో అనూహ్యమైన సంగతులను తల్చుకుని ఎందుకో బాధ పడ తాను. బాధ పడ్డాను.

రమాదేవి ఉత్తరానికి సమాధానం రాశాను.

కాలేజీలు తెరిచారు. ఊరికే కూర్చుంటే అనేక ఆలోచనలు, అనేక విచారాలు, అనేక రకాలయిన భావాలు. అర్థం లేనివి కొన్ని, అర్థం ఉన్నవి కొన్ని, అర్థం చేసుకుందామన్నా అర్థం కానివి కొన్ని.

నాన్నతో చెప్పాను, కాలేజీలో చేరుతానని. ఆయన ఏం మాట్లాడలేదు. నాన్నకి ఆర్థికచిక్కులు. ఆ ఆర్థికచిక్కులు అనేక రకాలు. అమ్మని అడిగాను. ఆవిడ మనస్సు అక్కయ్య చావుతో అగాధమై పోయింది. ఆవిడ మనస్సులో ఏముందో స్పష్టంగా చెప్పలేదు. "చూద్దాంలేవే" అన్నది ఆ చూద్దాం అన్న మాటకు అంతర్యమేమిటో అప్పుడు నాకు తెలీలేదు.

రెండు రోజులు గడిచినయ్యి. నాన్న నన్ను పిల్చారు. కాలేజీలో చేర్పించటానికి ఒప్పుకున్నారు కాబోలనుకున్నాను.

"సీతా!"

"ఏం నాన్నా?"

"చదువుకోవాలనే ఉందా?"

"అందుకేగా నాన్నా కాలేజీలో చేరతాననంది".

"అసలు నీ ఉద్దేశ్యమేమిటో, నీ భవిష్యత్తు ఎట్లా నిర్ణయించుకున్నావో చెప్పు తల్లీ" అన్నారు కన్నీరు పెట్టుకుని.

"భవిష్యత్ విషయం నేను ఆలోచించలేదు నాన్నా. కాలేజీ చదువు పూర్తయ్యాకనే భవిష్యత్ సంగతి ఆలోచించటమనేది" అన్నాను.

"బి. య్యే. పూర్తి కావాలంటావా?"

"నేనే మగపిల్లవాడినయితే చదివించవా నాన్నా?"

నాన్న మనస్సులోనే నవ్వుకుని "నిజమేనమ్మా" అని అన్నారు.

"మీ ఉద్దేశ్యమేమిటి నాన్నా?"

"ఏం లేదమ్మా. అట్లాగే కాలేజీలో చేరి చదువుకో" అని కళ్ళు తుడుచుకున్నారు.

అమ్మ దగ్గరకు వెళ్లాను.

"నాన్న ఒప్పుకున్నారమ్మా చదువు చెప్పించటానికి. ఎల్లుండి కాలేజీలో చేర్తాను" అన్నాను అమ్మతో.

అమ్మ "నీ ఇష్టం" అంది.

# 13

అమ్మా, నాన్న మాటలు చూస్తే నాకు చదువు చెప్పించాలని వాళ్ళకు లేనట్లుంది. వాళ్ల మనస్సులోని భావాలు నాకు చెప్పలేక పోతున్నారు. అయినా వాళ్ల ఉద్దేశ్యం నన్నూ ఒకరికిచ్చి కట్టబెడదామని. అంతకన్నా ఇంకేం ఉద్దేశ్యాలుంటయ్యి

పి. యు. సి.లో చేరాను. అమ్మా, నాన్నా ఏ ప్రస్తావనా ఎత్తలేదు. కాలేజీలో చేరినట్లుగా రమాదేవికీ, సుభద్రకు ఉత్తరం రాశాను.

ఉత్తరాలు రాస్తూంటే నాకు మనస్సు చివుక్కుమంది. అక్కయ్య కనుక బ్రతికుంటే నేను కాలేజీలో చేరానని వింటే ఎంత సంతోషించేదో? ఎన్ని ఛలోక్తులు, ఎన్ని హితోక్తులు చెపుతూ ఎంత పెద్ద ఉత్తరం రాసేదో? అమ్మ అన్నట్లుగా మంచికిగాని, చెడుకుగాని తోడ బుట్టిన వాళ్ళుండాలని. అక్కయ్య పోయినరోజున అమ్మ ఇట్లాగని గుండెలుబాదుకుని ఏడ్చింది. "మీ కాపురాలు మీరుచేసుకుంటూ ఏ పండక్కో, పబ్బానికో మీ భార్యా భర్తలిద్దరూ ఒక్కసారిగా ఇద్దరు కూతుళ్లూ, ఇద్దరల్లుళ్లూ వస్తారని అనుకునేదాన్ని. పెద్దవాళ్లం కలకాలం ఉండం గదా! మగపిల్లలు లేకపోయినా ఈ ఇద్దరు కూతుళ్ల చేతుల్లోనయినా మేం వెళ్లిపోతే బాగుండును" అని ఏడ్చింది. ఇప్పుడిక ఉత్తరాలు ఆప్తులయిన వాళ్లకి ఎవళ్లకు రాయాలి? నాకు ఆప్తులయిన వాళ్లు రమాదేవి, సుభద్ర. బావ ఆప్తుల్లో ఒకరయినా ఆయనకు ఉత్తరం రాయలేక

పోయాను. అదే ఆడదాని [illegible]కి భగవంతుడు సృష్టించిన గిరిగీత. భావతో [illegible] [illegible]యాలో ఎంతసేపో నవ్వుతూ మాట్లాడొచ్చు. ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకో వచ్చు కాని ఉత్తరాలు రాయాలంటే సాంఘిక న్యాయ సూత్రాల దృష్ట్యా అదికాని పని, తగని పని, నలుగురూ హర్షించని పని. ఏ మరదలూ ఏ భావకూ ఉత్తరాలు రాయదు, రాయకూడదు. రాస్తే అనేక అపోహలకు దారి తీయవచ్చు. అనేక దురభిప్రాయాలు మనస్సుల్లో చిత్రించుకోవచ్చు. అందుకనే భావకు ఉత్తరం రాయలేకపోయాను. మాటలకూ, రాతలకూ అంత తేడా ఉంది లక్ష మాటలు మాట్లాడినా రాని అనుమానాలు, ఒక్క ఉత్తరంతో వచ్చేస్తాయి.

కాలేజీ వాతావరణం నాకు చాలా కొత్తగానే ఉంది. హైస్కూలు చదువు జీవితంలో విద్యార్థుల అల్లరు వేరు. బ్లాక్‌బోర్డు మీద మాష్టరు బొమ్మవేసి అల్లరిచేసే రోజులవి. కాలేజీ జీవితం అట్లాకాదు. అల్లరి కూడా హుందాతనంతోనే చేస్తారు. లెక్చరర్ల చేతులో మాటలు కూడా హుందాతనం తోనే పడతారు. అంతలో అంత మార్పు వస్తుంది. కారణం మనస్సుల్లో, భావాల్లో కలిగే మానసిక పరిణామమే అది.

ఇంక ఆడపిల్లల జీవితాలూ, వాళ్ళ కట్టుబొట్లల్లోనూ తేడా కనిపిస్తుంది హైస్కూలు జీవితంలో టిఫిన్ కారియరు పట్టుకొని, ఇంత పుస్తకాల దొంతరా గుండెల కదుముకుని, నడిచి వెళ్ళే ఆడపిల్లలు కాలేజీలో చేరగానే ఇట్టే మారిపో తారు. కంటి జబ్బునా్న లేకపోయినా కళ్ళకు పెట్టుకునే రోల్డు

గోల్డు ఫ్రేము కళ్ళద్దాలూ, రిస్టు వాచీలతో రావటమే కాక పాపం వాళ్ళు నడవలేరు. ఇద్దరిద్దరూ కలిసి రిక్షా ఎక్క వలసిందే.

ఒక కన్ను కన్ను కాదు, ఒక బిడ్డ బిడ్డకాదు అన్న సామెత నా విషయంలో కూడా వర్తించింది. అక్కయ్య చావుతో నామీద కళ్ళు పెట్టుకుని అమ్మా, నాన్నా బ్రతుకు తున్నారు. కాలేజీకి వెళ్ళుతుంటే అమ్మ ఎన్నోసార్లు 'జాగ్రత్తగా వెళ్ళమ్మా' అని చెప్తుతుంది. నాన్న 'రిక్షా చేసుకుని వెళ్ళు సీతా. జాగ్రత్తగా కూచో. రిక్షావాడ్ని జాగ్రత్తగా తొక్కమను. జాగ్రత్తగా వెళ్ళిరా తల్లీ' అంటూ పదే పదే హెచ్చరించేవారు.

పిల్లల మనోభావాలూ, అభిలాషలూ, కట్టుబాట్లూ పెద్దల పెంపకం మీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటయ్యి. తల్లిదండ్రులు డబ్బుగల వాళ్ళయితే ఆ పిల్లలకు ఏ కొరతా సామాన్యంగా ఉండదు. కావలసిన బట్టలూ, పుస్తకాలూ, డబ్బా అన్నీ యిచ్చి మా పిల్లలే కదా ఇంత కష్టపడి చదువు కుంటున్నారనుకుంటారు. దాంతో ఆ పిల్లలకు ఇంట్లోలేని పోని ఆధిక్యత పెరిగి, పెంకితనం ఏర్పడి చెడిపోయే సావకాశాలూ లేకపోలేదు.

డబ్బులేని వాళ్ళకు పిల్లల మీద ప్రేమ ఉన్నా వాళ్ళకు కావలసిన అవసరాలను ఎక్కువ తీర్చలేక కేవలంగా మాటల్లోనే సానుభూతి చూపిస్తూ వాళ్ళను బళ్ళల్లోకి పంపి చదివిసారు.

నా పరిస్థితి అటూ ఇటూ కాకుండా ఉంది. ఉన్నది ఒక్క కూతురేనని గొప్పవాళ్ల పిల్లలమాదిరి అన్ని వసతులూ ఏర్పరచలేరు. మధ్య తరగతి కుటుంబీకులంకదాని దానికి తగినట్లుగానే ఉందామనే ఉద్దేశ్యమూ ఉండదు. గొప్పవాళ్ల పిల్లలతో సరితూగే రీతిగా నన్ను ఉంచాలని నాన్న ప్రయత్నం. కారణం ఒక్కగా నొక్క పిల్లని. ఆ రీతిగా భారీ తనంగా ఖర్చుపెట్టాలంటే డబ్బు కావాలి. నాన్నకు వచ్చే జీతం చాలదు. కారణం ఉన్న ఎకరన్నరపొలం అక్కయ్య పెళ్లికి అమ్మేశారు. జీతం తప్ప పొలాలమీద వచ్చే రాబడి లేక అన్ని అవసరాలూ నాన్న గారికి వచ్చే జీతంలోనే సరి పెట్టుకోవాలి

మా ఇంటికి నాలుగిళ్లు అవతల ఒక సేల్సుటాక్సు ఆఫీసరు గారు కొత్తగా వచ్చారు వాళ్లమ్మాయి జ్యోతి కూడా కాలేజీలో చదువుతోంది. ఆ అమ్మాయి బి యస్. సి. ఫస్టు ఇయర్. రోజూ రిక్షా వాళ్లింటికి వస్తుంది. ఎంతో చక్కగా ముస్తాబై రిక్షా కోసం కూర్చుంటుంది జ్యోతి. రిక్షా రాగానే రిక్షాలో కూర్చుని మా ఇంటిముందుగానే నన్ను చూస్తూనే వెళ్లిపోతుంది. నేను సందు చివరిదాకా నడిచి వెళ్లి అక్కడ రిక్షా బేరం చేసి అప్పుడు రిక్షా ఎక్కి కాలేజీకి వెళతాను. అక్కడి నుంచీ కాలేజీకి అరణాలు. ప్రతినెలా ఏ ఇబ్బందీ లేకుండా పదిహేను, ఇరవై యో తారీఖు వరకూ రోజూ నాన్న రిక్షాకి డబ్బు లిచ్చేవారు తరువాత మళ్లీ నెలాఖరు దాకా కొంచెం ఇబ్బంది పడుతూనే ఉండేవారు. రోజూ రానూ పోనూ ముప్పావలా రిక్షాకే అయ్యేది.

ఒకరోజున నాన్న అన్నారు, "సీతా! ఇద్దరికీ అయితే రిక్షా అర్ధరూపాయికి కడతారు నువ్వూ ఆ సేల్సుటాక్సు ఆఫీసరు గారమ్మాయి కలిసి వెళితే చేరో పావలాతో పోతుం దిగా, ఆ అమ్మాయిని అడక్కపోయావా" అన్నారు.

"ఆ అమ్మాయి రోజూ నా వైపు చూస్తూనే రిక్షాలో వెళుతుంది నాన్నా నన్ను పలకరించదు" అన్నాను.

"చూడమ్మా! వాళ్ల నాన్నగారు ఆఫీసరు. నీ తండ్రి గుమాస్తా జరుగుబాటు ఉంది గనుక అంతడబ్బు ఇచ్చి ఒకర్తే వెళుతుంది. అవసరం మనది కనుక నువ్వే పలకరించి అడిగినందువల్ల తప్పేం లేదమ్మా" అన్నారు నాన్నగారి భావం నాకు అర్థమైంది రోజుకి ముప్పావలా చొప్పున నా రిక్షాకే ఇవ్వాలంటే ఆయనకూ కష్టమే మరి.

"అట్లాగే నాన్నా. ఈ రోజునే అడుగుతాను' అన్నాను.

కాలేజీకి వెళ్లేముందు వాళ్ళింటికి వెళ్లాను. నన్ను చూచి కొంచెం ఆశ్చర్యపడింది జ్యోతి.

"రండి కూర్చోండి. కులాసా. ఏమిటి విశేషం?" అన్నది జ్యోతి.

ప్రస్తావన ఎట్లా తీసుకురావాలో తెలీక కొంచెం తికమక పడ్డాను.

"మీరు రోజూ కాలేజీకి రిక్షా మీద వెళుతున్నారనుకుంటాను" అన్నాను.

"అవునండీ మీరు నడిచివెళుతున్నారా" అన్నది జ్యోతి.

"లేదండీ నేనూ రిక్షాలోనే పోతున్నాను. ఇద్దరం ఒక బజారు వాళ్లమే కనుక కలిసి వెళితే ఖర్చు కలిసొస్తుందేమో నని. మీ ఇష్టమైతే రోజూ ఇద్దరం కలిసే ఒక రిక్షాలో వెళ దాం' అన్నాను బెరుగ్గానే.

జ్యోతి కొంచెం చులకన భావంతో నవ్వుతూ, "ఎంత తగ్గుతుంది లేండి. రోజుకో పావలో, అరణాలో కద. దాంతో మనమేం మేడలూ మిద్దెలూ కట్టబోంకద" అన్నది.

నేనూ పేలవంగా నవ్వి ఊరుకున్నాను.

"మీకు ఇష్టమైతేనే. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పోవచ్చు' అన్నాను.

"సరే అట్లాగే. ఇవ్వాళ నుంచే పోదాం" అన్నది.

బ్రతుకుజీవుడా అని 'థ్యాంక్సు' చెప్పి వచ్చేశాను. నాన్నగారు ఎంతో సంతోషించారు ఆ రోజు నుంచే ఇద్దరం కలిసి ఒక రిక్షాలోనే కాలేజీకి వెళ్ళి ఒక రిక్షాలోనే సాయంత్రం పూట వస్తున్నాము.

కోరికలు జరుగుబాటు నుంచి కలుగుతయ్యి. జరుగు బాటు డబ్బునుంచి ఏర్పడుతుంది. అహంభావం, దర్జా, డాబుసరి కేవలం డబ్బువల్లరాదు. అధికారంవల్ల వస్తుంది. ఉద్యోగాన్ని బట్టి అధికారం వస్తుంది.

సహాధ్యాయిని కాకపోయినా నేనూ కాలేజీలో చదువు కునేదాన్ని. తన ఈడుదాన్నే. విచక్షణాజ్ఞానమూ, ఇంగిత జ్ఞానమూ కలదాన్నే. మరి నేను అధికారి కూతుర్ని కాదు.

రిక్షాలో పోతున్నా జ్యోతి ముభావంగానే ఉండేది. అడిగిన దానికే సమాధానం. పోనీ ఆ అమ్మాయి స్వభావమా

అనుకుంటే అదేం కాదు. ఎంతో చక్కగా, చిలిపిగా, తెలివిగా మాట్లాడుతుంది. జ్యోతి స్నేహితురాళ్ళంతా కలెక్టరు గారమ్మాయి, తాసిల్దారుగారి అమ్మాయి, పోలీసు సూపర్నెంటు గారమ్మాయి. వీళ్ళు ముగ్గురూ, జ్యోతి నలుగురూ కలిస్తే ఎన్ని గంటలసేపయినా మాట్లాడేస్తారు. అంతా పెద్ద ఉద్యోగస్తుల పిల్లలు కాబట్టి.

రోజూ జ్యోతి, నేనూ కూడా టిఫిన్ బాక్సులో మధ్యాహ్నానికి టిఫిన్ తీసుకు వెళ్ళే వాళ్ళం. జ్యోతి ఫ్లాస్కులో కాఫీ కూడా తెచ్చుకునేది. నేను మధ్యాహ్నం కాఫీ తాగే దాన్ని కాదు. కారణం ఎక్కువ ఇష్టత లేక.

"ఇవ్వాళ టిఫినేం తెచ్చావ్ సీతా?" అన్నది జ్యోతి.

"ఉప్మా"

"ఉప్మానా మధ్యాహ్నానికి చల్లారిపోయి ఏం బావుంటుంది. చక్కగా మైసూరు పాకో, రవ్వ లడ్డూనో, అయితే ఎంతో రుచిగా ఉంటుంది. కారం ఏ మిక్స్చరో, బూందినో అయితే అక్కడికి స్వీటూ, హాటూ తినొచ్చు. నేను రోజూ స్వీటూ, హాటూ రెండూ తెచ్చుకోవాల్సిందే. కాఫీతాగవా?"

"మధ్యాహ్నంపూట తాగను. కాఫీ ఎక్కువ సయించదు."

"చాలా పొదుపరివన్నమాట. చల్లారిన ఉప్మాతిని పంపులో మంచినీళ్లు కాఫీ తాగుతావన్నమాట" అని హేళనగా నవ్వింది.

"మంచినీళ్ళు కాఫీగా ఎట్లా తాగుతారు జ్యోతీ, నీదంతా మరీ సోద్యం" అన్నాను.

"ఇడ్లీలు కూడా తెచ్చుకుంటావా ?"

"ఆహా. అప్పుడప్పుడూ అవ్వేనూ. అట్లుకూడా తెచ్చు కుంటాను. పూరీలు, పెసరట్లు, మినపట్లు, ఒకో రోజున ఒకో టిఫిన్" అన్నాను.

"అంతా చప్పగా చల్లారిపోయిన సరుకయితేనే ఇష్ట మన్నమాట అలాంటివన్నీ నేను వేడి వేడి వయితేనే తింటాను. చల్లారితే నాకు సయించవు. అయితే ఉప్పుడు పిండి కూడా తెచ్చుకో అప్పు డప్పుడూ" అని నవ్వింది జ్యోతి.

జ్యోతి మనస్తత్వానికీ, అహంభావానికీ మనస్సులో విచార పడ్డానే కాని ఏమీ అనలేకపోయాను.

* * *

రోజులు గడిచిపోతున్నయ్యి. దసరా పండుగలకు పది రోజులు శలవు లిచ్చారు. జ్యోతి గుంటూరు వెళ్ళింది.

దసరా పండుగలు తల్చుకుంటే నా మనస్సు వికలమై పోయింది. నిరుడీ రోజుల్లో దసరాకు అక్కయ్య గారింట్లో ఉన్నాను. అక్కయ్య జీవితం తీర్చిదిద్దటంలో ఆ రోజుల్లో కాలం అట్లా గడిచిపోయింది. చక్కగా, సరదాగా అక్క య్యతో, బావతో కబుర్లు చెపుతూ విజయవాడకు కనకదుర్గా దేవిని దర్శించటానికి వెళ్ళటమూ, రైల్లో జరిగిన, చూసిన సంఘటనలూ, బావ స్నేహితులింట్లో ఆయన భాగ్యతో ఎన్నో విషయాలు మాట్లాట్టమూ అన్నీ కళ్ళకు కట్టినట్లుగా సినిమా రీలులాగా నా కళ్ళముందు తిరిగిపోయినయ్యి. ఈ

దసరాకు అక్కయ్య లేదు. అప్పుడే అక్కయ్య పోయి అయి దారునెల లయింది. ఆ రోజులు వెన్నెల రోజులు, ఈ దసరా పండుగలు చీకటి రోజులు. వెన్నెలయినా, చీకటయినా జీవితాలు బాగుంటే అదే సంతోషం. కాపురాల్లో కష్టాలు పడుతున్నా మనస్సు విప్పి మాట్లాడుకోటానికి అక్కయ్య ఉంది. ఈ దసరాకు నేను వంటరిదాన్నయి పోయాను. నా భావాలు అర్ధం చేసుకునేవారు కాని, మనస్ఫూర్తిగా మాట్లాడేవాళ్ళు కాని లేరు. నాలో నేను బాధ పడాల్సిందే. విచారంతో కుమిలి పోవాల్సిందే తోడబుట్టినదాన్ని చంపుకుని, చావలేక బ్రతుకుతున్న ఏకాకిని.

అక్కయ్య కళ్ళముందు కనబడుతుంటే ఆ దసరా ఎంతో ఆనందంగా గడిచిపోయింది. ఈ దసరా కన్నీళ్ళతో గడిచి పోయింది. బ్రతికుంటే రోజులు కనిపించవు. రోజులు గడవటానికే మనము బ్రతికున్నామా అనిపిస్తుంది

ఆలోచిస్తూ కూర్చుంటే పోస్టుమేన్ కవరు కిటికీలోంచి వేసి వెళ్ళిపోయాడు. ఆత్రంగా విప్పి చదివాను. సుభద్ర రాసింది.

గుంటూరు.

సీతా !

నీకు ఉత్తరం రాసి చాలా రోజు లయింది. కాలేజీ జీవితం ఎట్లా ఉంది ? ఈ రోజుల్లో చదువులూ, డిగ్రీలు ఎట్లా ఉన్నా ఆడంబరమూ నాగరికతాలక్షణాలూ, మాట్లాడుతూనే గోతులు తీసే మనస్తత్వాలూ, ఉంటేనే మనబోటి వాళ్ళని మనుష్యుల కింద జమ కడతారు. లేకపోతే ఎందుకూ పనికి

రాని వాళ్లమే. మన బడబడ వాగుడూ కల్మషంలేని మనస్తత్వాలనూ చూసి ఎవ్వరూ మనల్ని గౌరవించరు. రోజులు అట్లా ఉన్నయ్యి

రమాదేవి ఇప్పుడు మన ఇంటికి వస్తున్నది. మొదట్లో సందేహిస్తూనే వచ్చింది. అమ్మ ఏమీ అనలేదు. ఆవిడకి కోడలు పోయిన దిగులుకన్న నాకు పెళ్ళి ప్రయత్నం మా నాన్నగారు చెయ్యటంలేదే అన్న దిగులు ఎక్కువైంది. దానికితోడు ఈ పెద్దతనంలో పసివాడి పోషణ భారం ఆవిడ మీాద పడ్డది. నే పుట్టిన తరువాత ఆవిడకు కాన్పులేదు. అంటే పద్దెనిమిదేళ్ళు అయిందన్నమాట. ఇంత కాలానికి ఈ పసిగుడ్డు పోషణ భారం ఆవిడమీాద పడేసరికి ఆవిడకు పని తెమలకుండా ఉంది.

తెల్లవారుఝామున బాబుకు కడుపుకు వెయ్యాలికదా. ఆవిడకు వాతపు నొప్పులు. లేవలేదు. వాడా ఆముదం తాగే వేళకి లేచి ఏడుస్తాడు. ఈలోగా రాత్రి తెల్లవార్లూ వాడి ఉచ్చ గుడ్డలు అవితీసి ఆరేస్తుండాలి. తెల్లవార్లూ నాలు గయిదు సార్లులేచి పాలుకలిపి పట్టాలి. పెద్దది అమ్మ లేవలేదు. ఆవిడ విసుక్కుంటుంటే మధ్య మధ్య నేనూ, అన్నయ్యా లేచి వాడికి పాలుపట్టి నిద్రపుచ్చుతున్నాం. పాలయితే పడతాంగాని వాడికి నీళ్లుపొయ్యాలికదా! పొద్దున పూట వాడికి నీళ్లు పొయ్యాలంటే నడుం వంగక ఆవిడ ఎంతో ఇబ్బంది పడుతుంది కోపంతోనే వదినను తల్చుకుని విచారపడి, ఈ పెద్దతనంలో తను ఈ పసివాడ్ని సాకాల్సొచ్చిందని విసుక్కుంటుంది. వాడికి నీళ్లు, పోనీ నేను పోద్దా

మంటే తొడలవరకూ చీర పైకి ఎగ్గట్టి వాడ్ని కాళ్ళమీద పడుకోబెట్టుకొని నీళ్ళు పొయ్యటమంటే నాకు చచ్చే సిగ్గేస్తుంది. ఆ పోషణకాని, ఆ ముద్దు ముచ్చట్లుగాని, ఆ అవస్థలు కాని కన్నతల్లికి బాధ్యత ఉండటంచేత పడాల్సిన అవసరం ఉన్నదిగాని, ఇతరులకు అంత బాధ్యత ఉండదు కదా!

మొన్నీ మధ్య వాడికి నీళ్లు పోస్తుంటే కాసినినీళ్ళు నోట్లోకిపోయి మింగాడు. వాడికి జలుబుచేసి జ్వరం తగిలింది. ఆ రోజున అన్నయ్య ఏడ్చిన ఏడుపు తల్చుకుంటే, వాడిని చూస్తుంటే నాకిప్పటికీ కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నయ్యి. ఆ రోజున అమ్మ, అన్నయ్య కొంచెం ఘర్షణ పడ్డారు. అన్నయ్యని మళ్ళీ పెళ్ళి చేసుకుని బాబు పోషణ భారం తనకి తగ్గించమన్నది. అమ్మ అన్న మాటలు తల్చుకుని అన్నయ్య ఆ రోజల్లా కుమిలి పోయాడు. అన్నయ్య మనస్తత్వం పూర్తిగా మారిపోయింది.

రమాదేవి అంత గొప్పింటి పిల్లయినా, చదువుకుంటున్నదయినా పని పాటలన్నీ తెల్సు. తను మన యింటికొచ్చినప్పుడు అస్తమానం బాబుని ఎత్తుకునే ఉంటుంది. ఎన్నోసార్లు వాడి తడిగుడ్డలుతీసి ఆరేసింది. నాలుగయిదుసార్లు నీళ్ళుపోసి, పౌడరురాచి, బొట్టుపెట్టి, పాలుపట్టి వాడ్ని ఉయ్యాల్లో పడుకోపెట్టి ఊగించి నిద్రపుచ్చేది. వాడ్ని చూస్తూ ఎన్నోసార్లు కంటతడి పెట్టింది అక్కయ్య, బావ ఉన్న ఫోటో ఒకటి తమ ఇంటికి తీసుకువెళ్ళింది. ఇంత సహాయకారిగా ఉన్నా అన్నయ్య రమాదేవితో మాట్లాడరు. రమాదేవి కూడా అన్నయ్యతో మాట్లాడదు. నాతో

ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతుంది. ఆదరణగా మాట్లాడుతుంది. ఎన్నో కబుర్లు చెప్తుతుంది. అన్నయ్య ఉన్నా నాతోనే మాట్లాడుతూ కూర్చుంటుంది. ఏమిటో రమాదేవి చర్యలు తల్చుకుంటే నాకు నవ్వూ, సానుభూతీ కలుగుతున్నయి.

ఒక్కొక్కరి జీవితాలు తమాషాగా ఉంటయ్యి. ఇతర్లను సుఖ పెడదామని అనుకుని ఆ ఆచరణలోనే తామూ సుఖ పడదామని అనుకుని, సుఖపడక పోయినా, సుఖపడుతున్నట్లుగానే భావించి సంతోష పడతారు. రమాదేవి ఈ తరహాకు చెందినది.

అన్నయ్య అంతర్యం అర్థంకానిది మనస్సులో అనేక ఆలోచనలు. అమితమైన ఆదుర్దా, మనసువిప్పి ఎవ్వరికీ చెప్పడు. ఎప్పుడూ బాబుని చూసుకునే విచారపడతాడు.

"గేదె చస్తేనేగాని పాడి బయట పడదన్నట్లుగా వదినె పోయిం తరువాతనే ఆవిడ మంచితనం అన్నయ్యకి ఇప్పుడు అర్థమైంది. ఏమిటో! చాలా రాశాను. ఇంక ముగిస్తా. నాకూ నువ్వు ఇంత పెద్ద ఉత్తరం రాయాలి సుమా! రాస్తావుగా!

సుభద్ర.

ఉత్తరం చదువుతుంటే నా మనస్సులో అనేక ఆలోచనలతో పాటు కన్నీళ్ళు ఉత్తరాన్ని తడిపేసినయ్యి. తల్లిలేని పసిగుడ్డు అవస్థ ఇట్లా ఉంటుంది. బావ అంతర్యం ఏమిటో? పెళ్ళి చేసుకోవాలని లేదా? అప్పుడు నాకేమీ తోచలేదు.

* * *

జ్యోతి గుంటూరు నుంచి వచ్చింది. దసరా శలవు లయ్యాయి. కాలేజీ తెరిచారు. యథాప్రకారంగా జ్యోతి నేనూ రిక్షాలో వెళదామనే ఉద్దేశ్యంతో ఇంట్లో కూర్చు న్నాను. సరిగ్గా తొమ్మిదిన్నరకు జ్యోతి వాళ్ళ జవానుచేత కబురు చేసింది. తను ఒంటరిగానే రిక్షాలో వెళతాననీ, నన్ను వేరే రిక్షాలో వెళ్ళమనీ. ఈమాట వినేసరికి నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ మాట తనే చెప్పొచ్చుగా. జ్యోతి ఈ విధంగా ఎందుకు మారిపోయిందో నాకర్థంకాలేదు. నేను గుమస్తా కూతురు కావటంచేతనా? తనతో ఏమయినా తగాదా పెట్టు కున్నాననా? ఏమీ లేదే? ఎందుకీమార్పు? సాటి విద్యార్థినితో రిక్షాలో పోవటానికే తనకు అంత కష్టంగా ఉంటే నేను మాత్రం బ్రతిమాలి జ్యోతి మనస్సు మార్చగలనా?

నేను ఇంకో రిక్షా చేసుకునే కాలేజీకి వెళ్ళాను. దార్లో ఇద్దరి రిక్షాలూ పక్కపక్కనే పోతున్నా జ్యోతి మాట్లాడలేదు. తప్పు తనమీదే ఉందిగా ! ఎట్లా మాట్లాడుతుంది

మధ్యాహ్నం కాలేజీ వదిలారు. టిఫిన్‌రూంలో కొంత మంది భోజనం చేస్తున్నారు. కొంతమంది టిఫిన్ చేస్తున్నారు.

అనుకోకుండానే నేనూ జ్యోతీ, పక్కనే కూర్చొని టిఫిన్ తింటున్నాం. నాకే మనస్సుండ బట్టక జ్యోతిని పలక రించాను.

"జ్యోతీ"

అదోలా నావైపు చూసింది.

"నా మీద అంత కోపం దేనికి ? రిక్షాలో నాతో రావటానికి నీకు నామోషీగా ఉంటే నన్ను పిల్చి చెప్పా

చ్చుగా. మీ జవాను ద్వారా కబురు చెయ్యటం ఎందుకు? నేనే మయినా తప్పుమాట అన్నానా ?"

"అంటే మాత్రం ఈ రోజుల్లో పడేవాళ్లెవరూ లేరు. అయినా మాటలతో పనేముంది. నాకు ఇష్టంలేదు, అంతే" అన్నది. ఇంక నేను జ్యోతిని పలకరించలేదు.

వారం రోజులు గడిచినయ్యి జ్యోతి పూర్తిగా నాతో మాట్లాట్టం మానేసింది. అకారణమైన ఈ మార్పుకు నేను మొదట్లో బాధ పడ్డా తరువాత అలవాటయి పోయింది.

మా కాలేజీలోనే ప్రమీల అనే అమ్మాయి ఉన్నది. ఆఅమ్మాయి బి. కాం. చదువుతోంది. అందరితోనూ కలుపుగోలుతనంగా ఉంటుంది. చక్కగా నవ్వుతూ విప్పారిన ముఖంతో అందర్నీ కవ్వించి నవ్విస్తూ మాట్లాడుతుంది. ప్రమీల నాన్నగారు సర్కిలినస్పెక్టరు. ఆ తండ్రి పోలికే ఈ కూతురుకీ వచ్చిందేమో ? కాలేజీలో ఉన్న ఆడపిల్లలనందరినీ ఒక కంట కనిపెడుతూనే సి. ఐ. డి. పని చేస్తుంది. అందరి మన స్తత్వాలూ ప్రమీలకు బాగా తెలుసు

ఒక ఆదివారంనాడు ప్రమీల నన్ను వాళ్లింటికి రమ్మన్నది. పిల్చింది కదాని వెళ్ళాను. సాయంత్రం నాలుగయింది. అక్కయ్య పోయాక ఇతర్ల ఇంటికి వెళ్లటం అదే మొదలు. ప్రమీల గదిలో ఇద్దరం కూర్చున్నాము.

"జ్యోతి పూర్తిగా మాట్లాట్టం మానేసిందా ?" అన్నది ప్రమీల.

"అవును."

"ఎందుకని?"

"నాకు తెలీదు ప్రమీలా."

"జ్యోతి వాళ్లది కొంచెం గడుసు సాంప్రదాయం" అన్నది ప్రమీల.

"వాళ్ల సాంప్రదాయం ఎట్లాంటి దయితే మనకేం ప్రమీలా. వాళ్ళగొప్ప వాళ్ళకే ఉంటుంది" అన్నాను.

ప్రమీల నవ్వుతూ కూర్చుంది.

"నవ్వుతావేం ?"

"గొప్పల విషయం చెప్తుంటేను"

"డబ్బు గర్వమేమో అనుకున్నాను."

"కొంత వరకూ. కాని అసలు కారణం అది కాదు."

"మరి?"

"నువ్వే"

"నేనా !" అదిరిపడ్డాను.

నేనేమీ అనలేదే" అన్నాను మళ్లీ

"జ్యోతి గుంటూరు వెళ్ళొచ్చింది తెలుసుగా"

"అవును"

"వాళ్ళ అక్కయ్య ఆ ఊళ్ళో ఉన్నది"

"ఉంటే?"

"ఆవిడ నిన్ను ఎరుగున్నదిట"

"ఎవరావిడ ?"

"ఏమో"

"ఇంత తెలుసుకున్న దానివి ఆవిడ పేరు తెలీదా ?"

"తెలీదు"

"జ్యోతిని అడగలేదా ?"

"అసలు జ్యోతి నాకీ విషయం చెపితేగా !"

"మరి నీ కెట్లా తెల్సు"

"మన విజయకుమారి లేదూ"

"అదే పోలీసు సూపర్నెంటు గారమ్మాయి."

"అవును. విజయకుమారితో జ్యోతి చెప్తుంటే అంత వరకే విన్నాను."

"ఏమిటో నాకేం అర్థం కావటం లేదు గుంటూర్లో నాకు తెల్సినవాళ్లు ఇద్దరు కన్న ఎక్కువ లేరు. జ్యోతి బావ గారేం చేస్తుంటారో?"

"ఏమీ లేదు. చాలా ఆస్తిపరులుట. పెద్ద మేడా, తోటా ఉన్నయ్యిట బ్రాడీపేటలో"

"ఎవరబ్బా?"

"ఏమో"

"ఇంకా ఏం చెప్పింది జ్యోతి ?"

"ఏమీ లేదు. అంతక్రితం వాళ్ళేం మాట్లాడుకున్నారో తెలీదు. ఉండు చెప్తాను, ఆ, జ్యోతి అక్కయ్య పేరు కృష్ణవేణి"

"చంపావ్ పో. కృష్ణవేణి జ్యోతిఅక్కయ్యా? ఇంకేం తెలుస్తూనే ఉంది. మంచి కుటుంబమే. సరే, ఇంక చెప్పక్క ర్లేదు. అంతా తెల్సింది" అన్నాను.

"ఏమిటది? పోనీ నాకు చెప్పుదూ"

"ఆ రోజు వస్తే అప్పుడే చెప్తాను."

మరో గంటసేపు కూర్చొని వచ్చేశాను.

# 14

జ్యోతితో కృష్ణవేణి ఏం చెప్పిందో? ముందుగానే ఏ విషయమూ తెల్సుకోకుండా బాధపడి వారి మీద అభాండాలు వేస్తుంది. కార్పణ్యం తమ మనస్సునే దహించి వేస్తుంది క్రోధం తననే నలుగురిలోనూ నవ్వులపాలు చేస్తుంది ఇన్నిటిలోనూ కృష్ణవేణి నా మీద ఏఅస్త్రాన్ని ప్రయోగించిందో? అప్పుడు నాకు తెలీదు.

రమాదేవికి ఎట్లాగూ ఉత్తరం రాయాలి కదా! మామూలు పరిస్థితులన్నీ రాస్తూ "మీ వదినగారి చెల్లెలు జ్యోతి మా కాలేజీలో చదువుతోంది. నాకుస్నేహితురాలు. వాళ్ళిల్లు కూడా మా ఇంటి దగ్గరనే" అని రాశాను.

రెండు రోజులు పోయాక కాలేజీలో మా ఆడపిల్లల గదిలో కూర్చుని ఏదో నవల చదువుకుంటున్నాను. ఆ నవల చదువుతుంటే అక్కయ్య జీవితం కళ్లకు కట్టినట్లు కనిపించింది. పుస్తకంలో ఏ పేజీ చదివినా అక్కయ్య జీవితానికి వర్తిస్తుంది. ప్రతి పుటలోనూ అక్కయ్యరూపమే.కనిపించసాగింది. నా కళ్లల్లో నీళ్లు తిరిగినయ్యి. అప్రయత్నంగా "అక్కయ్యా" అంటూ ఆ నవలలో నా ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాను. అట్లా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలీదు. కొంత సేపటికి తెలివి తెచ్చుకుని కాలేజీలో ఏడవట మేమిటి? ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారనే ధ్యాసలో కళ్లు తుడుచుకుంటూ నవల మూసి కళ్ళు తెరిచాను. కాలేజీలో ఉన్న అంతమందీ నా ఎదురుగా నుంచుని వింతగా చూస్తున్నారు.

"ఏమిటిసీతా, మీ అక్కయ్య గుర్తుకొచ్చిందా లేక కలగన్నావా?" అంటూ ఎగతాళిగా కొందరూ, సాను భూతిగా కొందరూ యుక్తప్రశ్నలు వేశారు. లేనినవ్వు తెచ్చు కుని ఏదో సమాధానం చెప్పాను. అంత మందిలోను జ్యోతి గాని, విజయకుమారిగాని లేరు.

ఆ రోజు సాయంత్రమే ప్రమీల మా ఇంటికి వచ్చింది. ప్రమీలను చూడంగానే ఏదోవార్త తెస్తుందనే అనుకున్నాను. ప్రమీల నవ్వుతూ కూర్చుంది.

"ఏం ప్రమీలా! దారితప్పి వచ్చినట్లున్నావ్! మాబోటి బీదవాళ్ళ ఇంటికి రావటానికి మనస్కరించిందా?" అన్నాను.

'కాలేజీలో నువ్వు బీదవాళ్లకయినా గొప్పవాళ్ళ కయినా ఒక రీతిగానే చెప్తారు. అది గాకపోయినా నేను ప్రమీలనుగాని, జ్యోతిని కాదు."

'పోనీలే ఆ మాత్రం అభిమానం ఉన్నందుకు చాలా సంతోషం."

"కాలేజీలో ఆ నవల చదువుతూ అట్లా అయి పోయావేం?'

'అక్కయ్య గుర్తు కొచ్చింది."

'దుఃఖపట్టానికీ, ఏడవటానికీకూడా సమయూ సమయా లుండాలిట.

"ఎవరన్నారు?"

'జ్యోతి."

"అందరి ఉద్దేశ్యాలూ ఒకతీరుగా ఉంటయ్యా? అందర్నీ మనం మెప్పించగలమా? ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి.'

"ఎవరి అభిప్రాయాలు వాళ్ళవయినా కొందరి అభిప్రాయాలు మనమూ తెల్సుకోవాలి."

"అంటే?"

"నీ మీద కోపం చేతగాని, కార్పణ్యం చేతగాని అడగటంలేదు. నేను విన్న సంగతులు నిజమా, అభాండాలా అనే విషయం తెల్సుకుందామని అడుగుతున్నాను."

"ఏమిటా విన్న విషయాలు?"

"మీ బావగారంటే నీకు చాలా ఇష్టంటగా?"

"అక్కయ్య భర్త బావగా, నాకాయన ఇష్టమే. అక్క భర్తతో మాట్లాడకూడదా? విరోధభావంతో ఉండలా? ఏది ఉత్తమం ?"

"బాంధవ్యరీత్యా బావగా, అక్కగారి భర్తగా గౌరవించవచ్చు. కాని, ప్రేమించటం తప్పుకదూ ?"

"అసలు ప్రేమంటే?"

"నాకు అమ్మా, నాన్నలమీద ప్రేమ తెల్సు. బావగార్ల మీద ప్రేమ నాకు తెలీదు. కారణం నాకుఅక్కయ్యలు లేరు గనుక."

"నీకు తెలీకపోయినా మీరు ఊహించుకున్న ప్రేమ కాదు ప్రమీలా. అక్కయ్య భర్తగా, బావగా మాత్రమే గౌరవించాను. కాకపోతే చనువుగా మాట్లాడేదాన్ని. ఏదయినా పచ్చకామెర్ల వాళ్ళకి లోకమంతా పచ్చగానే కనబడుతుంది. అయినా కృష్ణవేణి నా మీద అభాండాలు వేసిందంటే నేను ఆట్టే బాధ పడను ప్రమీలా. ఆవిడ ప్రవర్తన, మనస్తత్వం నాకు తెల్సు" అన్నాను.

ప్రమీల ఆశ్చర్యంగా నా వైపు చూసింది. ఆ చూపులో జ్యోతి మీద ఈర్ష్యాభావం వ్యక్తమైంది.

"అయితే జ్యోతి సామాన్యురాలు కాదే!"

"సర్కిల్ ఇన్‌స్పెక్టరు గారమ్మాయివి. ఆమాత్రం తెలుసుకోపోతే ఎట్లా ప్రమీలా? నన్ను గురించి తను తెలుసుకున్న విషయాలేవో జ్యోతినే అడుగు. విని నేనూ సంతోషిస్తాను."

పేలవంగా నవ్వింది ప్రమీల కాసేపు కాలేజీ విషయాలు మాట్లాడుకున్నాం. తరువాత ప్రమీల వెళ్ళిపోయింది.

ప్రమీల వెళ్లాక ఆలోచిస్తూ అలాగే కూర్చున్నాను. నన్ను గురించి కృష్ణవేణి ఏమని చెప్తుంది? కల్పించి చెప్పటానికి ఒక హద్దేముంది? అక్కయ్య కోసం వాళ్ళింట్లో ఉంటే నేను ఏం తప్పు చేశానసీ కృష్ణవేణి నా మీద కల్పించి చెప్తుంది? కల్పిత కథలకి దారి తెన్నూ ఉండవుకద! కానీమని ఊరుకున్నాను.

రాత్రి భోజనాలదగ్గర అమ్మ బావ ప్రస్తావన తెచ్చింది

"సుభద్రకి ఉత్తరం రాశావుటే ? పసివాడు ఎట్లా ఉన్నాడో ఏమో" అన్నది.

"ఎట్లా ఉంటే మనకేమే అమ్మా! అక్కయ్యపోయాక మనకా ఇంటితో ఏంపని? కన్నకొడుకు మంచిచెడ్డలు ఆయనే చూసుకుంటారు" అన్నాను.

ఈ మాటలు అన్నానేగాని ఎందుకన్నానా అనిపించింది చాలా బాధపడ్డాను. అక్కయ్య కళ్ళల్లో మెదిలింది.

బావ దిగులుగా చిక్కిపోయినట్లు కనిపించారు. ప్రమీల చెప్పిన మాటలు చెవుల్లో మారుమ్రోగాయి. రమాదేవి నవ్వుతూ నాముందే బావప్రక్కన నిల్చున్నట్లు కనిపించింది. బాబు గుక్కపెట్టి ఏడుస్తూ ఉయ్యాల్లో ఉన్నాడు కంచంలో పెట్టిన అన్నం కోళ్లు కెలికినట్లు కుముపు తున్నానేగాని ముద్ద ఎత్తలేదు. కళ్ళనీళ్లు జారి కంచంలో పడ్డయ్యి. పొంగి పొర్లు కొచ్చే దుఃఖంతో ముక్కులు ఎగబీలుస్తూ కంచంలోనే చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయాను. దిండులో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాను. అమ్మా, నాన్నా ఇద్దరూ వచ్చారు.

"అదేమిటే సీతా! అన్నం తినకుండా ఈ ఏడుపేమిటి. ఎవరేమన్నారు నిన్ను? ఉత్తరం రాయలేదే మన్నానుగాని ఇంకేమీ అనలేదు కదా" అన్నది అమ్మ నన్ను లేవదీసి కూచోబెట్టి.

"అక్కయ్య గుర్తు కొచ్చిందామ్మా?" అన్నారు నాన్న.

ఏమీ మాట్లాడలేక పోయాను. అమ్మ ఎన్నో విధాలుగా బ్రతిమాలింది. నాన్న కారణమేమిటో చెప్ప మన్నారు. ఏం చెప్పేది?

అమ్మకు విసుగొచ్చింది.

"కడుపులో చిచ్చుపెట్టి అది ఆ రీతిగా దానిరోజులు వెళ్ళబుచ్చుకు పోయింది. ఈ రీతిగా నువ్వు మమ్మల్ని కాల్చుకుతిను. నాకు చావు రాకుండా ఉన్నది" విసుక్కుంటూ వెళ్లింది అమ్మ. నాన్న నా మంచంమీద కూర్చుని ఉన్నారు.

"సీతా! ఏమిటమ్మా? ఏం జరిగింది? నీకన్న మాకు ఇంకెవరున్నారమ్మా? అమ్మ పుట్టెడు దిగులుతో, విచారంతో రోజులు గడుపుతోంది. సంగతేమిటో నాతో చెప్పమ్మా" అన్నారు నాన్న.

"నాన్నా!"

"ఏం తల్లీ!"

"ఆడపిల్లలు మేకపిల్లలు నాన్నా. పులినిచూసి ఝడుసుకోవాల్సి వస్తుంది. తోటి మేకపిల్లలు కుమ్ములాటకు వస్తే తప్పుకు తిరగాల్సి వస్తుంది."

"ఎవరయినా ఏమన్నా అన్నారా తల్లీ?" అన్నారు నాన్న.

"ఎవరూ ఏమీ అనలేదు నాన్నా. అక్కయ్య జీవితం ఒక్కసారి కళ్ళకు కట్టినట్లు కనిపించి మనస్సు చెదిరి బాధ పడ్డాను నాన్నా. మరేం లేదు నాన్నా, మరేం లేదు. మీరు భోజనం చెయ్యండి నాకు అక్కర్లేదు."

"అట్లా కంచంలో అన్నంలో నీళ్ళు కుమ్మరించి వచ్చేస్తే మా మనస్సు ఎంత బాధ పడుతుందో ఆలోచించు తల్లీ. ఆకలయినంత మాత్రమే తిను."

ప్రాధేయ పూర్వకంగా బతిమాలారు నాన్న. లేచి వెళ్ళి మజ్జిగన్నం తిన్నాను.

రాత్రంతా నిద్ర పట్టలేదు. ఏమిటో ఆలోచన. ఏమిటో దిగులు. కృష్ణవేణిని తల్చుకుంటేనే వళ్ళు మండి పోతున్నది. ఏమని చెప్పేది జ్యోతికి! నాకూ బావకూ... తల్చుకుంటే వళ్ళు దహించుకు పోతున్నది. జీవితంలో

ఎట్లాంటి అవమానాలూ, అపవాదులూ పడాల్సి వస్తున్నది. బావతో మాట్లాడుతూ, అక్కయ్యగారింట్లో ఉన్నందుకేగా ఈ అపవాదులు. ఛీ! ఎంత నీచమై పోయింది బ్రతుకు. కృష్ణవేణి దృష్టిలో నేనెంత నీచురాలినై పోయాను! అక్కయ్యకు సాయంగా ఉంటున్నాననే సాకుతో చెప్పి ఉంటుంది. జ్యోతి ఇదంతా ఇంకా నాలుగు కల్పించి కాలేజీలో తన స్నేహితులందరికీ చెప్పి ఉంటుంది. అంతా నన్ను గురించి హేళనగా మాట్లాడుతూ నవ్వుకుంటారు. నా ప్రవర్తన మంచిది కాదనుకుంటారు. రమాదేవిని అనుకున్నట్లుగానే నన్నూ అనుకుంది కృష్ణవేణి.

రాత్రి తెల్లవార్లూ నా కళ్ళు చెరువులైనయ్యి. మర్నాడు లేవలేకపోయాను వళ్ళు ఆవిర్లు తేలుతోంది. పొట్ట చూసుకుంటే పేలిపోతున్నది. జ్వరం తగిలింది.

ఏడు గంటలు దాటినా లేవకపోయేసరికి అమ్మ గదిలో కొచ్చింది. నన్ను చూస్తూనే "అదేమిటే కళ్లూ, మొహం అట్లా వాచినయ్యి?" అంటూ నుదురుమీద చెయ్యేసిచూసింది.

"అదేమిటే వళ్ళు మసిలిపోతున్నది. జ్వరం తగిలింది" అంటూ నాన్నని పిల్చింది. నాన్న వచ్చారు. ధర్మామీటరుతో చూస్తే జ్వరం నూట మూడు డిగ్రీ లున్నది.

అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. నాన్న ఖంగారు పడ్డారు. నా లేవలేకపోయాను. మెల్లిగా రెక్క పట్టుకుని అమ్మ సాయంతో దొడ్లోకి వెళ్లి ముఖం కడుక్కున్నాను. మెల్లిగా తీసుకొచ్చి పక్కమీద పడుకోపెట్టింది అమ్మ. ఇంక ఇంటి పని మానేసి నా పక్క

లోనే కూర్చుంది. అక్కయ్యనూ, నన్నూ చిన్నప్పటినుంచీ ఎట్లా పెంచి పెద్ద చేసిందీ మా ముద్దుముచ్చట్లు ఎలా తీర్చిందీ రోగాలు వచ్చినప్పుడు నిద్రాహారాలు మాని మాతో ఎంత అవస్థలు పడ్డదీ అన్నీ ఏకరువుపెట్ట సాగింది. అక్కయ్యను తల్చుకుని ఒకటే ఏడుపు.

నాన్న వెళ్ళి డాక్టర్ను తీసుకొచ్చారు. ఆయన చూసి "ఏం భయం లేదండీ! మామూలు జ్వరమేను. కొంచెం నీరసంగా ఉంది. అంతే, మందిస్తాను ఆస్పత్రికి, రండి. రెండు రోజుల్లో తగ్గిపోతుంది" అన్నారు.

"దెబ్బ తిని ఉంటం నుంచి మాకూ కాళ్లూ చేతులూ ఆడలేదండీ. రాత్రి వరకూ బాగానే ఉంది. తెల్లవారి చూసే సరికి నూట మూడుంది" అన్నారు నాన్న.

ఇటీవల ఎప్పుడూ నాకు జ్వరం రాలేదు. జ్వరం అయిదేళ్ళ క్రితం కామాలు వచ్చింది. పది లంకణాలు చేశాను. మళ్లా ఇదే జ్వరం రావటం.

నాలుగు రోజులుంది జ్వరం. అమ్మ ఎప్పుడూ నాపక్కలోనే కూర్చునేది. వంట చేసే గంటసేపూ మినహా రాత్రింబగళ్ళు నా సేవతోనే సరిపోయేది. తల్లి ప్రేమ అటువంటిది. అందులోనూ అక్కయ్య చావుతో మరీ దిగులుపడిపోయింది అమ్మ.

అయిదో రోజున కాస్త చారన్నం తిన్నాను. పథ్యం తిన్నాక నిద్రపోతానేమోనని నాగదిలోనేకూర్చుంది అమ్మ. అమ్మను చూస్తుంటే జాలి, ఇంత కష్టపెడుతున్నాననే బాధా మనస్సులో కలతపెట్టింది. అమ్మకు అక్కయ్య ధోరణే

ఎప్పుడూ. కడుపుకోత అటువంటిది. కాపురం చేసే చెట్టంత కూతురు పోతే ఏ తల్లికి విచారం ఉండదు? ఆ మమకారమూ, కడుపు తీపి లేకపోతే కడుపున కన్నవాళ్ళంతా ఏమైపోతారు? పెరిగి పెద్దదాన్నయి పంధొమ్మిదేళ్ళు పైబడ్డా నేను అమ్మ వాత్సల్యంతో, ఆదరణతో, ప్రేమతో, కన్నతల్లి కరుణారసమయమైన చల్లని చూపులతో, ఆనందాన్ని, తృప్తిని అనుభవిస్తుంటే, బాబు, అక్కయ్య కొడుకు కన్నతల్లిని దూరం చేసుకున్నాడు. వాడికి పెద్దయాక నయినా కన్నతల్లి ప్రేమ ఏం తెలుస్తుంది? ఎట్లా తెలుస్తుంది? మీ అమ్మ ఇట్లా ఉండేదని అక్కయ్య ఫోటో చూపించి బావ చెప్పినా వాడికా మాతృప్రేమానుభూతులు ఎట్లా తెలుస్తయ్యి? బావ పెళ్ళి చేసుకోకుండానే జీవితం గడుపుతారా? ఒకవేళ చేసుకుంటే ఎవర్ని పెళ్ళి చేసుకుంటారు? ఆ పరాయింటి పిల్ల ఈ పసివాడ్ని ఆదరణగా చూస్తుందా? వాడిగతి? సుభద్ర రాసినట్లు కని పెంచి, మాతృప్రేమ తెల్సిన ఆ పసివాడి నాయనమ్మే వాడికి నీళ్ళు పొయ్యలేక, పాలుపట్టలేక, వాడిపోషణ చెయ్యలేక విసుక్కుంటే, ఆ వచ్చిన పొరుగింటిపిల్ల వాడిపోషణ చేస్తుందా? ఏమిటో? నా ఆలోచనలు నాకే అర్థం కాలేదు. కడుపులో ఎక్కడో ఒకమూల అర్థంకాని అనుభూతి కలిగింది. ఆ పసివాడి పోషణ భారం నేను వహిస్తే? ఎట్లా? వాడినిక్కడికి తీసుకురావాలా? బావ ఒప్పుకుంటారా? నా ఆలోచనలు నాకే అంతుపట్టలేదు.

"బావకు ఉత్తరం రాయరాదుటే సీతా" అన్నది అమ్మ. అప్పటికిగాని మళ్ళీ నేను తేరుకోలేదు.

"దానికు మనం ఉత్తరం రాయటమెందుకమ్మా?"

"పసివాడ్ని చూడాలని ఉందే"

"చెట్టంత కూతురు పోయిన దుఃఖాన్ని దిగమింగి ఆ పసివాడ్ని చూట్టానికి వెళతావా అమ్మా? కన్నతండ్రికీ వాడి బాధ్యత తెలీదూ?"

"మగవాడు అతనేం చేస్తాడు సీతా? ఆవిడేమో పెద్దది. ఏమిటో తల్చుకుంటే గుండె చెరువై పోతున్నదే."

"పోనీ ఓసారి వెళ్లి చూసిరారాదూ."

అమ్మ కళ్లు తుడుచుకుంది. ఆవిడఅంతరాంతర కల్లోలం ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా కనిపించింది. చెట్టుకు కాయలు బరువు కాదన్నట్లు పదిమంది పిల్లల తల్లయినా, అందులో ఒకరు పోయినా కడుపు దుఃఖం ఉంటుంది. మగపిల్లలంటూ లేక ఉన్న ఇద్దరాడ పిల్లల్లోనూ, కాపురం చేసే కూతురు పోయిందంటే ఇక ఆ తల్లి క్షోభ ఏమని చెప్పాలి.

"నేనే ముఖం పెట్టుకుని వెళతానే సీతా? పోనీ ఎదిగిన పిల్లలయినా ఉండి, నాకు మాలిమి అయిన వాళ్ళయినా ఉంటే పోనీ ఓసారి వెళ్ళి పిల్లల్ని చూసి రావచ్చు. ఆ పసివాడ్ని చూసి రావటానికి ఏ ముఖం పెట్టుకు వెళ్లను? అయినా వాళ్లు రమ్మనంది మనం వెళితే ఏం బావుంటుంది?" అన్నది అమ్మ.

ఆ మాట నిజమే. నేనేం సమాధానం చెప్పలేదు. అమ్మ నా వైపు చూస్తూ కూర్చుంది. ఏదో చెప్పాలనుకుంటున్నది గాని చెప్పలేకపోతోంది.

"అక్కయ్య చావుతో బావ పూర్తిగా మారి పోయారు కదూ ?" అన్నది అమ్మ.

"ఎటువంటి వాడయినా ఆ పరిస్థితులు అలాంటి వాతావరణాన్నే కల్పిస్తయ్యి. మన మనిషంటూ లేనప్పుడు ఆయన ఎట్లా ఉంటే మనకు ఒరిగేదేమిటమ్మా. కాపురానికి వెళ్ళిన సంవత్సరంలోనూ దిగులనేది లేకుండా ఏ ఒక్క రోజునా తృప్తిగా అక్కయ్య అన్నం తినలేదు. అన్ని విషయాలూ నీకు తెల్సుకదా. ఏమిటమ్మా బావ మంచితనం? మంచి వాడు మంచివాడు అంటూనే దాని గొంతు కోశారు. నీ పని ఇట్లా ఉందాని ఆ పరమాత్ముడు కూడా ఆ పసివాడనే ఒక మేకును ఆయన నెత్తిన కొట్టి అక్కయ్యను ఎత్తుకుపోయాడు. మంచివాళ్ల గుణగణాలు మరణకాలమప్పుడు తెలుస్తయ్యని, దాని రోజులు అది చక్కగా తెల్లార్చుకుపోయింది. ఇంక ఆ పసివాడితో అగచాట్లన్నీ ఆయనే పడాలి" అన్నాను.

పనిమనిషి రావటంతో అమ్మ వెళ్ళింది.

* * *

వారం రోజులు గడిచినయ్యి. రమాదేవి ఉత్తరం రాసింది.

గుంటూరు

సీతా !

నీ వద్ద నుంచి ఉత్తరం లేదు. పోనీలే. అందరి మాదిరే నీకూ నా మీద కోపమొస్తే ఇంక నేను చేయ గలిగిందేమీ లేదు. ఇటీవల సుభద్ర ఓసారి మా యింటికి వచ్చింది. మీ బావగారి తల్లి పసివాడి పోషణ చెయ్యలేక సతమతమై పోతు

న్నది ఒక్క పురిటి నొప్పులు మినహా తతిమ్మా అవస్థ అంతా ఆవిడే పడుతున్నట్లుగా రోజూ విసుక్కుంటున్నదిట. మీ బావగార్ని మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఒకటే పోరుతున్నదట. ఆయన ఏం సమాధానం చెప్పటం లేదు. చాలా చిక్కి పోయారు ఏదో క్రమ ప్రకారం కాలేజీకి వచ్చి పాఠాలు చెప్పి పోవటమే తప్ప. ఆయనలో ఉత్సాహం ఏమీ కనబట్టం లేదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటారు. ఏమైంది తెలీదు. ఆయన మనస్సు తెల్సుకోవటం కష్టమే ఆయన జీవితమూ, ప్రవర్తనా విచిత్రమైనవి. పసివాడి పోషణ విషయమై చాలా బాధపడుతున్నారు... ఆరిపోయి కరుడుగట్టిన ఆయన జీవితంలో జ్యోతిని వెలిగించే శక్తి ఎవరికున్నదో ? ఎవరికి తెలుసు ?

మర్చిపోయాను. ఇటీవల మా వదిన చెల్లెలు, జ్యోతి వచ్చినప్పుడు బహుశా నీ మీద ఏవో లేని పోని కబుర్లు చెప్పి ఉండొచ్చు. మీ బావగారితో నువ్వు చనువుగా ఉంటమే గోరంతలు, కొండంతలుగా చెప్పి ఉంటుంది. నా మీదనే దుమారం రేపిన ఆవిడ నిన్ను గురించి అన్నదంటే ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. ఎవరి జీవితాలు ఎట్లా వెళతయ్యో వేచి చూట్టంకన్నా మనం చేయ గలిగింది మాటుకు ఏముంది ? జాబు రాస్తావుగా !

నీ స్నేహితురాలు,

రమాదేవి.

ఉత్తరం చదవగానే నా మనస్సు దహించుకుపోయింది. ఈ ఉత్తరం అమ్మకు చదివి వినిపించాను.

"ఆ పసివాడికి సరిగ్గా పోషణ జరిగే అదృష్టం ఉంటే నా బిడ్డ బ్రతికుండేది. అది పోయింతరవాత కాపురం వీధిలోకి ఎక్కుతున్నది" అన్నది.

కాలేజీకి వెళుతున్నాను, వస్తున్నాను. ఇంటికి రాగానే ఏమిటో ఆందోళన, ఆవుర్దా. ఆస్పత్రిలో అక్కయ్య, పసివాడు, అక్కయ్య మాటలూ అంతా కళ్ళఎదుట ఎప్పుడూ మసులుతూనే ఉండేవారు. పసివాణ్ణి గురించి ఉత్తరాల్లో చదువుతున్నప్పుడల్లా మనస్సు గిలగిల లాడేది.

ఒక ఆదివారంనాడు ప్రమీల వాళ్ళింటికి వెళదామని వెళ్ళాను. నే వెళ్ళేసరికి జ్యోతి అక్కడే ఉంది. అంతకు క్రితం ఏం మాట్లాడుకున్నారో తెలియదు. గదిలోకి వెళుతుండగా ఈ మాటలు వినిపించినయ్యి. "సీతకసలు వాళ్ళ బావమీద మోజుంది. అందుచేతనే ఎప్పుడూ వాళ్ళింట్లోనే గుంటూర్లో ఉండేది. లేకపోతే స్కూల్ఫైనల్ ప్యాసయ్యాక ఒక సంవత్సరం చదువు ఎందుకు మానేస్తుంది చెప్పు?"

జ్యోతి అన్న ఈ మాటలు వినేసరికి తలతిరిగి పోయింది. కాళ్లు తేలిపోసాగినయ్యి. పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది. ఇంక గదిలోకి వెళ్ళలేక పోయాను. ఆరోజు పడ్డ మనోవేదనకూ, అభిమానానికీ అంతులేదు. అక్కయ్యగారింట్లో నే నెందుకున్నానో వాళ్ళకేం తెలుసు. ఏ పరిస్థితుల్లో అక్కడకి వెళ్ళేదాన్నో వాళ్ళకేం అర్థమాతుంది. అక్కయ్యను ఆ విధంగా కాల్చుకుతిన్న బావమీద వీళ్ళు చిత్రించుకున్న విషయాల్లో ఆవగింజలో నూరోవంతు ఆలోచనైనా నాకులేదు. ఎందుకు వీళ్ళిట్లా నామీద కత్తిగట్టి ఈ దుమారం

సృష్టించారు? కృష్ణవేణి జీవితం జ్యోతికి తెలీదా? తన అక్కయ్య కాబట్టి ఏ విషయాలూ చెప్పదు. కృష్ణవేణి జీవిత చరిత్ర ప్రమీలకి చెబితే? ఆపడ మనస్తత్వం ప్రమీల అర్థం చేసుకుంటే జ్యోతి చెప్పే మాటలు నిజంకావని తేలిపోతుం దిగా? ఛా! అయినా ఈ విషయాల్లో నేను తలదూర్చటం ఎందుకు? ఎవళ్ళ ఉలుకు వాళ్ళే బయట పెట్టుకుంటున్నారు. గాని, ఇందులో నా తప్పేముంది? ఏం చెయ్యటానికీ తోచ లేదు దిగులుపడి కాలం గడపటంతప్ప. ఇట్లా అనుకొని ఊరుకున్నాను

మరో రెండు రోజులు పోయాక సుభద్ర దగ్గర్నించి ఉత్తరం వచ్చింది.

సీతా,

నే రాసిన ఉత్తరానికి జాబులేదు. నా మీద కోపమా? లేక తీరిక లేకనా? చదువులో మునిగి తేలుతున్నావా? రమాదేవి ప్రతిరోజూ వచ్చిపోతూనే ఉన్నది. బాబును చూడ కుండా ఒక్కరోజు కూడా ఉండలేదు. రమాదేవి ఇప్పుడు చాలా మారిపోయింది. చాలా పెద్దమనిషి తరహాగా, మర్యా దగా, కలుపు గోలుతనంగా మాట్లాడుతుంది. అంత ఇదిగా ఉన్నా, అన్నయ్య రమాదేవిని పలకరించదు.రమాదేవి కూడా అంతే. వాళ్ళ ఉద్దేశ్యాలేమిటో?

నీకో శుభవార్త. నేనూ, నాన్నగారూ, అమ్మా, పసివాడితో సహా వచ్చే శనివారంనాడు ఏలూరు మీ ఇంటికి వస్తున్నాం. మేం రావటం నీకు ఇష్టమేనా? వచ్చాక అన్ని సంగతులూ మాట్లాడుకుందాం.

నువ్వు జాబు రాయకపోతే నేను రాను. తెల్సిందా!

సుభద్ర.

బాబునీ, సుభద్రనీ చూస్తాననే సంతోషంతో నా మనస్సు పొంగి పోయింది. అమ్మకూ, నాన్నకూ ఈ ఉత్తరం చదివి వినిపించాను. ఇద్దరూ ఒకళ్ళ ముఖాలొకరు చూసుకుని ఊరుకున్నారు. ఆ మూగ సంభాషణలు ఏమిటో నాకర్థం కాలేదు.

శనివారం నాడు ఉదయం పది గంటలకల్లా అంతా వచ్చేశారు. సుభద్రని చూడంగానే నాకు ముచ్చటేసింది. ఆ ముఖంలో ఇది వరకు మాదిరి వెర్రి తరహాలేదు ఎంతో నాజూగ్గా, ఆకర్షణీయంగా, అమ్మతల్లిలా విప్పారినముఖంతో ఆప్యాయంగా నన్ను పలకరించింది.

సుభద్ర తల్లి నా వైపు చూసి నవ్వుతూ "బాగున్నావా సీతా!" అని పలకరించింది. పసివాడ్ని ఆవిడ దగ్గర్నుంచి అమ్మ తీసుకుంది. వాడ్ని చూడంగానేఅమ్మ ముఖం విచారంతో పూడిపోయింది. కళ్లొత్తుకుంటూ వాడ్ని ఎత్తుకుని ఒకసారి ముద్దు పెట్టుకుంది. అక్కయ్యకా భాగ్యంలేదు కదా ! ఏ లోకంలో ఉందో! సర్వదా వాడ్ని చూస్తూ దీవిస్తూనే ఉంటుంది. అందుకనే తల్లి లేని పిల్లలు చక్కగా పెరిగి పెద్దవారవుతారు.

అక్కయ్య కొడుకూ అంతే. అట్లాని మురిసిపోవటమే. వాడ్ని చూస్తూ అక్కయ్యని తల్చుకుని కుమిలిపోవటమే. ఇప్పుడిప్పుడే వాడు పారట్లాట్లానికి ప్రయత్నం చేస్తున్నాడు. బోసినోటితో నవ్వుతూ చొంగ కారుస్తూ అందర్నీ పలక

రిస్తాడు. పచ్చగా నిగనిగ లాడుతూ ఎంతో ముద్దొస్తున్నాడు. వాడిని చూస్తేనే చాలు ఎటువంటి మనశ్శాంతి లేనివాళ్లైనా, వాళ్ళ కష్టాలన్నీ మర్చిపోయి వాడితో ఆడుకుంటారు. భగవంతుని సృష్టిలో ఒక చెడు ఎక్కడయితే ఉందో, ఒక మంచీ అక్కడే ఉంటుంది. ఒక కష్ట మెక్కడైతే ఉందో, ఒక సుఖమూ అక్కడే ఉంది. ఈ మంచి చెడ్డలనీ, సుఖ దుఃఖాలనీ సమన్వయించుకుని జీవితం గడిపినవారు ఎంతో ధన్యులు.

సుభద్ర ఆ రోజల్లా నాతో ఎన్నో కబుర్లు చెప్పింది. ముఖ్యంగా రమాదేవి సంగతి, కృష్ణవేణి సంగతి. "రమాదేవి బి. కాం. ఫైనలియరు చదువుతోంది కదూ" అన్నాను.

"అవును సీతా. రమాదేవి మొదట్లో మనం చూసినప్పుడులా హాళ్లా పెళ్ళాగా లేదు. ఎంతో వినయంగా, విధేయతగా, మాట్లాడుతుంది. నేనంటే ఎంతో ఆప్యాయతగా మాట్లాడుతుంది. మనింటి కొచ్చినప్పుడు బాబుని ఒక్క నిమిషం కూడా ఏడవ నివ్వదు. అదేమిటో రమాదేవి దగ్గర చక్కగా ఉంటాడు వాడూను" అన్నది.

"అంత అంటుకుపోయాడన్న మాట. పోనీ రమాదేవి అయినా విసుక్కోకుండానే వాడ్ని ఎత్తుకుంటున్నది. నాకూ చాలా సంతోషంగా ఉంది" అన్నాను.

"సీతా!"

"ఏం సుభద్రా?"

"ఏం లేదు"

"ఏదో చెప్పబోయి ఆగావేం?"

"మా ఇల్లు నీకెట్లాఉంది?"

"బాగుంది. అద్దె ఇల్లేకదా. స్వంత ఇల్లుకాదుగా."

"ఉన్నన్నాళ్లూ మన ఇల్లేగా"

"అవుననుకో. ఎప్పుడు బాగుండకపోతే అప్పుడే కాళీ చేస్తాం. అంతేకద"

"వదిన పోయాక అన్నయ్య కూడా చాలా మారి పోయాడు జీవితంలో ఎప్పుడూ ఏదో వెతుక్కుతున్నట్లే ఉంటాడు. వదినను తల్చుకుని ఎంతో బాధపడతాడు."

"అది లోక సహజమే సుభద్రా. ఉన్నన్నాళ్ళూ లేని పోని అనుమానాలతో కాల్చుకుతిని, చచ్చిపోయాక ఆవిడ్ని తల్చుకుని ఏడవక చేసేదేముంది బతకనిబిడ్డ బారెడుఅన్నట్లు, మనిషి పోయాక వాళ్ళ సద్గుణాలు వాటంతట అవ్వే వెల్ల డవుతయ్యి" అన్నాను.

"అన్నయ్యతో నువ్వూ చాలా సరదాగా మాట్లాడే దానివేగా. అన్నయ్య మనస్సు నీకూ కొంత వరకు తెలుసను కుంటాను.

"అక్కయ్య భర్త బావగా మాత్రమే తెల్సు."

"బాబు ఎప్పుడయినా నీకు గుర్తొస్తాడా?"

"ఎందుకురాడు? తల్లిని పోగొట్టుకున్న నిర్భాగ్యుడు."

"అక్కయ్య కొడుకుని నీ కొడుకుగా ఎందుకు చూసు కోకూడదు."

సుభద్ర గంభీరంగా నావైపు చూసింది. విషయం అర్ధం చేసుకున్నాను.

"అందుకే నన్నమాట మీరంతా వచ్చింది. నన్ను మీ ఇంటి కోడలుగా చేసుకోవాలను కున్నారా?"

"అవును సీతా."

నవ్వుతూ నావైపు చూసింది సుభద్ర.

"అయితే ఇప్పుడు పెళ్ళి చూపుల కొచ్చారా?"

"నువ్వేం తెలీని పరాయిదానివా సీతా? నీ అభిప్రాయం తెల్సుకుందామనే వచ్చాం. నువ్వు బాబు తల్లివి కావాలి సీతా. అదే మా అందరి కోరికా."

సుభద్ర నావైపు ఆర్తంగా చూసింది. నా మనస్సు అల్లకల్లోలమై పోయింది. ఏం చెప్పటానికీ నాకు మనస్కరించ లేదు.

"నే నిప్పుడప్పుడే పెళ్లి చేసుకోను సుభద్రా. చదువు పూర్తికావాలి. కాకపోయినా..." అక్కయ్య మాటలు గుర్తుకొచ్చి నాకళ్ళు నిండినయ్. కళ్ళు మూసుకుని అట్లాగే కుర్చీలో కూర్చుండిపోయాను. ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలీదు కళ్లు తెరిచేసరికి బాబును ముద్దాడుతూ సుభద్ర కుర్చీలో కూర్చుంది. వాడు "ఊ, ఆ" అంటూ సుభద్ర చేతుల్లోంచి ఎగురుతూ, కాళ్ళూ చేతులూ తన్నుకుంటూ ఇంతింత కళ్ళతో పాలుగారే బుగ్గలతో కేరింతలాడుతున్నాడు. సుభద్ర బాబుని నా చేతి కిచ్చింది. వాడ్ని గుండెల కదుము కున్నాను. నావైపు వాడు తేరిపార చూస్తూ, నా చెవులూ, ముక్కూ పీకుతూ, మెళ్ళో గొలుసు లాగుతూ పలకరిస్తు న్నాడు. వాడి బోసి నోటి పెదవులు తనివితీర ముద్దు పెట్టు కున్నాను. వాడి చొంగతో నా పెదవులు తడిసినయ్. నా

కళ్ళు చెరువులయినయ్యి. బాబు అక్కయ్య నోముల పంట. చిన్న చిన్న కాళ్ళూ చేతుల్తో ముద్దులు మూటగట్టే వాడి పాలుగారే ముఖాన్ని చూస్తూ, గుండెలకు హత్తుకునిపాలిస్తూ పడుకునే అదృష్టం అక్కయ్యకు లేదు.

నేను వాడికి తల్లిని కావాలా! అందరి కోరికా ఇదేనా! అందుకు అందరి కళ్ళు నామీదనే పడ్డయ్యా! నాకేం తోచ లేదు. ఏంచెప్పటానికీ మనస్కరించలేదు. అక్కయ్య భావమూ అదే అనుకున్నాను. ఆ రోజు గడిచింది.

మర్నాడు ఆదివారం మధ్యగదిలో అమ్మా, సుభద్ర తల్లీ, సుభద్రా కూర్చున్నారు అమ్మపక్కనే నేనూ కూర్చు న్నాను. నా మనస్సేమీ బాగుండలేదు.

"సీతా!" అన్నది అమ్మ. అమ్మ కళ్ళల్లో తీరని ఆవే దన స్ఫుటంగా కనిపించింది. అమ్మ వైపు చూశాను

"సుభద్ర అంతా చెప్పేఉంటుం దనుకుంటాను. నీ ఉద్దేశ్యం చెప్పమ్మా" అన్నది సుభద్రతల్లి నావైపుచూస్తూ.

అమ్మ మాట్లాడలేకపోయింది. బాబుని వళ్ళోకూర్చో పెట్టుకుని వాడి ముఖంలోకి చూస్తూ కూర్చుంది.

"సుభద్రతో అన్ని విషయాలు చెప్పాను. నేనిప్పుడు పెళ్ళిచేసుకోటానికి నిశ్చయించుకోలేదు. నా చదువు పూర్తి కావాలి" అన్నాను. ఇంక అక్కడ వాళ్ళ దగ్గిర ఒక్క నిమిషం కూర్చో బుద్ధిపుట్టలేదు నా గదిలోకి వెళ్లి తలుపేసు కుని పడుకున్నాను. కళ్ళు వాచినయ్యి. ఎంతసేపు ఏడ్చానో, ఎంతసేపు అట్లాగే మంచంమీద పడుకున్నానో నాకు తెలీదు. గది తలుపు తీసి టైము చూస్తే రాత్రి ఏడు గంటలయింది.

నాన్న నన్ను పిల్చి "చూడమ్మా! నీకు ఇష్టంలేని ఏ పనీ చెయ్యను తల్లీ" అంటూ నన్ను బుజ్జగిస్తూ మాట్లాడారు. ఆ రాత్రి ఎవరి ముఖాల్లోనూ కత్తి వేస్తే నెత్తురు చుక్క లేదు. నా పరిస్థితి చెప్పనక్కరలేదు.

మర్నాడు ఉదయమే వాళ్ళంతా ప్రయాణమయారు. యాంత్రికంగా చూస్తూ నిల్చున్నానేగాని, బాబుని చూడనైనా చూడలేదు. సుభద్రతో మాత్రం ముక్తసరిగా "ఉత్తరాలు రాస్తుండు సుభద్రా" అన్నాను.

అంతా వెళ్ళిపోయారు. అమ్మా, నాన్నా మళ్ళీ ఆ ప్రస్తావన తేనేలేదు. వాళ్ళని చూస్తుంటే, అమ్మకు నన్ను బావకిచ్చి పెళ్ళిచెయ్యటానికి ఇష్టపడ్డట్టుగానే తోచింది. నాన్నకు మాత్రం ఇష్టంలేదు.

మర్నాడు కాలేజీకి వెళ్లాను. ఎవళ్ళతోనూ మాట్లాడలేదు. మధ్యాహ్నం ప్రమీలమాత్రం తనంతటతనే పలకరించింది.

"అట్లా ఉన్నావేం సీతా? నువ్వెంత దాచినా నాకు తెల్సిందిలే?"

"ఏం తెలిసింది?"

"మీ బావగార్ని చేసుకోబోతున్నావుటగా?"

"ఎవరన్నారు?"

"జ్యోతి"

"జ్యోతికి ఎవరు చెప్పారు?"

"వాళ్ళక్కయ్య కృష్ణవేణి ఉత్తరం రాసింది."

"అట్లాగా!"

నా ముఖంలో ఏం మార్పు చూసిందో ప్రమీల ఒక్క సారి ఎగాదిగా చూసి వెళ్ళిపోయింది.

కాలేజీ నుంచి మామూలుగా ఇంటికి వెళ్ళిపోయాను. రాత్రి భోజనాల మూక అమ్మ అడిగింది.

"సీతా"

"ఏమిటమ్మా?"

"మేమూ పెద్దవాళ్ళ మవుతున్నాం. ఈ దిగులూ విచారాలతో ఎప్పుడో రాలిపోవచ్చు జానకి చేసుకున్న పూజ కొద్దీ దాని బ్రతుకట్లా తెల్లవారింది. ఒక తల్లి బిడ్డలయినా ఎవరి మనస్తత్వాలు వాళ్ళవి. ఎవళ్ళ అదృష్టం వాళ్ళది. తెల్సిన సంబంధం. అతనయినా పెద్దవాడు కాదు. అన్నీ నువ్వు ఎరుగున్న విషయాలే. మాకూ బరువుతీరినట్లుంటుంది. శావని చేసుకుంటే బావుంటుందని మా ఉద్దేశ్యం తల్లీ. అక్కయ్య ఉద్దేశ్యమూ అదే తరువాత నీ ఇష్టం" అన్నది అమ్మ.

ఎదిగిన ఆడపిల్లలంటే కన్నతల్లికి కూడా అంత బరువు కామాలు. ఎప్పుడెప్పుడు పెళ్లి చేసి అవతలకి సాగనంపుదామా అని చూస్తుంటారు. ఒక సంబంధం చేసి, దానిమంచి చెడ్డలు ఆకళింపుచేసుకుని, ఆ సంబంధం రీత్యా నానా అగచాట్లూ పడి, చేతులు కాల్చుకున్నా ఇంకా అటువైపే మొగ్గు చూపటంలో ఏం సబబుందో నా కర్థంకాలేదు. దీనికి కారణం ఆర్థికపరిస్థితులే కావచ్చు. అక్కయ్య ఆఖరి మాటలే కావచ్చు.

"అక్కయ్య కాపురం పరిస్థితులు చూసి నీ తల బొప్పి కట్టలేదమ్మా?" అన్నాను.

"నీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేనే సీతా! అయినా బావ మనస్తత్వం నీకు తెలీంది కాదు. బావని చేసుకుంటే కష్టం బాధ తప్పుతుంది. అదీ గాక వాళ్ళంతటవాళ్లే మనింటికి వచ్చి ఈ ప్రస్తావన తెచ్చారు. ఇంతకన్న మంచి సంబంధం కష్టం లేకుండా మీ నాన్న మాత్రం ఎక్కడ తేగలరమ్మా? దాని గీత బావుండక అట్లాంటి అపవాదులూ, అగచాట్లూ పడిందిగాని, నువ్వు సుఖపడతావనే నమ్మకం నాకుంది సీతా! నువ్వు బావని దిద్దుకోగలవు తల్లీ. ఆలోచించు" అన్నది అమ్మ.

అమ్మ ఈ మాటలు చెప్పి వెళ్లిపోయింది.

# 15

'బావ' అక్కయ్య భర్త అక్కయ్య పోయిందిగనక, అమ్మ చెప్పిందిగనక నా జీవితం బావతో ముడిపెట్టుకోవాలి. ఇది అమ్మ కోరిక. అక్కయ్య పరిస్థితులు విన్న అమ్మ ఆ రోజుల్లో 'దానిగొంతు కోశామని'విచారపడి కృంగిపోయింది. ఆ బావే ఈ రోజున అమ్మ దృష్టిలో నాకు తగిన వారనిపించారు. ఇదంతా కష్టమియ్యలేని పరిస్థితుల్లో మనస్సును సమాధానపర్చుకుని తెచ్చిపెట్టుకున్న ఆత్మవంచన. పెళ్ళిళ్ళ విషయంలో కన్నెచెర వదిలించుకోటానికి కట్న కానుకలివ్వలేని కన్యాదాతలు ఎంత ఆత్మవంచన కయినా సిద్ధపడతారు. లోక సహజమే అది.

అక్కయ్యగారింట్లో ఉన్నన్నాళ్ళూ బావను గౌరవ దృష్టితో నే నెప్పుడూ చూడలేదు. అక్కయ్యకోసం, దాని కాపురం సరిదిద్దదల్చుకున్న రీతుల్లో బావతో అనేక విషయాల్లో వాగ్వాదం పెంచుకున్నానేగాని, గౌరవప్రదమైన సానుభూతి వాక్యాలతో ఎక్కువగా మాట్లాడలేదు. అసలు బావ నన్ను చేసుకోటానికి ఇష్టపడి ఉంటారా? ఇష్టపడితే ఏదో ప్రమేయంతోనయినా నాకు ఒక్క ఉత్తరమైనా రాయలేదే ఇదంతా పెద్దవాళ్ళ ప్రోద్బలమూ లేక బావ అంగీకారం కూడా తీసుకునే వచ్చారా? నా ప్రాణంకన్నకూడా అక్కయ్యని మిన్నగా ప్రేమించాను. దాని సుఖమే నా సుఖమనుకున్నాను. అలాంటి అక్కయ్య పోగానే దాని స్థానం నేనెట్లా ఆక్రమించేది? రోజూ అక్కయ్యను తల్చుకుంటూ కుమిలిపోవటం తప్ప, దాని స్థానంలో నేను ప్రవేసించి బావ హృదయంలో చోటు చేసుకోగలనా? అంత ఎత్తిపొడుపు మాటలతో తర్కవితర్కాలతో బావతోమాట్లాడిన నేనుభార్యగా, గృహిణిగా బావతో కాపురం చెయ్యగలనా? భర్తగా ఆయనన్ను గౌరవించగలనా? ఇల్లాలుగా ఆదరించగలనా? "ఆ రోజుల్లో మీా అక్కయ్య తరఫున అట్లా నాతో వాదించావు. మరదలువు కాబట్టి నీమీాద నాకేమీా అధికారం లేకపోయింది ఇప్పుడు నువ్వు నా భార్యవు. అన్ని విషయాల్లోనూ నా అభిప్రాయాలకు అనుగుణంగానే నువ్వు మసులుకోవాలి" అంటూ నన్ను మరింత చులకనగా చూస్తే?

ఏమిటో ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోయాను.

నాలుగు రోజులు గడిచినయ్యి. సాయంత్రం కాలేజీ నుంచి ఇంటికి రాగానే నాన్న నా చేతికొక ఉత్తరం ఇచ్చారు. సుభద్ర రాసిందేమో ననుకున్నాను. ఆశ్చర్యం బావరాసిన ఉత్తరం. బావ నాకు ఉత్తరం రాయటమేమిటా అని ఆశ్చర్యపడ్డాను. ఆదుర్దాగా ఉత్తరం చదివాను.

సీతా!

మనఃపూర్వక ఆశీర్వచనములు. ప్రతివారూ జీవితంలో ఏ ఒడుదుడుకులూ లేకుండా సుఖ సంతోషాలతో కాలం గడిచిపోతున్నంత వరకూ, అంతా తమ ప్రతాపమేనని అనుకుంటారు. దానికి వ్యతిరేకంగా ఏవయినా ఇబ్బందులు కలిగినప్పుడు మన రోజులు బాగుండలేదని అనుకుని విచారపట్టం మానవ సహజం. ప్రస్తుతం నేనూ ఈపరిస్థితుల్లోనే ఉన్నాను.

నీతో నా కష్ట సుఖాలను గురించి మనస్సువిప్పి చెప్పుకోవాలని నా కోరిక. నా మనస్సులోని ఈ అవ్యక్త వ్యథను వెల్లడించటానికి బాధపడుతున్నాను. కాని నీతో చెప్పుకుంటే కాస్త మనశ్శాంతయినా ఉంటుందేమోనని నా ఆశ. మనకు సన్నిహితులయిన వారితో, మన చుట్టూ తిరిగే వారితో జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక పని తగులుతుందనే భావం సామాన్యంగా కలుగదు. ఎందుకంటే వారికన్న కొంత వరకూ మనం మిన్నగా ఉండటం నుంచి. తూష్ణీ భావంతో చూసిన అలాంటి వ్యక్తి వద్దకుపోయి యాచించవలసి వచ్చినప్పుడు మన అంతరాత్మను ఎంత చంపుకోవాలో నాకు ఇప్పుడు అర్థమవుతున్నది.

నా మనస్సు విప్పి నీతో ఎన్నో సంగతులు మాట్లా డాలి. ఆప్తమిత్రుడుగా అర్థిస్తున్నాను. బావగా అడగటం లేదు. నా మనస్సును అర్థంచేసుకున్న ఆప్తురాలివి గనుక ప్రార్థిస్తున్నాను. మరదలుగా నీతో చనువుగా, ఎగతాళిగా మాట్లాడదల్చుకోలేదు. నీకు ఇష్టమైతే, వీలయితే వచ్చే శని, ఆదివారాల్లో ఇక్కడికి మా ఇంటికి రావలసిందిగా ఆహ్వానిస్తు న్నాను. అమ్మా, నాన్నా ఉన్నారు. సుభద్ర నీ రాకకు ఎదురుచూస్తున్నది. బాబు పిన్నికోసం వెతుక్కుంటున్నాడు. ఎప్పుడు వచ్చేది వెంటనే జాబు రాస్తావుగా సీతా!

రామారావు.

ఉత్తరం చదివాక రెండు నిమిషాలు అట్లాగే నిల్చుండి పోయాను. కళ్ళు చమర్చినయ్యి. అమ్మా, నాన్న నా గది లోకి వచ్చారన్న సంగతే మర్చిపోయాను. నాన్న ఉత్తరం తీసుకుని మళ్లీ చదువుకుని,

"ఏమ్మా సీతా! గుంటూరు వెళ్ళివస్తావా?" అన్నారు.

"అంతగా రాస్తుంటే వెళ్ళిరా తల్లీ. వాళ్ళు మనిం టికి వచ్చి వెళ్లారు కదా! నువ్వు వెళ్లినంత మాత్రంలో తప్పే ముంది?" అన్నది అమ్మ.

"ఆలోచించి ఒకనిర్ణయానికి వస్తానమ్మా. ఇప్పుడేమీ చెప్పలేను" అన్నాను.

అమ్మా, నాన్న మరేం మాట్లాడలేదు.

బావ నాతో ఏం మాట్లాడతారు? నాతో చర్చించ వలసిన సంగతులేం ఉంటయ్యి! ఒక్కటే విషయం, తనను చేసుకోటానికి నా అభ్యంతర మేమిటో తెల్సుకోవాలనే.

అంతకన్నా మరేముంటుంది? ఎంతో ఆలోచించిన మీదట గుంటూరు వెళ్ళటానికే నిశ్చయించుకున్నాను. శనివారం ఉదయం వస్తున్నానని సుభద్ర పేర ఉత్తరం రాశాను.

గుంటూరు స్టేషనులో రైలుదిగి, రిక్షాలో వెళుతుంటే ఏమిటో చెప్పలేని ఆవేదనతో గుండెలు కొట్టుకోసాగినయ్యి. ఇదివరకు వెళ్లేటప్పుడు ఎప్పుడెప్పుడు వెళ్ళి అక్కయ్యను చూద్దామా అనిపించేది. అక్కయ్య కోసం మనస్సు సంతోషంతో, హృదయం ఉత్సాహంతో పరవళ్ళుతొక్కేవి. నవ్వుతూ గుమ్మంలో రిక్షా దిగేదాన్ని. ఇప్పుడు రిక్షాలో కూర్చుంటే, రిక్షా ఇంత తొందరగా పోతున్నదేమా అనిపిస్తున్నది. నేనెందుకు వెళ్లాలి? ఎవరికోసం వెళ్ళాలి? ఎవర్ని చూడటానికి వెళ్ళాలి? అక్కయ్య బ్రతికుంటేనే, అది బావగారిల్లు, అక్కయ్యగారిల్లు అక్కయ్య పోయాక అది పరాయి ఇల్లు. బావ కాదు, రామారావుగారు. ఆ రామారావుగారింటికి నేనెందుకు వెళ్లాలి? తిరుగు బండిలో ఏలూరు వెళ్లిపోదామనిపించింది. ఆలోచిస్తుండగానే రిక్షా ఇంటిముందు ఆగింది. రిక్షా చప్పుడువిని సుభద్ర బయటకు వచ్చింది. ఆప్యాయంగా పలకరించి నా చెయ్యి పట్టుకుని ఇంట్లోకి తీసుకు వెళ్ళింది. ముందు హాల్లో అడుగుపెడుతూనే హఠాత్తుగా ఆగిపోయాను గుమ్మానికి పైన అక్కయ్యది పెద్దసైజు ఎన్‌లార్జిమెంట్ ఫోటో. కళకళలాడుతూ, విప్పారిన ముఖంతో నా వైపు చూస్తూ, నన్నే పలకరించినట్లుగాఉంది. ఒక్కసారి చూసి తల వంచుకున్నాను అప్రయత్నంగా కళ్లు తుడుచుకున్నాను. ఇంట్లోకి వెళుతుంటే అక్కయ్య జీవితంలో నేను ప్రవేశిస్తు

న్నానా అనిపించింది. బాబుకు పాలుపడుతూ సుభద్ర తల్లి కూర్చుని ఉంది.

"రామ్మా! రా! నువ్వు వచ్చినందుకు చాలా సంతోషము కాళ్ళు కడుక్కోటానికి నీళ్లివ్వు సుభద్రా" అన్నది సుభద్రతో.

ఎంతలో ఎంత మార్పు! అక్కయ్య ఉన్న రోజులలో నేనే దొడ్లోకివెళ్ళి బావిదగ్గర కాళ్ళు కడుక్కొని వచ్చేదాన్ని. వంటింట్లోకి వచ్చేసరికి అక్కయ్య మంచి నీళ్ళిచ్చి "ఏమే సీతా! కులాసాగా ఉన్నావా? అమ్మా, నాన్నా కులాసాగా ఉన్నారా?" అని ఆప్యాయంగా పలకరించి మాట్లాడేది. ఇప్పుడు పరాయిదాన్ని, చుట్టాన్ని.

బావ గదిలోంచి వచ్చారు. కుశల ప్రశ్నలు వేశారు బావవేపు చూశాను చాలా మారిపోయారు చిక్కిపోయారు. ముఖంలో కళా కాంతులు తగ్గినయ్యి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లే ఉంటారు. మనసులో బాధ పడుతూ ఉన్నట్లే కనుపించారు.

పాలు పట్టటమయ్యాక బాబుని ఎత్తుకున్నాను. నా ముఖంలోకి తేరిపారజూస్తూ, నా మెళ్ళోని గొలుసు పుచ్చుకుని గుంజసాగాడు. బాగా వళ్ళుచేశాడు తెల్లగా, పచ్చగా, పుష్టిగా ముద్దులు మూటకట్టేటట్లున్నాడు. ఎందుకు ఉండడు, తల్లిని మింగినవాడు. తల్లిని దూరం చేసుకున్నవాడు. తల్లి ప్రేమకు నోచుకోనివాడు. తల్లంటే ఎవరో తెలీనివాడు. అలాంటి నిర్భాగ్యుడికి ఆరోగ్యమైనా లేకపోతే ఎట్లా? ఆ తల్లి ఆయుర్దాయంకూడా వాడిదే.

భోజనాలయ్యాక బావ గదిలో కూర్చుని నన్ను పిల్చారు. నాకా గదిలో వెళ్ళటానికి మనస్కరించలేదు. ప్రతిచోటా, ఇల్లంతా అక్కయ్య కలయతిరుగుతున్నట్లుగానే ఉంది. ఆ గదిలోనే అక్కయ్య, బావ, రమాదేవి, నేను కూర్చుని ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. రమాదేవి తన పరిస్థితులను చెప్పినప్పుడు అక్కయ్య ఎన్నో హితోక్తులు చెప్తూ మౌనంగా, జాలిగా అక్కడే చెంగు పర్చుకుని పడుకున్న సంఘటనలు గుర్తుకొచ్చినయ్యి మొదటి రోజుల్లో ఆ గదిలోనే బావచేతుల్లో అక్కయ్య దెబ్బలు తిన్నది. అక్కయ్య, బావ ఉండవలసిన ఆ గదిలోకి పోలేకపోయాను. గుమ్మం ముందు నిల్చున్నాను.

"రా సీతా! అట్లా కుర్చీలో కూర్చో" అన్నారు బావ.

"ఇట్లా నిల్చుంటాలే బావా. మరేం ఫరవాలేదు. పిల్చారెందుకు?" అన్నాను. బావ ఏమనుకున్నారో ఏమో!

"అట్లా వరండాలో కూర్చుందామా?" అన్నారు.

తల ఊపాను. ఇద్దరం వరండాలో కూర్చున్నాం.

"ఏం సీతా! ఉత్తరం రాసినందుకు కోపమొచ్చిందా" అన్నారు బావ.

"కోపమెందుకు బావా? ఉత్తరంలో తప్పులేం లేవే!" అన్నాను.

"బాబును చూశావా?"

"చూశాను, ఎత్తుకున్నాను. శాస్త్రవళ్ళు చేసి బాగానే ఉన్నాడు."

"సీతా!"

తలెత్తి చూశాను. బావ ఏదో చెప్పబోయి ఆగి పోయారు.

"మూర్ఖంగా ప్రవర్తించి మీ అక్కయ్యని శాశ్వతంగా దూరం చేసుకోవటమేగాక, మీ అందరి మనస్సులూ కష్టపెట్టాను సీతా! నన్ను గురించి మీమనస్సులలో ఏర్పడిన దురభిప్రాయం ఇంకా అట్లాగే ఉందా సీతా?" అన్నారు

"ఏ అభిప్రాయమైనా కాలానుగుణంగా, అప్పటి పరిస్థితులనుబట్టి ఏర్పడేదేగాని శాశ్వతంగా నిల్చిపోయేది కాదు. కాకపోయినా ఒకరికోసం మరొకరు తమ అభిప్రాయాలను ఎందుకు మార్చుకోవాలి బావా?" అన్నాను.

బావ ఒక్కసారి నా వైపుచూసి ముఖం తిప్పేసుకున్నారు.

"మంచివారయినా, చెడ్డవారయినా బాంధవ్యాన్ని బట్టి ఆ వ్యక్తియందు మనకుగల గౌరవ ప్రపత్తులు వెల్లడించుకుంటాము. బాంధవ్యం తెగిపోయాక ఆ వ్యక్తియందు మనకుగల అనుభవాలనుంచి ఏర్పరుచుకున్న అనుభూతులు మాత్రమే మిగులుతూ ఉంటయ్యి. అంతేగాని దురభిప్రాయ పడవలసిన అవసరమేముంది బావా?" అన్నాను మళ్ళా.

"పి. యు. సి. అయ్యాక ఇంకా చదువుతావా సీతా?" అన్నారు.

"చదవాలనే ఉంది. కాని, సాగాలిగా. నాన్నకొచ్చే జీతంలో నాకు పెద్ద చదువులు ఏం చెప్పిస్తారు? అయినా పరీక్షలయి పాసయినాక సంగతి."

'బాబుని పెంచటానికి ఓపిక లేక మా అమ్మ సతమతమయి పోతోంది. ఒక్క పురిటికష్టం మినహా మా అమ్మే పిల్లాడి తల్లిగా వాడితో అవస్థపడుతోంది. పెద్దతనంలో ఆవిడకు ఇదొక బాధా, అవస్థ."

"రమాదేవి కాస్త సాయం చేస్తున్నదిటగా. రమాదేవికి మాలిమి అయినాడా బాబు?"

"నిజంగా రమాదేవి వాడి పోషణ విషయంలో అవస్థపడుతునే ఉంది. కాని సీతా..."

"ఏమిటి బావా?"

'మన మనిషంటూ ఒకరుంటే లోటుపాట్లన్నీ చెప్పి వాడి పోషణ విషయంలో ఇంకా శ్రద్ధ తీసుకోవచ్చు"

"పోనీ......"అర్ధోక్తిలోనే ఆగిపోయాను. నాకేమిటో మాట పెగిలి రాలేదు.

"వివాహం చేసుకోమంటావా సీతా?"

"బాబుకి తల్లి లేని లోటు తీర్చరా మరి?"

"కొంతకాలం కాపురం చేసి, హృదయంలో, మనస్సులో స్థానమేర్పరచుకుని భర్తని తీర్చిదిద్దుకునే భార్య ఈ లోకాన్ని శాశ్వతంగా విడిచిపోతే ఆ భర్త హృదయంలో అగాధ మేర్పడుతుంది. మరో పెళ్ళి చేసుకున్నా ఆ అగాధాన్ని శాశ్వతంగా పూడ్చలేకపోవచ్చు. పైపెచ్చు ఆ అగాధమే ఇంకా కట్టలు తెగి పెద్దదయి మానసికంగా కృంగదీయ

వచ్చు. పునర్వివాహం చాలా కష్టతరమైనది సీతా'' అన్నారు బావ.

నాకు ఆశ్చర్యం కలిగింది. బావకు మళ్లా పెళ్ళి చేసుకోటానికి యిష్టం లేకపోతే పెద్దవాళ్లు ఆ రోజున ఎందుకు ఏలూరు వచ్చినట్లు? బావ అభిప్రాయం తెల్సుకోకుండా నే పెళ్ళి విషయాలు ఆలోచించటానికి వచ్చారా? అనుకున్నాను.

"నీ అభిప్రాయం తెల్సుకుందామని ఉత్తరం రాశాను సీతా!"

"నా అభిప్రాయాని కేముంది బావా. పెళ్ళి చేసుకునేది మీరు. బాబుకు కన్న తండ్రి మీరు. వాడి మంచి చెడ్డలు ఆలోచించవలసింది మీరు మధ్యలో నా అభిప్రాయముతో పనేముంది బావా!'' అన్నాను.

బావ ముఖం చిన్నబుచ్చుకున్నట్లయింది.

"సీతా! అన్నీ తెలిసే యిట్లా మాట్లాడతావేం? నువ్వు బాబుకి తల్లివి కావాలని నా కోరిక. తరువాత నీ అభిప్రాయం ఆలోచించుకుని చెప్పు సీతా. నన్ను స్వీకరించటానికి నీకు యిష్టం లేదా? నీ అభిప్రాయం తెల్సుకుందామనే పిలిపించాను. ఆఖరి క్షణంలో జానకి అన్న మాటలు గుర్తు తెచ్చుకో'' అన్నారు బావ.

నా గుండెల్లో రాయి పడినట్లయింది. బావ ఈ మాట అడుగుతారని తెల్సు. దానికి ఏం సమాధానం చెప్పాలో ఎంత ఆలోచించినా నా మనస్సుకు తట్టలేదు.

"అంత తొందరగా చెప్పలేనీ సంగతి" అంటూనే కుర్చీలోంచి లేచి సుభద్ర ఉన్న గదిలోకి వెళ్లాను. మా మాటలన్నీ ఆలకిస్తూ కూర్చుంది సుభద్ర.

సుభద్రతో మాట్లాడలేకపోయాను. ఎన్నో ఆశలు తన మనస్సులో నింపుకుని, ఎన్నో అనుభవాలను చవిచూడాలనే ఆశతో, ఆదర్శ గృహిణిగా అక్కయ్య ఆ యింట్లో అడుగుపెట్టింది. ఆ ఇంటి ఇల్లాలిగా అక్కయ్య ఆ యింట్లో తిరుగుతుంటే అందరికీ చూడ ముచ్చటగానే ఉంది. కొత్త కాపురంగా ఎన్నో అనుభూతులు పుణికి పుచ్చుకోవాలనుకుంది. అక్కయ్య ఆశలు అడియాస లయినయ్యి బావ అన్నట్లుగా భార్య పోయిన భర్త హృదయంలో నిజంగా అఘాతమే ఏర్పడుతుంది. ఆ అఘాతాన్ని రెండవ భార్య పూడ్చకలదా? అందులోనూ ఒకళ్ళిద్దరి పిల్లల పెంపకం కూడా రెండవ భార్య నెత్తిన పడితే ఎంత ప్రేమతో ఆ పిల్లలను చూసుకున్నా రెండో పెళ్ళి పెళ్ళామనే ఈర్ష్యాభావం చాలామందికి కలుగుతుంది. ఈ స్థితిలోకి నేనూ రావాలన్నమాట ఈ స్థితికి నేను రాగలనా? వచ్చినా బావ మనస్సు నాయందు లగ్నమై ఉంటుందా? బావ నన్ను ప్రేమించగలరా? కేవలం గాబు పోషణ భారం నామీద వెయ్యటానికే ఈ నిశ్చయాని కొచ్చారా? పెళ్ళికాని రోజుల్లో నేను తనతో సిగ్గుభిడియాలు లేకుండా మాట్లాడానని అక్కయ్యమీదిరే నామీదా ఏదో అభాండం వేస్తే? అసలు అక్కయ్య కోసం ఎన్ని మాటలో, ఎన్ని కష్టాలో పడాలనుకున్న నేను, ఈ రోజున అక్కయ్య పోగానే బావకు భార్యను కాగలనా? అక్కయ్య బ్రతికున్న

ప్పుడే, ఆ రోజుల్లో నా మనస్సంతా అక్కయ్యతో లగ్నమై పోయుండేదే! ఈ రోజున ఆ స్థానాన్ని నేను ఆశించటమా? నేను బావను చేసుకుంటే అక్కయ్య ఆత్మ శాంతిస్తుందా? అసలు అక్కయ్య కోరిక అదేనా?అక్కయ్య భర్తగా, బావగా, రామారావు బావగా నా మనస్సులో చిత్రించుకున్నానేగాని కల్లోనయినా ఆయన భార్యగా ఉండాలని ఎప్పుడూ అనుకో లేదే?— ఇట్లా ఆలోచించాను.

ఎంత ఆలోచించినా నా మనస్సుకు ఏ సమాధానం దొరకలేదు. ఒక్కసారి నిట్టూర్పు విడిచి అటు చూచేసరికి రమాదేవి కనిపించింది. ఎప్పుడొచ్చి నిల్చుందో అక్కడ. కళ్ళు తుడ్చుకుని, రమాదేవి చెయ్యి పుచ్చుకుని కుర్చీలో కూరోచ్చపెట్టాను.

"ఎప్పుడొచ్చావు సీతా!" అని ఆప్యాయంగా అడిగింది రమాదేవి.

"నే వచ్చేసరికి పది గంటలయింది రమా. కులాసాగా ఉన్నావా! బాగా చదువుకుంటున్నావా!" అన్నాను.

రమాదేవి మాటలు విని ఉయ్యాల్లో పడుకున్న బాబు తల ఎత్తి రమాదేవి వైపు చూస్తూ "ఊ, ఆ" అంటూ పలక రిస్తూ ఎత్తుకోమని కాళ్లూ, చేతులూ తన్నుకుంటున్నాడు. నా వైపు చూసింది రమాదేవి.

"ఎత్తుకో రమా. నువ్వంటే వాడికి ఎంతో యిష్టం. చూడు. కళ్ళార్పకుండా నీవైపు ఎట్లా చూస్తున్నాడో" అన్నాను.

రమాదేవి కుర్చీలోంచి లేచివెళ్ళి ఉయ్యాల్లో పిల్లాడ్ని ఎత్తుకుంది. వాడు కేరింతలాడుతూ రమాదేవి చేతుల్లో ఉండి పోయాడు. అక్కయ్యకా అదృష్టం లేకపోయింది.

ఏమిటో ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. మా అందర్నీ చూస్తూనే బావ బట్టలు వేసుకుని వెళ్ళిపోయారు రమాదేవితో మరేం మాట్లాడాలో నాకు తోచలేదు.

"నువ్వు పిలు సీతా! బాబు నీ దగ్గర కొస్తాడేమో" అన్నది రమాదేవి చేతులు చాచి బాబుని పిలిచాను. వాడు నావైపోసారి, రమాదేవి వైపోసారి చూసి ముఖం తిప్పేసు కుని, రమాదేవి గుండెలకి అతుక్కుపోయాడు. నవ్వుతూ "చూశావా సీతా! వాడికి నేనంటేనే యిష్టం" అన్నది రమా దేవి.

"పసివాళ్లు వాళ్ళకేం తెల్సు. నాలుగు రోజులు సీత ఎత్తుకుంటే యింక ఆవిడ దగ్గరా అలవాటవుతాడు" అన్నది సుభద్ర. వాడి రెండు చేతులూ పుచ్చుకుని నా దగ్గరకు రమ్మని పిల్చాను. వాడు నవ్వుతూ రమాదేవిని వదల్లేదు.

"పిన్నిరా. పిన్ని దగ్గిరికి పోరా వెధవాయ్" అన్నది సుభద్ర. వాడూ నవ్వుతూ రమాదేవి వైపే చూశాడు.

కాసేపు ఏవో కబుర్లు చెప్పుకున్నాం. రమాదేవి వెళ్ళి పోతూ వాళ్ళింటికి రమ్మన్నది. సాయంత్రం వస్తానని చెప్పాను రమాదేవి వెళ్ళాక సుభద్ర అన్నది. "కనీసం రోజుకోసారయినా రమాదేవి వచ్చి వెళుతుంది. బాబంటే ఎంతో ముద్దు తను ఉన్నంత సేపూ వాడిని ఎత్తుకునే ఉంటుంది. ఎందుకో వాడంటే అంత ఆపేక్ష" అన్నది.

"సహజంగా పిల్లలంటే కొంతమందికి ముద్దు. తల్లి లేని పిల్లాడనే జాలిచేతనయినా రమాదేవి వాడ్ని ఎత్తుకో వచ్చు. పిల్లాడ్ని రమాదేవి ఎత్తుకుంటే బావ ఏమీ అనరా?" అన్నాను.

"ఏమీ అనరు. రమాదేవితో మాట్లాట్టమే లేదు అన్నయ్య. రమాదేవి రాగానే ఏదో పనిమీద అన్నయ్య బయటికి వెళ్ళిపోతాడు. రమాదేవికూడా ఏం మాట్లాడదు" అన్నది సుభద్ర.

ఇవేం మనస్తత్వాలో నాకర్థం కాలేదు.

* * *

సాయంత్రం నాలుగ్గంటలకు రమాదేవి ఇంటికి వెళ్లాను. కృష్ణవేణి లేదు. సగం ఆదుర్దా తగ్గింది. రమాదేవి మేడమీద నుంచే నన్ను చూసి గబగబా కిందికి వచ్చింది. ఇద్దరం మేడ మీదికి వెళ్ళాము. చెరో కుర్చీలో కూర్చున్నాము.

"మీ వదినగారు కులాసానా రమా?"

"ఆ కులాసానే. ఆవిడ చెల్లెలు జ్యోతి నీకు తెలుసుగా?"

"ఆ. మా ఇంటి దగ్గరే. అప్పుడప్పుడు యిక్కడికి మీ ఇంటికొస్తుందనుకుంటా?"

"వస్తూనే ఉంటుంది. అప్ప చెల్లెళ్లిద్దరూ ఒకటే ఇద్దరి స్వభావాలూ, భావాలూ ఒక్కటే. ఎవరిమీదో ఒకరిమీద అభాండాలు వెయ్యందే వారికి నిద్ర పట్టదు"

రమాదేవి ముఖంలో మునుపటి చలాకీతనమూ, జీవిత మాధుర్యమూ కనిపించటంలేదు.

"జ్యోతి యిక్కడికి వచ్చి వెళ్ళినప్పుడల్లా ఏదో ఒక కొత్త పుకారు లేవదీస్తూనే ఉంటుంది. మొదట్లో బాధ పడ్డాను. తరువాత జ్యోతి స్వభావమే అటువంటిది కావాలను కున్నాను. ఇతరుల మనస్సుకు కష్టపెట్టి, వాళ్ళు బాధపడుతుంటే చూసి సంతోషించడం కొంతమందికి 'హాబీ'. దానికి డబ్బు ఖర్చు అవుసరం లేదు"

"నిజమే. మనస్తత్వాలు తెల్సుకోకుండా మాట్లాడ్డం అలాంటివాళ్ళ దృష్టిలో హాబీనే. పోనీలే, వాళ్ళ సంగతి మన కెందుకు? ఇంకా ఏమిటివిశేషాలు? ఉంటావా రెండురోజులు?"

"లేదు. బావ ఉత్తరం రాస్తే వచ్చాను."

"సుభద్ర పెళ్ళా?"

"సుభద్ర పెళ్ళి విషయం వాళ్ళేమీ అనుకోవటము లేదే!"

"మరి?"

"బాబువిషయంలో బావ చాలా బాధపడుతున్నారు, వాడికి సరిగ్గా పోషణ జరగటంలేదని. ఎవరెంతచేసినా తల్లిలేని కొరత తీర్చలేంకదా రమా! నిజంగా కోపమొచ్చి తల్లికొట్టినా, బద్ధకించి ఒక గంట ఆలస్యంగా నీళ్ళు పోసినా, పని తొందర్లో తెమలక పవుడరు రాచి బొట్టు పెట్టకపోయినా ఆ తల్లిని ఎవరూ ఏమీ అనరు. అది ఎబ్బరికంగాగాని, వేలెత్తి చూపే టంత తప్పుగాగాని తోచదు. అదే ఇతరుల పెంపకమయితే ప్రతి విషయానికీ గోరంతలు కొండంతలుగా చిత్రిస్తారు. లోకం తీరే అంత."

"నిజమే సీతా!"

"రమా!"

"ఏం సీతా?"

"ఒక్క విషయం అడుగుతా, ఏమీ అనుకోవుగదా!"

"ఏమీ అనుకోను, ఏమిటది?"

"మొట్టమొదటిసారి మీ యింటికొచ్చినప్పుడు నాకు ఎన్నో విషయాలు చెప్పావు. మగవాళ్ళ మనస్తత్వాలు పూర్తిగా తెల్సుకోవాలనీ, ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మ కూడదో తెల్సుకోవాలనీ, అందుకుగాను వాళ్ళతో స్నేహం చేసి, వాళ్ళను నీ చుట్టూ తిప్పుకోవాలనీ, అప్పుడే వివాహ విషయంలో ఒక నిర్ణయానికి రాగలననీ చెప్పావు, గుర్తుందా రమా?"

రమాదేవి నవ్వింది. ముభావకంగానే నా వైపు చూసి "అవును. గుర్తుంది సీతా!" అన్నది.

"ఏమయినా ఒక నిర్ణయాని కొచ్చావా?"

"అంటే?"

"బి.కాం. ఈ సంవత్సరంతో అయిపోతుందిగా తరు వాత శుభలేఖ పంపుతావా?" నవ్వుతూ రమాదేవి ముఖం లోకి చూశాను. క్షణం తలొంచుకుంది రమాదేవి.

"ఏ నిర్ణయానికీ రాలేదు సీతా. ఏ నిర్ణయానికి రావాలో అర్థం కావటంలేదు. మనం అర్థం చేసుకున్నా ఇతర్లు, అంటే మన మంచి చెడ్డలు కాంక్షించేవాళ్ళు అర్థం చేసుకోవాలిగా."

"అంటే నువ్వు అర్థంచేసుకున్నా ఇతరులు అర్థంచేసు కోలేదనా? లేక నీ అన్వేషణ ఇంకా పూర్తి కాలేదనా?"

"రెండూను."

"అంటే?"

"మనల్ని మనం ముందు అర్థం చేసుకోవాలి. మన మనస్సు మన చెప్పుచేతల్లో ఉన్ననాడు, మన నిర్ణయం దానంతటదే ఏర్పడుతుంది. జీవిత సమస్యల్ని పరిష్కరించుకోటానికి జానకిలాంటి వాళ్లకి ఒక జీవితకాలం పడుతుంది ఆజీవితాలు దగ్గరుండిచూసినా, ఎదుటివాళ్ళు తమ జీవితసమస్యలు ఎట్లా పరిష్కరించుకోవాలో అర్థంకాక సతమత మాతూంటారు. ఏమంటావు సీతా?" అన్నది.

"నిజమే."

"బాబు మంచి చెడ్డలు చూడవలసిన బాధ్యత నీ మీదా కొంత వరకు ఉంది సీతా."

"నా మీదనా?"

"అవును."

"ఎందుకని?"

"బాబు పింతల్లివి. తల్లి తరువాత పింతల్లికే బాధ్యత ఉంటుంది. ఎంత తప్పుకుందామనుకున్నా నీ బాధ్యత నుంచి నువ్వు తప్పుకోలేవు. జానకి స్థానంలో నువ్వుంటే పెద్దలంతా హర్షిస్తారు అందరి కోరికా అదే. జానకి ఆత్మకూడా శాంతిస్తుంది. మీ బావ ఉద్దేశ్యమూ అదే. ఈ విషయంలో నూటికి నూరు మార్కులూ నీవే" ఏదో నిశ్చయాని కొచ్చిందానిలా నా వైపు చూస్తూ అన్నది రమాదేవి. ఆ మాటల్లోని తొట్రుపాటు నేను గమనించాను. రమాదేవి కంఠం విచారంతో పూడిపోయినట్లుగా ఉంది.

"మీ అందరి కోరికా అంతేనా?"

"నిజం సీతా!"

"ముక్త కంఠంతో మీరంతా నన్ను బావని చేసుకో మని సలహా యిస్తున్నారు"

"సలహా కాదు. కోరుతున్నాం."

"నా యిష్టా యిష్టంతో ప్రమేయం లేదా?"

రమాదేవి ఆశ్చర్యంగా నా వైపు చూసింది.

"అంటే ఈ విషయంలో నువ్వొక నిర్ణయానికి రాలేదా?"

"లేదు. నేనూ వ్యక్తుల మనస్తత్వాలు తెల్సుకోవా లనే అన్వేషణలోనే ఉన్నాను."

"అంటే, మీ బావ మనస్తత్వం నీకు తెలీందికాదుగా! కొత్త సంబంధం కాదు."

"అందుకనే బాగా ఆలోచించాలి. ఇంతకీ నీ సలహా?"

"మీ బావను చేసుకోమనే."

"మనస్ఫూర్తిగా చెపుతున్నావా రమా!"

"మనస్ఫూర్తిగా చెపుతున్నాను."

"ఆలోచిస్తాను."

రమాదేవి ఆశ్చర్యపడింది. నేను వచ్చేశాను.

# 16

సోమవారం ఉదయమే ఏలూరు వచ్చేశాను. నాన్న నన్నేమీ అడగలేదు. అమ్మ ఆదుర్దాకు అంతులేదు. నా మనస్సులోని ఆందోళనకు అవధులులేవు.

అక్కయ్య సంసార జీవితం తీర్చిదిద్ది ఆదర్శ స్త్రీ మూర్తిగా చెయ్యలేకపోయినా, గృహిణిగా దాని కాపురం అది చేసుకుంటూ మానసికంగా ఏ విధంగానూ బాధపడ కుండా, సుఖమయ జీవితం గడపాలనే ఆకాంక్షతో బావ ఇంట్లో అడుగు పెట్టాను. అడుగడుక్కీ బావ అక్కయ్యను అను మానిస్తుంటే ఇద్దరి అభిప్రాయాల్నీ సమన్వయ పర్చుకుని, బావతో తర్క వాదానికికూడా దిగి అక్కయ్య కాపురం సరి దిద్దబోయాను. ఈ విషయంలో నేను కొంతవరకూ కృత కృత్యురాల్నయినా, బావ దృష్టిలో గడసరిదానిగా చూడ బడ్డానో, మంచి చెడ్డలను సమన్వయపరిచి, సూటిగా, నిర్భ యంగా మాట్లాడేదాన్నిగా చిత్రించుకోబడ్డానో, నా కింత వరకూ నిర్దిష్టంగా తెలీదు. నా మనస్తత్వాలు బావ ఏ విధంగా అర్ధం చేసుకున్నా ఒక్కసారి బావ నన్ను అన్న మాటల్ని తల్చుకుంటే, బావ నన్ను ఏ దృష్టితో తన మన స్సులో నింపుకున్నారో కొంతవరకూ తెల్సుకోగలిగాను. ఒక సారి "సీతా! నిన్ను చేసుకుంటే నన్ను తీర్చిదిద్దుకుని నన్నొక దారిలోకి తీసుకువచ్చేదానివి. కాని..." అంటూ మనస్సులో మాటను ఆపివేశారు. మరోసారి "సీతా, కాబోయే నా మొగుడ ల్లుడు చాలా అదృష్టవంతుడు" అన్నారు. ఇవన్నీ తల్చుకుంటే అక్కయ్య బ్రతికున్న రోజుల్లోనే బావ నన్ను మనస్సులో నయినా కాంక్షించారన్నమాట. అక్కయ్య పోయాక బాబు పోషణ భారం వహించటానికిగాని, తను మళ్ళీగృహస్థాశ్రమం స్వీకరించటానికిగాని, నన్ను పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించు కున్నారన్నమాట. అసలు బావ నన్ను ప్రేమిస్తున్నారా?

పునర్వివాహం పరాయి పిల్లను చేసుకునే బదులు నన్ను చేసుకుంటే బాబు పోషణ విషయంలో ఏ ఇబ్బందులూ ఉండవనే ఉద్దేశ్యంతో ఈ అభిప్రాయాని కొచ్చారా? తల్లి దండ్రుల ప్రోద్బలం నుంచి వారి మాటను కాదనలేక నన్ను చేసుకోటానికి ఇష్టపడ్డారా? ఎంత ఆలోచించినా నాకేం అర్థం కాలేదు. రమాదేవిని తల్చుకుంటే చాలా ఆశ్చర్యం కలుగుతున్నది. బాబు పోషణ విషయంలో ఎందుకు శ్రద్ధ తీసుకుంటున్నది? అక్కయ్య పోయాక వాళ్ళింటికి ఎందుకు వెళుతున్నది? బావ తనను పలకరించకపోయినా, తను వెళ్ళినప్పుడు కన్నెత్తి చూడకపోయినా ఆ కుటుంబానికి, బాబు పోషణ విషయంలో సాయపడుతున్నదంటే, రమాదేవి ఆంతర్యమేమిటి? బావను ప్రేమిస్తున్నదా? బావను కాంక్షిస్తున్నదా? బావను చేసుకోవాలనుకుంటున్నదా? అంత ఆస్థిపాస్తులు కలవాళ్ళు, డబ్బు కలవాళ్లు అయిన రమాదేవి తల్లిదండ్రులు ఇంతకన్నా మంచి సంబంధం తేలేకపోయారా? అసలీ విషయాలన్నీ వాళ్లకి తెలుసా? తెలిసి హర్షించారా? అంతా ఇష్టపడే ఈ నిర్ణయాని కొచ్చారా? నాకు ఏమీ తోచలేదు.

ఒక వ్యక్తి చావుతో కుటుంబంలో ఎన్ని మార్పులు? ఎన్ని చీలికలు? ఎన్ని విపరీతమైన అభిప్రాయాలు? ఎన్ని సంఘర్షణలు? ఎన్ని ఆలోచనలు?

రమాదేవి నన్ను బావని చేసుకోమని ఎందుకు చెబుతున్నది? నేను బావను చేసుకోటానికి ఇష్టపడ్డట్లయితే రమాదేవి అభిప్రాయం ఏ తీరుగా ఉంటుందో? మనస్ఫూర్తిగా

తనూ ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూనే అట్లా అన్నదా! నా అంతర్యం ఏమిటో తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో అన్నదా? ఏమిటో! జీవితానికే అశాశ్వితమైనప్పుడు వ్యూహాలు శాశ్వతంగా ఎట్లా ఉంటాయ్యని న్నను.

కాలేజీకి వెళ్ళాను. మధ్యాహ్నం కాలేజీ వదిలాక టిఫిన్ రూంలో ఫలహారాలు చేస్తున్నప్పుడు ప్రమీల అన్నది.

"ఏమే సీతా, గుంటూరు కబుర్లేమిటి?"

"ఏం లేవే, బాబుని చూసి వద్దామని వెళ్లాను"

"బాబునా, బావనా" అంటూ నవ్వింది ప్రమీల.

"నువ్వు కాదన్నా, అవునన్నా దేవుడిదగ్గర మాట తప్ప లేవుగా. సాయంత్రం మాయింటికి రా దేవుణ్ణి చూపిస్తాను." అన్నది మళ్లా నా వైపు చూసి నవ్వుతూ

"అంత పుణ్యం కూడానా. మీ ఇంట్లో దేవుడు వెలి శాడా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఆహా. దేవుడున్నాడు. స్వామిని మా ఇంట్లో చూద్దువుగాని, సాయంత్రం నాతో రా" అన్నది ప్రమీల. నాకేం అర్థం కాలేదు. సాయంత్రం ప్రమీల ఇంటికి వెళ్లాను. వాళ్ళ ఇల్లంతా ఎంతోమంది ఆడవాళ్లు, మగవాళ్లతో నిండి పోయింది. ఆ హాల్లో శ్రీ వేంకటేశ్వరస్వామి పూజామందిరం ఉంది. ఎదురుగా ఒక స్టౌ వెలిగించబడి ఉన్నది. స్వామికి దణ్ణం పెట్టుకుని పూలు పూజ చేశారు స్టౌ దానంతట అదే జరగటం మొదలు పెట్టింది. ముగ్గురు పిల్లలు ఆ స్టౌ మీద అంటీ అంటకుండా తమ రెండు చేతులూ వేళ్లతో పూరికే ముట్టుకున్నట్లుగా ఆ స్టౌ పొట్టమీద పెట్టారు. మన

మనస్సులోని ప్రశ్నలను అంటే ఎవరి ప్రశ్నలను వారు ఆ స్టాత్తో రహస్యంగా, చెప్పినట్లుగా మన నోటిలో అనుకుంటే దాన్ని ఆవేశించిన స్వామి ఆ అడిగిన విషయం అవుతుందో కాదో చెపారుట.

అంతా ప్రశ్నలడిగి వెళ్ళారు.

"నువ్వు అడగవే సీతా" అన్నది ప్రమీల. స్టాకి నమస్కరించి నా మనస్సులో ఉన్న రెండు ప్రశ్నలూ అడిగాను. రెండూ "ఆ" అని స్టా కోడు రాసింది. నా మనస్సులోని ఆందోళన తీరింది.

అంతా అమ్యాక స్వామికి మళ్ళా పూజ చేసి హారతి యిచ్చారు. తీర్థ ప్రసాదాలు తీసుకుని ఇంటికి వచ్చేశాను. అంటూ సంతోషంగా చెప్పింది సీత.

"చాలా విచిత్రంగానే ఉందే. అయితే స్వామి స్టా రూపంలో తన భక్తులకు దర్శనమిస్తున్నారన్నమాట. చాలా బాగుంది. ఇంతకీ నీ ప్రశ్న లేమిటి?" అన్నది రాధ.

"నేను చెప్పను. అంతా వింటే నువ్వే తెల్సుకుంటావు. కాని, ఒక్క సంగతి. స్టా రూపంలో స్వామి చెప్పినవన్నీ సత్యంగానే జరిగినయ్యి. తరువాత చాలామంది చెప్పారు" అన్నది సీత.

"సరే ఇంక నీ కథ చెప్పు" అన్నది రాధ. సీత చెప్ప సాగింది.

"ఇంటికి వెళ్ళాక మళ్ళీ ఆలోచించసాగాను. నేను బావను చేసుకోవాలన్నదే అక్కయ్య కోరికయితే అక్కయ్య నాకు కల్లో ఎప్పుడూ కనబడి చెప్పలేదే? నేనంటే అక్క

య్యకు యిష్టంలేదా? తన కన్నకొడుకుమీద, పసివాడిమీద ఆపేక్ష లేదా? లేక దానికి జీవితంలో ఇంక కోరికలేం లేవా? జీవితంలో నాలుగోవంతు వయస్సయినా గడవలేదే? దాని కోరికలు దానితోనే మట్టిపాలయినయ్యా? తన స్థానం నేను ఆక్రమించటం అక్కయ్యకు ఇష్టం లేదా? నేను బాబుకి తల్లిని కావటం అక్కయ్యకు ఇష్టమైతే ఎందుకు కనబడదు? ఏమిటో పిచ్చిగా ఆలోచించేదాన్ని.

ఏమిటో ఈ పిచ్చి ఆలోచనలతో ఆ రాత్రి అన్నం కూడా మర్చిపోయాను. ఆకలి లేదు. నాన్న గదిలోకొచ్చి పిలిచేటంత వరకూ ఏమిటో ఆలోచిస్తూనే కూర్చున్నాను.

"ఏమమ్మా సీతా, అట్లాదిగాలుపడి కూర్చున్నావేం?" అన్నారు నాన్న. ఖంగారుగా లేచి "ఏం లేదు నాన్నా. కొంచెం తల నొప్పిగా ఉంది" అని బొంకాను.

"కాదమ్మా అంతా నాకు తెల్సు. బావను చేసుకో టానికి నీకు యిష్టం లేకపోతే బలవంతంగా కట్టపెట్టం తల్లీ. నీ యిష్టమే నా యిష్టం. అమ్మ సంగతి నీకూ తెలుసు. సావ కాశంగా ఆలోచించే చెప్పు. తొందరేం లేదు" అని వెళ్ళి పోయారు నాన్న.

నాన్న మాటలతో నా మనస్సు ఎందుకో తేలికపడి నట్లయింది. పెద్ద బరువు దించి నట్లయింది. అట్లా అవటానికి అసలు నన్నెవరయినా బలవంతం పెడితే కదా.

ఇష్టతగాని, అయిష్టతగాని ఒక వ్యక్తిమీద చూపా లంటే అది నిలకడగా ఎప్పుడూ ఉండదు. బాంధవ్యాన్నిబట్టి వ్యక్తిగత విలువల్నిబట్టీ మారుతూ ఉంటుంది.

పెళ్ళికొచ్చిన ఆడ, మొగ పిల్లలు అనేక మంది ఉంటారు నిన్నటిదాకా మనంబజారులో చూసిన,చూస్తున్న ఒక వ్యక్తి పెళ్ళి చూపులకు వస్తున్నాడంటే, చివరకి ఆ సంబంధం అయినా, కాకపోయినా, వాళ్ళకి పెళ్ళివారనేబిరుదు తగిలిస్తాం. పెళ్ళికొడుకు నచ్చాడనో, నచ్చలేదనో అంటాం. అప్పటికప్పుడే ఆ అబ్బాయి పెళ్ళికొడుకు జాబితాలోకి వచ్చేస్తాడు. అట్లాగే ఆడపిల్లలూను పెళ్ళి చూపులకి కూర్చోబెట్టంగానే ఆ పిల్ల ముఖాన పెళ్ళికూతురు ముద్రపడిపోతుంది. ఈ మార్పులన్నీ వూహించుకునే బాంధవ్యాన్ని బట్టి ఏర్పరుచుకున్న అభిప్రాయాలు.

ఇది వరకు రోజుల్లో అక్కయ్య భర్తగా, బావగా నా మనస్సులో స్థానం ఏర్పరుచుకుని ఆ పరిస్థితులకు తగినట్లుగా మాట్లాడాను. అక్కయ్యపోయాక అభాగ్యుడుబాబు తండ్రిగా నా మనస్సులో నిలుపుకుని సానుభూతి కనబరిచాను. ఇప్పుడు కాబోయే భర్తగా మనస్సులో స్థాన మేర్పరుచుకుని గౌరవంతో కూడిన సిగ్గుతో బావతో మాట్లాడాలా ? బాబుకి తల్లిగా, మాతృదేవిగా నాఅభిప్రాయాల్ని మార్చుకుని వాడి పోషణభారం నేను నెత్తిన వేసుకోవాలా ? కట్న కానుకలు ఇచ్చుకోలేని తల్లిదండ్రుల మనశ్శాంతికోసం వారి సంతోషం కోసం, తల్లి దండ్రుల ఋణం తీర్చుకోటానికిగాను నేను బావను పెళ్ళి చేసుకోవాలా? ఏది సవ్యమైంది ? ఇందర్ని సంతోష పెట్టటానికి నేను తాపత్రయపడాలా ? ఈ రీతిగా అక్కయ్య ఆత్మను సంతోష పెట్టాలా? అమ్మ మనఃక్లేశాన్ని ఈ రీతిగా పోగొట్టాలా? వీరందరి బాగోగులూ ఆలోచించి,

అందర్నీ సంతోషపెట్టటమే నా కర్తవ్యమా? ఏమిటీ ఆలోచనలు? ఏమిటీ పిచ్చి? ఏమిటీ భ్రమ? ఏమిటీ ధోరణి? ఇట్లా మధనపడుతూ ఉండేదాన్ని.

ఆ రాత్రి భోజనం చెయ్యకుండానే పడుకున్నాను. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. కళ్లు మూస్తే అక్కయ్య, బావ, బాబు, రమాదేవి, సుభద్ర, కృష్ణవేణి, జ్యోతి, ప్రమీల, బావతల్లిదండ్రులు, అమ్మ, నాన్న అందరూ నావైపే చూస్తున్నట్లు కనిపించేవారు. ఇందరి జీవితాలు నా నిర్ణయం మీద ఆధారపడి ఉన్నట్లా? అయితే నా జీవితం ఎవరి మీద ఆధారపడి ఉన్నట్లు? నా నిర్ణయం మీదనేగా? అనుకుంటూ ఎప్పటికో నిద్రపోయాను.

* * * *

తెల్లవారింది. ఎట్లాగో పగయింది. కాలేజీకి వెళ్ళాను. నా పేర ఉత్తరం. ఆత్రంగా చదివాను. రమాదేవి రాసింది.

సీతా,

క్షేమంగా గుంటూరు నుంచి వెళ్ళావనుకుంటాను. మీ బాబు కులాసాగా ఆడుకుంటున్నాడు. ఎవరేమనుకున్నా, ఎన్ననుకున్నా ఏమిటో వాడ్ని చూడకుండా ఒక్కరోజు కూడా ఉండలేను. వాడ్ని ఎత్తుకోకుండా ఉండలేను. ప్రతి రోజూ ఆలోచిస్తూనే ఉంటాను. తల్లి తండ్రీ కూడా లేని పిల్లలు ఎంతమంది లేరు? అందర్నీ ఆదరించి సానుభూతి చూపిస్తున్నామా? అట్లాగే బాబు విషయంలో కూడా నేనెందుకు ముభావకంగా ఉండకూడదు? రోజూ వాళ్ళింటికి వెళ్ళి వాడ్ని నేనెందుకు ఎత్తుకోవాలి? నాకేం సంబంధం? నాతో మాట్లాడని,

నా వైపు కన్నెత్తి చూడని, మీ బావగారి కొడుకునుగురించి నే నెందుకు ఆదుర్దాపడాలి? ఎంత ఆలోచించినా నాకేం అర్థం కాదు. ఆలోచిస్తూనే అప్రయత్నంగానే వాళ్ళింటికి వెళ్ళి బాబుని ఎత్తుకుంటాను. ఏ జన్మలో సంబంధమో ?

కొంతమంది వ్యక్తులుంటారు. నివురు గప్పిన నిప్పులా ఏమీ ఎరగని వాళ్ళలా అమాయకంగా ఉంటారు. వాళ్లకు ఈ కాలపు తెలివితేటలు ఉండవనీ, లౌకికజ్ఞానం తక్కువనీ మనబోటి వారి అంచనా. కాని వాళ్ళకు మనకన్నా ఎక్కువ సంగతులు, ఎక్కువ విషయాలూ తెలుస్తు. ఆ విషయం తెలుసు కోటానికయినా కొంతకాలం పడుతుంది.

నువ్వూ, నేనూ కబుర్లతో కాలక్షేపం చేసేవాళ్ళమే గాని కార్యవాదులం కాదు మనకూ, మనతో స్నేహం చేసే వారికీ కూడా నోటి మాటలు జాస్తే

మనకన్నా సుభద్ర నాలుగాకులు ఎక్కువే చదివింది.

సుభద్ర మా కాలేజీలోనే పి. యు. సి. చదువు తున్నది, నీకూ తెలుసుగా. మెడిసిన్ చదువుతున్న విద్యార్థి హరనాధ్ అనే అతనితో సుభద్రకు పరిచయమైంది. ఇటీవలనే వారిద్దరూ సినిమాకు వెళ్లి వస్తుంటే చూశాను. నేనేం మాట్లా డలేదు. నన్ను కూడా వాళ్లిద్దరూ చూశారు. మర్నాడు సుభద్ర, వాళ్లింటికి వెళ్ళినప్పుడు నాతో చెప్పింది. హర నాధ్‌ని ప్రేమించాననీ, పెద్దల అంగీకారంతోనే పెళ్లి చేసుకో దల్చుకున్నామనీ చెప్పింది. నా సలహా అడిగింది. నేనేం చెప్పేది సీతా, సుభద్ర మంచి చెడ్డలు ఆమె చూసుకోవాలి గాని నేనేం చెప్పేది? వాళ్లన్నయ్యా పెళ్లి కుదిరితే తరువాత

తామూ పెళ్ళి చేసుకుంటానుట. పి. యు సి. తో చదువు మానేస్తానన్నది. అతనిదీ ఎం. బి ఫైనలియరు. మంచివాడే. బాగానే ఉన్నాడు. ఈ సంగతి మీ బావగారికీ పెద్దవాళ్ళకూ కూడా చూచాయగా తెల్సు. కాని ఇంకా బయటపెట్టలేదు. బహుశా మీ పెళ్ళితోనే వాళ్ళ పెళ్ళికూడా చేస్తారేమో !

పెళ్ళి విషయం నువ్వేం ఆలోచించినదీ నాకు తెలీదు. మా అందరి ఉద్దేశ్యాలూ ఒక్కటే ! నువ్వు మీ బావను తప్పక చేసుకుని బాబుకి తల్లివి కావాలని అందరి కోరికా.

అందరి కోరికా తీరుస్తావా? ఈసారి నువ్వు గుంటూరు వచ్చినప్పుడు బాబు నిన్ను 'అమ్మా' అని పిలుస్తాడు. అప్పటి కయినా పెళ్ళికి వప్పుకోవా ? జాబు రాస్తావుగా !

రమాదేవి.

ఉత్తరం చదివి ఆశ్చర్యపడ్డాను సుభద్రకు ఎన్ని తెలివి తేటలు కలిగినయ్యి. సుభద్ర నిజంగా పునర్జన్మ ఎత్తిందా అనిపించింది. ప్రేమించింది, పెళ్ళి చేసుకుంటానని చెప్పింది. పెళ్ళి కొడుకు డాక్టరా. సుభద్ర ఎంత తెలివి కలది ? ఎంత అదృష్టవంతురాలు ?

మా పెళ్ళి అయితే తామూ పెళ్ళి చేసుకుంటారా ? మా పెళ్ళి కాకపోతే? మానేస్తారా? వాయిదా వేస్తారా? అంద రికీ నేను బాబుకి తల్లిని కావాలనే ఉన్నదా? రమాదేవి కోరిక కూడా నిజంగా అదేనా ?

నా పెళ్ళి. బావతో నా పెళ్ళి. మా పెళ్ళిలో సుభద్ర పెళ్ళి. సుభద్ర, కాబోయే డాక్టరుగారి కాబోయే భార్య. ఎంత బావుంది? రమాదేవి ఎంత చక్కని విషయాలు తెలియపర

చింది. మరి రమాదేవి పెళ్ళి రమాదేవి పెళ్ళి చేసుకోదా? ఇట్లా ఆలోచించాను.

ఏమీ అర్థం కాలేదు. అర్థమయినా కాకపోయినా రమాదేవికి ఉత్తరం రాయాలిగా!

మర్నాడే రమాదేవికి ఉత్తరం రాశాను. రాసిన ఉత్తరం పదిసార్లు చదువుకున్నాను.

రమా!

చక్కని ఉత్తరం రాశావు. జీవితంలోని అనుకున్న మార్పులు జరిగినా జరక్కపోయినా, అనుకోని మార్పులు అనేకం జరుగుతుంటయ్యి. సుభద్ర జీవితంలో ఇంత మార్పు వస్తుందని ఎవ్వరం అనుకోలేదుకదా! నిజమే, నవ్విన నాప చేనే పడుంతుంది. సుభద్ర మెడికల్ స్టూడెంటుని ప్రేమించి పెళ్ళి చేసుకోబోతోందా? మంచిదే. ఎవరి జీవితాలు వాళ్లు ముళ్ళ పుంతల్లోనుంచి పూలబాటల్లోకి మార్చుకుంటున్నారంటే హర్షించదగిన విషయమే. సుభద్ర పెళ్ళి కనులపండుగగా చూద్దాం రమా! ఏమంటావ్?

మరిచిపోయాను. సుభద్రపెళ్ళి వాళ్లన్నయ్య పెళ్ళిలో కలిపి చేస్తారా? అంటే – అంతా అనుకునే మా పెళ్ళితో పాటుగా కలిపి చేస్తారా? బాగుంది మీ అందరి కోరికా. నేను బాబుకి తల్లిని కావాలని, మీరంతా నన్ను బావను చేసుకోమని ప్రోత్సహిస్తున్నారు నువ్వు కూడా ఆ అందరిలో ఎందుకు కలిసిపోయావో నాకు అర్థం కావటంలేదు. అమ్మా, నాన్నా, బావ తల్లిదండ్రులూ ఈ మాట అన్నారంటే అర్థముంది. బావ మనస్సులోనూ అదే కోరిక ఉన్న

దని నాకు తెలుసు బావ నన్నే ఎందుకు పెళ్ళి చేసుకోవా లనుకుంటున్నారో నాకు తెలుసు. ఆయన ఈ విషయంలో నన్ను అడిగారని కూడా నీకు తెలుసు.

కాని రమా ! నేను స్వార్థపరురాల్ని కాదు. నా స్వార్థం కోసం మరొకరి జీవితంలో నీళ్లు పొయ్యలేను. అది నా ఊహాకందని విషయం. బావ మీద నాకు కోపంగాని ద్వేషంగాని లేదు. అయిష్టతలేదు. కాని ఎందుకో నా మనస్సు అటు మొగ్గటంలేదు. కారణం నేను చెప్పలేను. ఒక వ్యక్తికి ద్రోహం చేసి నేను సుఖపడేది మాత్రం ఏముంది? కొత్త సుఖాలకోసం, కొంతమందిని దూరం చేసుకోవడం నాకు ఏ మాత్రం ఇష్టంలేదు.

నా జీవితంలో నేను మనసార ఆడుకోలేకపోతున్నాను. మరొకళ్ళ జీవితంతో నేనే మాత్రం ఆడుకోగలనో నా కే మాత్రం నమ్మకం లేదు.

సుభద్రతో ఈ విషయం చెప్పి త్వరగా తన పెళ్ళి శుభలేఖ పంపవలసిందిగా ప్రార్థిస్తున్నానని విన్నవించు. సుభద్ర పెళ్ళిలోనే మనం మళ్లా కలుసుకుందాం. సరేనా?

జాబు వెంటనే రాస్తావుగా రమా !

సీత.

ఉత్తరం పోష్టులో వేశాను. అప్పటికిగాని నామనస్సు కుదుటపడలేదు. పెద్ద బరువు దించినట్టుగా ఉంది.

నా ఉత్తరం రమాదేవికి హర్షామోదాన్ని కలగ జేసుందా?

రెండు రోజులు గడిచాయి. మళ్ళీ నాకో ఉత్తరం వచ్చింది. చూస్తే అది సుభద్ర రాసిన ఉత్తరం. ఉత్తరం చదువుతున్నాను. నాకు పొట్ట చెక్కలయ్యేలా నవ్వూ, సుభద్ర మీద జాలి ఒక్కసారిగా కలిగినయ్యి.

సీతా !

నా మీద కోపం రాకుండా ఉంటే ఈ ఉత్తరం చదువు సీతా. కొందరి జీవితాలు దేశసేవకు అంకితమౌతయ్యి. కొందరి జీవితాలు ఇతరులను సుఖపెట్టటానికే అంకితమవుతాయి. మరికొంత మంది తమ జీవితాలనే తాము సుఖపెట్టుకోలేక సతమతమైపోతూ ఉంటారు. అలాంటివారు ఇతరుల జీవితాలని ఏం సుఖపెట్టగలరు? నేను ఈ మూడవ కోవకు చెందిన వ్యక్తినేమో ననిపిస్తున్నది. వీళ్ళకి ప్రతి విషయంలోనూ ఆతృతా, ఆదుర్దా ఎక్కువ. స్వార్థం కూడా ఎక్కువేనేమో. ఈ స్వార్థం ఎక్కువయితే తామేం చేస్తున్నదీ కూడా ఆలోచించకుండా కొన్ని పన్లు చేస్తారు అవి కనక కలిసొస్తే వాళ్ళు జీవితంలో బాగుపడినట్లే.

కథల్లోలాగా, సినిమాల్లో మాదిరిగా నేను హరనాథ్ అనే మెడికల్ స్టూడెంటును ప్రేమించాను. నా మన స్తత్వం తెల్సిన నువ్వు నేనింత పని చేస్తానా అని ఆశ్చర్య పడొచ్చు. నీకేకాదు నా మట్టుకు నాకూ ఆశ్చర్యంగానే ఉంది. కల్లోనయినా తలచని, అనుకోని విషయం. తెలియనిఅనుభూతులు. ఎంతో ఆలోచించి, ఎన్నాళ్ళో మధనపడి, తర్కవితర్కాలు చేసి, ఈ నిర్ణయానికి వచ్చాను. అమ్మకూ, నాన్నకూ నా నిర్ణయాన్ని చెప్పాను. నన్ను తిట్టారు దూషించారు. ఎన్నో

మాటలన్నారు గాలి దుమారం రేగింది. జడివాన కురిసింది. ప్రశాంత వాతావరణం ఏర్పడింది. అంతా వప్పుకున్నారు. మా ఇద్దరి పెళ్ళికి అంతా ఇష్టపడ్డారు. కాని ఒక చిన్నషరతు. ముందు అన్నయ్యతో నీ పెళ్ళి. తరువాత ముహూర్తానికి మా పెళ్ళి ఒకటి రెండు రోజులు వ్యవధిలో. మనిద్దరి పేర్లూ ఒక శుభలేఖలో ఎక్కితే ఎంతో బావుంటుంది. నాకూ చాలా సంతోషంగా ఉంటుంది. కాని అన్నయ్య రెండో పెళ్ళికి అచ్చుశుభలేఖలుకూడానా అన్నాడు. ఇంక అన్నయ్య మాటకు తిరుగేముంది? మీ అక్కయ్య పెళ్ళిచూపులకి వచ్చి నప్పుడు నువ్వొకమాట అన్నావు గుర్తుందో లేదో. ఆడబిడ్డ పోస్టు చాలా హోదాగల పోస్టనీ, జిల్లాబోర్డు ప్రెసిడెంటు లాంటిదనీ నాకు నీ ద్వారా అంటే నీ రీత్యా ఆ ఉద్యోగం కావాలి. మరి ఆ ఉద్యోగం ఇప్పిస్తావా?

రెండు రోజుల్లో మా నాన్నగారు మీ ఇంటికి వస్తు న్నారు, ముహూర్తాలు పెట్టుకోటానికి. అందరి సంతోషం, అందరి ఆనందం నీ మీద ఆధారపడి ఉన్నయ్యి.

"సీత అన్నయ్యను చేసుకుంటుందా లేదా" అని ప్రశ్న వేసుకుని బాబుని రెండు వేళ్ళల్లోనూ ఒక వేలు పట్టుకోమ న్నాను. మధ్యవేలూ, చూపుడు వేలూ వాడి ముందుంచి ప్రశ్న అడిగాను. వాడూ అసాధ్యుడే. వాడికి మాత్రం తెలీదూ? సీతని వాళ్ళమ్మగానే ఎంచుకున్నాడు బాలవాక్కు బ్రహ్మవాక్కు గదా!

మా అందరి ఆశలూ నీ మీదనే పెట్టుకున్నాం. అందరి జీవితాలూ సరిదిద్దగల శక్తి సామర్థ్యాలు నీలోనే

ఉన్నయ్యి. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. పుష్ప సౌరభం అంతా ఆశిస్తారు. అంతా కాంక్షిస్తారు. అన్నయ్య విష యంలో కాంక్ష కాదు. ఆశ కాదు, వాంఛ కాదు. నిన్ను మన స్సులో పూర్తిగా నింపుకున్నాడు. నీ మీద విశ్వాసం ఉంచాడు.

అన్నయ్య హృదయ కుసుమానివి. వెంటనే జాబు రాస్తావుగా సీతా !

సుభద్ర.

ఆ రోజునే సుభద్రకు ఉత్తరం రాశాను.

సుభద్రా!

నా పెళ్ళి విషయంలో నేను ఏ ఆలోచనకూ రాలేదు, బహుశా రాలేనేమో!

నీ పెళ్ళి శుభలేఖ కోసం ఎదురు చూస్తున్నాను. త్వరలో మీ దంపతుల్ని చూడాలని ఉవ్విళ్లూరు తున్నాను.

డాక్టరు భార్యగా త్వరలోనే నిన్ను చూడబోతానన్న మాట. ఎంత అదృష్టం?

సీత.

సుభద్ర రాసిన ఉత్తరం నాన్నకూ అమ్మకూ చదివి వినిపించాను. నాన్న ముభావంగానే విని ఊరుకున్నారు. అమ్మ మాత్రం నన్ను చీవాట్లు పెట్టింది. ఎదిగిన పిల్లని ఎన్నాళ్ళు ఇంట్లో పెట్టుకూర్చోను! గడపలో కొచ్చిన సంబంధం, కట్నంలేని సంబంధం, ఇంక ఈ జన్మలో తీసుకు రాలేమంది. ఆఖరుకు కోపం పట్టలేక "నువ్వో ఎవరి వల్లో నన్నా పడ్డావుటే సీతా. చచ్చి అది కడుపులో చిచ్చుపెట్టి

పోయింది. బ్రతికి నువ్వు మమ్మల్ని కాల్చుకు తింటున్నావు”
అని కంట తడిపెట్టింది

నాన్న అమ్మను కేకలేశారు. మనస్సు తెల్సుకోకుండా మాట్లాడవద్దన్నారు. దానికి ఇష్టంలేని పెళ్ళి చెయ్యనన్నారు.

“తండ్రీ కూతురూ కలిసి నన్ను వేధిస్తున్నారు. మీా అలుసు చూసుకునే అది ఆ తీరుగా ఉంది. ఎప్పుడో ఆ కాస్త మాటా మనమూ చెవిన వేసుకుంటాము. ఫలాని వాళ్ళ మ్మాయి సీత ... ...”

నేను వినలేక గదిలోకిపోయాను. తలుపు గడియపెట్టి భోరున ఏడ్చాను అంతకన్నా నేను చెయ్యగలిగిందేముంది? ఆఖరికి కన్నతల్లి దృష్టిలో కూడా నీచమైన స్థానాన్ని ఏర్పర చుకున్నాను నా జీవితం ఎంతమందికి ఎన్ని సమస్యల్ని తెచ్చి పెట్టింది? నా మనస్సులో అక్కయ్య మెదిలింది. జాలిగా నా వైపు చూసింది. బాబుని చేతుల్లో పెట్టుకుని నా వైపు దీనంగా చూసింది. అక్కయ్య బాబునినాకు ఇస్తుందా? నేను అక్కయ్య వద్దకు వెళ్ళాలా? ఆలోచిస్తున్నాను.

ఆ రోజంతా కన్నీళ్ళతో నేకాలంగడిపాను. ఇంతకన్నా నేను చెయ్యగలిగిందేమీా లేదా? జీవించి ఉంటే నా జీవిత ధ్యేయం ఏమిటి? నా కర్తవ్యం ఏమిటి? చదువుకుని నేను చెయ్యగలిగిందేమిటి? ఈ పరిస్థితుల్ని ఎదుర్కొని చెయ్య గలిగిందేమిటి? ఇట్లా ఆలోచిస్తూ సతిమతమైపోయాను.

మూడో రోజున సుభద్ర తండ్రి రంగారావు గారు వచ్చారు. నా మానసిక వేదనకు అంతులేదు. మనస్సులోనే కుమిలిపోతున్నాను.

# 17

భోజనాలయాక వియ్యంకు లిద్దరూ మాట్లాడుకుంటు న్నారు. అమ్మ మాత్రం ఆ సంభాషణల్లో జోక్యం కలుగ జేసుకోలేదు.

నాన్న అన్నీ వివర్శగా చెప్పారు. ఆయనా అన్ని విష యాలూ విన్నారు. ఆయన దిగాలుపడిపోయూరు. ఆ సాయం త్రమే గుంటూరు వెళ్లిపోయూరు.

ఇంతమంది మనస్సును నేను బాధపెడుతున్నాను. అందరిమాటా కాదన్నాను. నా నుంచి వాళ్ల ఆశలన్నీ అడి యాస లయినయ్యి. అంతా దిగులుగా ఉన్నారు. ఎవ్వరి మనస్సూ సంతోషంగా లేదు. మరి వీళ్ళంతా కలసి నన్ను ఆత్మవంచన చేసుకోమంటుంటే నా మనస్సు ఎంత బాధ పడుతున్నదో వాళ్ళకేం తెల్సు? అమ్మకు అల్లుడు రావాలి. నాన్నకు కట్నంలేని సంబంధం కావాలి. సుభద్రకు నేను వదినె కావాలి. బావకు నేను భార్యను కావాలి. బావ తల్లి దండ్రులకు నేను కోడలు కావాలి. బాబుకి నేను తల్లిని కావాలి. ఇంతకుముందే తమ తమ కోరికలు తీర్చుకోటానికి తమ మనస్సునంతా నామీద కేంద్రీకరించారు. వాళ్ళమాట వింటే నేను చాలా మంచిదాన్ని. ఉత్తమురాల్ని. యోగ్యు రాల్ని. వినకపోతే నేను ఎవరినో ప్రేమించినట్లు, ఎవరితోనో సంబంధం పెట్టుకున్నట్లు, కుటుంబానికి కళంకం తెచ్చినట్లు, అమ్మ! కన్నతల్లి! పెళ్లికి వప్పుకోకపోతే నాలో ఈ దుర్గుణా లన్నీ ఉన్నట్లుగా ఆవిడ ఊహించుకుంది. కన్నతల్లే ఇన్ని

మాట లన్నప్పుడు బావ ఏమనుకుంటాడు? సుభద్ర ఏమను
కుంటుంది? నిన్న మొన్నటి వరకూ ఏ దిగులూ, చింతాలేని
నా జీవితం ఈ రోజున ఇట్లా ఈ విధంగా అపనిందల పాల
యింది. నా మూర్ఖత్వమే కారణమా? ఇందులో
మూర్ఖత్వం మాత్రం ఏముంది? ఎంతమంది సంబంధాలు
వెతకటం లేదు? చూసిన సంబంధాలన్నీ చేసుకుంటున్నారా?
సంబంధం కాదనుకుంటే అపవాదులు భరించవలసిందేనా?
అః ప్రేమలు ఎట్లా కలుగుతయ్యి? మానసిక ప్రవరన
నుంచా? శారీరక సౌఖ్యాలను ఆశించా? లౌకిక ప్రలోభాలకు
లోబడి ప్రేమిస్తున్నారా? గృహస్థాశ్రమం స్వీకరించటానికి
ప్రేమిస్తున్నారా? పిల్లల్ని కని, పెంచి, పెద్దవాళ్ళను చెయ్యా
టానికి ప్రేమిస్తున్నారా? మానవసేవ, మాధవసేవ, చెయ్యా
టానికి పెళ్లి చేసుకుంటేనేగాని వీలుపడదా? భర్తకు సేవ
చెయ్యటమే ఆడదాని జీవిత పరమావధిగా పెద్దలు నిర్దేశిం
చారా? మానవసేవ చెయ్యటం జీవిత పరమావధి ఎందుకు
కాకూడదు? మానవసేవే మాధవసేవగా భావించి తరించిన
వారు లేరా?

ఏమిటో నా ఆలోచనలకు అంతులేకపోయింది. ఆ
రోజు శనివారం. స్వామి దర్శనం కోసం ప్రమీల ఇంటికి
వెళ్లాను. జనం చాలామంది వచ్చారు. అంతా ప్రశ్న లడుగు
తున్నారు. నేను రెండు ప్రశ్న లడిగాను. నమ్మినవారికి స్వామి
ఉన్నాడు. ఇదంతా అమ్మకూ, నాన్నకూ చెప్పాను. అమ్మా,
నాన్నా వెళ్లి స్టా స్వామిని దర్శించి వచ్చారు. స్వామి లీలలు
వాళ్ళకూ ఆశ్చర్యం కలిగించినయ్యి ఇంటికి వచ్చాక నాన్న

అన్నారు: "సీతా! అంతా స్వామి దయ. ఇంక ఆలోచన లతో మనస్సు పాడుచేసుకోక చక్కగా చదువుకో తల్లీ. ఈ ఏడు పి. యు. సి క్లాసులో ప్యాసయితే నా కదే పది వేలు. నువ్వు నాకు కూతురువు కావు కొడుకువి. జానకి మాకు కూతురు. దాని దారిన అది పోయింది, అమ్మ కన్నకడుపు కనక అట్లా అంటుందే అనుకో. అందుకు మనస్సులో బాధ పడకు తల్లీ. ఇంక పెళ్ళి విషయం ఎప్పుడూ తీసుకురాను సీతా" అని నాన్న కళ్ళు తుడ్చుకున్నారు అమ్మ కూడా ఏమీ అనలేదు.

కాలేజీకి వెళ్ళాను. ప్రమీల అడిగింది. "నీ జీవితం ఏమిటో నా కిప్పుడు అర్థమైంది సీతా! మీ నాన్నగా రన్నట్లు చదువు వైపే నీ మనస్సు మళ్ళించు. కనీసం మీ నాన్న గారయినా నీ మనస్సు గ్రహించట మనేది నిజంగా నీ అదృ ష్టమే. అందరి తండ్రులూ మీ నాన్నగారంత ఉత్తములుగా ఉండరు. అన్నింటినీ మించి స్వామి దయ నీమీద పూర్తిగా ఉన్నది" అన్నది ప్రమీల.

* * * *

మరో వారం పదిరోజులు గడిచినయ్యి. శుభలేఖ వచ్చింది. హరనాథ్‌తో సుభద్ర పెళ్ళి. శుభలేఖ చూచేసరికి నా కళ్లు చెమర్చినయ్యి బావ పెళ్ళి విషయం ఏమయినట్లు? మరే పిల్లనీ పెళ్ళి చెసుకోటానికి ఇష్టపడలేదా? నన్నే చేసు కోవాలనే పట్టుదలతో ఉన్నారా? నన్ను కాకపోతే మరెవ రినీ చేసుకోటానికి ఇష్టపడలేదన్నమాట. బాబుకి తల్లి కాద

గిన వాళ్ళు నేను తప్ప ఎవ్వరూ లేరా! తనూ అట్లాగే ఉండి పోవాలనుకున్నారా? ఇదంతా నా నుంచేగా! స్వామి నా కోరిక తీరుతుందన్నారే! నా ప్రశ్నలకు స్వామి స్టాట 'ఆ' అనే రాసిందే! ఏమిటీ సమస్యలు? అసలు నేను లేకపోతే ఏసమస్యా ఎవరికీ ఉండదేమో? అనుకున్నాను.

* * * *

నాలుగు రోజులు శెలవు పెట్టి సుభద్ర పెళ్ళికి వెళ్ళాను. అమ్మా, నాన్నా పెళ్లికి రాలేదు కూతురుపోయి సంవత్సర మయినా కాకపోవటం ఒకటి. రెండోది వాళ్లకోరిక ప్రకారం బావను పెళ్ళి చేసుకోటానికి నేను ఇష్టపడకపోవటం.

హరనాధ్ చాలా బావున్నాడు. సుభద్రకు తగినవాడే. ఇద్దరూ చాలా అదృష్టవంతులు. వారు ప్రేమించి పెళ్ళి చేసు కున్నారంటే నూటికి నూరుపాళ్ళు హర్షించదగిన విషయమే.

పెళ్ళికి రమాదేవి వచ్చింది. పెళ్ళిలో బావకనిపించినా నన్ను పలకరించటానికి మనస్సొప్పక తప్పుకు తిరుగుతున్నారు. ఎప్పుడు కనిపించినా బాబుని ఎత్తుకునే కనిపించేవారు. నాతో గాని, రమాదేవితో గాని మాట్లాడలేదు. వీలయినప్పుడల్లా రమాదేవి మాత్రం బాబుని ఎత్తుకుని వాడి పన్లన్నీ చేసేది. రమాదేవి ఎత్తుకుంటే వాడూ నవ్వుతూ ఊరుకునేవాడు.

పెళ్ళయింది. పెళ్లివారు మూణ్ణిద్రలకు వెళ్ళారు. చుట్టాలంతా ఉన్నారు. అందులో కొంతమంది నావైపు చూస్తూ "ఈ పిల్లేగా జానకి చెల్లెలు మన రామారావుకి చేసుకోకూడదూ" అని బావ తల్లితో అన్నారు. ఆవిడ ఏం సమాధానం చెప్పేదో నాకు వినబడేదికాదు.

పెళ్ళికి ఆ ఇల్లు చాలక మేడమీద వాటా కూడా తీసుకున్నారు. బావ, బాబుని ఎత్తుకుని మేడ మీద గదిలో కూర్చున్నారు మెల్లిగా బావ ఉన్న గదిలోకి వెళ్ళాను. నన్ను చూసి ఏంమాట్లాడలేదు. నేనే బావను పలకరించాను.

"కులాసాగా ఉన్నారా బావా ? బాబు ఏమంటు న్నాడు?" అన్నాను.

"కులాసానే. ఈ రోజుల్లో ఎవరి ఆరోగ్యం వాళ్ళు కాపాడుకోకపోతే ఇంకొకళ్ళు మన ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకోరుగదా ఏదో ఇట్లా కాలక్షేపం చేస్తున్నాం" ముభావకంగానే అన్నారు బావ.

"బాబుఅల్లరి చేస్తున్నాడా? ఎత్తుకునితిప్పుతున్నారు?"

"తప్పించుకునే వాళ్లకి తప్పుతుంది గాని, కన్న తల్లి దండ్రులకు తప్పదుగా."

"బావా! నా నిర్ణయం నీకు కోపంకలిగించింది కదూ? నా మీద కోపమొచ్చింది కదూ ?"

"నీ మీద నాకు కోపమెందుకు సీతా? నువ్వేం చేశావని? కారణం ఉండి గాని, కారణం లేకగాని ఒక భర్త భార్యని ఏడిపించి పేరు తెచ్చుకుంటే ఇంక ఆ వచ్చిన పేరు చచ్చినా పోదు. బతికున్నన్నాళ్ళు ఆ పెళ్ళాన్ని కాల్చుకు తిన్నాడు. ఆ వచ్చేది మాత్రం ఏం సుఖపడుతుంది" అని తప్పకుండా అంటారు. పరాయివాళ్ళే అట్లా అనుకున్నప్పుడు అన్నీ తెల్సి పెళ్లి చేసుకోబోయే పిల్ల ఆ పెళ్ళికి ఎందుకు ఒప్పుకుంటుంది ?"

బావ మనస్సులో బాధపడుతూ ఉద్రేక పూరితంగా మాట్లాడారు. ఆయన మనస్సులో నిరాశ పేరుకు పోయింది. ముఖంలో విచారం తిష్టవేసింది. మాటల్లో సంఘర్షణ వ్యక్త మయింది.

"మీ మీద కోపంచేత నేను పెళ్ళికి ఇష్టపడక పోలేదు బావా."

"రెండో పెళ్లివాడు, నా కెందు కనుకున్నావా ?"

"నా కసలా ఊహాలే తట్టలేదు."

"మరి ?"

"అక్కయ్య ఎప్పుడయినా మీకు కల్లో కనిపించేదా బావా?"

"ఇప్పుడా విషయం ఎందుకు?"

"ఏమీ లేదు అడుగుతున్నాను."

"చాలాసార్లు కనిపించింది."

"ఏం చెప్పేది?"

"నన్ను పిచ్చివాడిగా భావిస్తున్నావా సీతా!"

"బావా! మనస్ఫూర్తిగా మీ మీద నా కెటువంటి దురభిప్రాయమూ లేదు. పెళ్లికి ఇష్టపడక పోవటానికీ, వ్యక్తి గత విషయానికీ ఏమీ సంబంధం లేదు. చెప్పు బావా, అక్కయ్య ఏమనేది?"

"ఏమీ అనేది కాదు. దిగులుగా, జాలిగా నా వైపు చూసేది. బాబుని జాగ్రత్తగా కాపాడుకోండిఅనేది. ఎప్పుడూ కనిపిస్తున్నట్లే ఉండేది. నవనీతం లాంటి జానకి మనస్సుని కష్టపెట్టాను. నా జానకిని నేను నిజంగా చంపుకున్నాను. నేను

పాపాత్ముడ్ని. ఆ ఫలితం అనుభవిస్తూనే ఉన్నాను. నాకు ఈ శాస్తి కావలసిందే.''

నా కళ్ళల్లో నీళ్లు తిరిగినయ్యి. బావ మనస్సు ఇంత సున్నితమైందనీ, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నదనీ, అర్థం చేసుకున్నాను. ఇంత సహృదయుడైన బావ అక్కయ్య విషయంలో అంత కాఠిన్యం ఎందుకు చూపాడో నాకు అర్థం కాలేదు. అది అక్కయ్య ముఖారవిందమేమో !

''ఎవరి ఆయుర్దాయానికి ఎవరు కర్తలు బావా ?''

''కాదు సీతా, జానకిని నేను నిజంగా ఏడిపించాను. నే చేసిన తప్పుకు నాకు నిష్కృతి లేదు. కాని సీతా, పశ్చాత్తాపంతో కుమిలిపోయేవాడికి ఏదో పెన్నిధి దొరికిందని సంతోషపడే సమయంలో, ఆ పెన్నిధి కాస్తా చేయి జారిపోతే ఇంక అంతకన్న దంపప్పుకోత ఏముంది సీతా? నిన్ను పూర్తిగా నా హృదయంలో నింపుకున్నాను. జానకి లేనిలోటు నువ్వు తీర్చగలవని ఆశించాను. నా ఇంట దీపంపెట్టి బాబుకి తల్లి లేనిలోటు తీర్చగలవని ఆశించాను. అనేక ఊహాలతో మనసారా నిన్ను నా దాన్నిగా చేసుకోవాలనుకున్నాను. నా బోటి అదృష్టహీనుడికి నువ్వు గగనకుసుమానివే కాని, హృదయ కుసుమానివి కావని ఇప్పుడు తెల్సుకున్నాను. అవును మరి. అక్కను సుఖపెట్టలేనివాడిని చెల్లెల్ని సుఖపెట్టగలననే నమ్మకమేముంది?'' అన్నారు బావ.

ఈ మాటలకు నేను తలవంచుకున్నాను. అభిమానంతో కుమిలిపోయాను. మనస్సులో కారుచీకట్లు తారులాగా అలుముకు పోయినయ్యి. బావ తన జీవితపు పుటలు

విప్పి నాకు చదివి వినిపిస్తుంటే నా హృదయం విచారంతో కుమిలిపోయింది. బావను ఎందుకు చేసుకోకూడదు ? ఈ రోజున అంగీకారం తెలిపినా, హర్షామోదాలతో అత్యంత సంతోషంతో నన్ను స్వీకరిస్తారు. అందరి మనస్సుల్లో, హృదయాల్లో కారుచీకట్లుపోయి దేదీప్యమైన వెలుగు వెలుగుతుంది. అందరి కష్టాలూ గట్టెక్కుతయ్యి. ఇంత చెయ్యాలంటే ఒక వ్యక్తికి ద్రోహం చెయ్యాలి. ఒక్క ప్రాణి హృదయం ఆక్రోసింప చెయ్యాలి. దగ్గరలో ఉన్న వెలలేని మాణిక్యాన్ని అంతా చులకనగానే చూస్తున్నారు. కళ్ళ కద్దుకుని ఆ మాణిక్యాన్ని స్వీకరించే తరుణం ఇంకా రాలేదా ?

బావ, బాబుని ముద్దు పెట్టుకుని, వాణ్ణి కవ్వించి, నవ్విస్తున్నారు. అరచేతుల్లో పడుకోబెట్టుకుని వాడి పొట్టని ముద్దు పెట్టుకుంటే వాడా చక్కలిగిలికి, పొట్ట నొప్పి పుట్టేటట్లు నవ్వుతున్నాడు.

"రమాదేవి బాగా చదువుతోందా బావా ఈ పటితో చదువు ఆపేస్తుందా ?"

"నాకేం తెల్సు!"

"వాళ్ళ క్లాసుకు మీరు వెళ్ళరా ?"

"వెళతాను. పాఠం చెబుతాను. చదువుకుంటే వాళ్ళే బాగుపడుతారు. లేకపోతేలేదు. అంతకుమించి నాకేం తెలీదు."

"రమాదేవి రోజూ మీ ఇంటికి వస్తూంటుందిగా. బాబంటే ఎంతో ఆపేక్ష. ఉన్నంతసేపూ వాడ్ని ఎత్తుకునే

ఉంటుంది. సరేగాని బావా, రమాదేవితో ఇదివరకు మాదిరి మాట్లాట్టం లేదే!" అన్నాను

బావ కొంచెం ముఖం ముడుచుకున్నారు. కనుబొమలు చిట్లించారు

"రమాదేవి నీతో అన్నదా నేను మాట్లాట్టం లేదని. అయినా పెళ్ళి కావలసిన వయసొచ్చిన పిల్ల. ఎవరేమనుకున్నా తరువాత బాధపడి ప్రయోజన మేముంది?"

"ఇది వరకు మాట్లాడిన రోజుల్లో ఈ విషయం తట్టనే లేదా బావా?"

"తప్పు తెల్సుకోటానికి నాబోటి వాడికి కొన్ని నెల్లు పడుతుంది సీతా"

"మనస్సునీ, హృదయాన్నీ అర్థం చేసుకోటానికి!"

"కొన్ని ఏళ్లు పట్టొచ్చు."

"సహృదయుల్ని సహృదయతతో అర్థం చేసుకుంటే ఏ అనర్థాలూ రావు బావా."

"అంటే?"

"మీ జీవిత దృక్పథం ఒక వైపే చూస్తున్నది. కాని రెండోవైపు చూట్టంలేదు. మీ చుట్టూ ఉండే మనుష్యుల హృదయాల్ని మీరు అర్థం చేసుకుంటే మీ జీవిత సోపానంలో మీరు ఒక మెట్టు పైకి ఎక్కినట్లే."

"అందరి మనస్సులూ, అందరి జీవితాలూ అర్థం చేసుకోవాలనే నిబంధన ఏమీలేదు."

"ఎందుకు లేదు బావా? అందరిదాకా ఎందుకు! నా మనస్సుని మీరు అర్థం చేసుకున్నారా?"

"ఇప్పుడిప్పుడే అర్ధ మవుతున్నది."

"ఔనుగదా. నేను మీతో మాట్లాడుతున్నాను. కనక నా హృదయం మీకు అర్ధమౌతున్నది. నావరాదికి మాట్లాడ లేని మూగజీవాల హృదయాలు ఎట్లా అర్ధం చేసుకుంటారు? ఎట్లా అర్ధమౌతుంది?"

"ముందే చెప్పానుగా, అందరి హృదయాలూ అర్ధం చేసుకోవాలనే నియమం లేదని. అసలు నా ఉద్దేశ్యం కూడా అది కాదు."

"అట్లా అనకు బావా. అర్ధం చేసుకోవడానికి ప్రయత్నించండి. దానంతటదే అర్ధమవుతుంది. సరే, నేను ఈ రోజుననే వెళతాను. ఉత్తరాలు రాస్తూ ఉంటారుగా. త్వరలోనే మళ్ళీ వస్తాను. మళ్ళీ వచ్చే అవకాశం నాకు తప్పక లభిస్తుంది" అన్నాను. అర్ధంకాక నా వైపు చూశాడు బావ. బాబుని ముద్దు పెట్టుకుని మేడ మెట్లు దిగబోతున్నాను. నాలుగు మెట్ల అవతల ఎంతసేపటినుంచి నిల్చుందో రమాదేవి. నన్ను చూడగానే కళ్ళొత్తుకుంటూ వెళ్లిపోయింది.

ఇంట్లోకి వెళ్ళి చూశాను రమాదేవి కనబడలేదు. ఇంటికి వెళ్ళిపోయింది. రమాదేవితో చెప్పకుండా వెళ్లిపోవటమా ! నాకు మనస్కరించలేదు.

గడియారం చూశాను. రైలుకు యింకా గంటన్నర టైముంది. గబగబా నాలుగు మెతుకులు తిని అందరి వద్దా సెలవు తీసుకుని రిక్షా ఎక్కి రమాదేవి యింటికి వెళ్ళాను. నేరుగా మేడమీద గదిలోకి వెళ్ళాను. మంచంమీద గోడ వైపుకు తిరిగి పడుకుంది రమాదేవి. నా అలికిడి విని లేచి

కూర్చుంది. కళ్ళు ఎర్రబడ్డయ్యి. కన్నీటి చారికలు చెంపల మీద స్పష్టంగా కనిపిస్తున్నయ్యి. నేనూ మంచం మీదనే కూర్చున్నాను. "నాతో చెప్పకుండా వచ్చేశావేం రమా! కోపం వచ్చిందా అంతసేపు బావతో మాట్లాడుతూ కూర్చున్నాననని ?"

"నాకేం కోపం సీతా? నీ మనస్సును ఈ రోజు పూర్తిగా అర్థం చేసుకున్నాను. నువ్విట్లా మనస్సు మార్చుకోవటానికి కారణం నేనని యిప్పుడు తెలుసుకున్నాను. మీ బావ నిన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు. వార్ని భర్తగా స్వీకరిస్తావనే ఇంతవరకూ అనుకున్నాను. ఉత్తరంలో నువ్వు ఆ విధంగా రాసినా నమ్మలేదు. ఇప్పుడు ప్రత్యక్షంగా మీ మాటలు విన్నాను. నీకు నేనెంత ద్రోహం చేస్తున్నానో నా కిప్పుడు తెలిసింది. నన్ను క్షమించు సీతా! ఈ రోజు నుంచి ఎప్పుడూ మీ బావ గారింటికి వెళ్ళను బాబుని ఎత్తుకోను. ఏమిటో వాణ్ణి చూడందే మనస్సు ఉండబట్టక యింతవరకూ వెళ్లాను. మీ బంధుత్వానికీ, మీ బావగారి కోరికలకీ నేను అడ్డుగా ఉన్నాననే ఊహ నాకు తట్టలేదు క్షమించు సీతా !" అంటూ కంట తడిపెట్టి నా చేతులు పట్టుకుంది రమాదేవి.

"ఏమిటి రమా ఇది. ఏడాది పెద్దదానివి, చదువుకున్న దానివి. అన్నీ తెల్సిన నువ్వేయింత అగాధానపడుతుంటే యింక నేను చెప్పేదేముంది? ఎందుకీ విచారం? ఎందుకింత ఆందోళన? కాస్త నిదానంగా ఆలోచించు. నేను వెళుతున్నాను. ఒక్క మాట. ఎవరేం అనుకున్నా ఆత్మవంచన

చేసుకోవద్దు. నీ మనస్సుతో నీవు ఘర్షణ పడితేయింక చెప్పే దేముంది. మనవేం సినిమా మనస్సులు కావు. రెండు ప్రతిరూపాలూ, ఇద్దరు రమాదేవులూ కనబడి తర్క వితర్కాలు చేసుకోవడానికి. నీమనస్సుకు నీవే ఆలోచించుకో. నీవు ఎవ్వర్నీ వంచించటంలేదు. నిన్ను నీవు వంచన చేసుకో వద్దు ఉత్తరాలుమాత్రం రాస్తూండు. మరివెళతాను. బండికి టైమయింది" అంటూ రమాదేవి కన్నీళ్ళు తుడిచి "చూడు రమా! నువ్వు బావగారింటికి వెళ్ళటం మానకు. బాబు దిగులు పడతాడు. నా మాట విని, కనీసం వాడికోసమయినా వెళ్లు. నా మాట కాదనకు" అన్నాను.

రమాదేవి మాట్లాడలేదు.

"రమా! ఎప్పటిమాదిరే వెళ్ళకపోతే నామీద ఒట్టే" అన్నాను. రమాదేవి వెళతానంది. సంతోషంతో నేను రైలెక్కాను.

*                *                *

పది రోజులు పోయాక సుభద్ర ఉత్తరం రాసింది.

సీతా,

నీవు కులాసాగా ఉన్నావని తలుస్తాను. నేను శ్రీమతి నయినా, మీ అన్నగారి ప్రేమ, అభిమానాలు చూరగొం టున్నా, వారితో సుఖ సంతోషాలతో మునిగి తేలుతున్నా, సర్వ వేళలా నిన్ను తల్చుకుంటూనే వుంటాను నీమాటలూ, నీ చేతలూ, నీఊహలూ మరుపురాని మణిపూసలు అన్నయ్య అన్ని విషయాలూ చెప్పారు. నీ అంత వివేకవంతులూ, ఉన్నత భావాలు కలవారూ స్త్రీ జాతిలో చాలా అరుదు.

మన కుటుంబాల్లో అందరిలో మణిపూసలాంటిదానివి. త్యాగ మూర్తివి.

రమాదేవిలో నీవు వచ్చి వెళ్ళిం తరువాత చాలా మార్పు కనబడింది. ఆ మార్పు నీవల్ల వచ్చిందే. ఇప్పుడు రమాదేవి బాబుతో పూర్తిగా, మనస్ఫూర్తిగా, తల్లిలా లీనమైపోయి ఆడుకుంటున్నది. వాడూ రమాదేవికి అతి సన్నిహితుడైపోయాడు. ఇదంతా అమ్మ చూసి మొన్నొకసారి అన్నది రమాదేవిని చూస్తుంటే జానకినిచూసినట్లుగా ఉంటున్నదని అన్నది. మా యింట్లో ఒక రత్నంగా ఉంటున్నది రమాదేవి. కాని అన్నయ్యలో ఆసించదగిన మార్పు రాలేదు. అన్నయ్య కఠినాత్ముడు కాదు. కాని ఎదుటివారి హృదయాల్ని అర్థం చేసుకోలేడు. హృదయౌన్నత్యంగల ఆడది రమాదేవి. కాని అన్నయ్య రమాదేవి హృదయాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాడు. ఈ పరీక్షలో ఎవరు నెగ్గుతారో? అంతా నీమీద ఆధారపడి ఉన్నది. ప్రస్తుతం అన్నయ్య పరిస్థితి ఎట్లా వున్నదంటే నువ్వు విషమిచ్చినా అమృతంగా భావించేటట్లుగా ఉన్నాడు. కాని ఏయే భావాలు మనస్సులో ఉన్నా అవి నువ్వే వెలికి తీయాలి. ఆసమర్థత నీలోనేఉన్నది. నే నొకసారి రమాదేవిని అడిగాను. "అన్నయ్య నిన్ను పలకరించటం లేదనుకో. అన్నయ్యతో నువ్వే కలిపించుకునిఎందుకు మాట్లాడకూడదు?" అన్నాను.

రమాదేవి ఏమన్నదో తెలుసా సీతా! "మీఅన్నయ్య మనస్సు నాకు తెలుసు. నా మనస్సును వారు తెలుసుకుంటే మాటలు వాటంతటవే కలుస్తయ్యి" అన్నది.

ఈ మాటల అర్థం ఏమిటో ఆలోచించు సీతా.

మొన్ననో విశేషం జరిగింది. మామూలుగానే వచ్చి రమాదేవి బాబుని ఎత్తుకుంది. ఉన్నట్లుండి ఆ వెధవ రమాదేవి చీర పాడుచేశాడు. రమాదేవి విసుక్కుంటుందేమో ననుకున్నాను. నేనే ఆ పరిస్థితుల్లో ఉంటే వాడిని ఎత్తి ఉయ్యాల్లో పడేసి విసుక్కుంటూ బట్టలు మార్చుకునేదాన్ని. రమాదేవి ఏమీ అనలేదు. నవ్వుతూ నన్నుపిల్చి "చూశావా సుభద్రా! మీ మేనల్లుడు ఎంతకొంటెపని చేశాడో" అంటూ పంపు దగ్గరికెళ్ళి అంతా కడిగేసింది. రమాదేవికి ఎంత ఓర్పో ఆలోచించు సీతా! బాబుకి చేసే సేవ చూస్తుంటే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్యి. మరి బి కాం. చదువుతున్నదా, ఎప్పుడు కాలేజీ పుస్తకాలు, పాఠాలు చదువుతుందో నాకు తెలీదు. అన్నయ్యను సాహసించి అడిగాను. రమాదేవిని పెళ్లి చేసుకోరాదా అని. అన్నయ్య నవ్వి ఊరుకున్నాడు. పొరపాటుగానైనా వాళ్ళిద్దరూ మాట్లాడుకోలేదు.

సీతా! నా పరిస్థితి ఆలోచించు. మీకన్నా నేను చిన్నదాన్నే కాదా. అప్పుడే ప్రేమించి పెండ్లి చేసుకోవటంవరకూ వచ్చింది. ఒక్కొక్కరి జీవితాలు ఎట్లా మారిపోతాయో ఎవ్వరికీ తెలీదు.

అమ్మనీ నాన్ననీకూడా అడిగాను. అన్నయ్యకు రమాదేవిని చేసుకోమని. వాళ్ళకీ ఇష్టమే, రమాదేవి తమ కోడలు కావటానికి. కాని అన్నయ్య వప్పుకుంటేగా, ఈ సమస్య తేలటానికి.

నాలో నేను అనుకుంటాను. రెండో పెళ్ళివాడని అన్నయ్యను నువ్వు కాదన్నా, రమాదేవి అన్నయ్యనే ఎందుకు చేసుకోవాలనుకుంటున్నదా అని.

ఏమయినా ఈ సమస్యలను నువ్వే తేల్చి, వాళ్ళని ఒక దారికి తీసుకురావాలి.

ఇంకా మార్చి పరీక్షలు నెల రోజు లున్నాయి కదా! పరీక్షలకు నువ్వు బాగా చదువుతున్నావనుకుంటాను. మేము బాగా చదువుకుంటున్నాము. పరీక్షలయ్యాక నువ్వు గుంటూరు వస్తావుగా సీతా! జాబు రాయాలి సుమా!

సుభద్ర.

ఉత్తరమంతా చదివితే సంతోషంగానే ఉంది. కాని ఒక్క మాట నా హృదయాన్ని కలచివేసింది. బావ రెండో పెళ్ళివాడని నేను చేసుకోవటానికి యిష్టపడలేదని సుభద్ర అనుకుంటున్నది. ఆ ఉద్దేశ్యం నే నెప్పుడూ వెలిబుచ్చలేదే! సుభద్ర ఎందుకట్లా అనుమానపడాలి? బావ రెండో పెళ్ళివాడని నే నెప్పుడూ అనలేదే! నా కసలు అలాంటి భావనేలేదే! సుభద్ర ఎందుకిట్లా అనుకోవాలి! ఈ విషయంలో ఇంక పరీక్షలయ్యేవరకూ జోక్యం కలిగించుకో దలుచుకోలేదు. అందుకని వెంటనే జాబు రాయలేదు.

పరీక్షలు దగ్గరపట్టంనుంచి నా దృష్టినంతా చదువు మీాదనే కేంద్రీకరించాను.

పబ్లిక్ పరీక్షలయినవి. కాలేజీ గొడవ ఇంక తీరిపోయింది. పరీక్షల్లో బాగానే రాశాను. తప్పక ప్యాసవుతాననే నమ్మకం ఉంది. పరీక్ష లవంగానే ఏదో పెద్ద బరువు దించిన

ట్లయింది. పుస్తకాలన్నీ అవతలపారేసి రెండుమూడు రోజులు విశ్రాంతి తీసుకున్నాను.

నాన్నగారుగాని, అమ్మగాని నా పెళ్ళి విషయమే ప్రస్తావించటంలేదు.

నాన్నగారు అడిగారు "పి.యు.సి. ప్యాసయిన తరువాత ఏం చెయ్యదలుచుకున్నావమ్మా" అని.

"ఫలితాలు తెలీనీండి నాన్నా. తరువాత ఆలోచించవచ్చునుగా" అన్నాను.

"అది సరేనమ్మా. డిగ్రీకోర్సు చదువుతావా? చదువు ఆపేస్తావా? అసలు నీ మనస్సులో ఉన్నది చెప్పమ్మా సీతా" అన్నారు నాన్న.

అమ్మ ఏం మాట్లాడలేదు. అమ్మ మనస్సు నాకూ నాన్నకూ తెల్సిందే. నన్నో అయ్యచేతుల్లో పెట్టి తమ బరువు బాధ్యతలు తీర్చుకోవాలనే అమ్మ ఉద్దేశ్యం.

నే నింకా కాలేజీ చదువుచదవటం అమ్మకు ఏమాత్రం ఇష్టంలేదు.

నాన్న మళ్ళా అడగటంనుంచి నా ఉద్దేశ్యం చెప్పాను.

"నాన్నా! నేను మంచి మార్కులతో ప్యాసవుతాననే నమ్మకం ఉంది. దైవకృపవల్ల నేను క్లాసులో ప్యాసయితే డాక్టరు కోర్సు చదవాలని ఉన్నది నాన్నా" అన్నాను.

"డాక్టరు కోర్సా!"

"అవును నాన్నా."

"కలగంటున్నావా సీతా !"

"కలకాదు నాన్నా నిజమే."

"ఎట్లా సాధ్యం తల్లీ. నా స్థితిగతులు నీకూ తెలుసు కదా సీతా. ఎట్లా చదువుతావమ్మా అయిదేళ్లు ఏం చూసి ఆ ఉద్దేశ్యం వెలిబుచ్చావమ్మా"

నాన్న జాలిగా అడిగారు. ఆయన కళ్లల్లో నీళ్ళు తిరిగి నయ్యి.

"విచారించకండి నాన్నా. నాకా యోగ్యత ఉంటే చదువు సాగుతుంది. ఆ గీత లేకపోతే ఏమీ లేదు. నేను డిగ్రీ కోర్సే చదువుతాను. దానికేం గాని, నాన్నా నే నొకసారి గుంటూరు వెళ్ళి రావాలి. వెళ్ళి నాలుగు రోజుల్లో వస్తాను నాన్నా.

"మళ్ళీ గుంటూ రెందుకు తల్లీ. బావతో ఏమయినా మాట్లాడాలా."

"వెళ్ళొచ్చాక చెపుతాగా నాన్నా"

"సరేనమ్మా" నాన్న వప్పుకున్నారు. అయిష్టంగానే అమ్మకూడా ఒప్పుకుంది.

మర్నాడే నేను గుంటూరు ప్రయాణ మయ్యాను. ఈ సారి గుంటూరు ప్రయాణమంటే ఎందుకో నా మనస్సు పరవళ్ళు తొక్కింది ఏందుకో, ఏమో ? అప్పట్లో నాకు అర్థం కాలేదు.

## 18

నేను గుంటూరు బావగారింటికి ఎంత ఉత్సాహంతో వెళ్ళానో అక్కడి పరిస్థితులు అంతతారుమారుగా ఉన్నాయి. బావ నన్ను పలకరించలేదు. చూస్తూనే వెళ్ళిపోయారు.

సుభద్ర మాత్రమే పలకరించింది. ఆ మాటల్లో సంతోషం గాని, ఆప్యాయతగాని లేదు ముభావకంగానే "కులాసానా సీతా, కాళ్లు కడుక్కో, భోంచేద్దువుగాని" అన్నది. నా ప్రాణం చచ్చిపోయింది. సుభద్ర తల్లి "మీ అమ్మ కులాసాగా ఉన్నదా సీతా" అంటూనే వెళ్లిపోయింది వంటిట్లోకి.

బాబు నిద్రపోతున్నాడు. కొంచెం చిక్కినట్లుగా కనిపించాడు. సుభద్ర నడిగాను: "బాబు అట్లా చిక్కిపోయాడేమని" సుభద్ర నిట్టూర్పు విడిచి "వాడి ఖర్మ" అన్నది. విచార పడ్డాను ఆశ్చర్య పడ్డాను. అర్థంకాక తికమక పడ్డాను. సుభద్ర అట్లా ఎందుకు మాట్లాడిందో తెలీదు.

"సుభద్రా నువ్వనేది నాకు అర్థం కావటంలేదు. వాడి ఖర్మ ఒక్కసారే తేల్చేశాడు భగవంతుడు వాడి ఖర్మ బావుంటే అక్కయ్య బ్రతికే ఉండేది. ఆ చిన్న వెధవ ఖర్మ మనం ఆశించనంతగా మారిపోయిందా" అన్నాను.

సుభద్ర కళ్ళు తుడ్చుకుంది. నా మనస్సు కలుక్కుమంది. బాబు మంచం దగ్గరికి వెళ్లి వాడి పొట్టమీద చెయ్యి వేశాను. వళ్ళు మసిలిపోతున్నది.

"జ్వరంగా ఉందా సుభద్రా బాబుకి. ఎప్పట్నుంచీ మందు ఇస్తున్నారు? ఏం జ్వరమన్నాడు డాక్టరు?" అన్నాను.

"సీతా! ఏం చెప్పమన్నావు. కన్నతల్లి ఆ రీతిగా వాణ్ణి అన్యాయం చేసింది. కన్నతండ్రీ ఇప్పుడు మూర్ఖత్వంగా ప్రవర్తించి అన్యాయం చేస్తున్నాడు. ఆ పసివాడి మీద అన్నయ్యకు కక్షగా ఉంది" అన్నది సుభద్ర.

"ఏమిటి సుభద్రా అసలు విషయం చెప్పు చంపక" అన్నాను ఆదుర్దాగా.

"వాడు రమాదేవికి మాలిమి అయిన సంగతి అందరికీ తెల్సిందేగా. రమాదేవిని చూడంగానే చేతులిచ్చి ఎత్తుకో మంటాడు. ఎత్తుకోంగానే రమాదేవి చేతుల్లోంచి ఊడిరాడు మొన్నట్నుంచీ రమాదేవిని మనింటికి రావద్దన్నాడు అన్నయ్య. రమాదేవి ఖిన్నురాలై వెళ్ళిపోయింది. రమాదేవి ఇంక ఎందుకు వస్తుంది? ఏ ముఖం పెట్టుకునివస్తుంది? రావటం మానేసింది. బాబు దిగులు పడ్డాడు. నిన్నట్నుంచీ జర్వం. మూసిన కన్ను తెరవటం లేదు. ఎవరం ఎత్తుకున్నా ఊరు కోడు. ఊరికే ముఖాలవంక చూసి ఏడుస్తాడు. పసివాడు ఏం చెపుతాడు. డాక్టరు మందు వాడికేం పని చేస్తుంది? వాడి లేత మనస్సులో రమాదేవి ముద్ర వేసుకుంది. కాని వాడి కోరిక ఎవరు తీర్చగలరు. అన్నయ్యనుగట్టిగాఅడిగింది అమ్మ. అందుకు సమాధానం ఏమిటో తెల్సా?" ఉద్రిక్తతతో సుభద్ర కంఠం పూడిపోయింది. మాట్లాడలేకపోయింది. కళ్ళు తుడుచ్చుకుంది.

"సీతా, అన్నయ్య ఏమన్నాడో వింటావా? నాపిల్లాడి బాగోగులు నేను చూసుకోగలను. మీాకు వాడి పోషణ విషయం భారంగా ఉంటే దాదిని పెట్టి వాడ్ని పెంచు తాను. ఈ రమాదేవిగారు లేకపోతే వాడేం చచ్చిపోడు. నాలుగు రోజులు దిగులుపడ్డా అయిదోరోజు నుంచి వాడే మర్చిపోతాడు. అన్నాడు సీతా" అన్నది సుభద్ర.

ఈ మాటలు వినేసరికి నాకుమతిపోయినంత పనయింది. మంచం మీద పడుకున్న బాబును చూస్తుంటే అక్కయ్య నా కళ్ళముందు కన్పించింది. బావ మూర్ఖత్వం, అర్థంలేని ఆవేశాలు అక్కయ్య చావుతోనే అంతరించాయనుకున్నాను. మధ్యలో పోయినట్లు కనిపించినా, బావ మళ్ళా ఈ తీరుగా తయారయినారన్న మాట. ఉన్నట్లుండి రమాదేవి మీద అంత అయిష్టత ఎందుకు కలిగింది? కొత్త-తగాదా ఏముంది? నేను బావను పెళ్లి చేసుకోననటమే కారణం. ఇంతకన్న జరిగిన తప్పేమిటి? కాకపోయినా నా మీదకోపం ఈరీతిగానా తీర్చు కునేది? రమాదేవి లాంటి వ్యక్తి బావకు సప్త జన్మలెత్తినా దొరకదు. అంత ఇష్టతగా, అప్యాయంగా, మనసిచ్చిన రమాదేవిని కాదని, ఇష్టంలేని నన్ను బలవంతంపెట్టి పెళ్ళి చేసుకుని తను మాత్రం సుఖపడేదేముంది? బావ ఇంత మూర్ఖుడా? ఒక వేళ ఈ స్థితిలో నేను ఒప్పుకున్నా, నా మెళ్ళో తాళి గట్టిం తరువాత నన్ను ఎట్లా చూడాలో అట్లాగే చూస్తారు. ఛీ! తల్చుకుంటే ఇంతమందిని ఉసురుపెట్టి, ఎవళ్ళ మాటా వినకుండా నేను బ్రతికేకంటే, చస్తే బావ జీవితం ఒక దారి కొస్తుందేమో?

ఆలోచిసూ విచారం పట్టలేక నిద్రపోతున్న బాబుని ఎత్తుకుని గుండెలకు అదుముకున్నాను వాడూ కలతనిద్దుర లేచి నా ముఖంలోకి తేరిపార చూసి కావురుమన్నాడు. చేతుల్లో నుంచి జారిపోతున్నాడు. పొంగి పొర్లుకొచ్చే దుఃఖాన్ని ఆపు కుంటూ వాణ్ణి సుభద్రచేతికిచ్చాను. నాజీవితంలో ఈసమస్య నేను బ్రతికున్నంతవరకూ పరిష్కారంకాదేమో? అనుకున్నాను.

సాయంత్రం ఇంటికి రాగానే బావను పలకరించాను. బావ నా వైపు చూసి మాట్లాట్టంలేదు. ఏదో ముభావకం గానే ఉన్నారు. బాబు మంచంమీద కూర్చుని వాణ్ణి వళ్ళో పడుకోబెట్టుకున్నారు. వాడికి పాలు తనే కలిపి పట్ట సాగారు. వాడూ దిగాలుపడి చూస్తూ పాలు తాగాడు ఏం చేస్తాడు మరి? తండ్రి కార్కశ్యానికి వాడికి ఇప్పట్నుంచే శిక్ష. బావతో నేను మాట్లాడతానని కామాలు సుభద్ర అక్కడి నుంచి వంటింట్లో తల్లి దగ్గరికి వెళ్లింది.

"బావా!"

నా వైపుకు చూశారు.

"ఎందుకు బావా ఆ పసివాడి మీద అంత కోపం?"

"వాడి మీద నాకు కోపమెందుకు సీతా? రమాదేవి అలవాటు వాడికి తప్పించాలి. రేపు రమాదేవికి పెళ్ళయి వెళ్ళి పోతుంది. అప్పుడువీడినితనతో అత్తారింటికి తీసుకుపోతుందా?"

"చాలా వింతగా మాట్లాడుతున్నావు బావా. నీ మన స్తత్వం నాకు తెల్సుగాని, నీ మనస్సు ఇంతపాషాణమైపోతుం దని నేను ఊహించలేకపోతున్నాను."

"పాషాణ హృదయుణ్ణి నేను కాదు. నా బిడ్డ తప్పు దారిని పడుతుంటే వాణ్ణి మంచిదార్ని పెట్టటం తప్పవుతుందా? సీతా! ఆడవాళ్ళే కఠినాత్ములుగా తయారయినప్పుడు ఇంక నేను ఏదో ఒక విషయంలో కాఠిన్యత చూపటంలో ఆశ్చర్య మేముంది సీతా?" అన్నారు.

"బావా! నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావా? అక్కయ్య స్థానం నేను ఆక్రమిస్తే నీ జీవితంలో ఏ కొరతా

లేనట్లుగానే భావిస్తావా?" సిగ్గూ, అభిమానమూ ముంచు కొచ్చినా బావతో ఈ మాటలు మాట్లాడక తప్పలేదు.

"ప్రేమ, నాకు ప్రేమేమిటి సీతా? నేనేం బ్రహ్మచారి పెళ్ళికొడుకునా ప్రేమించటానికి? రెండో పెళ్లివాణ్ణి. వృద్ధుణ్ణి. భార్యను సుఖపెట్టలేనివాణ్ణి. జానకిమీద నాకు కసి ఇంకాతీర లేదు ఆ మిగిలిన కసి జానకి చెల్లెలివైన నీ మీద తీర్చు కుందామని, నిన్ను పెళ్ళిచేసుకుందామనుకున్నాను. తెల్సిందా సీతా, నా ప్రేమ ఎటువంటిదో?" అన్నారు కోపంతో.

బావ తలవంచుకుని బాబువైపు చూస్తూ కూర్చు న్నారు. బాబు చంకలో ధర్మామీటరు ఉంచి జ్వరం చూశారు. ధర్మామీటరు గ్లాసులో ఉన్న నీళ్లలో ముంచి తుడిచి గొట్టంలో పెట్టిమూతపెట్టారు. ఉడుకులాంలో చిన్న గుడ్డ తడిపి బాబు ముఖాన వేశారు. వాణ్ణి వళ్ళో కాళ్ళమీద పడుకో పెట్టుకుని వాడివై పేమాస్తూ పొట్టమీద మెల్లిగాచిచ్చ కొడుతున్నారు ఎంత విచిత్రంగామారిపోయింది బావజీవితం!

బావ అన్న మాటలకు నేను విచారపడ్డాను. నన్ను బావ అంతవరకూ అర్థం చేసుకున్నారు.

"బావా! నువ్వు రెండో పెళ్ళివాడివనీ, వృద్ధుడివనీ నేను పెళ్ళికి ఒప్పుకోలేదని నువ్వు అనుకుంటున్నావు ఆడ దాని మనస్సు ఎట్లా అర్థం చేసుకోవాలో నీకు తెలీదు బావా! స్వతంత్రించి ఈ మాటఅన్నందుకు క్షమించు" కళ్ళు తుడ్చు కున్నాను. బాబు బావ చేతుల్లోనే నిద్రపోయాడు.

"మరి ఏ కారణంచేత కాదన్నావు సీతా? పోనీ, ఎవరి నయినా ప్రేమించావా సీతా?" బావ మెల్లిగా సందేహిస్తూనే ఈ మాట అన్నారు.

నేను పేలవంగా నవ్వాను.

"అంతగా నన్ను అర్థం చేసుకున్నందుకు చాలా విచారిస్తున్నాను బావా! నే నెవ్వరినీ ప్రేమించలేదు. ఎవ్వరికీ మాట ఇవ్వలేదు. అసలు నేను పెళ్ళి చేసుకోదల్చుకోలేదు."

"మరి?"

"డాక్టరు చదవాలని నా కోరిక. ఈ దేశంలో అక్కయ్య లాంటి వాళ్ళు అనేకమంది ఉన్నారు. అలాంటి అభాగ్యులకు నా చేతనైన సాయం చెయ్యాలనే నా కోరిక. దానికి సాధనం డాక్టరు చదివి నర్సింగ్ హోం నడపటమే. అదే నా జీవితధ్యేయం" అన్నాను.

బావ ఆశ్చర్యంగా నా కళ్ళల్లోకి చూశారు. అయిదు నిమిషాలు అట్లాగే కదలకుండా కూర్చున్నారు.

"నేను డాక్టరు చదవటానికి అర్హురాల్ని కాదా బావా?" నవ్వుతూ అన్నాను.

"సీతా! నేను ఎన్నటికీ ఆ మాట అనను. నీ మనస్సులో ఇలాంటి కోరిక ఉన్నదని నాకు తెలీదు. మీ నాన్న డాక్టరు చెప్పిస్తానన్నారా? డబ్బు?" అర్థోక్తిలో ఆగిపోయారు బావ.

"ఆ భగవంతుడే దారి చూపిస్తాడు. అంతా ఆయనదే భారం.

"నీ కోరికనూ, అభిప్రాయాలనూ నేను కాదనను సీతా! కాని.

"ఏమిటి బావా?"

"ఏం లేదు సీతా, ఏం లేదు."

ఒక్క నిట్టూర్పు విడిచి బావ మంచం మీద మెల్లిగా బాబుని పడుకోబెట్టి లేచారు నేను సుభద్ర దగ్గరికి వచ్చాను.

రాత్రి భోజనాలయినయ్యి. బావమళ్ళీ బాబు మంచం మీదనే కూర్చున్నారు. బావ నాన్నగారు నన్ను పిల్చారు.

"ఏం మావయ్యా" అంటూ వారి గదిలోకి వెళ్లాను.

"సీతమ్మా! నీ అభిప్రాయానికి విరుద్ధంగా నిన్ను మా ఇంటి కోడలిగా చేసుకోలేం. కాని ఈ వృద్ధాప్యంలో చిన్న దానివయినా నిన్ను ఒక్క కోరిక కోరుతున్నానమ్మా."

"ఏమిటి మావయ్యా!"

"వాడికి నచ్చచెప్పి రమాదేవినయినా మా ఇంటి కోడల్ని చేసి, ఆ పసివాణ్ణి కాపాడుతల్లీ. అదే నా కోరిక" అంటూ ప్రాధేయపూర్వకంగా నావైపు చూశారు. నాకు ఏం చెప్పాలో తోచలేదు. పెద్దవాడు. ఆయనతో నేనేం చెప్పేది? ఎట్లా చెప్పేది? మనస్సు నిబ్బరం చేసుకుని "ప్రయత్నిస్తాను మావయ్యా" అన్నాను. ఆ రోజు నేను బావతో ఏం మాట్లాడలేదు.

మర్నాడు నా అంతట నేనే ఆలోచించుకుని రమాదేవి ఇంటికి వెళ్ళాను. ఉదయం ఎనిమిది దాటినా రమాదేవి ఇంకా నిద్రపక్కమీదనుంచి లేవలేదు. నన్ను చూడంగానే ఖంగారు పడుతూ లేచింది.

"ఎప్పుడొచ్చావ్ సీతా!"

"నిన్ననే వచ్చాను. ఇంకా నిద్రలేవలేదా. వంట్లో కులాసాగా ఉందా?"

"కులాసానే సీతా. చేసేదేముంది. పరీక్షలయినయ్యి. ఏం తోచక ఊరికేనే పడుకున్నాను. కూర్చో, పదినిమిషాల్లో వస్తా" అంటూ వెళ్ళింది.

రమాదేవి కళ్ళు ఎర్రగా ఉన్నయ్యి. బుగ్గలమీద కన్నీటి చారికలు చూశాను. రమాదేవికి మనస్సులోనే నమస్కరించాను.

వేసంకాలం ఎండ చుర్రుమంటూ వచ్చేసింది. వడ గాల్పులు వీచే సూచనలు కనిపిస్తున్నయ్యి. ఏమిటో ఆలోచిస్తూ కూర్చున్నాను.

పావు గంటలో రమాదేవి వచ్చింది. పళ్లు తోముకుని, ముఖం కడుక్కుని వచ్చింది. రెండు గ్లాసుల్తో కాఫీ తెచ్చింది. నాకో గ్లాసిచ్చి తనో గ్లాసు తీసుకుంది. ఇద్దరం కాఫీ తాగాము.

"పరీక్షలు బాగా రాశావా సీతా?"

"ఆ"

"క్లాసొస్తుందా?"

"రావచ్చు. నువ్వు బాగా రాశావా?"

"ఏదోమొత్తంమీద ప్యాసవుతాను. ఇంక విశేషాలు. అమ్మా నాన్నా కులాసాగా ఉన్నారా? మా వదినె చెల్లెలు జ్యోతి కులాసాగా ఉందా? ఇంకా ఏలూరు కబుర్లేమిటి?" అన్నది.

రమాదేవి చలనం లేకుండా మాట్లాడుతోంది. నిబ్బరంగా ఉన్నది. అది నిబ్బరమో గుండె రాయి చేసుకోటమో నాకు అర్థం కాలేదు.

"సుభద్ర ఏమంటున్నది? చాలా అదృష్టవంతురాలు. అత్తవారింటికి వెళుతుందా? అతనికి పరీక్షలింకా కాలేదట్లే ఉంది. పాసయితే ఇక్కడే గుంటూరులోనే 'హౌస్ సర్జన్'గా వేయించుకుంటారట. వేరే ఇల్లు తీసుకుని కాపురం పెడతారుట. అతనూ మంచి తెలివి తేటలు కలవాడే. అదృష్టం అన్ని విధాలా ఆ దంపతుల్ని వరించింది సరేగాని, పి. యు. సి. ప్యాసయాక ఇంకా చదువుతావా? జ్యోతి ఏం చదువుతుందిట? మీ నాన్నగారు వచ్చే ఏడు రిటయిరవుతారనుకుంటాను. ఏలూరులోనే స్థిరపడిపోతారా? మా వదిన చెప్పటం జ్యోతి యం బి ,బి యస్. చదువుతుందిట. నిజమేనా సీతా!" అన్నది రమాదేవి.

"జ్యోతి నాతో ఎక్కువగా మాట్లాడదు రమా!"

"ఎందుకని?"

"ఏమిటో ఎవరి తీరు వాళ్ళది. పోనీగాని, బి.కాం. ప్యాసయాక నువ్వేం చేస్తావు రమా?"

రమాదేవి నిరాశగా నావైపు చూసింది. ఆచూపుల్లో నిర్లిప్తత గోచరించింది.

"రమా!"

"ఏం సీతా?"

"బావగారింటికి వెళ్ళటం లేదుటగా. ఎందుకని"

రమాదేవి గతుక్కుమన్నది. ఒక్కసారి నావైపుచూసి మళ్ళా కిటికీలోంచి బయటికి చూడసాగింది.

"నాకు అంతా సుభద్ర చెప్పింది రమా. బాబు దిగులు పడ్డాడు. మూడు రోజులనుంచి జ్వరం. నూట మూడు డిగ్రీల జ్వరం ఏమీ తగ్గటంలేదు. నిన్ను మరువలేక దిగులుపడ్డాడు."

కళ్ళ నీళ్ళు రమాదేవి కాళ్ళమీద పడ్డయ్యి పై పళ్ళతో పెదిమలు నొక్కిపెట్టి దుఃఖాన్ని ఆపుకుంది.

"రమా!"

కళ్ళు తుడ్చుకుని నావైపు చూసింది.

"బాబుమీద నువ్వు కోపగించుకుంటే ఎట్లా రమా?"

"బాబు! ఎవరికి బాబు సీతా? నాకేమిటి సంబంధం? కన్నతల్లే వాణ్ణి భూమ్మీద పడేసి వెళ్ళిపోతే ఇక నేను లేక పోతే వాడు పెరిగి పెద్దవాడు కాలేడా సీతా? కన్నతండ్రి, తల్లి లేని పిల్లవాణ్ణి చక్కగా పెంచుకోగలరు. నాలుగు రోజులు దిగులు పడ్డా, జ్వరం తగ్గంగానే వాడు నన్ను మర్చిపోతాడు."

చెంపలు తుడ్చుకుంది రమాదేవి

"రమా! నువ్వెంత దాచినా నీ హృదయం నాకు తెలియంది కాదు."

రమాదేవి మాట్లాడలేదు.

"పట్టుదలకీ, పళ్ళబింకానికీ నువ్వు అట్లా అంటున్నావు గాని, జరిగిన విషయాలు నాకు తెల్సు రమా. నువ్వు బాబుని చూడకుండా ఉండలేవు. వాడు నోరులేని పసివాడు. ఏమీ చెప్పలేనివాడు. మీ రిద్దరూ ఇట్లా బిగిసి కూర్చుంటే ఇద్దరూ కలిసి వాణ్ణి పొట్టన పెట్టుకున్నవాళ్ళవుతారు నా మాట విను

రమా! నాతో రా. బాబుని నువ్వు ఎతుకుంటేనేగాని వాడు కోలుకోడు." రమాదేవి చేతులు పట్టుకుని బ్రతిమాలాను.

"సీతా! తెల్సి చేసినా, తెలీక చేసినా తప్పు తప్పే కదా! మీ బావగారి మనస్తత్వం తెల్సింతరవాత నాఅంతట నేనే వాళ్ళింటికి వెళ్ళకుండా ఉంటే బావుండేది. రావద్దని చెప్పించుకుంటేనేగాని నా జన్మ చరితార్థం కాలేదు."

"జరిగిందానికి విచారపడి లాభంలేదు రమా! నీ మనస్సు నాకు తెల్సు. నువ్వు ఎంత తెగతెంపులు చేసుకున్నా బాబుని మర్చిపోలేవు వాడు నీ చేతుల్లో పెరగవలసినవాడు. బాబుకు నువ్వే తల్లివి. నా మాట నమ్ము రమా. ఒక్క మాట చెప్పు రమా! బావ మనస్సు మారితే నువ్వు సంతోషంగా..." నవ్వుతూ రమాదేవి బుగ్గమీద చిటికె వేశాను. ఎక్కడో దాగి ఉన్న సంతోషం వెల్లుబికి రాగా రమాదేవి చిరునవ్వుతో నావైపు చూసింది. ఆ చూపులో తృప్తీ, ఆప్యాయతా నాకు కనిపించినయ్యి.

'రమా!"

'సీతా!" ఆనందంతో పొంగి పొరుకొచ్చే కన్నీళ్ళను తుడుచుకుంటూ నన్ను కౌగలించుకుంది. రమాదేవి కట్టలు తెంచుకు వచ్చే దుఃఖాన్ని ఆపుకో ప్రయత్నిస్తూ, ఎక్కువుట్టే టట్లుగా ఏడ్చి, కంఠం పూడిపోగా, రమాదేవి నా భుజంమీద తలపెట్టి, కన్నీటితో నా భుజమంతా తడిపేసింది. రమ పరిస్థితి చూస్తే ఏమిటో తెలియని ఆనందంతో నాకూ కళ్ళు చమర్చ నయ్యి. మెల్లిగా రమాదేవి వీపు నిమురుతూ "రమా! అన్న మంతా పట్టి చూడక్కర్లేదు. నీ కోరిక నేను పూర్తిగా అర్థం

చేసుకున్నాను. ఒక్క ప్రశ్న?" రమాదేవి లేచి కూర్చుని నా కళ్ళల్లోకి చూసింది.

"ఏమీలేదు రమా! బావ పరిస్థితులూ, ఆర్థిక పరిస్థితులూ నీకు తెల్సు. కాని నీ నిర్ణయానికి మీ అమ్మగారూ, అన్నయ్యా, వదినె అంతా ఆమోదించారా?"

రమాదేవి నావైపు నవ్వుతూ చూసింది.

"ఏం రమా?"

"ఆ అనుమానం ఏమీ అక్కర్లేదు సీతా. నేను చిన్న పిల్లను కాదు. నా అభిప్రాయంతో, అందులో నా స్వవిషయంలో ఏకీభవించనివాళ్లు ఎవ్వరూ లేరు. కాని..." అర్థోక్తిలోనే ఆగింది రమాదేవి

"ఏమిటి రమా?"

"నీ ఋణం ఎట్లా తీర్చుకోవాలో నాకు అర్థంకావటం లేదు. నాకోసం నీజీవితాన్ని త్యాగంచేసుకున్నావు. ఈరకంగా చూస్తే నేను స్వార్థపరురాలినే. నా స్వార్థంకోసం, నీజీవితాన్ని బలిపెడుతున్నానా అనిపిస్తున్నది. మరోరకంగా ఆలోచిస్తే మీ బావ నిన్ను ప్రేమించారు. మీ ఇద్దరిమధ్యా నేను చోటు చేసుకోబూనటంలో అర్థం లేదేమో?" అన్నది రమాదేవి.

నవ్వి ఊరుకున్నాను. రెండు నిమిషాలు ఎవ్వరం మాట్లాడుకో లేదు.

"మాట్లాడవేం సీతా!" అన్నది రమాదేవి.

"ఇందులో నాకూ స్వార్థముంది రమా. నే నసలు వివాహం చేసుకోదల్చుకోలేదు. ప్రేమను గురించీ, ప్రేమించి పెళ్ళిచేసుకోటాన్ని గురించి నాకు తెలీదు. నా మనస్సులో

అలాంటి ఊహలకు తావులేదు. బావ రెండో పెళ్లివాడని గాని, మరే ఇతర కారణాలవల్లగాని, బావమీద నాకు కోపం లేదు. మీ ఇద్దరూ ఒక ఇంటి వాళ్ళయి, అక్కయ్య స్థానం నువ్వు ఆక్రమించి, జానకిలేని కొరత తీరుస్తూ, నన్ను నీ చెల్లెలిగా మనస్ఫూర్తిగా స్వీకరించటమే నా కోరిక. నువ్వు మా అక్కయ్యవు బాబుకు తల్లివి. బావకు..."

రమాదేవి అప్రయత్నంగా నా వళ్ళో తల దాచుకుని కన్నీటితో నన్ను ముంచెత్తింది. జడివాన కురిసి వెలిసినట్లయింది రమాదేవి మనస్సు. పెదవుల్లో, కళ్ళల్లో, ముఖంలో ఆనందం తొణికిస లాడింది.

"నువ్వు దేవతవు సీతా" అన్నది రమ.

"అంత మాటనకు రమా నువ్వు వట్టి రమాదేవి కాదు. నా రమాదేవి అక్కయ్యవు నిన్నికనుంచీ అక్కా అనే పిలుస్తాను ఒక్కమాట నేను డాక్టరు చదవాలని నిర్ణయించుకున్నాను. నా కోరిక నెరవేరాలని మనస్ఫూర్తిగా ఆశీర్వదించు. అంతకన్నా నాకు జీవితంలో ఏ కోరికా లేదు."

ఈ మాటలు ఆవేశంతో అన్నాను. రమాదేవి సంభ్రమాశ్చర్యాలతో నా వైపు చూసింది.

కాసేపు కూర్చుని వెళ్ళిపోయాను.

ఇంటికి వెళ్ళేసరికి బావ బాబుని భుజాన వేసుకుని తిప్పుతున్నారు.

"బాబుకి జ్వరంఎక్కువయిందా బావా?" అన్నాను. బావ నావైపు చూశారు. ఆ చూపులో కరుణ, నిశ్చయానికొచ్చిన ఉద్వేగమూ కనిపించినయ్యి. ఆప్యాయంగా నావైపుచూస్తూ,

"సీతా! బాబుకి జ్వరం అట్లాగే ఉంది. నిజంగా వాడు దిగులుపడ్డాడు. నా బాబు, నా కన్నకొడుకు నా మనస్సుని మార్చాడు. వాడికి నేను లొంగిపోయాను" అన్నారు బావ.

ఆనందంతో నా మనస్సు పరవళ్ళు తొక్కింది. హృదయం ఉరకలు వేసింది.

"బావా!"

"ఏం సీతా?"

"రమాదేవి అక్కయ్యను తీసుకురానా? ఇప్పుడు మనింటికి రమాదేవి అక్కయ్య రావచ్చుగా" అన్నాను.

బావ నవ్వారు. అక్కయ్య పోయాక బావ తృప్తిగా నవ్వటం అదే ప్రథమ మనుకుంటాను. బావ నవ్వుతుంటే సుభద్ర కూడా వచ్చింది.

"సీతా! అన్నయ్య నవ్వుతున్నాడెందుకు?" అన్నది.

"ప్రేమించి పెళ్ళి చేసుకున్నదానివి, ఆమాత్రం తెలుసుకోలేకపోతే ఎట్లా సుభద్రా!" అన్నాను.

సుభద్ర సిగ్గుపడింది.

"బావా! నే నిప్పుడే వెళ్ళి రమాదేవిని తీసుకొస్తాను" అన్నాను.

"ఎట్లా వస్తుందో చూస్తాను. తలుపులు మూయిస్తాను తెల్సిందా సీతా!" సుభద్ర నవ్వుతూ అని, బావవైపు చూసింది.

"సుభద్రా! తలుపులు మూయించవచ్చు గాని నా హృదయకవాటం తెరిచే ఉన్నది. రమాదేవి నిరభ్యంతరంగా రావచ్చు" అన్నారు బావ.

వెంటనే నేనూ, సుభద్రా కలిసి రమాదేవి ఇంటికి వెళ్లాం. అపరలక్ష్మీదేవిలా ఉంది రమాదేవి. వాళ్ళ అమ్మా, నాన్నలతో సంతోషంగా మాట్లాడుతున్నది. వాళ్ళ అన్నయ్యా, వదినా కూడా ఉన్నారు. మా ఇద్దర్నీ చూడగానే అంతా ఆప్యాయంగా ఆహ్వానించారు. వచ్చిన విషయం చెప్పాం.

"కాబోయే డాక్టరుగార్ని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను" అన్నారు రమాదేవి నాన్నగారు నా మనస్సు ఉప్పొంగిపోయి సంతోషంతో మునిగిపోయింది.

మరో పావుగంటలోనే అంతా కలిసి వాళ్ల కారులో ఇంటికి వెళ్ళాము. ఇంతమందీ గుమ్మంలో దిగేసరికి ఆశ్చర్య పడుతూ బావ, అత్తయ్యా, మామయ్య అంతా వచ్చారు.

అందర్నీ నేను పరిచయం చేశాను. రమాదేవిని చూసే సరికి బాబు తండ్రి చేతుల్లోంచి జారి రమాదేవి చేతుల్లోకి వెళ్లాడు. ఆ పసివాడిముఖం సంతోషంతో నిండిపోయింది. రమాదేవి మెడ వాటేసుకుని అతుక్కుపోయాడు

"మనందరి హృదయాల్లోనూ సీత ఆనందజ్యోతులు వెలిగించి, చీకటితో ఆక్రమించిన మన ఇళ్లను జాజ్వల్యమానంగా ప్రకాశింప జేసింది. మనమంతా సీతకు ఋణపడి ఉన్నాం" అన్నారు రమాదేవి తండ్రి.

అంతా ఒకరిముఖాలొకరు చూసుకుని నవ్వుకున్నారు. నాకూ అర్థంకాలేదు అంతా ఒక్కసారిగా అక్కయ్య ఫోటో వైపు చూసి మనస్సులోనే మనస్ఫూర్తిగా తల్చుకున్నాం.

"సీతా" అన్నారు బావ.

"ఏం బావా!"

"నీ కోరిక తీర్చాము. మరి మా కోరికా ఒకటుంది. నువ్వు లేడీ డాక్టరువయి, స్థాపించబోయే నర్సింగ్ హోంకి 'జానకీ నర్సింగ్ హోం' అనే పేరు పెట్టాలి. ఏం రమా, ఏమంటావ్?" అన్నారు బావ రమాదేవి కళ్లు ఆనందంతో మిల మిల మెరిశాయి.

"అంతకన్నా మనకు కావలసిందేమిటి. చాలా సంతోషకరమైన సంగతి. డాక్టరు కోర్సు సామాన్యులు చదవటం ఆర్థికంగా సందర్భపడేదికాదు. కాని, సీత డాక్టరు కావాలి. పి.యు.సి. క్లాసులో పాసవుతుందని మాకు నమ్మకమే. ఈ పాతిక వేల రూపాయల చెక్కు సీతకు యిస్తున్నాను. డాక్టరు కోర్సు పూర్తి కావటానికీ, స్థాపించబోయే జానకీ నర్సింగ్ హోంకీ ఇది ప్రథమ కానుక" అంటూ రమాదేవి తండ్రి చెక్కు నా చేతి కిచ్చారు. నా ఆశ్చర్యానికి అంతులేదు. అంతా నవ్వుతూ నావైపు చూశారు. ఆనందంతో నా కళ్లు చమర్చినయ్యి.

"చాలా ఉత్తమురాలివి రమా. మా అందరికీ కనువిప్పు కలిగించి నీ సహృదయతను చాటుకున్నావు. నిన్నూ, సీతను కూడా నా హృదయ కుసుమాలుగా స్వీకరిస్తున్నాను. నిన్ను హృదయములో దాచుకుని, హృదయ పీఠంలో నిల్పుకున్న జానకికి పూజా పుష్పంగా సమర్పించుకున్నాను. సీతను హృదయ కుసుమంగా స్వీకరించి నా శిరస్సున ధరించాను" అన్నారు బావ.

నా మనస్సూ, హృదయమూ ఆనందంతో నిండిపోయినయ్యి.

"అంతా నీ చలవా, అదృష్టమురా బాబూ" అని బాబుని తీసుకోబోయాను. వాడు రమాదేవి చేతుల్లోంచి ఊడి రాలేదు. నవ్వుతూ రమాదేవి ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు. రమాదేవి బాబుని బావ చేతికిచ్చి అక్కయ్య ఫోటోకు నమస్కరించింది. నేను మనస్సులో శ్రీ వేంకటేశ్వర స్వామిని తల్చుకున్నాను.

ఆ రోజునే టెలిగ్రాం యివ్వగా అమ్మా, నాన్నా వచ్చారు" అంటూ తన జీవిత కథను ముగించింది సీత.

* * * *

రాధ అంతా విని సీతను అభినందించింది.

"ఈ విధంగా మా జీవితాలు గడుస్తున్నయ్యి రాధా. డాక్టరు కోర్సు ఇట్లా పూర్తి చేశాను. విశాఖపట్నంలో 'హౌస్ సర్జన్'గా ఒక సంవత్సరం పనిచేసి ఆరు మాసాల క్రితమే ఈ జానకీ నర్సింగ్ హోమ్ స్థాపించాను తతిమ్మా విషయాలు నీకు తెల్సినవే" అన్నది సీత రాధతో.

"అయితే మీ బావగారూ, రమాదేవి ఎక్కడున్నారు? బాబు కులాసాగా ఉన్నాడా? మరి డాక్టరు హరనాథ్ రాజమండ్రిలో ప్రాక్టీస్ చేస్తున్నా రనుకుంటాను" అన్నది రాధ.

"అవును. డాక్టరు హరనాథ్ రాజమండ్రిలో ఉన్నారు. సుభద్ర అక్కడే ఉన్నది. ఇద్దరు పిల్లలు. ఇంక మా బావ ఇక్కడే గుంటూరులోనే లెక్చరరు. బాబు కులాసా. వాడికి ఎనిమిదో ఏడు. నాలుగో క్లాసు చదువుతున్నాడు. రమాదేవికి ఇద్దరు పిల్లలు. మొన్ననే మూడో పురుడు మా జానకీ నర్సింగ్

హోములోనే పోసుకుంది. మొన్నటి రోజున రాత్రి పన్నెండింటివరకూ అటెండయిన డెలివరీ కేసు అదే. తెల్సిందా? ఇదీ మా కథ. మా అత్మ కథ'' అన్నది సీత నవ్వుతూ.

''చాలా సంతోషం. రమాదేవిని చూస్తాను. ఎంత చిత్రంగా ఉంది మీ జీవితం. రా, వెళ్లిచూద్దాం రమాదేవిని'' అన్నది డాక్టరు రాధ.

ఇద్దరూ రమాదేవి ఉన్న స్పెషల్ రూంకి వెళ్ళారు.

రమాదేవి, రామారావు మాట్లాడుకుంటున్నారు. రమాదేవి కులాసాగానే ఉంది. రాధను చూడంగానే రామారావు లేచి నిల్చున్నాడు.

''ఈ దంపతులే రాధా! నాజీవితాన్ని తీర్చిదిద్ది నన్నింత దాన్నిగా చేసింది'' అని వాళ్ళను రాధకు పరిచయంచేసింది.

వా రిద్దరికీ నమస్కరించి ఆ గదిలోనే గోడకున్న జానకి ఫోటోకూడా నమస్కరించింది రాధ.

రమాదేవి, సీతకూడా జానకి ఫోటోకి నమస్కరించారు.

రామారావు కళ్ళు చమర్చినయ్యి.

♦ సమాప్తం ♦

